# విజ్ఞాపనము

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతాయుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందుఁ గౌరవపాండవులకు యుద్ధము జరిగెనని మహాభారతమునందుఁ జెప్పంబడియున్నది. ఈ యుద్ధమునుగూర్చి బాహ్యదృష్టితో విచారించిన నీ కాలపు యుద్ధములవలెనే యానాఁడును మహాఘోరముగా నడిచియుండునని తోఁచుచున్నది. దీనినే యాంతరిక దృష్టి నాలోచించిన ప్రతిశరీర మొక భారతముగను నందు జరుగు సుగుణ దుర్గుణముల పోరాట మొక భారతయుద్ధముగను గోచరించుచుండును. దీనికిఁ దార్కాణముగ ధర్మక్షేత్రే కురుక్షేత్రే యని చెప్పినచోట క్షేత్రశబ్దము నకు భూమియనియు శరీరమనియు రెండర్థములు గలవు. క్షేత్రే ఇచట సప్తమికి ప్రథమార్థము. అనగా క్షేత్రము (దేహము) ధర్మక్షేత్రే = ధర్మ దేహమగునట్లు కురు = చేయుము. అని ప్రపంచమునందలి ప్రతి వ్యక్తిని నుద్ధరింపనెంచి వేదవిభాగముల నొనరించి భారతాది పుణ్యగ్రంథ ప్రదాత యైన శ్రీ వేదవ్యాసమహర్షి చెప్పియున్నాడు.

ఇక భారతరచనా విధానమునుగూర్చి విచారింప భారతాంతర్గతమైన భగవద్గీత భారతమునకంటె ముందె రచింపఁబడియుండెనా ? యని తోఁచు చున్నది. కారణమరయ ప్రపంచమున జన్మించిన ప్రతిజీవియు సుఖప్రాప్తిని దుఃఖనివృత్తినిఁ గోరుచున్నది. కాని తఱుచుగా మానవకోటియొక్క పరిస్థి తినిగూర్చి గమనింప నిందు దుఃఖబహుళతయు సుఖలేశమునుఁ గాన్పించు చున్నది. ఇట్టి యీ దుఃఖనివృత్తికొఱకు మానవుఁ డనేకమైన యవస్థలు పొందుచున్నాఁడు. కాని దుఃఖనివృత్తిని, యానందప్రాప్తిని నందలేక దుర్గమంబైన సంసార గహనమునంబడి దిక్కుదోఁచక దారపుత్రక్షేత్ర పశు ధనాదులయందలి ప్రేమపాశంబులం బట్టువడి విడివడ సమర్థుండుగాక నానావిధ రుజలును, జరయును పట్టి బాధింప కట్టా ! యీ దారుణాఘాతం బుల కంతము గలదా ? యీ ఘోర తాపత్రయాగ్నిజ్వాలల నార్చుట కేదే

నొక్క యుపాయంబు కలదా ? శాంతిసుఖమునందు మార్గంబొందు లభిం చునా ? యని పరిపరివిధంబులఁ బలవించుచున్నాఁడు. ఇట్టి యీసంసారులకు తరణోపాయంబు నుపదేశింప నెంచి, వ్యాసభట్టారకుఁడు భగవద్గీతను తొలుత రచియించి యందుఁ జూపిన ధర్మములు మానవాచరణమునకు సాధ్యములుగాని తెలుఁగున లోకులకుఁ దోఁచునని యెంచి వెంటనే భగవ ద్గీతా ప్రబోధము నంతటి నొక మానవుఁడు తన నిత్యజీవనమున సమ్మేళన మొనర్చి యెట్లు సంసారయాత్ర ముగించుకొనఁగలఁడో దానిని తెలియఁ జేయుటకయియే ధర్మరాజపాత్రను గల్పించి గీతాకావ్య వ్యాఖ్యానముగా భారతసంహితను నిర్మించెనా ? యని తోఁచుచున్నది. శ్రీ తిలకు మహా శయుని యాశయమును నిట్లే కలదు. భారతాంతర్గత భగవద్గీత కిదివరకె కొందఱు పండితులు వేదాంతార్థముతో సమన్వయపరచి వ్యాఖ్యానము జేసి యున్నారు. దానియందు పాండవకౌరవులను సుగుణ దుర్గుణములుఁగాఁ జూపిన భావముల నాధారంబుఁగాఁగొని మిగిలిన భారత కథావిధానము నంతటిని వేదాంతార్థమునకుఁ బోల్చి వ్రాయ సాహసించితిని.

ఈ కావ్యమును పఠించిన కొందరి యభిప్రాయముల ననుసరించి కొన్ని కథాపాత్రము లేల కల్పింపబడినవో వానిగూర్చి స్థాలీపులాకముగా జూపించెదను. జ్ఞానాజ్ఞానకర్మము లెవ్వియెని దృఢముగా నడుపవలెనన్న మూలశక్తి బ్రహ్మచర్యమేయగుట, కౌరవపాండవులను దుర్గుణ సుగుణ వ్యూహమున కంతకును ప్రధానశక్తి బ్రహ్మచర్యముగానుండి జీవుని యుత్తే జితునిగాఁ జేయుచుఁ దుదకు ముక్తిప్రాపకునిగాఁ జేసినచోట బ్రహ్మచర్యము భీష్మాచార్యుఁడును, విత్తను ధాతుజన్యమైన వేదము సృష్టి రహస్యము నంతటిని విభాగించి తెలియఁజేయునచోట, నీశ్వరుఁడు జీవుఁడై సృష్టిని విస్తరింపఁజేసికొని చూచుటకు మూలము వేదమనియు, నా వేదమే వేద వ్యాసుఁడనియు జెప్పితిని. జీవోత్పత్తి యనంతరము పంచభూతములు గుణములు కాకుండుటంజేసి ప్రత్యేకముగా మూలమున నే పేరులకుం జోడింపక పంచభూతాత్మికమైన స్థూలశరీరమే హస్తినాపురమనియు, నందు జీవుఁడను ధృతరాష్ట్రుఁడు చేరెననియుఁ జెప్పితిని. మరియు బంచీకరణ

మును గూర్చి శాస్త్రములు యీశ్వరుని నుండి పంచభూతోత్పత్తి వరకు నడుమ కొంత పరిణామము నడచినట్లు చెప్పినవి; కాని యీసృష్ట్యుత్పత్తిని గూర్చి తైత్తరీయము "ఆత్మనఆకాశ స్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృధివీ పృధివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నమ్ అన్నాత్పురుషః" యని యొక్కపెట్టున నడుమనున్న మహదాదులజూపక ఆత్మనుండి పంచభూతము లుత్పన్నమైనవని చెప్పఁబడినది. నేనును నట్లే పంచభూతాత్మిక స్థూలశరీరమును జెప్పి మహదాదు లొకదానినుండి నొకటి పుట్టినట్లు చెప్పిన మూలకథకు భంగమువచ్చునుగాన బుద్ధ్యహంకారాదుల వేఱువేరుగాఁ జూపితిని.

సత్త్వరజస్తమోగుణములను భారతకథలోని పాత్రలను జోడించి చెప్పుటకు ప్రత్యేకపాత్రత కుదురలేదు. కాని సుగుణములు, దుర్గుణములు, సుగుణదుర్గుణముల సమిష్టి యను మూఁడువర్గములుగా గుణములవ్యవస్థ నేర్పఱిచి, పాండవులు, కౌరవులు, మధ్యవర్తులైన భీష్మాదులుఁగాఁ జెప్పి యీ మూఁడుతెగలయందే త్రిగుణము లంతర్భూతములైయున్నట్లు జూపితిని. ద్రుపదుని ప్రతికక్షి ద్రోణుఁడగుట నీ రెండు పాత్రలను నహింసాహింసా తత్త్వములుగఁ దీసికొని, హింసామయ యజ్ఞోత్పాదకములైన బ్రాహ్మణములె ద్రోణుఁడనియు, బ్రాహ్మణములనుండి పుట్టిన యజ్ఞకర్మయె యశ్వత్థామయనియు, వాని రక్షణకుగా గోధనమిమ్మని (అనగా యజ్ఞపోషణమునకు గోవులనిమ్మని) ద్రుపదు నడిగెనని చూపి, అంతర్యాగము ద్రుపదుఁడు అందు బుట్టిన వహింసయు విద్యయు నని చెప్పితిని. పంచపాండవులు పంచప్రాణములని బాల్యమున నేను (నా జనకుల సన్నిధిని వినిన భారతగాథ ననుసరించి) పంచకాములు తమ తపశ్చర్యయందు పంచప్రాణములుగా యోగవిద్య సన్నిధి నుండినట్లు నిరూపించితిని. విద్యాగంధమేమియులేక కేవల పురాణగాథల వినుచుండెడి నా మాతృదేవి నన్ను గర్భమున ధరించియున్నన్నినాళ్లను, శ్రద్ధగా భారతకథాశ్రవణ మొనర్చి పిండరూపమునందే భారతమును జొనిపినట్లు నా చిన్ననాఁడు నాకు భారతకథను బోధించుచుఁ జెప్పినది. ఆభావములె యీరచనకు మూలాధారములు.

మానవుఁడు తన జీవదశయందు (ధృతరాష్ట్రుఁడు ఆత్మభారతమునకు కర్త యితఁడే) పురాకృత కర్మ విశేషంబునంజేసి యాసురీబుద్ధి (గాంధారి) యుక్తుండై మహామోహంబు (దుర్యోధనుఁడు) మూలావిద్య లేక భ్రాంతి నొందినవాఁడై మనోమయుండై (శకుని) యహంకరించి (కర్ణుఁడు) యమనియమాదిక (మార్కండేయాదులు) యుక్త నిష్కామాది (పాండవులు) సుగుణానీకమును చేరందీసి నిల్పుకొననేరని కారణంబున, సద్విచారము (విదురుఁడు) గలవాఁడగుచును తన్నెరుంగనేరక, తన నిత్యానంద స్వరూపమును, తన సర్వ పరిపూర్ణత్వమును మరచి "దీనుఁడను హీనుఁడను నేమియును గాంచనేరని యంధుఁడను" అని యనుకొనుచు నెన్నఁడును తన్ను వదలకయున్న నిత్యవిభూతిని దర్శింపనేరక, దుఃఖకారకములైన బ్రాహ్మణ (ద్రోణుఁడు) మయ యజ్ఞాదిక (అశ్వత్థామ) బాహ్యకర్మములలముకొని కొన్ని కలిగియు కొన్ని లేకయు తన్ను దుఃఖింపంజేయుచుండ కలిమిలేములకు కడఁగానక యేడ్చియేడ్చి తుదకు విసుగునొంది వైరాగ్యమును (సంజయుఁడు) చేరఁదీసి వేద (వేదవ్యాస) రహస్యారాధనం జేసి వాసుదేవ చరణకమల భక్తియుక్తుఁడై సత్కాముఁడై (అర్జునుఁడు) తత్త్వవిచారంబుఁ (అర్జునరథము) జేసి ప్రణవము (గాండీవము) ననుసంధించి నేతినేతి మహావాక్య (బాణములు) విచారణచేఁ దెలివొంది, బుద్ధినిఁ బదిలపరచి చిత్తమును (ద్వైపాయన హ్రదము) దేరుకొనంజేసి నిరాపదుండై యహంకారమును (కర్ణుఁడు) వధించి మనస్సును (శకుని) లయింపఁజేసి కామాది దుర్గుణానీకములఁ (ధార్తరాష్ట్రాదుల) గడతేర్చి, మహామోహ (దుర్యోధనుఁడు) పతనంబుతోఁ దనువను సర్వంబును సమసిపోవ నడలుచు సర్వశూన్యంబును నిరామయంబును నైన కర్మక్షేత్రమగు హస్తి (అస్థి) పురమున (శరీరమున) నుండియె విదేహ కైవల్యంబున (ఇంద్రప్రస్థమున) ముక్తిమంటప (మయసభ) మను సహస్రార కమలకర్ణికా మధ్యంబున నిష్కామ (ధర్మరాజు) పట్టాభిషేకంబొనర్చి, జీవుఁడు స్వస్వరూపజ్ఞానంబు

నొంది శాశ్వతానంద ముక్తిపథంబు నొందు. ఇట్లే యొక్కొకదేహమొక్కొ భారతంబుగా నొప్పుచుండు. అదియె కురుక్షేత్రము. (కర్మభూమి) అందు గలుగు సుగుణదుర్గుణముల పోరాటమే కౌరవపాండవ యుద్ధము. దేవుఁడైన పరమాత్మ సంకల్పమాత్రమున జీవుఁడై (సంసారియై) దుఃఖించి దుఃఖించి విరక్తినొంది సుగుణసంపదలచే దుర్గుణములనెల్ల నశింపఁజేసి తుదకు సర్వగుణరహితుఁడై శాశ్వతానంద ముక్తిస్థానము నొందుటయే జీవుని పరమావధి. కావున నాజన్మమరణాంతముగాఁ మానవుఁడు తన నిత్య కర్మములయందేమాత్రమును పాపముల నంటనీక, జీవకారుణ్యమును వీడక, యెంతలేసి కష్టదశలయందును దన లక్ష్యమును వదలక గమ్యస్థానము నెప్పుడును మరువక, పరమును నమ్మి, దుర్గుణసంహార మొనర్చి, నొప్పింపక తానొవ్వక తప్పించుక తిరుగుచు, బ్రహ్మాండము నేను, నేను బ్రహ్మాండమను నారూఢజ్ఞానము గలవాఁడై సర్వమానవ సౌభ్రాతృత్వంబున మెలఁగుచు నిష్కామ కర్మయోగియగువాడె ముక్తుఁడు, విజ్ఞాని, మహాయోగి యని మహాభారత సిద్ధాంతము. అదియె భగవద్గీతోపదేశము. ఈ యాత్మభారతోద్దేశ్యమును నదియ.

ఇందలి గుణదోషములను పండితులు తెలియపరచిన పునర్ముద్రణమున సవరించుకొందును. గ్రంథశోధనమునందు శ్రమమనుకొనక సహాయ మొనర్చిన శ్రీ భాషాప్రవీణ బి. వీరభద్ర వరప్రసాదరాయశర్మగారికిని, చిర పరిచితులు కాకున్నను నడుగుటయె తడవుగా పీఠిక వ్రాసియిచ్చిన శ్రీమాన్ న్యాయశిరోమణి శ్రీ వేదాల తిరువెంగళాచార్యులవారికిని, శ్రీమాన్ కవిబ్రహ్మ యేటుకూరి వెంకటనరసయ్యగారికిని, గ్రంథములను బంపినవెంటనే తమ యభిప్రాయముల నిచ్చిన పండిత బృందమునకును, గ్రంథమును సర్వాంగ సుందరముగా నచ్చొత్తించి యిచ్చిన శ్రీ జానకిరాంప్రెస్‌వారికిని నా కృతజ్ఞతా పూర్వకాభివందనములు.

సీ. "శ్రీరామ" యని వ్రాయఁజేసి వెంటనె యుద్ధ
పంచకంబును జదివించె నెవఁడు
కావ్యపరిశ్రమఁ గన్గొనుటకు సఖా
పర్వార్థమునుఁ దెల్పఁబంచె నెవఁడు
"విన్నభారతమునె వినవలె"నని నిత్య
పారాయణముఁ జేయఁగోరె నెవఁడు
"శుభమ"స్తటంచును చూచి యాదిని నాది
పంచక మేయమగొంచు నొసఁగె

గీ. నట్టిగురుల కేదారలింగార్య, బుచ్చ
యాహ్వాయున్, దండ్రి శ్రీ పిచ్చయాఖ్యు మఱియు
మాతృదేవిని కనకాంబ, మదినిఁదలఁచి
యీ కృతికి మూలమగువారి నెంతు సతము.

—గ్రంథకర్త

---

# పీఠిక

మహాభారతమును తెలియనివారీ భరతఖండమున నుండరు. కౌరవ పాండవుల చరిత్రము సుపలక్షణముగా నొనరించుకొని సకల ధర్మములను లోకప్రవృత్తులను, కర్తవ్యాకర్తవ్యములను, మంచిచెడ్డలను, సకల తీర్థ క్షేత్ర విశేషములను, భూమండలస్వరూప పరిమాణ నిర్మాణ వైచిత్ర్య విశేష తారతమ్యములను. ఊర్ధ్వాధోలోకముల స్వరూప పరిమాణ యోజనలు. రాజవిద్యలు. బ్రాహ్మణవిద్యలు, సప్తవ్యసనములు, అనేక చిత్రవిచిత్రము లగు నాఖ్యాయికలు, ఆఖ్యానకములు, ఇది యది యననేల? సమస్తమును మానవుఁడు తన బుద్ధితో నెరుగఁదగిన, భావింపఁదగిన, అనుష్ఠింపఁవలసిన అథవా అనుష్ఠింపగల సమస్తమును నిందుఁ గూర్పఁబడినవి. ఈ మహా భారతపు స్వరూప గుణ విభవములు ఈ క్రింది కందపద్యమున ప్రశ్న వ్యాజమున స్పష్టీకరింపఁబడినవి.

కం. ఏయది హృద్య మపూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ
మే యది యక్కథయ వినఁగ నిష్టము మాకున్,

అంతమాత్రమేకాక అత్యంత నిగూఢములును, ఆత్యంతిక పరమార్థములును "ఎఱుక సమగ్రమగుట"ను నిర్వహించునవియు నగు జ్ఞాన విజ్ఞానము లందు చాల యెడలఁ గూర్చఁబడినవి. ఆధ్యాత్మికములగు నీ విషయముల విశిష్టమగు నిరూపణమే భారతమును మహాభారతము నొనర్చినవి. "మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారతం" అని కదా పెద్దల శ్రీసూక్తి. ఈ యాధ్యాత్మికవిషయముల నిట నడపదడప గూర్పనిచో నీ గ్రంథ మంతయు విజ్ఞానరహితమగు సారస్వతమై యధునాతనమగు వాఙ్మయముం బోలి నిరర్థకమై, అనర్థదాయకమై, అరిషడ్వర్గజయమునకుఁగాక అరిషడ్వర్గ జయమున కుపయోగించునదగును, వెన్నెముకలేని శరీరము యెంతకాలము నిలువగలుగును? ఏమి యుపయోగమునకు రాగల్గును? కావున సకల

మానవులకును పార్యంతిక పరమార్థమగు మోక్షసామ్రాజ్యమును లభింపఁ జేయుట కుపయోగించు తత్త్వవిజ్ఞానము సాంగోపాంగముగ నిట నెడనెడ నుపదేశించుటయేకాక విశిష్టముగా భగవద్గీత, సనత్సుజాతీయము, మోక్ష ధర్మములు, విష్ణుసహస్రనామము మొదలగుచోట్ల నుపదేశ రూపమున నొక్కొకయెడ నన్నియు కూర్పఁబడినవి. వీని యావశ్యకత మొదట ధర్మ వ్యాధాది చరిత్రములందు స్ఫుటమొనర్పఁబడి యెంతదూర మరిగియైనను ఎంత తపస్సంపన్నుడైనను, ఎంతటి నీచునివద్దనుండియైనను, ఈ యాధ్యా త్మిక విజ్ఞానమును దానెంతటి యుత్తమజాతివాఁడైనను అభ్యర్థించి నేర్వ వలయును. ఇదియే జీవిత పరమార్థము. ఇదియే జీవిత రహస్యము. ఇదియే సకలజీవితములోని యన్నివిధములగు కృత్యములకును ప్రాప్యఫల సర్వస్వము. అని బోధింపఁబడినది. ఈ యాధ్యాత్మికవిషయముల కూర్పు నకు సంబంధించియే యీ గ్రంథమున కౌరవపాండవ చరిత్రము నిబంధింపఁ బడినది. కావుననే యీ గ్రంథమున నితివృత్త మంతటి ప్రధానముగాదు. అది కేవలము లౌకికైశ్వర్య భోగాదులందు విరక్తియొదవించుటకై యిట నిరూపింపఁబడినది. ఇటు పరికింపుఁడు. సహృదయచక్రవర్తియగు నానంద వర్ధనాచార్యుఁ డీ భారతము నంతయు విమర్శించి దాని సారము నేమని తెల్పుచున్నాఁడో—

"మాభూత విభూతిషు నిస్సారా సురాగిణః గుణేషువా నయ వినయ పరాక్రమాదిష్వమీషు, కేవలేషుకేషు చిత్సర్వాత్మనా ప్రతినివిష్టధియః తథా చాగ్రే పశ్యతనిస్సారతాం సంసారస్య ఇత్యము మేవార్థం ద్యోతయత్స్ఫుట మేవావభాసతే....సకల ఏవ సాంసారికో వ్యవహారః పూర్వపక్షీకృతః అధ్య క్షేణ దృశ్యతే (ధ్వన్యాలోకః 4 ఉద్యో)

ఇచట పాండవ ధార్తరాష్ట్రాదుల చరిత్రమంతయు నుడివితిమి. దీని పర్యవసానముఁ జూడుఁడు. ఇట్లు శోచనీయమగు స్థితి నొందిన కౌరవ పాండవ యాదవాదులఁ జూచియైన నో లోకులారా! మీ రెవ్వరును కేవ లములగు ఈ ప్రాపంచికైశ్వర్యములందుగాని, నయవినయ పరాక్రమాది గుణములందుఁగాచి అభినివేశము నొందకుఁడు. ఇవి యన్నియు నత్యంత

నిస్సారములు, అశాశ్వతములు........అని నిఖిల సాంసారిక విషయమును పూర్వపక్షరూపమున నిరాకరించినట్లు స్పష్టపఱుచుటలేదా?

(ఆంధ్రధ్వన్యాలోకము 4 ఉ)

ఈ గ్రంథమునఁ దీర్థాదులేల పేర్కొనఁబడినవో?

దేవతాతీర్థ తపః ప్రభృతీనాంచ ప్రభావాతిశయవర్ణనం తస్యైవ పరబ్రహ్మణః ప్రాప్త్యుపాయత్వేన తత్తద్విభూతిత్వేనైవవా దేవతా విశేషాణామన్యేషాం పాండవాదిచరిత వర్ణనస్యాపి వైరాగ్య జనన తాత్పర్యాత్ వైరాగ్యస్యచ మోక్షమూలత్వాత్ మోక్షస్యచ భగవత్ప్రాప్త్యుపాయత్వేన ముఖ్యతయా గీతాదిషు ప్రదర్శితత్వాత్పరబ్రహ్మ ప్రాప్త్యుపాయత్వమేవ.

(ధ్వన్యాలోక 4 ఉ)

కావుననే యీ మహాభారతమున దేవతలు, ఋషులు, తీర్థములు, తపస్సులు మొదలగువాని ప్రభావ వర్ణనములు దేవతావిశేషములగు పాండవాదుల చరితములు, ఇతరరాజుల చరిత్రముల వర్ణనములును నుపపన్నములగుచున్నవి. ఇందు దేవతాతీర్థ తపః ప్రభృతుల ప్రభావాతిశయ వర్ణనము భగవత్ప్రాప్త్యుపాయము కావునను, లేక భగవద్విభూతిరూపము కావునను నుపపన్నమగును, ఇఁక బాండవాది చరిత్ర వర్ణనలకు వైరాగ్యోత్పాదనమే పరమప్రయోజనమనుట స్పష్టమే. ఈ వైరాగ్యమేకదా? మోక్షోపాయము. మోక్షము భగవత్ప్రాప్తికిఁ బరంపరాసాధనము. కావున ముఖ్యమని గీతాది స్థలములందు స్పష్టపఱుపఁబడియున్నది. (ఆంధ్రధ్వన్యాలోకము 4 ఉ)

ఇంతయేల అసలు గ్రంథకర్తయగు శ్రీ బాదరాయణులె యిట్లు నుడువుచున్నారు. సత్యం మనోరమారామాః సత్యం రమ్యా విభూతయః కింతు మత్తాంగనాపాంగ భంగీ లోలం హి జీవితం. (మహాభారతం)

గీ. రమణులు నిజమ్ముగా మనోరమలె నిక్క
మే? సకలసంపదలును దా మించుననుట?
కానిమత్తాంగనాపాంగ మూను భంగి
బోలె లోలమ్మెకద జంతువులకు బ్రదుకు, (ఆంధ్రధ్వన్యా 4 ఉ)

ఈ తత్త్వము నెఱుంగక నవీనులగు నజ్ఞులు కొందరు భారతము నైతిహాసికదృష్టితో మాత్రమే పరిశీలించి యెవియో తలతోక లేని విమర్శల నొనరించుచున్నారు. ఇందు ప్రధానముగా ప్రతిపాదింపబడదలంచిన దేదియో యనుక్రమణికలో నాలోకనాథుఁడే యిట్లు నుడివెను. "భగవాన్ వాసుదేవోఽపి కీర్త్యతేఽత్ర సనాతనః" (మహాభారతం) ఇది యిట్లా నందవర్ధనాచార్యులచే వివరింపఁబడినది.

"భగవాన్ వాసుదేవోపి కీర్త్యతేత్ర సనాతనః" ఇత్యస్మిన్ వాక్యే హ్యాయమర్థో వ్యంగ్యత్వేన వివక్షితః యదత్ర మహాభారతే పాండవాది చరితం సంకీర్త్యతే తస్మాత్తస్మిన్నేవ పరమేశ్వరే భగవతి భవత భావిత చేతసః........ఇతి ఏవం విధంచార్థం గర్భీకృతం సందర్శయంతోఽనన్తర శ్లోకాలక్ష్యన్తే 'సహిసత్యం' ఇత్యాదయః ఆయంచ నిగూఢ రమణీయోఽర్థో మహాభారతావసానే హరివంశవర్ణనేన సమాప్తిః విదధతాతేనైవ కవివేధసా కృష్ణద్వైపాయనేన సమ్యక్ స్ఫుటీకృతః అనేనచార్థేన సంసారాతీతే తత్త్వాంతరే భక్త్యతిశయం ప్రవర్తయతా........పరంపరయా వాసుదేవాది సంజ్ఞాభిధేయత్వేన చాపరిమిత శక్త్యాస్పదం పరంబ్రహ్మ గీతాది ప్రదేశాంతరేషు తదభిధానత్వేన లబ్ధ ప్రసిద్ధి మాథుర ప్రాదుర్భావానుకృత సకలస్వరూపశం నిరూపం వివక్షితం నతు మాథుర ప్రాదుర్భావాంశ ఏవ సనాతనశబ్ద విశేషితత్త్వాత్ రామాయణాదిషు చానయా సంజ్ఞయో భగవన్మూర్త్యంతరే వ్యవహార దర్శనాత్ నిర్ణీతశ్చాయమంశః శబ్దతత్వ విద్భిరేవ తదేవ మనుక్రమణీ నిర్దిష్టేనవాక్యేన భగవద్వ్యతిరేకిణః సర్వస్యా నిత్యతాం ప్రకాశయతా మోక్షలక్షణ ఏవైకః పరః పురుషార్థః శాస్త్రనయే కావ్యనయేచ తృష్ణాక్షయ సుఖ పరి పోషలక్షణః శాన్తోరసో మహాభారతాంగిత్వేన వివక్షిత ఇతి సుప్రతిపాదితమ్ అత్యన్త సారభూతత్వాచ్చాయమర్థో వ్యంగ్యత్వేనైవ దర్శితో నతు వాచ్యత్వేన సారభూతో హ్యర్థః స్వశబ్దానభిధేయత్వేన ప్రకాశితః సుతరామేవ శోభా మాదధాతి ప్రసిద్ధశ్చేయ మస్త్యేవ విదగ్ధ విద్వత్పరిషత్సు యదభిమత తరం వస్తు వ్యంగ్యత్వేనైవ ప్రకాశ్యతేన సాక్షాచ్ఛబ్ద వాచ్యత్వేనైవ.

(ధ్వన్యాలోక 4 ఉద్యో)

తే. భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబులెల్ల బాపి యిష్టార్థ సం
సిద్ధిఁ గరుణతోడఁ జేయుచుండు. (నన్నయ)

ఈ వాక్యము వ్యంజకత్వ శక్తిసంపన్నము. దీనివలన నిట్లు వ్యంగ్యము కాగలదు. ఇచట పాండవ ధార్తరాష్ట్రాదుల చరిత్రమంతయు నుడివితిమి. దీని పర్యవసానముఁ జూచియుంటిరి........కావున సర్వతస్సారభూతుఁడును, శాశ్వతుఁడును, మోక్షలక్ష్మికి ప్రాణప్రియుండును నగు శ్రీ వాసుదేవాభిధాన పరబ్రహ్మమునందే మీ మనసుల నుంచి భావింపుఁడు. అతఁడొక్కఁడె ప్రాప్యుఁడు. అని యీ యర్థమునంతను "భగవాన్ సనాతనః" "వాసుదేవః" (శ్రీవల్లభుండు) అను పదములు వ్యంగ్య మొనర్చును. ఈ యర్థము లాపదముల వ్యంగ్యములగుట కాధారముగా "సహిసత్యం పరంబ్రహ్మ" అను నీ యనంతరశ్లోకము లున్నవి. మఱియు మహాభారతము చివర హరివంశ వర్ణనముతో ముగించుటవలన నీ మహాకవియే నిగూఢ రమణీయమగు నీ యర్థమును జక్కఁగా వ్యంగ్య మొనర్చెను. దీని యథార్థ మేమి? సాంసారిక వృత్తిరూపమగు మహాభారతము చివర సంసారాతీతమగు తత్త్వము శ్రీ వాసుదేవ పరబ్రహ్మమును గీర్తించెను. ........ఇచట వాసుదేవసంజ్ఞ కర్థముగా "మధురానగరమున నుదయించుట వలన దన రూపము సకలస్వరూపముల ననుకరింపగల్గునని వ్యక్తపరచిన యపరిమితశక్తి నిలయమను పరబ్రహ్మమే" వివక్షితము. వాసుదేవశబ్దము పరబ్రహ్మ బోధకమగుట గీతాదులందును సుప్రసిద్ధమేకదా? అది మధురానగరోదితుఁడగు వసుదేవసూనునిమాత్రమే యేల చెప్పరాదందురా? ఇచట "సనాతనః" అను విశేషణము వాడఁబడి యున్నదికదా? ఈ శబ్దము శ్రీ రామాయణమున భగవానుని యవతారాన్తరమగు శ్రీ రామచంద్రునందు గూడ వాడఁబడియున్నది. కావున విశిష్టోపసంహారము (ఈ కారణసామగ్రి యంతయుఁ జక్కఁగా నాలోచించి యొకమార్గమున నొకచోట గూర్చి ముగించుట) వలన "భగవాఙ్ వాసుదేవోపి కీర్త్యతేఽత్ర సనాతనః" అను

చోట వాసుదేవశబ్దముచే నపరిమితశక్తి నిలయమును మధురానగరోదయమున సకలస్వరూపమును అనుకరించు సామర్థ్యమును బ్రకటించునదియు నగు పరబ్రహ్మమే వివక్షితము. అంతేకాని మధురానగరోదయ రూపమగు నంశముమాత్రమే కాదని స్పష్టము. ఈ విషయమును శబ్దతత్వవేత్తలే నిర్ణయించియున్నారు. ఇట్లనుక్రమణికయందే వ్యంజనాశక్తి సమన్వితమగు వాక్యవిశేషమువలన "భగవద్వ్యతిరిక్తమగునదంతయు ననిత్యము" అని కవి వ్యంగ్యమొనర్చెను. ఇట్లు శాస్త్రనయము ననుసరించి మోక్షాఖ్యమైన పరమగు పురుషార్థమును కావ్యనయము ననుసరించి తృష్ణాక్షయ సుఖ పరిపోషాత్మకమగు శాంతరసమును శాస్త్రకావ్యరూపమగు నీ మహాభారతమునకు అంగిగా — ప్రధానముగా వివక్షితము లనుటలో వివాదమురాదు. అట్లయిన దీని ననుక్రమణికయందేల నుడువలేదందురా ? గ్రంథమునకంతకును నిది సారతమమగు నర్థముగావున స్వశబ్దములచే దీని నుడువలేదు. సారతమమగు నర్థము నుడువఁబడక వ్యంగ్యమొనర్పబడుచుండుట విదగ్ధపరిషత్తులఁ బ్రసిద్ధమేకదా ? అది యట్లు వ్యంగ్యమైననే అతిశయిత శోభమగును. అట్టియెడ నత్యంత విదగ్ధుఁడగు నీ మహాభారతకవి మఱియొక మార్గము నేల త్రొక్కును ? (ఆంధ్ర ధ్వన్యాలోకము)

ఈ నిరూపణమువలన ప్రకృతపుటాధ్యాత్మిక గ్రంథము "ఆత్మభారతము" ఉదయించుటకు మూలమును నుపపత్తియు నేర్పడినవి. ఇక నిది యెట్లు నడచినదో గమనింతము.

ఈ మహాభారతములోని పాత్రములును, చరిత్రమును గూడ ఇది యది యననేల ? సమస్తమును నాధ్యాత్మిక ప్రసంగమేకాని వేరు కాదని స్పష్టమేకదా ? కావున నిదియంతయు నిట్లర్థమొనర్చుకొని భావింపవలయును. అదియే యత్యంతావశ్యకమైన సంసారమును నివర్తింపఁ జేయఁజాలును. చూడుఁడు మహాభారత రణమన నేమి ? సంసార మహాభార, తరణమే కదా ? అది నిమిత్తమొనర్చుకొనియే కదా ? సకలోపనిషత్సారమగు భగవద్గీత యుదయించినది. ఇట్లెన్నో విషయము లాధ్యాత్మిక యోజ

నచే నధిగమింపవలసినవి కలవు. కాని వానినట్లు యోజించి మనకు నిరూపించి చూపినవారెవ్వరును నింతవరకు నా యెరిగినవారిలో లేరు.

అయితే శ్రీమద్రామాయణముకూడ నిట్లాధ్యాత్మికగ్రంథమే. అది కావ్యశాస్త్రము. అనగా కావ్యసౌందర్య మధికము. తదనుగుణముగా శాస్త్రస్వభావము నలవరుచుకొనును. ప్రకృతగ్రంథము శాస్త్రకావ్యము. అనగా శాస్త్రత్వ మిందధికము, తదనురూపముగా కావ్యత్వ మిందు జతగూర్పఁబడినది. ఎట్లయినను రెండును నాధ్యాత్మిక గ్రంథములే. శ్రీమద్రామాయణము విషయమున శ్రీ వైష్ణవాచార్యులు చాలవర కాధ్యాత్మికమగు వ్యాఖ్యయొనర్చిరి, చాల రసవంతముగా నాయాచోట్ల సమన్వయమొనర్చి యించుమించుగా వేదమంతటి ప్రమాణగ్రంథ మొనర్చిరి. కనుకనే "వేదవేద్యపరే పుంసి జాతే దశరథాత్మజే వేదః ప్రాచేతసా దాసీత్సాక్షాద్రామాయణాత్మనా" అను శ్రీసూక్తి యేర్పడినది.

అచట పదితలలతోడి రావణుఁడు కర్మేంద్రియ జ్ఞానేంద్రియ దశకశిరస్కమగు మనము. రావణు నధికారమందున్న లంకానగరము మనోధీనప్రవృత్తియను శరీరము. లంకలోనున్న సీత యింద్రియములవెంబడి పరువెత్తు మనసునకు లోగిన జీవాత్మ. అటగల సముద్రము సంసారసాగరము, ఆంజనేయు లాచార్యులు. శ్రీరామచంద్రుఁడు పరమాత్మ. ఆంజనేయులు శ్రీరామచంద్రుని సంగతి సీత కెరింగించుటయు, సీతవృత్తాంతమును శ్రీరామచంద్రున కెరింగించుటయు భగవదనుగృహీతమును తత్ప్రాపకమును నగు మోక్షార్థతత్వ విజ్ఞానమును ఆచార్యుఁడు జీవున కెరింగించి జీవుని సంసారతాపత్రయమును పరమాత్మకు నివేదించి తొలగింపుమనుట, శ్రీరామచంద్రుఁడొనర్చిన సీతాబంధవిముక్తియె పరమాత్మ అనుగ్రహమున నేర్పడు జీవుని తాపత్రయ విముక్తిరూపమగు మోక్షము." అని యిట్లింకను సుసంగతముగా నధ్యాత్మపరమగు వ్యాఖ్య శ్రీ రామాయణమునకు పూర్వాచార్యులచే ననుగ్రహింపఁబడినది. కాని పంచమవేదమగు నీ మహాభారతమునకుమాత్ర మిప్పటివర కిట్టి యాధ్యాత్మిక వ్యాఖ్య వెలువడలేదు. బహుశః ఈ గ్రంథమున ననేక స్థలములందు ఆధ్యాత్మికవిషయములు స్పష్టముగనే వివరింపఁబడి యున్నందున కౌరవపాండవ చరిత్రమునందిట్టి యంశతః వైయుక్తిక

వ్యాఖ్య యవసరములేదని ప్రాచీనులు తలంచియుందురు. శ్రీ రామాయణ మట్లుగాక కావ్యమార్గమునఁ బ్రవర్తించి యీ విషయముల నెక్కుడుగా వివరింపకుండుట వలన నట నిట్టి వ్యాఖ్యానము యొక్క యావశ్యకత యెక్కుడై యుండును. అది కారణముగా నిదివరకే యట నిట్టి వ్యాఖ్యాన ముదయించినది. ఇట నిట్టి సమగ్రవ్యాఖ్యాన మిదివరలో నుదయింపక పోయినను అటనట రూపకభంగులలోను సమాసోక్తి స్వరూపములందును గొంచెము కొంచెముగా తడువఁబడక పోలేదు.

ఆ. రోషమయ మహాతరువు సుయోధనుండు
స్కంధమందులోనఁ గర్ణుఁ డలరుఁ
గొమ్మ సౌబలుండు గుసుమఫలములు దు
శ్శాసనుండు మూలశక్తి తండ్రి.

ఆ. ధర్మజుండు ధర్మతరువర్జునుఁడు ఘన
స్కంధ మనిలసుతుఁడు శాఖకవలు
పుష్పఫలము లేను భూసురులును వేద
ములుఁ దదీయమైన మూలచయము.

ఇట్లే సమాసోక్తిభంగులను పరికించునది. కాని యిట్టివి యెన్ని యున్నను అసలుచరిత్రము మొదటినుండి చివరవరకు నేయే భావములతోడి రూపకము ననుసంధాన మొనర్పవలెనో స్పష్టపరుచు వ్యాఖ్యాన మున్నగాని అంతయు సమగ్రముగా ననుసంహితము కాజాలదు. అట్లయినపుడుగదా బాదరాయణుల సంఘటనాచాతుర్యమును మనకు వానివాని తత్త్వవిజ్ఞానము వలనఁ గలుగవలయు వైరాగ్యశాంతి తితిక్షలును ముముక్షాశ్రద్ధా బుభుత్స లును గల్గును. ఆ కొరఁత యీ ప్రకృతగ్రంథమగు "ఆత్మభారతము" వలన సమగ్రముగాఁ దీరఁగలదు. పూర్వము భారతమనఁగా భారతుల — భారత వంశస్థుల చరిత్రానుకీర్తనమని యర్థమయ్యెను. ఇపుడు తెనుగునాటి నానుడి నుండి ఆత్మభారత మనగా అత్మకు సంబంధించిన యావచ్చరిత్రము. యీ పెద్దచరిత్రమున కట్టి వాడుక తెనుగునాట సుప్రసిద్ధము. "వాఁడిభారతము వాఁడు వెళ్ళఁబోస్తున్నాఁడు" "చేటభారతంరా వాఁడిసంగతి" ఇత్యాదులగు

వాడుకలు ఈ తెనుగునాట నెవరికి తెలియవు. కావున నిట తెలుగువాఁడగు కవి ననుసరించి భారతమను పదమును బైయర్థ మనుసంధాన మొనర్చు కొనగా ఆత్మకు సంబంధించి తెలియదగిన విషయములతోడి యాతని చరిత్రమని యర్థము. ఇట్టి భారతపదమునకు వేరుగా నర్థమొనరించి భారత మొనర్చినవారు కలరు, శ్రీ పీఠికాపురాస్థాన విద్వాంసులును అత్యద్భుత శతావధానులును నగు శ్రీ వేంకట రామకృష్ణకవిసింహులు. శ్రీరామకృష్ణ మహాభారతమును రచించి "భరతవంశ్యుల చరితంబుఁ బ్రస్తుతించి, భార తంబయ్యె తొల్లిటి భారతమ్ము. భారతీ వాదగాథల బయలుపఱచి భారతం బయ్యె నిప్పటి భారతమ్ము" అనినారు. ఇట్లు భారతశబ్దమును వేరొక యర్థమునందును అందును తెల్గునాటిలోని తెల్గువారి వాడుకను సమర్థించు తీరున నవరించి తన జాతీయతను చక్కఁగా సమర్థించుకొని లోకుల కాహ్లాద మొనరింపగల యీ తెనుగుకవికి గల జాతీయాభిమానములోని వేయవవంతైనను మన కబ్బుఁగాక. ఇట్లు భారతచరిత్ర చిత్రణమొనరించు నపుడీ కవి ప్రబోధచంద్రోదయమును మనమునందిడుకొనెను. తొలుదొల్త నిట్టి రచన ప్రబోధచంద్రోదయమునందు అవతరించి సంకల్ప సూర్యోద యమునందు విస్తరిల్లినది. వీనినిఁజూచి యుదయించిన జీవనందనము మొదలగువానియం దనుకరణమేకాని ప్రతిభావైచిత్ర్యము నాకు గన్పట్టలేదు. అయితే యీ కవి ప్రబోధచంద్రోదయమును గురితించినను అంధపరంపరగా దాని ననుసరింపలేదు. అందుగల సూత్రమును గ్రహించి తన ప్రతిభా బలమున నూత్న ప్రక్రియతో నలంకరించి విస్తరింపఁజేసెను. ప్రబోధ చంద్రోదయమున మహామోహుఁడు మొదలగు ఆవిద్యకవిషయములకు శత్రురాజత్వాదులం గల్పించి వివేకునకు రాచరికము నేర్పరించి వీని విచార మును సంగరముగా సంఘటించి తత్త్వవిజ్ఞానోదయమును చంద్రోదయ ముగా నవరించెను. ఇట నట్లుకాదు. అందుకు విపరీతము. దుర్యోధనాదులు మహామోహాదులుగా నిందు నవరింపఁబడి అర్జునుడు సత్కాముఁడుగా నేర్పరుపఁబడెను. ఈ మార్పిడియందలి వైచిత్ర్య మేమనగా వెనుకటిదాని యందు మహామోహాది భావములం దయథార్థమగు శత్రురాజాది భావన యేర్పడవలయును. ఇట్లుగాక యిచట దుర్యోధనుని స్వభావము మహా మోహము గావున స్వభావరంజితమగు వాస్తవికభావనయే యేర్పడి వైరా

గ్యాదుల కతి శీఘ్రమున నవకాశము గల్గును. మనము సామాన్యముగా నొక వస్తువును దాని స్వభావముచే గనుగొనుటయు ఆ ధర్మముతోనె పేర్కొనుటయు నలవాటుగానున్నది. వంకాయల నమ్మువాడు వచ్చెనను కొనుడు, మనము వాని "ఓ వంకాయలూ ఇటురమ్ము" అని పిలుతుము. ఇట నెంతమాత్రమును భ్రమాదుల యనుసంధానమున కవకాశము లేదు. వేదమునందుగూడ "అయుర్వై ఘృతం తేజోవై ఘృతం" ఇత్యాదులందు వాస్తవికమును స్వభావ ప్రసక్తమును నగు స్వరూపానుసంధానమేకదా? అట్లే యిచటగూడ దుర్యోధనాదుల స్వభావమగు మహామోహాదుల యను సంధానమే యగుట మనకు జక్కగా ప్రస్తరించి నిరూపింపఁబడుటవలన భ్రమాత్మకమగు ననుసంధానము లేకుండనే చక్కని భావనయు నానందము మాత్రమునె కాక వైరాగ్యోదయ మతి సన్నిహితముగా నుండగల్గును. ఇది యీ గ్రంథమునం దంతటను విస్తృతముగా నుండుటవలనఁ బ్రత్యేక నిరూపణ మనావశ్యకము. అయినను నూటయేబదినాలవ పుట మొదలుకొని రెండు మూఁడు పుటలును మరికొన్ని చోట్లును నవశ్యకముగా కవి సంఘటనా చాతుర్యమునకును వాస్తవ స్వభావానుసంధానమునకును తప్పక పఠింపవలసినవి. ఇల్లు భారతములోని ప్రధానచరిత్రమును ప్రధానపాత్రలను జక్కగా వ్యస్తరూపక, సమస్తరూపక, వాక్యార్థరూపక, సమాసోక్తి రూపముల బూర్తిగా నలంకరించియు గృత్రిమతావేశమేనియు స్ఫురింపనీయక చక్కగా సంఘటింపఁగల్గిన యీ కవిచాతుర్యము తెలుగుకవుల కెల్లరకును అనుకరణీయమగుగాక, విజ్ఞానరహితమగు నెట్టి సారస్వతమును మనజాల దనియు తజ్జాతీయులకు శ్రేయోదాయకము కాజాలదనియు నిందువలన దెలుగునాట వారెరింగి తమ మార్గములఁ జక్కపరచుకొందురుగాక. జాతి శ్రేయోదాయకములగు నిట్టి యుద్గ్రంథముల రచించు నుత్సాహ మీ కవికి వలె నింకను తెనుగునాటి కవులకు గల్గుగాక.

ఈ కవి యీ రచనకు వలయు సామగ్రిని సద్గురువులవలన తాత్త్వికరూపమున సంపాదించినాఁడు. ఏదో ముక్కునబెట్టుకొని తాత్కాలికమగు విన్యాస మొనర్పక సమగ్రమును దాత్త్వికమును నగు నంగవిన్యాసమును సప్రమాణముగా నేర్పరుపగల్గుటవలననే యీయన సమధిక విజ్ఞానము మన

కవగతము కాగల్గెను. యీ కవి యుత్తమోత్తమ విజ్ఞానమును అగ్రజాతి యనుకొనువారెంతోమంది సంపాదింపలేదు, నిజముగా సంపాదింపనుగూడ లేరు. "సారంతు సారస్వతం జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః" అని కదా పెద్దలందురు, "గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం నచవయః" అనుచోట "లింగం" అని తీసివైచి "జాతి" అని పఠించు కొని వివేకమును సంపాదించుటకు ప్రయత్నింతము. ఎడనెడనిడిన ప్రమాణ వచన జాత మెంతయో విజ్ఞానమును వెదజల్లుచున్నది. ఈ కవి నింకను తనలో నున్న విజ్ఞానమును వెల్లడింపఋాను నట్లొనరింపవలెనని సకల ప్రమాణాత్మకుఁడును ప్రాణ నిలయుఁడును నగు శ్రీమన్నారాయణునకు నా విన్నపము.

ఆనందతీర్థ అగ్రహారము,
గుంటూరు.
ది 5—12—48

వేదాల తిరువేంగళాచార్యులు,
న్యాయశిరోమణి.

---

## కవిబ్రహ్మగారి పరామర్శ

ఆత్మభారతము నామూలచూడ మందంద గాలించితిని. గ్రంథకర్త కృతభూరిపరిశ్రముఁడని తోచినది. తా నధ్యాత్మ విద్యా ప్రవణుఁడయ్యు లౌకిక కథాఘట్టముల నెంతో నేర్పుగా ననుసంధించినాఁడు. గ్రంథమంతయు నాత్మపరముగా సమన్వయించుట యలఁతియయిన పని గానేరదు. ఆయాయినామముల కుపబలకముగా లగించిన పేళ్ళింతో సమంజసముగా నున్నవి.

భరతవంశమునకు గోశభూతుఁడయిన శంతనుని మూలవిరాట్టుగా నీ కథారంభ ముల్లేఖించినది. అసలు భారతకథాగమన మితనికడ నుండియే చక్కఁగా సమారంభ మయినదనక తప్పదు. భరతాదుల గాథ లుపాఖ్యాన

ములుగా నుపనిబంధింపఁబడినవి. అందుచే నీ కృతికర్తయు నా మర్యాద ననుసరించు యుండును.

వేదాంతమర్యాదలు లౌకికయాత్ర కనుగుణముగాఁ బ్రచారము చేయ వలయునన్న నిటువంటి బృహత్కథలపై నెంతో యెబ్బెట్టు గొల్పును. మన పూర్వులు కొందఱీ రీతి ప్రచారమునకు జీవితమంతయు ధారవోసిరి. ఒక కథారేఖలమీఁదనే గాదిటువంటి ప్రచారము జరిగినది ? నాటక ప్రహస నాదులందును నెక్కడవీలైన నక్కడ నిటువంటి యుపనామములఁ గల్పించి యీ వేదాంతబోధ చేసినారు. ఇందులకుఁ బ్రబోధ చంద్రోదయాదులే తార్కాణములు.

ఆదికావ్యమనుకొను రామాయణమును సైతము సమంత్రకముగా నన్వయించి గాయత్రీమంత్రోపనిబద్ధమొనర్చి పఠనపాఠన శ్రవణశ్రావణ మాత్రముననే ముక్తి నీఁగలదని యాసగొలిపినారు. ఇందుచేఁ జరిత్రరేఖ లపురూపములై గానటబీనట క్రిందికి దిగినవి. పంచలక్షణోపేతములగు నాదిరాజ చరిత్రములకే యిట్టి సమన్వయము జరుగఁగా వాని పిలకల విషయమునఁ గిముత ?

నా యెఱిఁగినంతమట్టుకు భారతమున కీ సమన్వయము నింత ముక్కు సూటిగాఁ జెప్పినవారరిది. ఆదికవుల యుద్దేశ్యము మన మీ ప్రతిబింబముల ద్వారముననే గ్రహింపవలయును. లేదా శిష్యపరంపరాగతమగు నానుపూర్విచే నైన గుర్తింపవలయును. భాగవతాంతర్గతమగు పురంజనోపాఖ్యాన మిందు లకు దగ్గఱగా నడచిన ఘట్టము.

అందలి శ్లేషపూర్వక విశేషార్థస్ఫురణచే విధీయమానాంశము గోచ రించుచున్నది. ఇందన్నినో ప్రత్యేక నామనిబంధముచే నంతరార్థావగాహము చేసికోవలసి వచ్చినది.

ఈ భారతము ద్వాదశపర్వ సంభృతము. ఇందలి పర్వవిశేషములు తత్తన్నామనిరూపితములై కథాగమనమున కందుపాటులో నున్నవి.

పరిశిష్టమునందలి యంశము లెంతయు గమనార్హములైనవి. అవతార ఘట్టములు, కాళీయమర్దనము, గోపికా వస్త్రాపహరణ మిత్యాదులు అలౌకికార్థములకు సంబంధించి జిజ్ఞాసువుల నెంతోదూరము కొంపోవుచున్నవి.

అనూచానముగా వచ్చుచున్న భారత భాగవత కృష్ణతత్త్వ నిరూపణ మీనాఁటిదిగాదు. దాని నీ పరిశిష్టములో నడుగుమోవ గాలించిన గ్రంథకర్త గారెంతయు ధన్యులు.

శ్రుత మెంతో దొడ్డది. అదిగాఁ బలువురు మాన్యులైనారు. దాని పరిణతి ఆత్మభారత కర్తలోఁ బెల్లుబికినది. "గద్యం కవీనాం నికషం వదంతి" అన్న నానుడి ఈ కవిగారిపట్ల నల్లేరుపై బండినడక యైనది. తన ముప్పదేండ్ల వ్యవసాయమునకు లభించిన ఫల మిది. క్షేత్రజ్ఞు లిందు పాలికాపులై తమ జీవనధర్మము నంతర్దృష్టితో నన్వయింతురుగాక.

కవిబ్రహ్మ
ఏటుకూరి వేంకటనరసయ్య

---

## సింహావలోకనము

ఈ యాత్మభారత మంతయు నామూలాగ్రముగ పరిశీలించితిని. ఇందుదాహృతమైన విషయములు గ్రంథకర్త ప్రతిభను శాస్త్రపరిశ్రమను బహు గ్రంథావలోకనమును స్పష్టము చేయుచున్నవి. ఇంతకు మున్ను రామాయణమును, భాగవతమును నాత్మపరముగా సమన్వయించి రచియింపఁబడిన గ్రంథము లాంధ్రమునఁ గలవు. కాని భారతము నాద్యంతము నాత్మపరముగా సమన్వయించి యీరీతి విపులముగా వ్రాయఁబడిన గ్రంథము లాంధ్రమున లేవు. ఇట్టి కొఱఁతను దీర్చిన శ్రీ యాంజనేయులుగా రెంతయు గృతార్థులు.

"భారతం చేషుఖండంచ ప్రతిపర్వ రసోదయమ్" అన్నట్లు నీ యాత్మ భారతముగూడఁ బ్రతిపర్వ రసోదయమై చదువరులకుఁ గ్రొంగ్రొత్త చవు లొలికించుచున్నది. భీష్మపర్వమునకు బ్రహ్మచర్యపర్వమనియు, ద్రోణపర్వ మునకు బ్రాహ్మణపర్వమనియుఁ, గర్ణపర్వమున కహంకారపర్వ మనియుఁ గల్పింపఁబడిన నామధేయములుకూడ గ్రంథస్థవిషయముల కెంతో యాను గుణ్యముగను సమంజసముగ నున్నవి.

వేదాంతాది శాస్త్రములు దురవగాహములు. వానిని బ్రత్యేకముగాఁ బఠింపవలయునన్నఁ జాలకాలము పట్టును. అట్టి శాస్త్రములఁ బఠించు వారును, బఠింపించువారును నీ నవయుగమున దుర్లభులగుచున్నారు. విషయగ్రహణమున సౌలభ్యమునుగోరు నిట్టి సమయమున నాత్మభారతము వంటి గ్రంథములు ప్రజానీకమున కత్యంతోపయోగకరములు. విశేషించి ముముక్షువుల కానందదాయకములును. తొలఁదొల్తనుండియు మన భారత వర్ష మధ్యాత్మవిద్యకుఁ బుట్టినిల్లు. వేదవ్యాసుఁడు మొదలుకొని వేమనయోగి వఱకు నెందఱెందఱో మహానుభావులీ బ్రహ్మవిద్యను గుఱించి యుద్గ్రంథ ములు రచించిరి. గీర్వాణ వాఙ్మయమునందు వేదాంతమును గుఱించి యున్నన్ని గ్రంథములు మఱేవిషయమును గురించియు రచింపఁబడలేదు. ప్రాచీనకాలమున ఖండఖండాంతర వాసులెల్లరు భారతీయులకడ కరుదెంచి బ్రహ్మవిద్య నభ్యసించిరనుటకుఁ జరిత్రయే ప్రబల నిదర్శనము. మన దేశ మున బ్రహ్మవిద్యా ప్రాశస్త్య మింకను గొఱవడలేదనుట కాత్మభారతము వంటి యుత్తమగ్రంథ రచనలే తార్కాణము.

అతి పురాతనకాలమున యోగులగు క్షత్రియులీ బ్రహ్మవిద్యయం దుత్తీర్ణులై తత్త్వశాస్త్రమును రచించిరనియు నద్దానిని బ్రాహ్మణపండితులు ప్రచారమునకుఁ దెచ్చిరనియుఁ జరిత్రవలనఁ బ్రస్ఫుటమగుచున్నది. దీని కనుగుణ్యముగ భీష్ముఁడు, జనకుఁడు మున్నగు రాజర్షులీ బ్రహ్మవిద్యను బోధించి ప్రచారమునకుఁ దెచ్చినట్లు మహాభారతమువలనఁ దేటపడుచున్నది. తదాది నేఁటివరకెల్లరు జాతి మత భేదములు లేక బ్రహ్మవిద్యను బ్రచారము చేయుచు వచ్చిరి.

ఈ గ్రంథకర్తగారు భారతమందలి విషయముల నాత్మపరముగ సమన్వయించుటలోఁ గడుంగడు నైపుణ్యమును బ్రదర్శించిరి. వీరి సామర్థ్యమును నిరూపించుట కిట నొక్కవిషయమునుమాత్ర ముదాహరింతును.

అహంకారపర్వములో — "సత్కాముఁ డహంకారుని జంపమికి నిష్కాముఁడు నిందించుట" ఇయ్యది యర్జునుఁడు కర్ణుని తేజమునకు భయపడి ధర్మజుని సేమమారయవచ్చిన ఘట్టము.

ఇచ్చట సత్కాముఁడను నర్జునుఁడు అహంకారుఁడను కర్ణునకు భీతిల్లి యుద్ధరంగము వీడివచ్చుట బ్రహ్మవాది మాయావాదికోడి సభారంగమును వీడివచ్చునట్టిదనియు నట్టితఱిఁ దపస్సుకంటెఁ జేయదగు కార్యమొండు లేదనియు నందుచే సంసారమును నరణ్యమున కేగుట యుక్తమని నిష్కాముఁడను ధర్మజుఁడు వచించునట్లుపమింపఁబడినది. అహంకార పర్వమందలి యీ ఘట్ట మెంతయో హృదయంగమముగా నున్నది. మచ్చునకే యిట్లుదాహరించితినిగాని గ్రంథమంతయు నిట్టి యానందమయఘట్టములతోనే నింపఁబడియున్నది. ఈ గ్రంథకర్త కేవల మాంధ్రభారతమునేగాక సంస్కృతభారతమందలి భగవద్గీతనుగూడఁ దీసికొని యాత్మపరముగా సమన్వయించుట మఱింత హృదయావర్జకముగా నున్నది.

ఈ గ్రంథమందలి శైలి మృదుమధురశబ్ద సంవలితమై నాతి దీర్ఘ సమాసయుతమై సామాన్యజన సుసంవేద్యమై చిన్నయసూరి రచనను బోలి పండితపామరజన రంజకమై యొప్పారుచున్నది. తత్వశాస్త్రజ్ఞానము సన్నగిల్లిన యీ దినములలో నిట్టి వేదాంతవివరణ గ్రంథము లత్యంతావశ్యకములై యున్నవి. బ్రహ్మవిద్యయం దపరిమితాసక్తిగల భారతజాతి యీ గ్రంథమును బ్రహ్మానందముతో నాదరింతురని యాశించుచున్నాడను.

ఉభయభాషా ప్రవీణ

ముక్కామల రాఘవయ్య

శ్రీరస్తు

## శు భా భి నం ద న ము

"శ్రీసనాధుని" నాభిఁ జెల్వొందు "బ్రహ్మ" మా
నసపుత్రుఁడును మౌని నాథుఁడైన
"భృగుమహర్షికిఁ" బుత్రుఁడగు "ధాత"కు "మృకండుఁ"
డధిక తపశ్శాలి యాత్మజుండు
నతనికిఁ జిరజీవి యైన "మార్కండేయుఁ"
డతనికి వేద శిరాఖ్యుఁడైన
వస్త్రనిర్మాత "శ్రీ భావనార్షి" జనించె
నతఁడు సూర్యాత్మజయందుఁ గనిన
సంతానమే "పద్మశాలి" వంశంబగు
నందు బిట్టాన్వయంబందుఁ దాడి
కొండను "పిచ్చయా"ఖ్యుండు సద్గుణఖని
యతని సతులు పతివ్రతలు, నేక
గర్భజ యుగళంబు "కనకాంబ" లనువారు
వారిలో ద్వితీయ వడసె వంశ
విలసితు నసమాన వేదాంతవిదుని, సు
శ్లోకు "నాంజనేయ" సుకవివరుని.

**"మనవంశ నందనంబునఁ**
**గనఁబడుఁ గల్పద్రుమ ప్రకాండం బెంతో"**
యనఁగా నుదాహరణముగఁ
గనుఁడీ "శ్రీ ఆంజనేయ" కవికృతి సుమమున్.

చదివితి "నాత్మభారతము" సార మపారము; పంక్తిపంక్తియున్
సదమల సద్గుణప్రకర సాధనమయ్యు నపూర్వ విజ్ఞతా
సదనమునందు నిల్పు; నెటు సాధనఁజేసితొ! నీ కలమ్ము వెం
దదరిని జాడఁ జూడము; హృదబ్జవికాస మదెంతయో కవీ!

ఒక్కొక్కఘట్టమం దొనరు నొక్కొకరీతి సమన్వయంబు; ఆ
ఫక్కినిఁగాక నీ రచన పాయలువాఱక నొక్క చక్కటి
న్నిక్క జయంబుఁ జేకొనె మనీషులు "భేష"ని మెచ్చునట్లు పెం
పెక్కెను వంశకీర్తి సుకవీ! నిను నొక్కని గాంచఁగల్గుటన్.

భారతకర్తలున్మువురు పల్మరుఁ జింతనఁ జేసిచేసి "యిం
దారయలేరు తెల్లముగ నాత్మవిచారము గొంద ఱందఱున్
సారమెఱుంగుఁ"డంచుఁ దమ శాశ్వతకీర్తుల నిల్పుకోఁగ నీ
తీరున జన్మమెత్తిరను తృప్తి జగమ్ములనిల్పు సత్కవీ!

పరమార్థాకర కావ్యకర్తలను సంభావించుచున్ "నానృషిః
కురుతే కావ్య"మటంచుఁ బల్కుదురు ప్రాజ్ఞుల్! మీరలద్దాన మా
కరుదారన్ ఋషితుల్యులేయగుచు బ్రహ్మానందముం గూర్చరే!
సరసోదంచిత కావ్యధాతలయి మీ జన్మంబు ధన్యంబయౌ.

కల వధ్యాత్మిక రూపునం దనరు సద్గ్రంథావళుల్పెక్కు, లీ
యిల నాంధ్రమ్మునఁ బూర్ణభారతము నే నెందున్వినన్ లేదు; మీ
వలనన్నేటికి దివ్యభాగ్య మది సంప్రాప్తించె; ఋష్యంశజా!
జలజాతాక్షుఁడు, కృష్ణుఁ డిచ్చుతను మోక్షశ్రీలమీ కాదటన్.

మంగళమగు సుకవులకును
మంగళమగు "నాంజనేయ" మాన్యున కెలమిన్
మంగళమగు విశ్వమునకు
మంగళమగుఁ "బద్మశాలి" మండలి కెపుడున్.

సీతారామపేట
(పుల్లంపేట పోస్టు)
10–11–1948

ఇట్లు
పండితవిధేయుఁడు
శ్రీ రామదాసు వెంకటయ్య

ఓమ్

## అభినందనము

సిరికిన్ బ్రాపగు పుణ్యలోకమున జేజేల్వొట్టగా భక్తులె
ల్లరు మాణిక్యచిరత్నపీఠమున లీలామూర్తియై రాధతో
సరసస్ఫూర్తి వసించు మోహనుఁడు నిచ్చల్ పద్మశాలీయ వి
స్తర బిట్రాన్వయ రత్నమంజయ కవిన్ దత్త్వజ్ఞు రక్షించుతన్.

పంచమవేదమై పరగు భారతసంహిత కంతరార్థముఙ్గా
బ్రాంచదుదారధీవిలసనంబునఁ బల్కుట నల్పరీతిగా
నెంచఁ ద్వదీయ కావ్యసుమమే; నలుదిక్కుల మించుతావులఙ్గా
నించుత నీ యశోలతల నిండుత మీ భువనాంతరాళముల్.

ఇట్లు
విద్యాప్రవీణ — భాషాప్రవీణ
శ్రీ బొద్దనపల్లి వీరభద్ర వరప్రసాదరాయశర్మ
సీనియర్ తెలుఁగు పండితుఁడు
యస్. వి. వి. హైస్కూలు, తాడికొండ.
ది 4—12—48

శ్రీ హయగ్రీవ స్సహాయః

# అభినందనము

చదివితి "ఆత్మభారతము సొంతముగా" నిది గద్యకావ్య మీ
పదములసొంపు, భావములవైఖరి, తత్వసమర్థనంబు నా
హృదయము నాహరించెను పఠించినవారికిఁ జిత్తమందు స
మ్ముద మొనరింపగాఁదగిన పొత్తము పాఠకులార చూడుఁడీ.

భారత మాత్మభారతము వైదికపర్వము యోగపర్వమన్
పేర రచించెఁ బర్వముల, వీరులు పాండవులెల్ల రిందులో
జేరిరి పంచకాములను చిహ్నముతోఁ బరమాత్మ కృష్ణుఁ డీ
తీరున నుండె నియ్యది సుధీమణులార! పఠింపుఁడీ కృతిన్.

గీతఁగలట్టి సారము లిఖించెను పిమ్మట నాస్తికత్వ మే
రీతిగ నుండునన్న వివరించెను ద్రౌపదిదేవి విద్యగా
ఖ్యాతి వహింపఁజేసె నిక హస్తిన అస్తిపురంబుగా సుధీ
వ్రాతము మెచ్చునట్లు కృతి వ్రాసె నపూర్వము లీ రహస్యముల్.

కులమున పద్మశాలి, యిక గోత్రము బిట్ర సమాఖ్య ఆంజనే
యులు హనుమత్పదాబ్జయుగళోపరిభాసుర భక్తిభావనా
కలిత సుధాసమాన పదకల్పిత దివ్యకవిత్వధోరణీ
లలితుఁడు విజ్ఞులార సఫలశ్రముఁజేయుఁడు మీరలీ కవిన్.

శ్రీ బిట్ర అంజనేయా!
ధీబల మారోగ్యవృద్ధి దీవ్యత్కవితా
ప్రాబల్యమిచ్చి బ్రోచుత
బవలా హనుమయమృత దృష్టిస్ఫూర్తిన్.

కవిరత్న — కవితాకళానిధి
శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు
ముక్తిపల్లి అగ్రహారము

శ్రీ లక్ష్మీహయగ్రీవో విజయతే తరామ్

శ్రీయుత బిట్రా ఆంజనేయులుగారికి—

మహాశయా!

నా యభిప్రాయమును గోరుచుఁ బంపిన తమ "యాత్మభారతము"ను వార్ధకదోషమున నోపిక సన్నగిలి పోవుటచే నెడనెడమాత్రమ తిలకింపఁ గలిగితిని. అష్టాదశపర్వములతో భారతరవగు మహాభారతమును ద్వాదశ పర్వములతోడనే సంగ్రహించియు, దురవగాహాత్మవిషయబాహుళ్యముచే భారతమ మగునట్లు గావించితిరి. ఆత్మకథాకల్పనమునందును, నానాచిత్ర పాత్ర ప్రవేశమునందును, బహుమత రహస్యవివేచనమునందును మీప్రజ్ఞ మిక్కిలి ప్రకటితమైనది. లేఖకముద్రాపకప్రమాదముల మాటకేమిగాని గ్రంథ మంతయు సరళాంధ్రభాషలో నావిష్కరింపఁజేయుటచే నెంతయు హృదయంగమముగ నున్నది. రామాయణభాగవతములఁగూడ నచిరముగ నిట్ల విరచించి, మహాయశస్సుం బడయ నీశ్వరుఁడీగ్రంథకర్తకుఁ జిరాయురారోగ్యభాగ్యములఁ బ్రసాదించుఁగాత!

అగ్రహారము
గుంటూరు.
14–12–'48

అవధాని శిరోమణి
మహామహోపాధ్యాయ
శ్రీకాశీ కృష్ణాచార్యులు.

---

## గ్రంథం బాగున్నది.

సంస్కృతినిబట్టి శ్రీ బిట్రా ఆంజనేయులుగారికి శ్రీమహాభారతము ఆత్మభారతముగా దర్శనమిచ్చింది. వారు దానిని గ్రంథముగారచించి తాము పొందిన మహదానందమును మనకు పంచిపెట్టినారు. చివరిభాగములోకొన్ని పేజీలు తరుగుగా గ్రంథమంతా నేను చదివాను. దురవగాహమైన (యాబ్‌స్ట్రాక్టుగావున్న) నీ మానసిక ఆధ్యాత్మిక శాస్త్రములను సులభగ్రాహ్యము (కాంక్రీటు) చేయుటకై ఇట్టిఆచారము శృతి, స్మృతి, పురాణ ఇతిహాసము లన్నిటియందును అవలంబింపబడుచున్నది. రాజనీతిశాస్త్రము బోధించిన

నారాయణకవియు ఈపద్ధతినే అవలంబించెను. కడపవాస్తవ్యులు శంకర రావుగారు భారతామృతసారమును రచించిరి. కాని అది సంపూర్ణరూపణము గాదు. ప్రకృతమగు ఆత్మభారతములో పాత్రలపేర్లు సృష్టించుకొనుటయందే గాక వారిపరివారము, వారిప్రవర్తనములును మిక్కిలి నేర్పుగా సమర్థింప బడినవి. శాంతేయుడైన అహంకారము, సాత్వికాహంకారము కాకపోవుట వలన దుర్గుణమగుటయు, అదిమహామోహునే బలపఱచుటయు, సుగుణ మగు బ్రహ్మచర్యము జీవుని అండజేరుటయు, హింసాకలంకితమగుటవలన బ్రాహ్మణములు మోక్షప్రతిబంధకములగుటయు, మొదలగు విషయములు మన ఆలోచనను యెంతయేని లోతునకు తీసుకొని పోవుచున్నవి. చివర వరకు బ్రహ్మచర్యము మృతినొందకుండుటయు, చిట్టచివరి ధర్మముగా బ్రహ్మచర్యమే శరణ్యమగుటయు యెంతయేని ముదముగొల్పెడిని. దంభము అహంకారమునకుతోడై యెట్లు రూపనాశనము పొందునో చక్కగా నిరూ పింపబడినది.

నాస్తిక, విద్యావాదము; జీవునకు చేసిన ఆత్మప్రబోధము; సత్కా మునకు గలిగిన విషాదపరిహారములు తిరిగితిరిగి చదువవలసినవిగానున్నవి.

ఇంతపెద్ద భారతము రూపణముగా రచించిన కృతికర్తప్రజ్ఞ అన దృశము. ఎంతోకాలము మథించిన తరువాతగాని యీభారతామృతము వెలువడియుండదు. మనముగూడ ఒకతూరి చదివి పారవేయక తిరిగితిరిగి చదివిననే మనకాయమృతముయొక్క సంపూర్ణఫలము లభించును. ఒక్క ముక్కలో చెప్పవలెనంటే గ్రంథము బాగున్నది. శ్రీ ఆంజనేయులుగారు యితోధిక గ్రంథరచనలు జేయ పరాత్పరుడు అనుగ్రహించుగాత।

ఇతి శం

ప్రకృతి, ఇండియన్ నాచురోపాత్ పత్రికాధిపతి

డా॥ పుచ్చా వెంకట్రామయ్య

ఈగ్రంథకర్త మాకు చిరపరిచయులు. వీరు తెలుగు పండితులు. సద్గురువులవలన వేదాంతము నెఱింగిన వేత్తలు. భారతభాగవతాది గ్రంథములకు వేదాంతపరముగ నర్థముచెప్పగల సమర్థులు. మొట్టమొదట దీనిని కొన్నివ్యాసములుగ రచించి విశ్వజ్యోతి పత్రికలో ప్రకటించిరి. ఇప్పటికి గ్రంథరూపము దాల్చుట ముదావహము. మహాభారతము చారిత్రకముగ కొందఱిచే విమర్శింపబడినది. మఱికొందఱిచే ధార్మికగ్రంథముగా గ్రహింపబడినది. వీరిచే పారమార్థికముగా ప్రదర్శింపబడినది. మానవుని జీవితమే మహాభారతము ఆజీవితమునగల విరుద్ధప్రకృతుల పరస్పర సంఘర్షణయే భారతయుద్ధము. అజ్ఞానాంధుడగు జీవుడు మోహాదులతోగూడి నానాదుఃఖముల ననుభవించుచున్నాడు. నిష్కామాదుల సాహాయ్యమునను వేదపురుషుని ప్రబోధమువలనను నిఖిలదుఃఖనివృత్తి, నిరతిశయానందప్రాప్తి రూపమగు మోక్షమును పొందుచున్నాడు. మహాభారతకథ నిట్టిమహావేదాంత గాధగా చిత్రించిన వీరికృషి యమోఘము. వీరికి పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగునుగాక! వీరు నిత్యనిరతిశయానంద మనుభవింతురుగాక!

ఓమ్ తత్ సత్

విశ్వజ్యోతిగురుకులము, ఏలూరు. ది 7–12–48

శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య,
జగద్గురు
శ్రీబ్రహ్మానందగిరి స్వాములవారు

---

శ్రీ బిట్రా ఆంజనేయులుగారికి

అప్పికట్ల
10–11–48

ఆర్యా! నమస్కారములు.

మీకృతి 'ఆత్మభారతము' చదివితిని. అడుగడుగున మీపాండిత్యము ప్రత్యక్షమగుచున్నది. ఆత్మవిద్యాసంపన్నులరగు మీరు ధన్యులు. మీవచనరచన ప్రౌఢమై నన్నయ, చిన్నయలను దలంపించుచున్నది. చిత్తగిం॥

విధేయుఁడు
అభినవతిక్కన పమ్మల సీతారామమూర్తిచౌదరి

# తోచిన ముక్క

ఆత్మభారతమును రచించిన బ్రి|| ఆంజనేయులుగారు దయతో నొసంగిన గ్రంథము నెంతో యోపికగ చూచితిని. భారతమనుటలో భరత వంశీయచరిత్రయని భ్రమపడియుంటిని. ఇది పఠించినకొలది ఆత్మానాత్మ విచారముతోకూడిన వేదాంతగ్రంథమని తేలినది. ఈరోజులలో పుస్తకము నాదరముతో ఆమూలాగ్రముగ పఠించి ఆనందించగల రసజ్ఞలోకమే సన్నగిలుచున్నది. అందులో తమకింపైన శృంగారమో, తమకిష్టమైన చిన్న కథో, తమకు నచ్చినప్రేలుడు టపాకాయవంటిగమ్మత్తో అయితే యట్టెచదివి అట్టె చిత్తుకాగితాలవానికమ్మివేయుదురు. వానివిలువ అంతే ఐహికముతో మునిగి, యుద్ధముల నల్లలనాది, అహమను పిశాచముబట్టి బాధింపబడు,నేటి సహృదయపాంధు దజ్ఞానతిమిరమునబడి యెట్టెటోతెన్నుగానక దిరుగుచుండ నిట్టిమహనీయుల, ఆత్మవిచారవిషయిక గ్రంథములుగదా? యొకమార్గమును చూపింపగలవు. నిజముగా నైహికాముష్మికముల రెంటిని పెంపొందించుటయే నిజమైన నాగరికతయని విశ్వసించుమనీషులందరి కిట్టివే ఆరాధన గ్రంథములు.

భారతీయవాఙ్మయమున నిట్టిగ్రంథములు కొన్ని లేకపోలేదు. సీతారామాంజనేయము పద్యగ్రంథము. ఆధ్యాత్మరామాయణము గేయగ్రంథము. ప్రబోధచంద్రోదయము. నాటకము. అదిగాక భారతీయుల కుగ్గుతోపెట్టినది. వేదాంతము. నిత్యజీవితములోని ప్రతివిషయమును ఆత్మానాత్మవిజ్ఞానము గలవారికి బుద్బుదప్రాయముగా దోచును. మనపురాణములు, ఇతిహాసములెన్నివిధముల కథాచమత్కృతిని వివరించినను యీవేదాంతవిషయమే. నిశితముగా విషయమును సమన్వయించుకొని, దానిని రమ్యమైన పద్ధతిని ప్రదర్శించినవాడే కవి. ఈగ్రంథమున కవి భారతీయులందరిని ఆత్మకథలో నాయకుల జేయుటయేగాక భారతకథనంతను పంచభూతములు, విద్య,అవిద్య అను వేదాంతవిషయముతో సమన్వయించి కవిమేధాశక్తి నెంతోప్రదర్శించెను. విషయము రసము బుట్టించి చవులూరించుటకన్న చదువువారి కబ్బురమును, ఆలోచించిన కొలది ఆలోచనామృతమును ప్రసాదించుచున్నది.

బీజరూపమున భారతమునందీ సూచనలున్నను, సహజముగ నెంతో అనుభవవేదాంతమున్నవారికితప్ప యీనిగూఢార్థము గోచరింపదు. నాకుతెలిసినంతలో కవి నిరంతర అనుభవానందుడు. ఈయన కెల్లకాలములందు వేదాంతగోష్ఠియే కడుప్రియంబగు పాయసాన్నము. ప్రశంసించుటగాదుగాని. యీతడెంత నిశితముగయోచించి, భారతగాథకీ సమన్వయమును దీర్చెనో, యీతనిబుద్ధికుదురు, యీతనిరచనసౌరు, యీతనిభావములతీరు యింతదని చెప్పవలనుపడదు. నేటికృత్రిమనాగరికవీథులందిట్టి వేదాంతపుపాటలెన్నేని భారతీయుల కవసరము,

సామాన్యముగా నవలవలెనో, ఖండకావ్యమువలెనో, విచిత్రనాటకగ్రంథమువలెనో యిట్టివని అట్టెచదువుటకు వీలులేనిదీగ్రంథము. ఒకసారి చదివి మరి చదివినగాని దానిఅంతరార్థమునాటుకొనదు. జిజ్ఞాసపరులకుగాని యిదేమనస్సున నిలువదు. నావంటిఐహికముగ్ధులకిది తాత్కాలికానందము. ఇందు ద్వాదశపర్వము లాయా యాత్మకథాసంధానమునకు తగినట్లున్నవి. జీవునిపుట్టుకమొదలు. జీవన్ముక్తదశవరకుగల వివిధావస్థల నెంతో రమణీయముగ వర్ణించెను, దానినంతను చెప్పబూనుట మరియొకగ్రంథమగును. ముంజేతికంకణమున కద్దమేల? పరిశిష్టప్రకరణమందీ వేదాంతకవి సముద్రమథనమున్నగు విషయములకిచ్చిన వేదాంతార్థము చదివి ఆనందింపదగినది. సహృదయులున్నంతకాలము కవులు, సత్కావ్యములు చిరంజీవులగుగాక "సుకవితాయద్యస్తిరాజ్యేనకిం" — ఇది కవికి తెలియును.

యస్. వి. వి. హైస్కూలు
తాడికొండ
16-12-48

ఇట్లు
సహృదయవిమర్శకుడు
వంగల శ్రీరామ అవధాని
బి. ఎ. బి. యిడి,
ప్రధాన సహోపాధ్యాయుడు

---

## ఆంధ్రప్రభ

ది 6—2—49
360 పేజీలు

### ఆత్మభారతము

రచయిత : శ్రీ బిట్రా ఆంజనేయులు తాడికొండ పోస్టు, గుంటూరుజిల్లా, వెల తెలియదు. ప్రతులకు గ్రంధకర్త పేర వ్రాయాలి.

ఇంతకు మున్ను రామాయణమును భాగవతమును ఆత్మపరముగా సమన్వయించి విద్వద్ముముక్షువులు కొన్ని గ్రంథములను తెలుగుభాషలో రచించినారు. కాని, భారతమును ఆద్యంతముగా ఆత్మపరముగా సమన్వయించి, ఇంత విపులముగా వ్రాయబడిన గ్రంథములలో ఇదే మొదటిది.

అసలు భారతము అష్టాదశ పర్వసంభృతమైతే ఈభారతము ద్వాదశ పర్వషంభృతము. ఇందలి పర్వవిశేషములు ఆయానామనిరూపితములై కథాగమనమునకు ఎంతగానో తోడ్పడుచున్నది.

గత ముప్పదేండ్ల పరిశ్రమ ఫలితముగా వెలువడిన ఈ గ్రంథము ఆధ్యాత్మ విద్యావివరణమైనను ఇందులో లౌకిక కథాఘట్టములు ఎంతో నేర్పుగా అనునందింపబడినవి.

ఇందలి విషయములు గ్రంథకర్త ప్రతిభను, శాస్త్రపరిశ్రమను బహు గ్రంధావలోకనమును స్పష్టము చేయుచున్నవి.

డాబాతోట

వాల్తేరు. R. S.

20—1—49

ఆర్యవర్యా !

మీరు దయతో పంపిన ఆత్మభారతము అందినది. కృతజ్ఞుడ. ఆమూలాగ్రముగా కాకపోయినను. చాలభాగము చదివితిని. మీవేదాంతపరిజ్ఞానము, సర్వసమన్వయశక్తియు ప్రశంసార్హములనుటకు సందేహములేదు.

కాని భారత రామాయణములు చారిత్రకములనియే నానమ్మకము. వానికి ఆధ్యాత్మకార్ధములనుగాని, జ్యోతిషార్థములనుగానిచెప్పుట చాలమందికి అలవాటైనది. అది నాకునచ్చదు.

ఇట్లు

పింగళి లక్ష్మీకాంతం

## మహాశయా! నమస్కారములు

అభిమానముతో దయచేసిన "ఆత్మభారతము" నామూలాగ్రము పఠించితిని. భారతమునగల "ఆది, సభాది" పర్వనామములకు బదులు మీగ్రంథమున నుపయోగించిన "సంభవ, యోగాది" పర్వనామములును, పంచమవేదమునగల "శంతన, వ్యాస, భీష్మాదిసమాహ్వయములకు కను గుణముగ నుపయోగించిన "ఈశ్వర, వేదపురుషబ్రహ్మచర్యాదినామము లును మీయసామాన్యశేముషీగరిమంబున నేకముఖంబుల చాటుచున్నయవి.

"పంచకావ్యములు విద్యనుగ్రహించుట, మహామోహనుడు ముక్తి మంటపమున బరాజితుఁడగుట, క్రోధుఁడు విశుద్ధచక్రమున నింద్రియములను గోవులను నాక్రమించుట, పరమాత్మజీవుని సమాధానపరచుట, బ్రాహ్మ ణుఁడు సుషుమ్నానాళాంతసహస్రారపద్మవ్యూహమునుబన్నుట, సత్కా ముఁడహంకారునిబంపమికి నిష్కాముఁడునిందించుట, శ్రీకృష్ణుఁడు నిష్కా మున కానందస్థానము నెఱింగించుట" అను నాయాభాగములందేగాక గ్రంథమునందెల్లెడల భారతకథకెట్టి భంగము వాటిల్లకుండ మాలికలోని నూలువలె "నాత్మభారతము" నిముడ్చుట మీయఖండ పాండిత్యాతిశయ మును సూచించుచున్నది.

"వివేకసముద్రమథన, గజేంద్రమోక్ష, వామనావతారాదులు" గూడ మీలౌకిక, పారమార్థికప్రజ్ఞానమపారమని ప్రతిధ్వనించుచున్నవి.

అన్వర్థనామముతో, అమూల్యపదములతో, నమోఘాశయములతో నలరారెడి "ఆత్మభారత" ప్రాశస్త్యమునుగూర్చి వ్రాయగడంగినచో నయ్య దియే దీనికంటె నధికమగుననియు, సర్వేశ్వర సాన్నిధ్యమును జేర సంకల్ప ముండియు సత్క్రమసరణి దెలియమి శ్రమనొందుజనంబులకు మీ "ఆత్మభార తము" సర్వసంశయముల సమగ్రముగ సమయింపజేసి, సన్మార్గమును జూపుటకు సద్గురునివంటిదని చెప్పిన జాలునని నాయభిప్రాయము.

ఇహపరసాధకమగు మీ "ఆత్మభారతము" ను శుక్లపక్షసుధాకరుని విధంబున నాచంద్రతారార్కమలరునట్లు చేయుగాతయనియు, సజ్జనోపయోగమునకై శ్రమనుబాటింపక సద్గ్రంథరచనకు బూనుకొని సఫలీకృతమనోరథులైన తమకు చిరాయురారోగ్యైశ్వర్యాదుల నొసంగుగాతయని, యీపరమేశ్వరుని బ్రార్థించుచున్నాను.

బోర్డుహైస్కూలు,
శృంగవరపుకోట

విద్వాన్ : వానపల్లి యెఱ్ఱయ్య.
ప్రధానాంధ్రపండితుఁడు.

---

సర్వధారి ఫాల్గుణ సంచిక

# భారతి

ఆత్మభారతము :-

రచయిత: బిత్రా ఆంజనేయులు గారు (తాడికొండ–గుంటూరు జిల్లా)

మహాభారతమును అత్యంతముగా పరిశీలనచేసి ఆత్మపరముగా దానిని సమన్వయించుటకు చేసిన విపుల విమర్శయిది. దాదాపు 400 పుటల ఈ గ్రంథములో ఆంజనేయులు గారి శాస్త్రపరిశ్రమ అనేక గ్రంథ పరిశీలనఁ విమర్శన వివేచనములను పాఠకులు సులువుగా అవగాహన చేసికోగలరు.

---

ముద్రణము పూర్తియైనందున మిగిలిన అభిప్రాయములను పునర్ముద్రణమున జేర్చికొందును.

— గ్రంథకర్త

## మాతృశ్రీ కనకాంబ



గీ॥ వితతగర్భస్థ పిండాభి వృద్ధియందె
మహిత భారత శ్రీవణితముగా మధురసుధను
సంచితముఁజేసి నన్ను పోషించు జనని
కషిరాంజలి నర్పింతు నధికప్రేమ.

# విషయసూచిక

## సంభవపర్వము

## యోగ పర్వము

## వైదిక పర్వము



## తపఃపర్వము

## సమాధానపర్వము



## బ్రహ్మచర్యపర్వము

## బ్రాహ్మణ పర్వము





## అహంకార పర్వము



## దంభపర్వము

## అప్రబోధ పర్వము



## ప్రబోధపర్వము



## ఆనందపర్వము



## పరిశిష్ట ప్రకరణము



---

# ఆత్మభారత భూమికలకు భారతనామములు

---

ఈశ్వరుఁడు-శంతనుఁడు

విష్ణుమాయ-సత్యవతి

పవిత్రత-గంగ

వేదపురుషుఁడు-వ్యాసుఁడు

బ్రహ్మచర్యుఁడు / పవిత్రతాపుత్రుఁడు } భీష్ముఁడు

తైజసుఁడు-చిత్రాంగదుఁడు

హిరణ్యగర్భుఁడు-విచిత్రవీర్యుఁడు

ప్రవృత్తి-అంబిక

నివృత్తి-అంబాలిక

భక్తి-దాసి

జీవుఁడు / క్షేత్రజ్ఞుఁడు } ధృతరాష్ట్రుఁడు

బుద్ధి-గాంధారి

సద్విచారుఁడు-విదురుఁడు

సాత్త్వికశ్రద్ధ-విదురునిభార్య

స్థూలశరీరము / కాయపురము / అస్థిపురము / చెయూవుకోటిక / భూమికలగూడు } హస్తినాపురము

ప్రబోధుఁడు-కృపాచార్యుఁడు

బ్రాహ్మణుఁడు-ద్రోణాచార్యుఁడు

యజ్ఞుఁడు-అశ్వత్థామ

మహామోహుఁడు / మిథ్యాకల్పనుఁడు / భ్రాంతివాది / దుర్గుణప్రభువు / కల్మషరాజు / పొల్లుబోఁడు / రవళిదొర / కల్లసామి / సేగిబోఁడు } దుర్యోధనుఁడు

నాస్తికుఁడు-దుశ్శాసనుఁడు

అంధుఁడు-లక్ష్మణుఁడు

బ్రహ్మమిథ్య-దౌశ్శాసని

అసూయ-దుర్ముఖుఁడు

మానసుఁడు-శకుని

సంకల్పుఁడు-ఉలూకుఁడు

అహంకారుఁడు-కర్ణుఁడు

సర్వోత్కృష్టుఁడు-వృషసేనుఁడు

ప్రేమ-వికర్ణుఁడు

దంభుఁడు-శల్యుఁడు

వైరాగ్యుఁడు-సంజయుఁడు

ధర్ముఁడు-బాహ్లికుఁడు

అర్థుఁడు-సోమదత్తుఁడు

కాముఁడు-భూరిశ్రవుఁడు

క్రోధుఁడు-సుశర్మ

లోభుఁడు-కృతవర్మ
మోహుఁడు-భగదత్తుఁడు
మదుఁడు-కాంభోజరాజు
మత్సరుఁడు-వికర్ణుఁడు
పూర్వమీమాంసుఁడు-సాల్వుఁడు
కలి-అలంబసుఁడు
ద్వంద్వాలు-విందానువిందులు
పాషండుఁడు - సైంధవుఁడు
కాపాలికుఁడు-జరాసంధుఁడు
చార్వాకుఁడు - శిశుపాలుఁడు
సదసద్వివేకుఁడు-పాండురాజు
శాంతి - కుంతి
దాంతి - మాద్రి

| | |
|---|---|
| నిష్కాముఁడు<br>ముక్తినేత<br>కైవల్యపతి<br>సత్యపాలుఁడు<br>అజాతశత్రుఁడు | ధర్మరాజు |

వేదకాముఁడు - భీముఁడు
సత్కాముఁడు - అర్జునుఁడు
సత్యకాముఁడు - నకులుఁడు
ఆప్తకాముఁడు - సహదేవుఁడు

| | |
|---|---|
| పంచకాములు<br>శాంతేయులు | పాండవులు |

బాధేయులు - కౌరవులు
ఓంకారేయులు-పాంచాలసైన్యము
తాపేయులు - విరటుసైన్యము
విద్యాదేవి - ద్రౌపది
విభ్రమావతి - హిడింబ
జాగరణుఁడు - ఘటోత్కచుఁడు

ముదిత - చిత్రాంగద
మననము - బభ్రువాహనుఁడు
నమ్రత - ఉలూపి
వినయము - ఇరావంతుఁడు
సమత - సుభద్ర
తర్క దృష్టి - అభిమన్యుఁడు
ధారణావతి - ఉత్తర
వస్తువిచారుఁడు - పరీక్షిత్తు

| | |
|---|---|
| మోక్షము<br>సంతోషము<br>ప్రీతి<br>ఆనందము<br>దయ | ద్రౌపదేయులు |

కారణశరీరము - లాక్షాగృహము
సుషుమ్నానాళము - బిలము
స్మృతిభ్రంశము - హిడింబుఁడు
బకనిష్ఠ - బకాసురుఁడు
గంధర్వనగరము - అంగారపర్ణుఁడు
ప్రణవపురము - ద్రుపదునిపట్టణము
అంతర్యాగుఁడు - ద్రుపదుఁడు
సాత్త్వికశ్రద్ధ - భార్య
అహింస - ధృష్టద్యుమ్నుఁడు
భ్రాంతి - మత్స్యయంత్రము
విదేహకైవల్యము - ఇంద్రప్రస్థము
సంసారారణ్యము - ఖాండవవనము
ముక్తిమంటపము - మయసభ

| | |
|---|---|
| వితండవాదము<br>మాయావాదము | జూదము |

రజ - జటాసురుఁడు
జర - అజగరము

పాపము - కిమ్మీరుడు
ప్రారబ్ధకర్మములు - నివాతకవచులు
ఆగామిసంచితకర్మలు - పౌలోమకాలకేయులు
సంప్రజ్ఞాతసమాధి - స్వర్గము
అంతరాత్మ - ఇంద్రుడు
రతి - ఊర్వశి
పంచాక్షరి - పాశుపతము
తపస్సు = మత్స్యనగరము
యోగవిద్య - విరటుడు
రాజసశ్రద్ధ - సుదేష్ణ
కంపము - ఉత్తరుడు
దిగంబరుడు - కీచకుడు
ప్రాణవాయువు - ధర్మరాజు
సమానవాయువు - భీముడు
అపానవాయువు - అర్జునుడు
ఉదానవాయువు - నకులుడు
వ్యానవాయువు - సహదేవుడు
గంధవతి - ద్రౌపది
యమము - మార్కండేయుడు
నియమము - రోమహర్షణుడు
ఆసనము - మైత్రేయుడు
ప్రాణాయామము - కణ్వుడు
ప్రత్యాహారము - గౌతముడు
ధ్యానము - జమదగ్ని
ధారణ - యాజ్ఞవల్క్యుడు
సమాధి - వైశంపాయనుడు
నిదిధ్యాసుడు - నారదుడు
శముడు - ధౌమ్యుడు
దముడు - సాత్యకి
ఆభిరతి - శిఖండి
ఉపరతి - శిశుపాలునికొడుకు దృష్టకేతుడు
తితిక్ష - జరాసంధపుత్రుడు సహదేవుడు
విశ్వాసుడు - యాదవుడు చేకితానుడు
అనసూయుడు - కాశిరాజు
అక్రూరుడు - ఉత్తమౌజుడు
అక్రోధుడు - యుధామన్యుడు
ఉత్తరమీమాంసుడు - కుంతిభోజుడు
విజ్ఞానుడు - సత్యజిత్తు
జ్ఞానుడు - సూర్యజిత్తు
తత్త్వవిచారము - అర్జునునిరథము
మహావాక్యములు - గుఱ్ఱములు
ఆనందమయ విజ్ఞానమయకోశములు - అక్షయతూణీరములు
ప్రణవము - గాండీవము
నేతినేతివాక్యములు - బాణములు
ప్రణవనాదము - దేవదత్తము.
ప్రమాణవాక్యములు } భీమునిగద
అవాంతరవాక్యములు }
మధుమతీవిద్య - దుర్యోధనునిగద
అనుబంధచతుష్కము - చతురంగసైన్యము
మిథ్యాదృష్టి - దుశ్శల
జగన్నిత్యదృష్టి - ప్రాతిగామి



అంకితము

శ్రీ కృష్ణపరమాత్మకు

ఓం

శుభమస్తు

సద్గురుభ్యోనమః

# ఆత్మ భారతము

## సంభవ పర్వము

శ్లో॥ ఓతప్రోత సమస్తవస్తు నిచయం చోంకార బీజాక్షరం
ఓంకారప్రకృతిం షడక్షరహితం హ్యోంకారకందాంకురం
ఓంకారస్ఫుట భూర్భువస్సువరితం త్ర్యోఘత్రయారాధితం
ఓంకారోజ్వల సింహపీఠనిలయం రామంభజే తారకం ॥

—రామకర్ణామృతం.

శ్లో॥ హేలోకాః శ్రుణుత ప్రసూతిమరణ వ్యాధేశ్చికిత్సామిమాం
యోగజ్ఞాస్సముదాహరంతిమునయో యాంయాజ్ఞవల్క్యాదయః
అంతర్జ్యోతి రమేయమేకమమృతం కృష్ణాఖ్యమాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణమాత్యంతికమ్ ॥

—ముకుందమాల.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండు సచ్చిదా
నంద స్వరూపుండు నిత్య నిరతిశయ నిర్వికారుండు నని

చెప్పంబడు బ్రహ్మము ప్రారంభమున నిట్టిదట్టిదని చెప్పనలవి గాక మనస్సున కందక కేవలమై యొప్పుచుండెను. అట్టిబ్రహ్మ మాదియందు ,,ఐతదాత్మ్యమిదం సర్వం,, అనునట్లు సర్వ మును తానేయై యుండెను. మఱియు "అసద్వా ఇదమగ్ర అసీత్ తతోవై సదజాయత" సృష్టికి పూర్వమున శూన్య రూపమై యుండి, పిదప సద్రూపమయ్యెను. "సోఽకామ యత" తిరిగి ఆబ్రహ్మము ప్రపంచరూపము నొందెద నని సంకల్పించెను. సంకల్పమాత్రమున స్రష్టయై విరాట్టనిపలుకం బడుచు నీశ్వరుండయ్యెను. ఆ యీశ్వరుడే శంతనుడు. (అనగా వికల్ప రహితుడై యుండెను.) ఆతడు పవిత్రతయను గంగనుగూడి బ్రహ్మచర్యమను భీష్ముని బడసెను. ఆ బ్రహ్మ చర్యుడు శుక్లపక్ష చంద్రుండునుంబోలె దినదిన ప్రవర్థ మానుండై సర్వ విద్యాసంపన్నుండై సకలార్థ దాయియై తండ్రి నలరించుచు దిగంత విశ్రాంత కీర్తిమంతుండై యలరు చుండెను. ఇతడిట్లుండ "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" పరమేశ్వరుడు మాయచే బహురూపములు గలవాడగుచున్నాడనియు "మాయాసృజేత విశ్వమేతత్" పరమేశ్వరుడు మాయాశక్తి సహితుడై ప్రపంచమును సృజించుచున్నా డనియును చెప్పినట్టు లీశ్వరసృష్టి విస్తారము నకు సహాయ స్వరూపిణియగు మూలమాయయే, సత్యవతి. ఆమె ఛందమను పరాశరుని వలన వేదమను వేదవ్యాసునిం గని యాతనివలన స్వయముగా సంసార విస్తరణం బాచరింప నెంచి తన కార్యం బీశ్వర సహాయంబు లేకున్న జడప్రాయంబె

కాని ప్రవృద్ధంబు కానేరదనియెంచి యొక్కపరి ,,నాస్తిద్వైతం,
అనురీతి నొంటివాఁడై చేనికి నంటకయున్న యీశ్వరుఁడను శంతను సాన్నిధ్యముం బొందిన, మాయాస్వరూపిణియగు సత్యవతీ సందర్శన మాత్రంబున విరాట్టు తన్నుఁ దామఱచి "సోకామయత బహుస్యాం ప్రజాయేయేతి" ఆ యాత్మనే ననేక ప్రజారూపము నొందెదనని సంకల్పించినరీతి నామె యందు బద్ధానురాగుఁడై ,,నన్నుఁగూడి యనుదినంబును నానంద వారాశి నోలలాడుచుండుమని ప్రార్థించె.

అప్పు డామె తాను గోరు సంసారవిస్తరణంబునకు బ్రహ్మచర్యుని సాన్నిధ్య మాటంకంబని యెంచి యీశ్వరుని కిట్లనియె. "మహాత్మా! బ్రహ్మచర్యం బత్యంతంబు నోజన్ స్వరూపుండును, సత్త్వాతి సత్త్వుండును, ప్రాకృతికవృత్తి విఘాతుండును, కామవిషయ విలయకరుండును నగుటం జేసి 'నీ నా సంయోగంబునఁ గల్గు ప్రజాబహుళత్వంబున కాటంక మగుం గావున పుత్రుండని ప్రేమంబునఁ జూడక మన యిరువురి సన్నిహితత్వమునఁ గలుగు సంతానంబునకు సంబంధ పడక, వారియానంద రాజ్యంబున పాలుఁగోరక, తాటస్థ్యంబున నుండునట్లు వరంబిమ్ము. అట్లయిన నిన్ను వరింతు" నన సంతను మున్న యట్లగుటను దృఢనిశ్చయుండై యున్న బ్రహ్మచర్యునిం గని సంతసించుచు నీశ్వరుం డొక్క శుభ మ్ముహూర్తంబున మాయాదేవి పాణిగ్రహణం బాచరించె.

## వ్యష్టి సమిష్టి హిరణ్యగర్భుల జననము

ఇట్లిరువురు నిష్టోపభోగంబులఁ బరితృప్తి నొందుచుండఁ గొంతొక కాలంబునకు "హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" హిరణ్యగర్భుఁడు ప్రపంచమునకు మొదటఁ బుట్టెను. "యథా వ్రీహిర్వా యవోవా శ్యామాకోవా శ్యామాక తండులో వైష మంతరాత్మన్పురుషో హిరణ్మయః" వడ్లగింజ వలెను, యవబీజము వలెను, చామగింజవలెను, అందలి బియ్యము వలెను, నతి సూక్ష్మరూపుఁడై తేజోమయుండగు నొక పురుషుఁడా యీశ్వరునియం దున్నాఁడనెడి శ్రుతి ననుసరించి యీశ్వరుని నుండి జగత్సృష్టికి మూలమైన హిరణ్యగర్భుఁడు తాన రెండై వ్యష్టి స్వప్నాభిమాని తైజసరూప చిత్రాంగదుఁడుగను, సమిష్టిస్వప్నాభిమాని హిరణ్యగర్భరూప విచిత్రవీర్యుఁడుగను నిరువురు కొమరులై జన్మించెను. ఆమీఁద స్వప్నశరీర ద్వయాంతర్గతుండై యీశ్వరుండు తన మూర్తి నుపసంహరించె. అనంతరమున మాయాదేవి బ్రహ్మచర్య సహాయమై పుత్రద్వయమును బెంచుచుండ సంప్రాప్త యౌవనుండై వ్యష్టి స్వప్నాభిమాని తైజసుఁడు, భావి సంసారానుకూలంబుగా సమిష్టి స్వప్నమందు చేరుకొనియె. "నతస్య ప్రాణా ఉత్క్రామంతి అత్రైవ విలీయంతే." యను శ్రుతి ననుసరించి యాతని మరణ మెంచఁ బడెను.

ఇంతటి నుండి సంపూర్ణ స్థూలశరీరమున కనుకూల ప్రవర్తనంబు సంఘటిల్లె. మూల మాయా ప్రేరణంబున బ్రహ్మచర్యుఁడు జగద్విజేత్రలు, వీర్యశుల్కలునై యొప్పు (వీర్య మన దృఢ చిత్తత) ప్రవృత్తి నివృత్తులను సంబి కాంబాలికలను సర్వగుణ సమక్షంబున జయించి తెచ్చి తమ్ముఁడైన హిరణ్యగర్భునకుఁ గూర్చె. అంత నా హిరణ్య గర్భుండు ప్రవృత్తి నివృత్తులఁ గూడిన వెనుక తన ప్రథమా వస్థ స్వప్నరూపమై సంసారవిస్తరణ యోగ్యంబు గాకున్న మరణమను ద్వితీయ సుషుప్తి స్థానంబునం జేరె.

## జీవోత్పత్తి

అంత మాయాదేవి తన సంకల్పంబంతయు వికల్పంబై సంసరణంబు కుంటుపడుటకు మిక్కిలియుం జింతించి "సేయం దేవతైక్షత హంతాహమిమా స్తిస్రోదేవతా అనేన జీవే నాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి" (నేను సూక్ష్మరూపముగ సృష్టింపఁ బడియున్న యీ యగ్న్యాది భూతముల యం దాత్మభిన్నము గాని జీవరూపముతో ప్రవే శించి వీని నామరూపముల విస్తరింపఁ జేయుదుఁగాక యని సృష్టికర్త్రి యగు దేవత తలంచెను.) అనునట్లు తనచేఁ గాంచఁబడి తపోవనంబున నున్న వేదపురుషుండలంచిన నతఁడు సన్నిధిం జేయుటయు ప్రవృత్తి నివృత్తులయందు పుత్రోత్పా దనంబుఁ జేయుమని మాయ నియోగించె. వేదపురుషుండు (వేదమన స్థూల సూక్ష్మ ప్రపంచమును నామరూప భేదము

లతో తెలియుట) హిరణ్యగర్భుని తృతీయావస్థ యను జాగ్ర ద్దశయందు ప్రవృత్తి యను నంబికంగూడ జీవుఁడను ధృతరాష్ట్రుఁడు జనుషాంధుండై జన్మించె. ( ధృత = ధరింపఁబడిన రాష్ట్రం = పురం = శరీరం) ధరింపఁబడిన శరీరము గలవాఁడు గావున జీవుఁడనియు, సకలేంద్రియములకు మిక్కిలి లోపల నున్నవాఁడై మానసికాదుల సహాయంబు లేక ప్రాపంచిక విషయముల నెఱుఁగలేని కారణమున నావరణశక్తికి లోనౌట నంధుఁడనియు నెంచఁబడియె.

## సదసద్వివేకోత్పత్తి

ఇట్టివాఁడై యున్న కుమారునివలన తన సామ్రాజ్యం బభివృద్ధి నొందదనియెంచి మాయ,నివృత్తియను నంబాలికను వేద పురుషునికిఁ గూర్ప సదసద్వివేకుఁ డను పాండురాజు జన్మించె. ఆతండును సంసార భారంబు మోయ సమర్థుండు గాక వెలవెల్లనై చూచుచుండుటచేతను, శుద్ధ సత్త్వగుణ ప్రధానుం డగుటచేతను పాండుఁడు నాఁబరగెను. ఆతఁడు మాయాసామ్రాజ్య పట్టభద్రతకు జంకుచుండుటఁ గాంచి మూలమాయ మిక్కిలి దుఃఖించి తన ప్రవృత్తి యెంతయును కొనసాగకుంటకు విచారించుచు ... లగు ప్రవృత్తిని మఱల వేదంబునుగూడి యుత్తమ సంతతిం బడయుమని నియోగించి వేదపురుషుని కడకుం జేర్ప, నాయమ "యీవృత్తి ప్రకృతి ధర్మంబునకు విరుద్ధం" బని యెంచి వేద పురుషుని యందత్యంత భక్తియుక్తయై భక్తియను దాసింజేర్ప నాపె

యందు వేదవేదాంతాఖిల విద్యాగర్భుండగు సద్విచారుఁ డను విదురుం డుద్భవించి జీవసన్నిధిం బాయకుండె.

ఇట్లుద్భవించిన కుమారులు ముువ్వురును క్రమక్రమ ప్రవర్ధమానులైనమీఁద బ్రహ్మచర్యుండుసవతితల్లియగు మూల మాయా నియోగంబున నాముువ్వురు బిడ్డల పాలన పోషణాది భారంబంతయు వహించె. ఇట్లు బ్రహ్మచర్యుఁడు సర్వేంద్రియ దుర్విషయ సంచారంబునకుఁ దన నామమాత్రమె భీషణ జనకమైయొప్పునట్లు సార్థక నాముఁడై యొప్పుచు, మాయాదేవి నిర్మించియిచ్చినస్థూలశరీరమనుహస్తినాపురమును(అస్థిపురము బొమికలగూడు) జీవుఁడను ధృతరాష్ట్రునకు పట్టముఁ గట్టెను. అతఁడు వెలుపలి కార్యంబులకుంగాని వాఁడౌట రాజ్యాంగ వ్యవహారముల కన్నింటికిని బ్రహ్మచర్యుఁడు తానచాలిన వాఁడై సద్విచారుని యాలోచనమును, సదసద్వివేకుని సామర్థ్యమును చేయూతగాఁగొని గ్రుడ్డిరాజు రాజ్యంబు పూజ్యంబుఁగాఁ జెల్లించుచుండె.

ప్రాప్తయౌవనులైన కొమరుల వివాహముసేయ విచా రించుచు బ్రహ్మచర్యుఁ డంతఃకరణ మను సుబలునియందుఁ బుట్టి పెరుగుచున్న బుద్ధి యను గాంధారీదేవి 'యితనికిందగిన' దని యెంచి తెచ్చి జీవునకు వివాహ మొనర్చెను. అంతఃకరణ పుత్రుఁడగు మనస్సను శకునియు నక్కతోఁ గూడి యాతని యింటఁజేరి "స్యాలకో గృహనాశాయ" యను నుడిని సార్థక మొనరించెను. ఆలివైపువాఁడగుట మహారాజతని నెక్కుడుగ మన్నింప మొదలిడియె. అదియ కారణముగ

నా మానసుండును ననేక దుర్ణయములకుం జొచ్చి జ్ఞాతివైర మును గల్పించి సర్వనాశనమునకుంగారణుండయ్యె. "ధ్యాయ తో విషయాన్ పుంస స్సంగస్తేషూపజాయతే, సంగాత్సం జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే" పురుషునకు విషయచింతనముచేత వానియందాసక్తియు, నా యాసక్తిచే కామమును, దానివలన క్రోధమును, దానివలన సర్వనాశన మును పుట్టుచున్నది.

## సదసద్వివేకునియందు నిష్కామోదయము.

బ్రహ్మచర్యుం డామీద సదసద్వివేకునకు, బ్రహ్మ విద్యయను వసుదేవునికి చెలియలై యుత్తరమీమాంసయను కుంతిభోజునిచేఁ బెంచఁబడిన శాంతి యను కుంతిని, దాంతి యను మాద్రిని బ్రాప్తయౌవన సురూపలు, సకలగుణాభి రాములు నై యొప్పువారినిఁ దెచ్చి వివాహమొనర్చె. సద్వి చారునకు సాత్వికశ్రద్ధ యను నామెం గూర్చె. ఇట్లు బ్రహ్మ చర్యునివలన సంప్రాప్త వివాహులై సకలకామ్య సుఖంబులు మఱిగి యానందించు చుండిరి.

వారియందు సదసద్వివేకుఁడు బ్రహ్మచర్యుని శక్తి సామర్థ్యమున మాఱులేని పరాక్రమముతో నన్ని దిక్కుల జయించి గడించిన తేజోరూప ధనముల నన్నకు సమర్పిం చుచు నొక్కనాఁడు భార్యాద్వయ సహితుండై కర్మప్రేరణ మున సంసారారణ్యంబుఁ దరిసి మృగతృష్ణికంబోలు మృగ యారూప హింసయందు రతుండయ్యె. తత్కారణమున

శప్తుఁడై భార్యలఁగూడి యచ్చటనె తపించుచుండె. వారికి వలయు సౌకర్యముల నన్నియగు జీవుఁడు నడిపించుచుండె. ఆమీఁద భర్త్ర నియోగంబున శాంతి, అధిదైవతారూప ధర్మదేవు నారాధించి నిష్కాముఁడను ధర్మజునిఁ గనియె. ఆతని జనన కాలంబున భూతజాలములు సంతసంబునఁబొదలె. దిక్కులు తేజరిల్లె. మహాపురుష హృదయములు వికాసంబు నొందె. "ఈతని వలన నాత్మప్రపంచ మంతయు నుద్ధరింపఁబడును. సుఖదుఃఖాది ద్వంద్వములడఁగును. నిర్వాణ పథము సుపథంబగును. మహామోహక్రోధాదులడఁగి శాంతిరాజ్యము సుస్థిరత్వంబు నొందు" నని మహర్షులెల్లఱును జెప్పికొనుచు నానందించుచుండిరి. మఱల పతికోర్కె మెయి శాంతి అధిదైవతారూప వాయుదేవు నారాధించి తత్కృపా విశేషమున వేదకాముఁడను భీమునిం గనియె. ఆతండు భీమబలుండును, ననంత శక్తిసంపన్నుండును, ననేక శత సంహితా సమన్వితుండునునై యొప్పె.

## మహామోహ జననము

ఆకాలంబునన యక్కడ స్థూలపురమున బుద్ధియను గాంధారీదేవి జీవసాన్నిధ్యవశంబున గర్భంబుఁ దాల్చియుండి, శతశృంగమున శాంతిదేవి సంతానమునుఁ బడయుట విని తనకింకను సంతానోత్పత్తి గామికి మిక్కిలి వగచి, తన ప్రవృత్తి యాసురి యగుటంజేసి గర్భతాడనముఁ జేసికొనియె. దానంజేసి యేకపిండరూపమున వృద్ధినందుచున్న యాశక్తి యేకోత్తర

శతధా విచ్ఛిన్నంబై దైవప్రేరణంబునంబడియె. అప్పుడు వేద పురుషుఁడు సన్నిహితుండై యా యమయాసురీకృత్యంబును బదరి యామాంసపేశికల మాయాసహాయంబున సంరక్షింపు మని యా యమను నియోగించి చనియె. కొన్ని దినంబులకు ప్రథమపేశిక పుత్రరూపంబు నొందె. అతనికి మహామోహుఁ డను దుర్యోధన నామంబిడిరి. ఇతఁ డాత్మజ్ఞానమునఁ దక్క జయింప సాధ్యముగానివాఁడయ్యె. మిగిలిన పేశికలును దిన మున కొక్కొకటిగ పుత్రరూపంబు నొందె. అందు రెండవవాఁడు నాస్తికుఁడను దుశ్శాసనుఁడు. తక్కుంగలవారెల్ల మహా మోహునకు సర్వవిధముల సహాయకారులై పరివారమును పరిచారకులునునై సర్వకాలసర్వావస్థలయందును సతనియను యాయులై యాతండె సర్వలోకంబుగా వర్తింపుచుండిరి.

ఇందఱకును కనగొట్టు చెలియలై మిథ్యాదృష్టి యను దుశ్శల నాస్తికాదులచే లాలించి పోషింపఁబడుచుండె. మహా మోహు జననకాలమున భూతజాలములెల్ల భీతావహములై సం క్షోభించె. దిక్కులు నిస్తేజములయ్యె, మహాపురుషహృదయ ములు కలఁతనొందె, ఇట్టి విపరీత భావంబులంజూచి బ్రహ్మ చర్యసద్విచారాది పురోహితులెల్లను జీవుని సన్నిధికిఁ జేరి "జీవా!

కం. మన దుర్యోధను జన్మం
బునఁ బెక్కులు దుర్నిమిత్తములు పుట్టె జగ
జ్జన సంక్షయ జననుం డగు
నని పలికెద రెఱుకగల మహాత్ములు వానిన్. భారతము.

" మహేశ్వరంతు మాయాయా తస్యా నిర్మాణ శక్తివత్
విద్యతే మోహశక్తిశ్చ తం జీవం మోహయత్యసౌ,
మోహాదనీశతాంప్రాప్య మగ్నోవపుషిశోచతి "

ఏ యీశ్వరసంబంధిని యగు మాయాశక్తి గలదో యట్టిమాయకు జగన్నిర్మాణశక్తివలెనే మోహింపఁ జేయు శక్తియుఁ గలదు. ఆ శక్తియే నిన్ను మోహింపఁ జేయు చున్నది. ఆ మోహమువలన ననమర్థతను బొంది శరీరాభి మానివై నీవు దుఃఖించు చున్నావు. కావున తండ్రీ! మా యుపదేశములమన్నించి మా యందు గౌరవముంచి సర్వానర్థ దాయకు నీ మహామోహుని బాల్యముననె నశింపఁ జేసి సుఖము నొందుము. బహుసంతానవంతుఁడ వగు నీ వీతని నొక్కనిఁ బోకార్చి పెక్కండ్రఁగూడి యానందింపు" మని యనేక విధముల బోధించిన జీవుఁడు పుత్రపరిష్వంగ సుఖ మునఁ బ్రమత్తుండై వారిమాటలు గీటునంబుచ్చి యిన్నకుండె.

## పంచకాముల జననము

ఇక్కడ శత శృంగమున సదసద్వివేకుఁడు మఱల ప్రేరేపింప శాంతిదేవి అధిదైవతారూప వాసవుఁడను నంత రాత్ము నారాధించి తదంశమున వంశవిస్తారకుండును, త్రిభు వన పావనుండును నగు సత్కాముఁడను నర్జును బడసి పురు షార్థంబులుం బోని ముప్పురు కొమరులంగూడి ముదిత హృద యయ్యై యొప్పుచుండె. అంత దాంతిదేవి, యక్కడ బుద్ధియు నిక్కడ శాంతియు కొడుకుల నెత్తి యానందింపుచుండ త్రా

నొక్కొక్కతె యట్లుండుటను మిక్కిలి నగచి యొక్కనాఁ డేకాంతమున సదసద్వివేకుని దగ్గఱఁజేరి "నాథా! పుత్రుల నెత్తమికి మిక్కిలియుంగుందెద. నాకును పుత్రోత్పాదనంబు సేయింప శాంతిని నియోగించి, నాకును నీకును లోకంబు నకును హితము నాపాదింప వేడెద." నని సదసద్వివేకుం డిట్లనియె. "దేవీ! యవశ్య మట్లుగావించెద, నేనును నట్లు తలచుచుంటి." నని యప్పుడ శాంతికిం జెప్పి యా యమ సహాయమున దాంతియం దధిదైవతా రూపులగు నశ్వనీ దేవతలవలన సురూపాభి రాములును, సుగుణ సంపన్నులును నగు సత్యకామాప్త కాములను నకుల సహదేవులం బడసె. ఇట్లు జన్మించిన యేవురు బిడ్డలును నామ రూపముల కించిద్భే దము నొందినను నొక్కటై పెరుఁగుచు సర్వజనాకర్షణీయు లును, సకల భూతానంద కరులును, సకల శాస్త్రకుశలు లును, వేదమార్గ ప్రవర్తకులునునై తల్లులకును తండ్రికిని నీప్సితములఁ దీర్చి యానంద మిడుచుండిరి.

## పంచకాములు జీవసన్నిధికి వచ్చుట

ఒక్కనాఁడు సదసద్వివేకుఁడు తనసత్తామాత్రమగు శక్తిని పుత్రులయం దావహింపఁజేసి యన్నయగు జీవునకుఁ గానరాక దూరస్థుఁడై యస్తమించె. దాంతి తన యంశమును శాంతియందుఁ గూర్చి తానును భర్త ననుగమించె. పుత్ర మాత్రయై యొంటి నా యరణ్యంబున నుండనేరకున్న శాంతిని బిడ్డలను వృద్ధులను మునిగణము కాయపురంబునకుఁ

దొడఁగొనివచ్చి "వీరు బ్రహ్మర్షి దత్త విజ్ఞాన చక్షువులు వేద వేదాంతాఖిల దర్శనులునై యొప్పుచున్నారు. ఇట్టి వీరిం జేకొని మీమ్మును మీవంశమును రక్షించుకొనుఁడని చెప్పి జీవ బ్రహ్మాచర్యాదులకు నివేదించి చనిరి. అంతట బ్రహ్మాచర్య సద్విచారులు సదసద్వివేక దాంతుల వియోగమున కుమ్మలించి శాంతి నంతిపురికిం జేర్చి పంచకాములఁ దన పుత్రునితోఁ గూర్చి యిష్టవినోదములఁ దేలుచుండిరి.

## మాయావేదపురుషుల సంభాషణము

వేదపురుషుఁ డొక్కనాఁడు తల్లియగు మాయాదేవి కడకు వచ్చి యేకాంతమున నిట్లనియె. "తల్లీ! కుమారజీవుఁడు పుత్రమోహమున మహామోహాదుల విడువనేరకున్నవాఁడు. వారు క్రూరులును, ధర్మాచార వివర్జితులును, సద్వృత్తి రహితులును, నిష్కారణ వైరులునునై వర్తించెదరు. వీరి కారణమున మన వంశమున కంతకు గొప్ప నెగులు బుట్టనున్నది. జీవుని తాటస్థ్యమునన యింతయుఁ గల్గు. అతఁడు పుత్రమోహమున వివేకాదుల పలుకులు విననొల్లఁడయ్యె. "అవిద్యా బంధనానిస్యుః కామక్రోధాదయ స్తథా; దేహాదా వభిమానిశ్చ మమేదంచ ధనాదికం, అహం దుఃఖీ సుఖీచేతి హృదయ గ్రంథయశ్చయే" కామము క్రోధము మొదలగు నవియు నా శరీరము నాయిల్లు నాధనము నను నభిమానము నేను సుఖిని నేను దుఃఖినను మొదలగు హృదయగ్రంధి రూప మగు నవిద్యాబంధములతోఁ గూడిన యీ సంసారమింతయు

గహనము. ఎండమావులఁ బుట్టు జలముల పగిది సర్వ సంప దలు క్షణికములై యుండియు మానవుల కెంత యాశఁ గొలుపు చున్నవి. మిథ్యారూప సంపదాదుల యందు సత్యదృష్టిఁ గల్పించి విభ్రమావతి త్రిప్పు త్రిప్పుళ్లకు లోనై ప్రాణముల విసర్జించుచున్నారు.

**కం॥ మతిఁ దలపఁగ సంసారం**
**బతి చంచల మెండమావు లట్టుల సంప**
**త్ప్రతతు లతి క్షణికంబులు**
**గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్. — భారతము**

అని పలుక మాయాదేవి "కుమారా! యిదియంతయు నావిలాసము. నన్నింత దానిఁ జేసిన నీతండ్రి యీశ్వరుఁడు నామమాత్రగా నైన తన యున్న జాడ గోచరింపనీక యీ సంసార దుఃఖములకు దేనికిని తాను గాక యడఁగి యుండె. ముందు జరుగనున్న యీ మానసికాదుల మాయానాటక మున కంతకును నేపథ్యంబు నేనై యుందు. అయినను దుఃఖా త్మకమగు నీనాటకమునకు కర్త్రి ననిపించుకొని లోకులవలన నింద మోయఁజాల. ప్రకృతియం దణఁగి యుండెద. నీవీ మహామోహాదుల దుర్మరణములను మోదఖేదములు దక్కి తిలకించుచుండు" మని చెప్పి మూలమాయ ప్రకృతియం దంతర్గతయై యుండె.

## మహామోహ మాయాజాల ప్రదర్శనము

జీవుఁడు తన కుమారులనియు తమ్ముని కుమారు లనియు భేదమునుఁ జూపక రెండు తెగలవారిని మిక్కిలి

సమంజస భావంబున నెక్క రూపకాం జూచుచుండె. ఇట్లు జీవుని నెయ్యమున కుమారులెల్లరు సంతత ప్రవర్ధమాను లగుచుం గూడియుండి బాల్యక్రీడలకుం గడంగిరి.

అందాటలయందు వేదకాముం డెల్లఱఁ జయించుచు సర్వక్రీడలయందును మిన్నయై మారులేని బలమున మహా మోహాదుల బాధించుచుండె. ఆతని విక్రమం బవక్రంబై చెల్లుచుండె. ఇంతయుం జూచి సహింపక కల్లయెకిమీఁదు మనోనాస్తికులం గూడి యేకాంతమున నిట్లనియె. "మామా! యీవేదకాముఁడు మనకందఱకు మారకుండై జన్మించినట్లు దోఁచు చున్నయది. అదియునుంగాక యీతఁడు క్షేమమున వృద్ధినొందెనేని నిష్కామాదులు మిక్కిలిబలవంతులై మన వంశ మును పేరులేకుండం జేయుదురు. ఆ వంశమువారి కెల్లఱకు నీతని యనేక శతసంహితా ప్రయుక్త వేదబలం బమోఘం బుగా నున్నది. కావున నే యుపాయంబుననైన నీతని నిప్పుడ సర్వత్రనామరూప రహితుంగాం జేసిన మిగిలిన శాంతేయులూఱ కయుచత్తురు. అంత మనరాజ్యము నిష్కంటకముగా నడచు. కావున ముందీతని నంతమొందింప వలయు" నని సమకట్టి యొక్కనాఁడు వేదకాముం డక్కుమారులం గూడి వాదమను క్రీడఁజేసి బడలి మైమఱచియుండ మహామోహుఁడా నిజ మోహపాశములంజుట్టి దుఃఖనదియను గంగయందు ముంచి నశింపఁజేయ సమకట్ట వేదకాముఁడు జ్ఞాన ప్రబోధము నొంది కర్మబంధములునశింప పుణ్యగతికి జను పురుషునట్లు మోహ పాశములనెల్ల నవలీల ద్రెంచి తన పరిశుద్ధతను స్థిరమొనర్చె.

మఱియు తవళిదార పాషండ కాపాలిక వాదములను విషాన్న విషప్రయోగములఁ జేసియు నశింపఁజేయ సమర్థుఁడు గాఁ డయ్యె. ఇట్లు తాను జేసిన యెగ్గులన్నియు కృతఘ్నునకుఁ జేసిన లగ్గులవలె నిష్ఫలంబు లగుటకు సిగ్గుపడి వారలేవు రకును నపాయంబుసేయు నుపాయం బాలోచించుచుండు తఱి బ్రహ్మచర్యుండు ప్రబోధమను కృపాచార్యుని రప్పించి సన్మా నించి కుమారుల కెల్లఱకు దుర్గుణసంహారచణంబైన ధను ర్వేదంబును సుగుణసంపాదకంబగు వేదంబునుఁ జెప్పించె.

## అంతర్యజ్ఞ బహిర్యజ్ఞోదయము

మఱియు నుద్గీథమను భరద్వాజుని యందు బ్రాహ్మణ మను ద్రోణుండును, నుద్గీథసఖుండైన ప్రణవరూప పృషతుని యం దంతర్యాగ మను ద్రుపదుండును బుట్టిన, నందంత ర్యాగుని నుద్గీథ సాన్నిధ్యమునఁ జేర్చి ప్రణవ మేకాంతంబు నొందె. ఆమీఁద బ్రాహ్మణాంతర్యాగు లిర్వురు బాల్యమున నొక చోటన యుండి మంత్రప్రయోగములను నస్త్రప్రయో గముల నభ్యసించిరి. వారిద్దఱియందు బ్రాహ్మణుఁడు యజ్ఞ మను నశ్వత్థామను గనియె. అతఁడు బాహ్య కర్మమగు పశుహింసాత్మక వేదకర్మఁ డయ్యె.

అంతర్యాగ మన హృదయమను వేదికయందు ప్రాణా పాన సంయోగమను గాలితిత్తులచే జఠరాగ్నిని ప్రజ్వలింపఁ జేసి కర్మలను నింధనములఁ జేర్చి తృష్ణయను నాజ్యమునుంచి బుద్ధియను యూపమున నహంకారమను ఛాగమును మన

స్సను త్రాటిచేబంధించి విజ్ఞానమను కత్తిచేఁదునిమి హుతము సేయుట. (సర్వవస్తుచయమును తృణముగాఁ జూచుటను తెలియఁ జేయుచు లతలలో నుత్తమంబగు పగడమును, రత్నములను త్తమంబగు ముత్యమును, లోహముల నుత్తమంబగు బంగారును, కాష్ఠముల నుత్తమంబగు శ్రీగంధమును, వస్త్రములనుత్తమంబగు దుకూలమును హుతాశనునందు 'న ఇదం మమ న ఇదం మమ' యని యాహుతి యొసఁగుట అంతర్యాగ మనం బరగు) ఇట్టిరు వురును దమ తమ యాగంబుల కుపయుక్తములగు ప్రయోగోప సంహారములతో విద్యల నెల్లఁ బడసిరి. అంతర్యాగుఁడు ప్రణవ మను పాంచాలమును పాలించుచుండె. బ్రాహ్మణుఁడు పుత్రుఁడైన యజ్ఞుని గోధన రహితంబుగా పోషింపనేరక బాల్యమిత్రుండైన యంతర్యాగుని పాలికింబోయి 'పుత్రపోషణార్థంబు గోధనం బి'మ్మని ప్రణయ పూర్వకంబుగా నడిగిన విని సహింపనేర కంతర్యాగుఁడిట్లనియె.

"బ్రాహ్మణా! నిన్నును నీ కర్మమును నన్నును నా స్వరూపమును విచారింపక మాటలాడుట న్యాయమా? జీవహింసాత్మక కర్మయోగమున పుత్రుఁ బోషించుట కంటె విసర్జించుటయ యుత్తమంబు. ఇట్టి నీవు సఖుండ ననుటకంటె పాపంబు గలదె? ధనవంతునితో దరిద్రునకును, తత్త్వజ్ఞునితో మూర్ఖునకును, ప్రశాంతునితో క్రూరునకును, సజ్జనునితో దుర్జనునకును సఖ్యంబు గూడునా? అంమును మాకు కార్యాపసరంబున మాత్రమ మిత్రామిత్ర సంబంధముండును గాని, తదనంతరమున నుండనేరదు. కావున మావంటి యాత్మసా

సామ్రాజ్య పట్టాభిషిక్తులకు మీవంటి హింసారూప హీనబ్రాహ్మణ ములతో కార్యకారణ సంబంధసఖ్యం బెన్నఁడును గానేర ” దని బ్రాహ్మణు మెచ్చక తిరస్కరించిన, నతం డవమానజనిత మన్యుఘూర్ణమానమానసుండయి యెద్దియుం జేయనేరక పుత్ర కళత్రాగ్ని హోత్రంబులతో నస్థిపురంబునకు వచ్చి బ్రహ్మ చర్యుం గాంచిన, నతని నెఱింగి ‘ యెక్కడినుండి వచ్చితి రెం దుండ మీ కిష్టం బెఱింగింపుఁ ’ డన బ్రాహ్మణుండు —

## శాంతేయ బౌద్ధేయుల విద్యాభ్యాసము.

అయ్యా ! బ్రహ్మచర్యమున సర్వగుణ సంహార కరంబైన ధనుర్వేద మను వేదము నభ్యసించి యజ్ఞుఁడను కుమారుం గాంచి వాని పోషణంబునకు సమర్థుండఁ గాక బాల్యమిత్రుఁడైన యంతర్యాగుకడకుం జని గోధనంబును యాచించి యతనిచేతం దిరస్కృతుండనై యిక్కిలియఁ గృశించి మీకడ కేతెంచితి ” నన బ్రహ్మచర్యుండు పొంగి , వెదుకఁబోవు తీవ కాళ్లకుం దగిలె ’ ననుచు నతని నభీష్ట పూజావిధానముల దృప్తునింజేసి మనుమల నెల్లఱం జూపి యిట్లనియె. మహాత్మా! వీరిని వేదకర్మలయం దప్రమత్తులై ప్రవర్తిల్లునట్లు జేసి మీ యమోఘ విద్యానైపుణ్యంబును ప్రకాశింపఁ జేయుం డనిన ‘ వల్లె ’ యని బ్రాహ్మణుండు శిష్యుల నందఱం జేకొని వారిని జూచి యిట్లనియె. “ విద్యలను శస్త్రవిద్యలఁ గఱచి మీలో నెవ్వండు నా యిష్టమును దీర్పగలఁ డెఱిఁగింపుఁ ” డనిన నందఱును మిన్నకుండిరి. సత్కాముఁడు ‘ నేను దీర్తు ’ ననియె.

ఇట్లు తన యిష్టమును నెరవేర్పఁ బూనిన సత్కాముఁ డతి స్నేహమున గౌఁగిలించుకొని కుమారుల కెల్లఱకు విద్యల నెల్లఁ గఱపుచుండె. అట్టియెడ యజ్ఞుఁడు తన తండ్రికిం బ్రియ శిష్యుండై విద్యల నన్నింట మేటియగుచున్న సత్కాముని యందు మత్సరించి, యెప్పటికేని యితండు తనకుం దండ్రికిని ప్రతిపక్షియగునని యెంచుచు నతఁడున్నత విద్యలఁబొందకుండ నారయుచుండె. కాని సత్కాముఁడు భగవదనుగ్రహమున గురు ముఖంబునను స్వయముగను సర్వశాస్త్రరహస్యముల భేదిం చుటయును బహువిధ వ్యూహభేదోపాయంబులను, మంత్రము లను నస్త్రప్రయోగోపసంహార క్రమంబులను నెల్లఱలోనఁ గన్నాకె యభ్యసించుచుండె. తక్కిన బాద్ధేయ శాంతేయు లును, నన్యవిషయాగత గుణసముదాయ మను రాజానీక మును విద్యల నభ్యసించు చుండిరి.

## కుమార శాస్త్ర బలప్రదర్శనము

బ్రాహ్మణు ననుమతంబున నొక్కనాఁడు జీవుఁడు కుమార విద్యాకౌశలంబుఁ జూచువాఁడై పేరోలగంబుండి యెల్లవారి రావింపం బంచిన సుందరీబృంద సంవృతయై బుద్ధి దేవి భర్తృ సన్నిధిం గూర్చుండె. వేదపురుషుండును, సద్వి చారుండును, బ్రహ్మచర్యుండును, ప్రబోధుండును, దంభ మను శల్యుండును, ధర్మమను బాహ్లికుండును, నర్థమను సోమదత్తుండును, కామమను భూరిశ్రవుండును, క్రోధమను సుశర్మయు, మంత్రి సామంత మండలేశ్వరులును, గాయక

పాఠక వైతాళికులును నిండియున్న యవసరమున శుక్ల మాల్యాంబరాభరణానులేపనంబులనొప్పారుచు నాచార్యుండు యజ్ఞునిఁ గూడి యేతెంచి రంగమధ్యం బలంకరించె. అమీఁద నాచార్యు ననుమతంబున కుమారవర్గం బంతయు తమచే నభ్యసింపంబడిన విద్యల నన్నింటిని సభామధ్యంబునఁ బ్రదర్శించిరి. అందు సత్కాముఁ డెల్లవారలం గడుమిన్నయై చూచువారి మనంబులకు వేడ్క నాపాదించుచు మంత్రప్రయోగములను నస్త్రప్రయోగముల ననేక విచిత్రగతులం జూపె. అతనిఁ బొగడువారి యులివు రంగమధ్యమునం దంతటను నిండియుండె. అట్టి సమయమున

## అహంకారాగమనము

శాంతిదేవి చిన్ననాఁ డుత్తర మీమాంసుఁడను కుంతిభోజునింటఁ బెరుగుచు నధిదేవతారూప సూర్యదేవుఁడను రాజసతేజంబు నాశ్రయించి తత్ప్రసాదంబున మనోహరాకారుండును, నజ్ఞానమను దృఢ కవచంబుఁ గలవాఁడును నగు నహంకారుఁడను కర్ణునిం గని తన యుత్తమవంశ సంజాతత్వంబునకు నిట్టి యహంకార జననంబు లోకప్రవాదకరం బని యెంచి యాపిన్నపాపని దుఃఖనదీగర్భంబునం ద్రోఁచి విసర్జించె. అప్పు డాతని తామసీరూప రాధ చేరందీసి పుత్రునింగాఁ బెంచి తన యింటన సర్వవిద్యలఁ గఱపె. అతండును జన్మస్థాన సామర్థ్యంబున నన్నిటఁ బ్రవీణుండయ్యె. కాని పాలనదోషంబున దుష్టవర్గంబులోనఁ జేరువాఁడయ్యె. ఇట్టి

యహంకారుండు కుమారవిద్యా ప్రదర్శన కాలంబున ప్రజల నెల్లఁ ద్రోనికొని రంగమధ్యంబునకు వచ్చి బ్రాహ్మణ ప్రబోధులకు నమస్కరించి జలధరగంభీరధ్వానంబు సేయుచు సత్యాముసకుఁ బ్రతికక్షియై యాక్షేపించి "నీవొక్కండవ నేర్పు కాఁడవు కావలదు. నేనునుఁ గొన్ని విద్యల నేర్చితి. నేఁడీ యీ సభాసదులు మెచ్చు నీవిద్యను నాముందుఁ జూపు" మనియె. ఆతని సందర్శన మాత్రంబునన పొంగుచున్న మహా మోహుం డాపల్కుల కెంతయు నలరె. ఆమీఁద నాచార్యు నాజ్ఞచే నహంకారుఁడు తన విద్యలనెల్ల నశ్రమంబుగాఁ జూపిన దుర్గుణ ప్రభువు తమ్ములుం దానును నతనిఁ గౌఁగిలించుకొని "నాతో బద్ధసఖ్యుండవై నాకును నాబాంధవులకును మేలు సేయుచు నారాజ్యం బంతయు నీదిగా నుపయోగించుకొ" మ్మనియె. ఆ మాటల కహంకారుఁ డొడఁబడి యా దుష్ట లోకమునఁ జేరిన వాఁడయ్యె. అప్పటి నుండి 'సత్యాముసకుఁ బ్రతిద్వంద్వి' నని చాటుచు మహామోహు హృదయ శల్యంబును బెఱికి సంతసం బరిచె. ఇన్ని రూపముల బాల్యము నుండియు సుగుణ దుర్గుణ సంతతు లొక్కచోటన కలిసి యున్నను వైరాను బంధంబు పెరుగుచున యుండె.

విద్యా ప్రదర్శనానంతర దివసంబున నాచార్యుండు శిష్యుల నెల్లర రావించి గురుదక్షిణ యిండని కోరిన వారు 'మీ యభీష్టం బేమి యానతిం' డన నతం 'డంతర్యాగుని ప్రాణంబులతో బట్టితెం' డిదియ నాకు సమ్మతంబని పంచిన, కలుష సంఘం బెల్ల ముందఱఁ జని యంతర్యాగు నెదిర్చి యతనిచే

పరాజితులై పాఱివచ్చిరి. ఆమీఁద సత్కాముఁడు గ్రరూపంబు గైకొని యంతర్యాగుమీఁదికిం జని యనేకరూపంబులఁ బోరాడి తన సాత్వికాంశంబున నతనిం బంధితుఁ జేసి గురుని సమ్ముఖమునకుఁ దోడితెచ్చినం జూచి యాచార్యుఁడు "ఓహో! అంతర్యాగులా! నామమాత్రులై యెచ్చటనో లోపలఁ బడియుండవలసిన వీరిట్లు మావంటి పురుషార్థుల కంటెఁ బడిరేమి? ఇప్పటికేని మీ రాజ్యాంధత వీడెనా? ఇంక నేని మే మెంతవారమో తెలిసికొందురో?" అని యుల్లసంబాడి విడిచిపుచ్చిన నంతర్యాగుఁడు సిగ్గున పురంబుఁ జేరి తన యనంతాంతర్యాగశక్తిం జేసి హింసారూప యజ్ఞమారకుండగు యహింసుఁడను దృష్టద్యుమ్నుని కొమరునింగాను, సత్కాము నల్లునింగాఁ జేసికొని తనకు వశ్యునిఁ జేసికొనునట్లు విద్యయను ద్రౌపదిని కూఁతురింగాను బడసి ("నిర్వికారాత్మ బుద్ధిశ్చ విద్యేతీహ ప్రకీర్తితా" నేను కర్తనుగాను, భోక్తనుగాను కూటస్థ బ్రహ్మము నేనను ఆత్మాకారాంతఃకరణవృత్తి విద్య యనబడును.) ఆనందరూపమునఁ బెంచుచుండె.

## మహామోహమానసులు జీవునితో మంతనమాడుట

జీవుఁడు బ్రహ్మాద్య సద్విచారులతో మంతనంబాడి యాత్మసామ్రాజ్యమునకు నిష్కాముని యావరాజ్య పట్టభద్రుం జేసిన, నతఁడు తన నలువురు తమ్ములును బలవంతులై నాల్గుదిక్కుల నోర్చి సకల శత్రు దర్పంబు లడంచుచుఁ గ్రమంబున ననంతశక్తులను ధనంబుల వృద్ధినొందించుచుండ

మహా తేజశ్శాలియై యొప్పుచుండె, అంతయుఁజూచి భ్రాంతి వాది నిష్కాను పట్టాభిషేకంబును వేదకామసత్కాముల పరాక్రమంబును సహింపక యొక్కనాఁడు మనోహంకార నాస్తికులంగూడి యేకాంతంబున వారితో నిట్లనియె. "సర్వ విద్యలం బ్రవీణులు సంతతోత్సాహులు నగు పంచకాములం గాంచి నాకును నా రాజ్యమునకును భయకారణులని యెప్పు డుం దలంచెద. దానికిఁ దోడుగా తండ్రి నిష్కాముని క్షేత్ర పాలనా పట్టభద్రునింజేసె. ఇంక నేనేమిసేతు" ననిన మాన సుం డిట్లను. "కుమారా! కార్యాకార్యగతుల నెఱుంగక దుష్టుఁడై సంచరించెనేని తండ్రినైన శిక్షించుట యాత్మ ధర్మము. తన కపాయంబు రానున్నయెడ సత్కర్మయని దుష్కర్మయని చూడక యెద్దియేనియుం జేసి "ఆత్మానం సతతం రక్షయేత్" అనునట్లు తన్నుఁ దా రక్షించుకొన వలయు. తన దోషంబు లితరులకుం దెలియరాని విధంబున గుప్తంబుఁజేసి యన్యులదోషంబు లెఱుఁగుచుండవలయు.

తే॥ వీరు నమ్మంగఁ దగుదురు, వీరు నమ్మఁ
దగరు నాకన వలవదు, తత్వబుద్ధి
నెవ్వరిని విశ్వసింపక యెల్లప్రొద్దు
నాత్మరక్షపరుండగు నది విభుండు. — భార

తన కపకారి యగు వాఁ డల్పుఁడని నమ్మి చేకొన రాదు. తన కపకారులని తోఁచినవారి నుపేక్షింపక యాత్మ రక్షకై దూరంబుఁ జేసి శిక్షింపన వలయు." ననిన నా పలు కుల నాదరించి యొకనాఁడు మహామోహుఁడు తండ్రి కడకుఁ

జేరి యిట్లనియె. "జనకా! శాస్త్రబలసంపన్నులగు నిష్కా-
మాదులకే నెప్పుడును భయంపడెద. దానికిఁ దగిన యట్లతని
యౌవరాజ్యపదస్థునింజేసితివి. దానంజేసి సద్వృత్తుండగు నత
నికి నింద్రియాధిదైవతము లను మంత్రి సామంత బ్రాహ్మణ
పౌరజనంబు లెల్లలు ననురక్తులై నిన్నును బ్రహ్మచర్యునిఁ
గూడ నాదరింపకున్నవారు. నీ వీ ప్రమాదంబు నెఱుంగక
యిట్టులె యుపేక్షా భావంబున నుంటివేని సర్వబలసంపన్నుఁడై
యతఁడు నిన్ను పదభ్రష్టునిఁ జేయక మానఁడు. ఆ కృత్యము
నకు బ్రహ్మచర్య సద్వివేకులును నతనివారై సహాయులుగా
నుండెద రింతకంటె మనకుం గష్టంబు గలదె, నా ప్రార్థనం
బంగీకరించి వారి నీ పురంబు వాయునట్లు చేయవలయు"
(పురము = శరీరము) ననిన జీవుఁడిట్లనియె. "కుమారా!
మహామోహా! క్షేత్రజ్ఞుఁడైనవాఁడు తన క్షేత్ర వ్యవహార
మును తాన చూచుచుండ వలయు, నేను షడంగయుక్తముగ
వేదముల నభ్యసించితి, తత్వశాస్త్రంబెల్ల సద్విచారుని కూడి
కతో సాకల్యంబుగ నెఱింగితి, కాని బాహ్య సంచారంబును
బాహ్యదృష్టియు లేకుండుటం జేసియు, పరావిద్యకు ప్రతి
విద్యను బన్ననేరమింజేసియు సర్వలోక వినతుండగు నీ పిన
తండ్రి సదసద్వివేకుఁడు సత్వగుణప్రధానుండై యంధుండనైన
ననీ పురంబునకుఁ బ్రభునిఁగా నియమించి నాయం దత్యంత
భక్తిం జూపుచు నంతశ్శత్రులనెల్ల జయించి తద్విజయంబున
లభించిన తేజశ్శక్తుల నాకుం జేర్చుచు నాత్మరాజ్యం బానంద
మయంబుగాఁ జేసి న్నాచే నుత్తమకర్మము లను యజ్ఞములఁ

జేయించె. ఇప్పటికి వాని కుమారులు నిష్కామాదులును నన్నిగుణములఁ దండ్రిని మించినవారై యింద్రియరూప ప్రజల మెప్పించుచు మెప్పుచున్నవారు. అట్టివారిని నాకు దూరస్థులఁ జేసికొని యెవ్విధమున సుఖింపనేర్తు '' నని యనేక విధంబుల దుఃఖించుచున్న తండ్రిం జూచి కల్లతేఁ డిట్లను " తండ్రీ! క్షేత్రపాలనా తంత్రమును మాయావివై నిష్కా-ముఁడెట్లు నడుపుచున్నదియుఁ దెలియనేరకుంటివి. పైతృకంబైన యీ పురసంపదను ముందు సదసద్వివేకుఁడు తాల్చుటం జేసి తత్పుత్రుఁడైన నిష్కాముఁ డిప్పుడు చేకొనిన ననంతర మతని పుత్రుఁ డనుభవించు. ఇట్లే యీ పురమెప్పుడును వారి పుత్రపౌత్రాదులకె సంక్రమించు. మేమిట్టి పురంబునకు దూరస్థులమైన మా పుత్రపౌత్రాదులకును లోపించు. కావున మహాత్మా! నీవంటివాని బిడ్డఁడనై యుండి యొరులసేవించుచు జీవింపనోప. ప్రాణత్యాగంబుఁ జేసికొందు. నన్ను బ్రతికించుకొనం దలంతువేని సదసద్వివేకుని యందలి పూర్వపుభక్తియు దయయు విసర్జింపుము. వెనుకటి సదసద్వివేకపాలనంబున నలరిన యింద్రియములను ప్రజలెల్లయిప్పుడు వాని కొమరుండను నభిమానంబున నిష్కాము పాలనంబ కోరుచుండిరి. అతండును తన పాలనంబు సుస్థిరంబగుటకు వారిని సంతోషింపఁ జేయుచున్నాఁడు. మనలోని కొందఱు దుష్టులు వానివారై పక్షపాతంబున నున్నవారు. ఈ యెల్లఱు మనవారగు నంతవరకు నుపాయమున శాంతితోఁగూడ పంచకాములు సుషుప్తి యను వారణావతమున నుండునట్లు పంపుము. మన పాలనమున

నెల్లఱ మనపట్ల సుముఖులఁ జేసికొనిన పిమ్మట మఱల వారు వత్తురుగాక. నాఁ పుడు జీవుండిట్లనియె.

"నేనును నెల్లప్పుడు నిట్ల తలంతు. కాని నీ యభి ప్రాయం బిది మహాదారుణంబు. కావున నక్కాఱింప వెఱచు చుందు. శాంతిపుత్రుల నెంటిమెయి నెట్ల పంపఁగలము. ఇక్కార్యంబు బ్రహ్మచర్య సద్విచార బ్రాహ్మణప్రబోధులు విని సహింతురె? ఇది మనతోఁ నయ్యెడు పనిగాదుడుగు" మనిన మిథ్యాకల్పనుఁడు "తండ్రీ! నీ యాజ్ఞకు సద్విచారాదులు బద్ధులు. వారుభయులకు సములయ్యు నావారల. ఎట్లనిన యజ్ఞుండు హింసాకర్ముఁడగుట నాయందిష్టుఁడు. పుత్రస్నేహ మున బ్రాహ్మణుండు నన్ను విడునఁడు. మేనల్లునిమీఁది ప్రేమం బున ప్రబోధుండు నాయొద్దనయుండు. బ్రహ్మచర్యుఁడు మధ్య స్థుండు. సద్విచారుఁడు నిష్కామ పక్షపాతియయ్యును నన్నుఁ జేరనోపఁడు కావున నీవ్యవహారమున నేదోషంబును రానేర" దని చెప్పుచు తండ్రి నెట్టకేల కొడంబరిచె.

## జీవుఁడు పంచకాముల సుషుప్తికిఁ బనుచుట

అంత నొక్కనాఁడు జీవుండు సుహృన్నిహావంబుతోఁ గూడియుండి నిష్కామాదులఁ బిలువనంపి వారి సమ్ముఖంబున సదసద్వివేకునిఁ దలంచికొని కన్నీరొత్తి కుమారులారా! మీరును తమ్మునికంటె నాయందతిభక్తులరు. ఇట్టి మీ కే నొక్క యాజ్ఞ నొసంగెద దానిం గాదనక మంగళకరంబ యని యెంచి యాచరింపవలయు. శాంతియు మీరును సుషుప్తియను

వారణావతంబునకు జని యందు నిత్యోత్సవమున నుండుఁడు. అది రుద్రభూమి యగుటం జేసి పుణ్యస్థానము నాఁబరగు. (అనాహతచక్రము సర్వవిషయ శూన్యస్థానము) పరలోకవాసి యగు సదసద్వివేకునకు హితంబగు నట్లుత్తమ కర్మంబుల నొనర్చుచుఁ గొంత కాలంబుండి వచ్చునది" యని పంచిన వల్లెయని నిష్కామాదులు బ్రహ్మచర్యాదులకు నమస్కరించి తల్లినిగూడి సుషుప్తికిఁ జనిరి. చనునప్పుడు సద్విచారుఁడు కొంతదూరం బరిగి మహామోహుని దుస్తంత్రంబంతయును నిష్కామున కెఱింగించి "భూమి కాయాం వివాసనః షష్టీం గాఢసుషుప్త్యాఖ్యాం క్రమాత్పతతి "యని చెప్పియుండుటంజేసి యందు వారప్రమత్తులై మెలఁగ వలసిన మార్గములనన్నింటిఁ గఱపి చనియె.

## పంచకాముల సుషుమ్నానాళ సంచారము

ఆమీఁద శాంతేయులు సుషుప్తి స్థానమున కారణ శరీర రూప లాక్షాగృహమున నివసించి మహామోహమాయా విలసితంబగు దాని కృత్రిమ విలాసంబును గాంచి భ్రమింపక నప్రమత్తులై నివసించుచుండిరి. అంతఁ దామజ్ఞానసుప్తిం జెందిరయేని కాలంబెఱింగి మొదలంట రూపము లడఁగునట్లు దహింపం బూనియున్న పొల్లులజేని ప్రయత్నంబుఁ గ్రహించి తమ్ము నశించిన వారినిగా పగతు రనుకొనునట్లు వారికన్న ముందర కారణశరీరంబును,జ్ఞానాగ్నిం బ్రజ్వాలింపఁజేసి దహించి శుద్ధియుఁ ధమకు లగ్గె కాఁదలంచి "సుషుమ్నాంతర్గతం

సర్వం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం, శతం చైకాచ హృదయస్య నాడ్యః తాసాం మూర్ధాన మభి నిస్సృతైకా, తయోర్ధ్వ మాయ న్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" సమస్తమును సుషుమ్నానాళమునకు లోపల నున్నది. హృదయమునకు ముఖ్యములగు నాడులు నూఱు నొకటిఁ గలవు. వానిలో సుషుమ్న యను పేరుగల యొక బ్రహ్మనాడి బ్రహ్మరంధ్రమును ఛేదించుకొని వెలుపలికి వెడలును. ఆ బ్రహ్మనాడీ మార్గమును బట్టి వెళ్లుచు మోక్షమును జెందుదురు. అట్లు సుషుమ్నా నాళమను బిలంబునఁజొచ్చి యతి కష్టప్రయాణంబులఁ బోవుచున్నంత మార్గమధ్యమున తల్లియు నన్నయుఁ దమ్ములును పరిశ్రాంతులై నిద్రింప వేదకాముఁ డొక్కరుండు జాగరితుండై యుండ "సమాధా క్రియ మాణేతు విఘ్నా న్యాయాంతి వై బలాత్, అనుసంధాన రాహిత్య మాలస్యం భోగలాలసా, భయం తమశ్చ విక్షేప స్తేజ స్పందశ్చ శూన్యతా, ఏవం యద్విఘ్న బాహుల్యం త్యాజ్యం బ్రహ్మవిదా శనైః" సమాధి స్థితికిఁ జేరువారిని విఘ్నములు బలవంతముగా నాక్రమించును. అవి (1) అనుసంధానభంగము (2) ఆలస్యము (3) భోగేచ్ఛ (4) భయము (5) నిద్ర (6) కల్పన (7) చిత్తచాంచల్యము (8) శూన్యత. ఇవి అష్ట విధ సమాధి విఘ్నములు. వీనిని బ్రహ్మజ్ఞులు నెమ్మదిగా విడువవలెను. అను నట్లు స్మృతిభ్రంశమను హిడింబాసురుఁడు చెలియలగు విభ్రమావతి యను హిడింబను గూడివచ్చి యతని నాక్రమింప వేదకాముఁడు తన యనంత సంహితా

బలంబున నతనిం బరిమార్చిన, విభ్రమావతి శాంతిపుత్రు నందు బద్ధానురాగయై తన్ను కామింపుమని కోరిన నతండు "నీవు తామసీ జాతవు రక్కసివి గాన నొల్ల" ననిన నాయమ స్మృతిభ్రంశ భంగా నంతరమున జాగరితురాలై యున్న శాంతే యుల కడకుంజని తన యావద్వృత్తాంతము నెఱింగించి "నేను తామసీజాత నైనను మీయందు సాత్త్వికప్రవర్తన గలదాన నయ్యెద నన్నుఁ జేకొనునట్లు వేదకాము నియోగింపు" మని శాంతిని ప్రార్థింప శాంతినియోగంబున వేదకాముఁ డాయమం బ్రతిగ్రహించి జాగరణంబను ఘటోత్కచ కుమారునిం గాంచె.

## పంచకాములు సుషుమ్నానాళమున వేదపురుష దర్శించుట

పదంపడి సుషుమ్నానాళ మధ్య గమనమున వేద పురుషుఁడు ప్రత్యక్షుండై వారిచే సత్కృతుండై యిట్లనియె. "బ్రహ్మగుణులారా! పాపబుద్ధిం గూడిన జీవుఁడు కామరుల దుర్ణయమునకు లోనై మిమ్ముఁదనకు దూరస్థులఁ జేసికొనియె. దుర్జనుల నెన్నఁటికిని యేమరి నమ్మరాదు. ఆనంద ఘును బాసి యుండవలసినం యీదుష్కర గమన కర్మమునకు దుఃఖింపం బనిలేదు. ఇదియు నొక సుకృతంబకా పరిణమించు. శుభములు నీకొఱకెదురు చూచుచున్నవి. కొండొక" కాలమునకు మీయిష్ట బాంధవులంగూడెదరు. సుఖంబుండుఁడని చెప్పి తిరోహితుం డయ్యె. ఆ కాలమున కల్లలఁజేని పాలనము జరుగుచుండుటంజేసి బ్రాహ్మణంబులె గౌరవ పాత్ర

ముతై యునికిం గ్రహించి పంచకాములు ప్రచ్ఛన్న వేషులై తమ్ము బ్రాహ్మణంబులెకా జను లెంచునట్లు సంచరించుచు నాజ్ఞా చక్రంబను నేకచక్రపురమున నివసించి బకనిష్ఠయను బకాసురుని కృత్రిమ జపమునకు లోనై యాపురంబంతయు నాశమగుచుండుటఁ గని వేదకాముఁడా రక్కసు ననాయాసమున నశింపంజేసి యా చక్రము ప్రశాంత స్థితిం బొందునట్లు సేసె. ఇట్లు నిర్ముక్త కృత్రిమంబైన యా స్థానము వీడి పోవుచు నా మార్గమత్యంతాంధకారావృతంబును నతి గహనంబును నై యుండుటం జేసి సత్కాముఁడలాతశంక యను కొఱవిం బట్టి త్రోవనడపుచుండ, గంధర్వనగర మను నంగారపర్ణుఁడెదుర్కొని వారిని తన మాయా జాలములఁ బడనేసి గారించిన సత్కాముఁడలాత శంకా విచారంబను బాణ ప్రయోగమున నా గంధర్వుని మాయపస బయ లొనర్చె. ( అలాతశంక యన కొఱవిఁ ద్రిప్పు నపుడు కఱ్ఱ చివర నున్న కించిదగ్ని చక్రాకారముగాఁ దోచునట్లు, జడమైన ప్రకృతియందుఁ దోఁచు నామరూపాత్మకాగ్ని జగద్రూపముగా గోచరించుటయే యలాతశంక, తన్నివృత్తి యలాతశంకానివృత్తి. “అలాతే స్పందమానే వై సాభాసా అన్యతో భువః, నతతోఽన్యత్ర నిస్స్పందా న్నాలాతం ప్రవిశంతితే ” అలాతము సంచలించు చుండగా నా యాభాసములు మఱియొకదాని నుండి పుట్టినవి కావు. ఆ సంచలనముకంటె వేరైన చోట నుండుటలేదు. అ యాభాసము లలాతమును ప్రవేశించుట లేదు. ) అప్పు డతం డతనికి వశ్యుండై నమస్కరించి,

" మహాత్మా! నాతో సఖ్యంబు పాటింపుము. మీ ముందు నా మాయాజాలముల విశదపరిచి మీకుఁ గష్టులైనవారి నొంచుచుఁ జరించెద " నని చెప్పి యెందేనిం జనియె.

**పంచకాములు శమమును పురోహితునిగాఁ జేసికొనుట.**

ఆ మీఁద వేదపురుషు నాదేశమున నెంతటి పండితులైనను శమమును పురోహితునిగాఁ జేసికొనకున్న నెట్టి శుభమును జరుగనేరదని యెంచి మార్గమధ్యమున తపోమయుండై, వేదవేదాంగవేత్తయై యొప్పువాని శమం బను ధౌమ్యుని సన్నిధికిఁ జేరి ప్రార్థించి తమకు పురోహితుండుగా నుండునట్లు కోరి సమ్మతింపం జేసికొని యవ్వలఁ జనిరి.

అట నోంకారమను పాంచాలంబున నంతర్యాగమను ద్రుపదుఁడు " దేహాభిమానా దభివర్ధతే క్రియా విద్యాగతాహం కృతితః ప్రసిద్ధ్యతి " దేహాభిమానము వలన కర్మలు వృద్ధి నొందు చున్నవి. విద్యవలన నహంకారము నశించు చున్నది. అనుటకుం దగిన విద్యయను ద్రౌపదిని కని సత్కామ నల్లునిఁగాఁ జేసికొందు నని యువ్విళ్లూరు చుండె. క్రమంబున కొమరిత సంప్రాప్త యౌవన యగుటం జూచి యా యమ వివాహంబునకుఁ దగు ప్రయత్నం బాచరించు చుండ నాకాలంబున శాంతేయు లేవురును తల్లితో కారణ శరీరంబున హతులైరని విని యెంతయు దుఃఖించె. ఇట్లు దుఃఖించు నోంకార పతికి నంతర్వాణి యను పురోహితుండు " పంచకాములు పరలోకగతులు కారు. వారవి

నాశులు. కారణాంతరమున ప్రచ్ఛన్నవేషులై యుండిరి. నీవు స్థిరమతివై స్వయంవరంబు చాటింపుము. సత్కాముసకుఁ దక్క నన్యుల కభేద్య మగునట్లు భ్రాంతియను మత్స్య యంత్రమును గూర్పుము! దానిని భేదించిన వారి కక్కన్య నిత్తుననుము. అని యుపదేశించిన సంతర్యాగుఁ డట్టుల సర్వం బును సుసంగతంబుఁ జేసె.

## సర్వ విషయవాసు లోంకారమునకు వచ్చుట

ఆ మీాద నన్ని విషయముల నుండి పాలకు లెల్లఱు వచ్చుచుండిరి. కాయపురమునుండి బాధేయులును, వికుంఠ మునుండి వాసుదేవ సంకర్షణులును వచ్చిరి. చార్వాకుఁడను శిశుపాలుండును, కాపాలికుఁడను జరాసంధుఁడును వచ్చిరి. పంచకాములు ప్రచ్ఛన్నబ్రాహ్మణ వేషములతో వచ్చి కుంభ కార గృహమున నుండిరి. (జగన్నిర్మాణ క్రియలో నిమిత్త కారణుండైన కుమ్మరింబోలి యీశ్వరుం, డుపాదాన కార ణంబైన మృత్తిక వంటి ప్రకృతిం జేకొని, కాల మను చక్ర మునఁ జేర్చి, కర్మ మను కోలచేఁ ద్రిప్పుచు, ఘటము లను దేహముల నామరూపములతో ననేకములుగా నిర్మించు చుం డును. ఈ తత్వము నెఱుంగుట యను కుంభకార గృహ మున నుండిరి. )

## పంచకాములు విద్యను పరిగ్రహించుట.

ఆ మీాద నంతర్యాగుఁడు స్వయంవరోచిత సకల మం గళముల భద్రపరచి నిఖిల విషయాగత గుణాలోకము నెల్ల

మన్నించి వారివారికిఁ దగిన ప్రదేశముల విడియఁ జేసె. అహింసుఁడు విద్యను దోడితెచ్చి సభామధ్యమున నిలిపి భ్రాంతి యను మత్స్యయంత్రముం జూపి 'దాని భేదించి దీనిఁ జేకొనుం' డనియె. అంత దుష్టచతుష్టయమును తక్కిన విషయేశ్వరులును నా భ్రాంతి నుపలక్షింపను భేదింపను నేరక సిగ్గువడి తలలువంచి కూరుచుండిరి. సంకర్షణుఁడు పోఁబోవ వాసుదేవుఁ డా విద్య మన శాంతికొమరుల భాగంబని వారించె. ఇట్లెల్లవారును బెండువడి 'యేరికిని నలవిగాని పణం బొడ్డుట తగని పని ' యను చుండిరి, అప్పుడు సర్వగుణ సమాజ మధ్యంబుననుండి ప్రచ్ఛన్నరూపంబున నున్న సత్కాముఁడు వెలువడి భ్రాంతిని వీక్షించి "అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యోధ్వనిః, ధ్వని రంతర్గతం జ్యోతి ర్జ్యోతి రంతర్గతం మనః, తన్మనో విలయం యాతి తద్విష్ణోః పరమంపదమ్ " కొట్టఁబడకయే ధ్వనించుచుండెడి యనాహత చక్రమందలి దశవిధ ప్రణవనాదముల నెఱిఁగి దశమనాద మెచ్చట విలీనమగు చున్నదో యచ్చట ప్రాణాగ్రస్థితమైన చిత్కళయొక్క దర్శనముతోఁ గూడి యా దర్శనమందు విలీనుఁడై నిమిషమాత్రంబున విజ్ఞానశరమున దాని భేదించి విద్యంజేకొని పోవు చుండ ('యా విద్యా సా విముక్తయే' ఏది ముక్తిని బొందించునో యదియే విద్య) దుర్గుణ రాజసమూహం బెల్ల సిగ్గువిడిచి తలయెత్తి చూచి 'యెవ్వఁడు వీఁడు నామరూపములనేని యెఱుకపరుపక కన్యందోడ్కొని పోవుచున్నాఁడు ' పట్టుఁడు కట్టుఁడు కొట్టుఁ డనుచు నుక్కు పెట్ట యతనిం

దలపడిన సత్కాముఁడు వారలనెల్ల తన యనంత విద్యా శక్తి బాణంబులచే బడలు పరిచి తిరిగి చూచుచు పాటి పోవం గొట్టె. అందఱు పాఱినను మహామోహాహంకారులు పోక తమ దుర్గుణ సంఘ సైన్యంబులఁ గూడి పెనఁగుచుండ వేదకామ సాహాయ్యంబున సత్కాము డందఱ మహావాక్య శరవిద్ధ గాత్రులం జేసిన నాతేజంబునకు సహింప నోపక వీరు శాంతేయులని గ్రహించి చచ్చి రనుకొనిన వారు మరల బ్రతికి వచ్చుటకు దుఃఖించుచు స్థూలపురంబునకుఁ జనిరి.

వారి నిట్లుచేసి సత్కాముఁడు విద్యాదేవిం దోడుకొని శాంతి సమక్షంబునకుంజని ‘ జననీ ! యుత్తమభిక్షం దెచ్చితి ’ నన నాయమ ‘ మీ రేవురు నుపయోగింపుఁ ’ డని పలికె. తల్లి యాజ్ఞ కన్నదమ్ము లేవురును నొడంబడి యట్లులసేయ కృతనిశ్చయు లైరి.

## అంతర్యాగుని విచారము

అంత నంతర్యాగుఁడు తనకోర్కికి భంగముగా కొమరిత బ్రాహ్మణముల పాలాయెఁ గదా ? యని చింతించుచు నద్వైతోచిత వాక్యపరంపరల నిచ్చి యహింసుని వారి కడకుఁ బంచి రప్పించి వారివలన క్రమంబున శాంతి పుత్రులని యెఱిఁగి సంతసించె. ఆమీఁద వివాహంబు మాట పుట్టిన నిష్కాముఁడు తమ కేవురకును విద్యను పాణిగ్రహణంబు సేయింపు మనియె. ఆమాట కులికి యంతర్యాగుఁ “ డీ ధర్మ మెందేనిఁ గలదే ? ఒక్కరుం డెన్ని విద్యలనేని గ్రహించుఁ

గాని యొక్క విద్య గుణభేదరూపులైన పెక్కండ్ర పరిగ్ర హింపఁ గల్గునా? యేనాఁట నేని యిట్టి పథంబు గలదా? సర్వజ్ఞుల రగు మీ రిట్లానతియ్యఁ దగునా?" యని పనటం గూరు మాటలాడుచున్న నాలో వేదపురుషుండు వచ్చిన నెల్ల వారును సంభ్రమంబున లేచి నమస్కరించి యుచితాసనంబున నుపవిష్టుం జేసి కొలిచి యున్నంత వేదపురుషుం డంతర్యాగున కిట్లనియె.

"అంతర్యాగా! మీరు కారణ జన్ములు. ఉపాధి మాత్రంబున పంచరూపముల గోచరించు చున్నను నేక రూపంబె కాని భేదంబు లేదు. ఈ యమ ప్రేరణంబున వేద బ్రాహ్మణ యజ్ఞ సంస్కారంబులును, జీవాహంకార మమ కారాదుల నాశంబును కానున్నది. ఇయ్యది విధినియమము. కాదనక నిర్వహింపు" మనుటయు 'వల్లె' యని సహస్రార దేశము నందలి ప్రణవ పురమును సర్వవిధాలంకార శోభి తంబుఁ గావించి శుభముహూర్తమున వేద సన్నిధిని శముని పౌరోహితంబుతో నహింసా సాహాయమున నంతర్యాగ దాతచేత దత్తమైన విద్యను పంచకాములు పరిగ్రహరూప పాణిగ్రహణం బొనర్చిరి. ముక్తికాంత ముక్తామయాక్షత లిడియె. ఇవ్విధంబున వివాహమంగళంబు సంపూర్ణంబుఁ గావించి యందఱును నిష్టోపభోగంబుల ననుభవించుచు సుఖం బున నుండిరి.

## మహామోహ నిర్వేదము

శాంతిపుత్రులు ప్రచ్ఛన్నవేషంబు లుజ్జగించి సర్వజన ప్రకాశులై (సుషుమ్నానాళ సంచారంబు వీడి) ప్రణవ పురంబున నుండుట చారులవలన నెఱిఁగి మిథ్యాకల్పనుఁడు మనోనాస్తికాహంకారులఁ బిలిపించుకొని మిక్కిలియు దుఃఖించుచు వారితో నిట్లనియె. అక్కటా! పంచకాములకు మనము చేయు మారణకర్మంబు లన్నియు దైవానుకూలంబు కతమున నభ్యుదయకారణంబులెయగుచున్నయవి. కారణ శరీర మున ప్రమగ్గునట్లతిప్రయత్నమున మనచే గావింపఁ బడిన తంత్రంబంతయు కృతఘ్నున కొనర్చిన మేలునుంబోలె వ్యర్థ మగుటగాక వీర్యబల స్థానబల సంపద్బలములు గల యంత ర్యాగునివంటి మహాదుష్టునితో వారికి వియ్యంబు గుదిరి నది. ఇంక వారి నిర్జించు టెట్లు. ఏమిసేయుదు? నా దుఃఖ మున కేది కడ? యని పనవుచు మఱియు నేవిధంబుననైన నంతర్యాగునకును వారికిని భేదంబు నడిపి వైరము పుట్టునట్లు సేయవలయు. అక్కడ వాసుదేవుని కతమున వైకుంఠవాసు లును వారివారై యున్నవారు. వీరెల్లం గూడిన మనకు కరము భరంబగు. కావున వీరందఱ నొకరితో నొకరు కలియకుండఁజేసి పోకార్చు టెట్లుగల్గు. ఈ దుఃఖనివృత్తికి మార్గమేది యని చెప్పుచు భేదోపాయం బాలోచించుచుండె. సద్విచారుఁడు పంచకామాభ్యుదయంబును విద్యాదేవీ పరి గ్రహంబును విని సంతసించుచు నా వార్త జీవునకు నివేదిం చిన నాకర్ణించి జీవుండు "సద్విచారా! శాంతేయు లంత

ర్యాగు కూఁతుఁ జేపట్టుటం జేసి చక్కని బంధుబలముఁ గల వారైరి. వారి యభ్యుదయము సంతసంబుఁ గల్పించె" నని యతనికిఁ బ్రియంబు పుట్టునట్లు మాటలాడి లోనగరికిం జని తన మనోదుఃఖం బితరుల కెఱుకపడకుండ నుండెఁ. అట్టితఱి మహామోహాహంకారులు జీవుని పాలికిం జని యిట్లనిరి, "ప్రభూ! యెన్నియో దినములనుండి మా యభీష్టమును నీ కెఱింగింప వలయునని చూచుచున్నను రాత్రిం దివములు సద్విచారుఁడు నీ కడన యుండుటం జేసి చెప్పలేకుంటిమి. ఇన్ని దినముల కీయెడమును జూడఁగంటిమి. సద్విచారుఁడు పంచకాముల పక్షమువాఁడని యెఱిఁగియు నతని బోధనలనే హృదయమున నిలుపుచుందువు. అతఁడన నీకొక మహాపదేశికుఁ" డని యనుచున్న వారలకు జీవుం డిట్లనియె.

## మహామోహాహంకార మనోజీవుల దురాలోచనము

"బిడ్డలారా! వాక్కుల యందును చేష్టల యందును శాంతేయులయెడ ప్రేమమున్నట్లు నటింతునే కాని నా హృదయ మెన్నఁడును సద్విచారున కెఱిఁగింపను. మీ రను కొనునట్ల యేనును భావింపుచుందు. శాంతికొడుకులు దైవ బల సంపన్నులు. అట్టివారి నేమిసేయఁ గల్గుదుము. మీ యభీష్ట మేమియో యెఱిఁగింపుఁ" డనిన కల్లసామి యిట్లను. "తండ్రీ! ముందు శాంతేయు లంతర్యాగునకు దూరస్థు లగునట్లు సేయవలయు. వీరు ప్రణవరాధీశ్వరుం జేరినవారితో మాధవుఁడనుఁ గూడిన మూఁడు లోకంబులును వారిజయింప

నోపవు. కావున నాలస్యంబు సేయ కంతర్యాగుఁడు వీరి వెడల నడచునట్లు భేదోపాయంబుఁ బన్నవలయు. కాదేని మధుమతీ విద్యాసంపన్నలగు సుందరరూపల రాజస తామస శ్రద్ధల నేవురకు వేర్వేరఁ గూర్చి విద్యయందు విరక్తులఁ జేతము. కాకున్న నొక్కర్తుక యైదుగురితో భరింపఁబడుట కష్టం బని విద్యకుఁ జెప్పి యామె వారి విడిచిపోవునట్లు సేయుదము. అట్లు గాకున్న మాయా ప్రయోగంబున వేదకాముని జంపి బల రహితుల జేయుదము. వేద కాముఁడు ప్రాయిన సత్కామునిఁ జంపుట మన యహంకారు నకు సులభంబయగు. కావున నీ చెప్పిన యుపాయముల నేది సుప్రయోగంబై చెల్లు దానిన ప్రయోగించుద " మనిన నహంకారు డిట్లనియె " మిత్రమా! యివి యేటి మాటలు, వారి సంతతిలోనివాఁడై కోరితెచ్చికొనిన సంబంధముగలవాఁ డౌట నంతర్యాగుఁడు వారి నేలవిడుచు, విద్యాపరిగ్రహకాల మాది యనవరతానంద మగ్నులై యున్న వారామె నెట్లు విసర్జింతురు? పలువురచే లాలింపఁబడుట విద్యకు కాంక్షయే కాన నామె వారి నెట్లు వదలు, వేదకామునం దింతవరకుఁ బ్రయోగించిన మారణతంత్రంబు వ్యర్థమైనవి. కావున నీ యుపా యంబు లన్నియు మాని పరాక్రమణంబునన యెదుర్కొని నిర్జింత " మనిన జీవుఁడు " ఇది సేయందగు కార్యంబె యయినను బుద్ధిమంతులైనవారితో విచారించి చేయుట బుద్ధి" యని చెప్పి యప్పుడ బ్రహ్మచర్య బ్రాహ్మణ ప్రబోధ సద్వి

చార యజ్ఞధర్మార్థకాముల రావించి వారితో నంతయు నెఱిం గించిన యులికిపడి బ్రహ్మచర్యుఁడు మహామోహునకిట్లనియె.

## బ్రహ్మచర్య బ్రాహ్మణులు మహామోహునకు బుద్ధిసెప్పుట

"కుమారా! మహామోహా! జీవ సదసద్వివేకు లిరువు రును నాకు నొక్కరూప. కావున మీయందును వారియం దును భేదబుద్ధి యెన్నఁడును లేదు. ఆ కారణమున శాంతి పుత్రుల మారణంబున కే నెన్నఁడును నొడబండనోప. పితృ పైతామహంబైన యాత్మసామ్రాజ్యంబు మీయట్ల వారును భోగింపఁగలరు. కావున వైరంబుడిగి వారిఁ బిలువనంపి యేతదానందార్థ భోగభాక్కులుగాఁ జేసిన నీకును నీ వారికిని లోకంబువారికిని జీవునకును నిర్వాణసుఖానందంబు గలుగు. కానినాఁ డసంప్రజ్ఞయు నిరయంబును గల్గకమాన" దనిన నాతని పలుకుల కలరి బ్రాహ్మణుం డిట్లను. "నాయనా! సాధుసమ్మతంబులగు నీ పవిత్రతాపుత్రుని మాటల బాటిం పుము. నష్టాత్ములైన మనోహంకారుల దుర్బోధల విని శాంతేయుల విసర్జింపకుము. స్వభావ శక్తిసంపన్నులగు పంచ కాము లిప్పటికి శమదమాంతర్యాగాహింసా విద్యాయుక్తు లగుటచే ననంతబల సంపన్నులై యున్నవారు. పిత్ర్యంబైన వారి యాత్మాంశంబు వారికిడక యపహరింప సాధ్యంబుగాదు. కావున వారిని సత్కరించి యిటకుఁ దీసికొని వచ్చునట్లు దగినవారి బంపు"మనిన కటకటంబడి యహంకారుఁ డిట్లనియె. "వృద్ధులైనవారు శాస్త్రచర్చలకుం దగినవారైయుందు రంతియ

కాని యాత్మ విచారణంబుల సంబంధపడుట మేలగునె! తమకు మారకులైన శత్రువులఁ దమలో జేర్చుకొనుట ధర్మ మఁట యేమిసెప్పవలయు" ననిన బ్రాహ్మణుండు "జాను జీవునకు మే మహితమును బోధించు వారమును నీవు హితమును బోధించువాఁడవును. ఆహా! ఈ జీవసంతతికి మాకంటె నీవ యెక్కుడు హితకారివి. నీ దుష్టబోధలచే నీ వంశము తుదిముట్టుటకేమి యాశ్చర్యము" అని యనుచుండ వారిద్దఱ వారించి సద్విచారుఁడు జీవున కిట్లను.

"అన్నా! జీవా! బ్రాహ్మణ బ్రహ్మచర్యులు సనాతనులు, సనాతన ధర్మనిర్ణయులు నగుట వారు జెప్పిన దానిఁ గాదనక యాచరించుట నీకు ముఖ్యధర్మము. వారికంటె నీ ముక్తిసుఖమును గోరువారు మఱియొకరుండరు. ఈ మహామోహాదులు బాలబుద్ధులు. "పరాచః కామా ననుయాంతి బాలాస్తే మృత్యోర్యాంతి వితతస్య పారం" విషయ వాసనా బుద్ధులై బాలులు కామలోలురై యనంత మృత్యుపాశములఁ దగుల్కొను చున్నారనునట్లు వీరికి ధర్మాధర్మ నిర్ణయ వివేకము శూన్యమైనది. వీరి మాటలఁ బాటింపక వారి రావించి యాత్మరాజ్యమున నిల్పుము. పంచకాములు తమకుఁ దామ మహామహిమాస్పదాత్మశక్తి సంపన్నులు. దానికిఁ దోడు నేఁడు ప్రణవ పురాధీశ్వరుఁ డంతర్యాగుఁడును, వాని కుమారుఁ డహింసుఁడును సమశక్తిమంతులై బాంధవ్య రూపమునఁ గూడిరి. కృష్ణపరమాత్మయు దమంబును మిత్రత్వంబుఁ బాటించు చుండిరి. ఇట్లు దైవ మానుష శక్తులు

గలవారు శాంతేయులు. ఇంతటి వారయ్యును నీకొమరుల కంటె నీయం దెక్కుడు భక్తిసేయుదురు. వారు మాత్రము నీ సంతతి కారా? అట్టివారి నూఱక యన్యులుగా భావించి "అనన్యేనైవ యోగాత్ సా స్వారాట్ భవతి" (ఆత్మకన్న నన్యమును జూడనివారు స్వర్గమునకు ప్రభువు లయ్యెదరను నుడిని మఱచి వారినెడసేయుట నీతియగునా? అంతటి దివ్య శక్తిసంపన్నులతో నూఱక విరోధంబుఁ బూను మందబుద్ధుల నేమనవలయు. ఇంతకు నీపుణ్యమున కారణ శరీరమున మాయింపంబడక దానిన మాయించి బ్రతికిరి. నీ కొమరుని దుర్ణయంబున నీపురపాలనంబున కెల్ల ముప్పురానున్నది. దానిం దొలగించి "సర్వమాత్మానాం పశ్యే" త్తనుమాట నెఱింగి నిన్ను నీవ రక్షించుకొను మనిన జీవుండు.

"సద్విచారా! నీవును బ్రహ్మచర్యుఁడును బ్రాహ్మణుం డును విశుద్ధాత్మ ధర్మస్వరూపు లగుటంజేసి మీ ప్రబోధముల కన్యథాత్వము కల్గునా? మీయాజ్ఞ ననుసరించి వారిని రప్పించి యానందరాజ్య మేలించెద" నని బ్రహ్మచర్యాదు లయు, మహామోహాదులయు సమక్షంబున శాంతేయుల శాత్మార్థ రాజ్యం బిచ్చునట్లు నిశ్చయించి వారిం దోతేర సద్విచారుం బంచె.

## సద్విచారుఁడు ప్రణవ పురమునకు వచ్చుట

సద్విచారుఁడు సహస్రారమునకుఁ జని యంపఁ దనవారిఁ గూడియున్న యంతర్యాగుని, పరమాత్మునితోఁ

గూడియున్న పంచకాములను గాంచి వారిచేత మన్ననలు బడసి యంతర్యాగునితోనిట్లనియె. మహాత్మా! అంతర్యాగా! నీవంటివానితో తనపుత్రులకు బాంధవ్యము సమకూరినందుకు జీవుఁ డెంతయు సంతసించుచున్న వాఁడు. శాంతియు కామ పంచకమును తమ్ముఁబాసిన దాదిజీవుండును తక్కిన బంధువర్గ మును పెద్దయు వగచుచున్నారు. ఇప్పుడు వీరిం జూడఁగోరు చున్నారు. నీ యనుజ్ఞ లేక వీరు రానేరరు. కాన విద్యా శాంతి సహితంబుగా నీయల్లురఁ బుత్తెంచు" మనిన నంత ర్యాగుఁడు "అయ్యా! సర్వకర్తయగు జీవుని వంటి వాఁడు పంప మా శుభంబుల కోరు నీవంటివాఁడు రాగ వీరి కిష్టార్థంబులు లభించుట కేమి వింత. నీవును వాసు దేవుండును బ్రహ్మచర్యుండును జీవుండును నేమిసేయఁ దలం చినను నదియెల్ల మాకు శుభంబె కాని మఱియొండగునా?" యని పలికి వారిం బోయిరండనిన పంచకాము లంతర్యాగుని వీడుకొని విద్యాశాంతులఁ దోడుకొని వాసుదేవాహింసులు వెంటరా స్థూలపురంబునకు వచ్చిరి.

పురజనంబులు (ఇంద్రియాదులు) సంతసంబునం బొదలి దీవించుచుండ కులవృద్ధుల దర్శించి నమస్కరించి మహా మోహాదులఁ గూడి యెప్పటియట్లు యిష్టవినోదంబుల నై దేండ్లుండిరి. అంత నొక్కనాఁడు జీవుండు సద్విచారాదుల సమక్షమున పంచకాములఁ జూచి యిట్లనియె. "సర్వ కర్మ సాక్షియగు నీ పరమాత్మ సాక్షిగా సకల కులవృద్ధుల సన్నిధిని మీకు సదసద్వివేకుని దైన యానందరాజ్యం బిచ్చెదఁ

గొనుండు. ఇఁక మీఁద ఖాండవప్రస్థమను సంసారారణ్యమునఁ నుండుఁడని యాజ్ఞాపించి దానికి నధీశ్వరునిగా నియమించి నిష్కాము నభిషిక్తుం జేసిన వాసుదేవసహితులై వారు సంసారారణ్యంబుఁ బ్రవేశించిరి. (వివాహ మైనవారు గృహస్థాశ్రమమునఁ బ్రవేశించినట్లు)

## పంచకాములు విదేహ కైవల్యమును పాలించుట.

కృష్ణపరమాత్ము ననుగ్రహంబు మెండుగా నుండుటం జేసి వేదసహితంబుగా శాంతిశమదమాదుల సహాయంబుతో సంసారారణ్యమధ్యంబున స్వర్గాతీతంబై యత్యంతరామణీయకంబును. ననంత నిత్యవిభూతియుతంబును నై యొప్పు విదేహ కైవల్యమను నింద్రప్రస్థపురంబును, వాసుదేవుండు వాసయోగ్యముఁగా నిర్మించి యిచ్చిన నొక శుభముహూర్తమున నందుఁ బ్రవేశించి వేదపురుష మాధ్వుల శాసనంబులతో శాంతి శమ విద్యలఁ గూడి సుప్రతిష్ఠితంబుగాఁ జేసికొని నిష్కాముఁడు పాలించుచుండె.

అంత నొక్కనాఁడు నిదిధ్యాసయను నారదుం డే తెంచిన మహాభక్తియుక్తుండై నిష్కాముఁడు తమ్ములుం దానును సమస్కరించి విద్యచే నమస్కరింపఁ జేసిన నందఱ దీవించి విద్య నభ్యంతరంబునకుఁ బోవం బనిచి యేవురితో నేకాంతంబున నిదిధ్యాసుఁ డిట్లనియె." ప్రవృత్తియేని యింద్రియ విషయముల యం దేకైక స్థానంబున ప్రవర్తింపఁ గల్గుఁగాని యున్నిఁట నొక్కపరి ప్రవర్తింప నేరదు, కావునఁ దద్విషయము

బునఁ గట్టడ యేర్పరచుకొనుట మేలు. మీ యేర్పరకును విద్య యొక్కతయ పత్నిగా నున్నది. అందఱియొడ నేక కాలంబునఁ బ్రీతిఁ బుట్టింప సమర్థురాలు గాకుండు. కావున నొక్కొక్కరి కడ నొకకొంత కాలంబుండునట్లును, నొకరికడ నుండుతఱి మఱియొకరుచేరిన, వారు పంద్రెండు నెలలు మహా పురుషహృదయములను తీర్థముల నవగాహనం బొనర్చి వచ్చు నట్లును నొక కట్టడఁ గావించుకొనుం " డనిన దీని కెల్లఱును 'వల్లె' యన నిదిధ్యాసుఁడు చనియె. నాఁటినుండి యట్టుల నా సమయంబు నడుపుచుండిరి.

## సత్కాముఁడు మహాపురుష హృదయములను తీర్థముల సంచరించుట

కొండొక కాలమున కొకనాఁడొక బ్రాహ్మ కర్మ సంరక్షణంబుఁగోరి సత్కాముఁడు విద్యా సహితుండై యున్న నిష్కాము గృహంబునకుం జనియె. తత్కారణంబుగా సోదరులచేతఁ బంపఁబడినవాఁడై కతిపయ బ్రాహ్మణ సహితంబుగా సత్కాముఁడు మహాపురుషహృదయ తీర్థములఁ దోఁగుచు సంచరించుచుండె.

"యస్మిన్ దేవాశ్చ వేదాశ్చ పవిత్రం కృత్స్న మేకతామ్
ప్రజేత న్మానసం తీర్థం తత్రస్నాత్వా ఽ మృతోభవేత్
జ్ఞానహ్రదే ధ్యానజలే రాగద్వేష మలాపహే
యస్నాతి మానసే తీర్థే సయాతి పరమాంగతిమ్"

(మహాభారతము)

ఇట్లు క్రుమ్మరువాఁ డొక్కనాఁడు గంగాతీరమ్మున కృతస్నానుండై యగ్నికార్యముల నొనరించుచున్న కాలంబున నమ్రత యను నాగాంగన యులూపివచ్చి సత్కామ్ముఁ గాంచి యనురక్తయై తన్నుఁ బరిగ్రహింపుమని వేడ నాయమం బొంది, వినయుఁ డను నిరావంత కుమారునింగని, యచ్చట నుండి వెడలి యుత్తమాశయములను, పవిత్ర మానసంబులఁ గాంచుచు మణిపూరకంబను మణపురాధీశు కొమార్తె ముదితయను చిత్రాంగదం గాంచి ప్రీతినొంది యాయమం జేకొని, మననమను బభ్రువాహన కుమారుం గాంచి, యట నుండి వెలువడి ప్రభాస తీర్థమునకరిగి యచ్చటికి వైకుంఠము సమీపమని విని యందరిగి హృషీకేశుని సందర్శించి నాజన్మమును సఫలంబుఁ జేయుదు, మఱియు వాని తోఁబుట్టు సమత యను సుభద్ర మహదానందదాయిని యని వినియుంటి దానిం దర్శించి వశురాలిం జేసికొనిన వైకుంఠుఁడు సులభంబుగా వశ్యుఁడగునని నిశ్చయించి యతీర్థంబున, దన్నొరు లెఱుఁగకుండ నుండి పరమబ్రహ్మణ్యు జగద్గురు పుండరీకాక్షు హృదయ పుండరీకంబున నిక్షేపించుకొని సమతంబొంద ధ్యానించుచుండె.

వైకుంఠమను ద్వారకానగర వర్ణనము

"దేవకీ బ్రహ్మ విద్యా సా యా దేవై రుపగీయతే
నిగమో వసుదేవో యో వేదార్థః కృష్ణ రామయోః
యోనందః పరమోనందః యశోదా ముక్తి గేహినీ"

బ్రహ్మవిద్య యను దేవకీదేవియం దుపనిషత్తులను వసుదేవుని వలన పరమాత్మయగు కృష్ణుండును సంకర్షణుం

డగు బలరాముఁడును జన్మించి బ్రహ్మానందమను నందుఁడును ముక్తికాంత యను యశోదయు నెత్తి లాలించి పోషించు చుండ, లింగశరీరమను వ్రేపల్లెయందు బాల్యావస్థం బెరుగుచు పరమాత్మ యింద్రియాధి దైవతములను గోపకులం గూడి యింద్రియాధ్యాత్మికశక్తులను గోపికల నుపలాలించుచు బృహదారణ్యమను బృందావనమున మంత్రములను వ్రాకుల మధ్య నింద్రియములను గోవులఁ గాయుచు పరమాత్మ బాల్యమతిక్రమించి పౌగండమున గోపికలను చతుర్వింశతీం ద్రియములఁ గూడి రమించి తన నిత్యవిభూతి లీలలం దనిపి యానందపారవశ్యంబునఁ దేల్చుచు యౌవనావిర్భావమున స్థూలశరీరమను మధుర కేఁగి యందు

" దర్పః కువలయాపీడో గర్వోరక్షః ఖగోబకః
దయా సా రోహిణీసూతా సత్యభామా హి శాంతతా
అఘాసురో మహావ్యాధిః కలిః స కంసభూపతిః
శమోమిత్రం సుదామా యః సత్యాక్రూరోదమోద్ధవః "

దయ యను రోహిణి శాంతి యను సత్యభామ శమ మను సుదాముఁడు సత్యమను నక్రూరుఁడు దమమను నుద్ధవుడుఁ గలిగి దర్పమను కువలయాపీడమును గర్వ మను బకాసురుని రాజయక్ష్మ యను నఘాసురుని కలియను కంసుని నశింపఁజేసి, స్థూల మను మధురాపుర ప్రాకృతిక తత్వంబుల నెల్లఁ దనియింపంజేసి యానందరూపుఁడై యుండ, కాపాలికుఁ డను జరాసంధుఁడు (కాపాలికుఁడన శక్తిపూజలు సేసి నరబ ళుల నిచ్చుచు కపాలమున భోజనముఁజేయువాఁడు) కృష్ణునిఁ

జంపి మధురను దన వశముఁ జేసికొని యంచి పదునెనిమిది మారులు ససైన్యుఁడై వచ్చిన వాని డాకకుంగాక శత్రు రూప రాక్షసుల కలభ్యంబైన వికుంఠ మను ద్వారకాపురిం బ్రవేశించె. అందు సంకర్షణుం డను బలరాముండును, లోభ మను కృతవర్మయు, వృష్ణులను సాలోక్యులును, భోజులను సామీప్యులును, నారాయణ గోపాలురను సారూ ప్యులును, యాదవులను సాయుజ్యులును, నిత్యశూరులై సేవింప నాదిలక్ష్మియగు రుక్మిణీకాంతం గూడి తన సంతానం బనంతమై నెగడ నిత్య విభూతి యోగంబును నెరపుచుండె.

## సత్కాముఁడు సమతను వరించుట

అట్టి పరమాత్మ ప్రభాసమున సత్కాముఁడు సమత కొఱకు తపించుచుండుట నెఱింగి యతని కడకుంజని మహా పురుషహృదయమధ్యసంచారశ్రమంబునను, సమతా కర గ్రహణంబు లభింపమిం జేసియు కృశించి యతివలె మారు రూపంబున నున్నవానిఁ జూచి తనకు నభివాదనంబు సేయు నతని నాదరించి యుచిత సంభాషణముల గొంతకాలము గడపి నీయభిమతము గూర్తు వైకుంఠమునకు రమ్మని తోడ్కొని చని యొక్క భవనమున విడియించి యతనికి సర్వోపచారములు నొనర్ప సమతను నియోగించె. ఆమీఁద నొక్కనాఁడు సంక ర్షణుం డెఱుంగకుండ నేకాంతమున తల్లిదండ్రులైన బ్రహ్మ విద్యోపనిషత్తుల సమక్షమున నింద్రియాధిదైవతము లను దేవతలు పెండ్లి పెద్దలుగా, సమతాసత్కాములకు పురుషో

త్తముఁడు వివాహమంగళం బాచరించె. వారిరువురకు తర్క దృష్టి యను నభిమన్యుఁడు జన్మించె. పుత్రజననాంతరము సత్కాముఁడు కృష్ణసహితముగా సమతం దోడ్కొని విదేహ కైవల్యమున కేతెంచి నిష్కామాదులకు నమస్కరించి యిష్టోపభోగముల నానందించు చుండె. తర్కదృష్టి శమ మను పురోహితునికడ వైదికములగు కర్మముల నెల్లఁ బడిసి వేదాధ్యయనము జేసి తండ్రిచే నధ్యాత్మిక తర్కము నభ్యసించి యంతశ్శత్రుసంహారకరణపటిష్ఠుండై యుండె.

విద్య నిష్కామువలన మోక్షమను ప్రతివింధ్యుని, వేదకాముని వలన సంతోషమను శ్రుతిసోముని, సత్కాము వలన ప్రీతియను శ్రుతకీర్తిని, సత్యకాముని వలన నానందమను శతానీకుని, నాప్తకాముని వలన దయయను శ్రుతసేనునిఁ గనియె.

## సంసారారణ్య దహనము

ఇట్లు పంచకాములు సుతవంతులును, శ్రుతవంతులును నీతివంతులునై కైవల్యరాజ్య సుఖం బనుభవింపుచుండ సత్కాముఁ డొకనాఁడు పురుషోత్తమునిఁగూడి విదేహ కైవల్యమును వీడి సంసారణ్యమను ఖాండవప్రస్థమున విహరించుచు నొక్క సువాసనయనుచందన భూజంబునీడ సాత్త్విక వృత్తి యను చంద్రకాంత వేదికపైఁ గూర్చున్నతఱి విజ్ఞాన మను నగ్నిహోత్రుఁడు బ్రాహ్మణవేషధరుండై వారిసన్నిధి కేతెంచి పూజింపంబడి వారితో నిట్లనియె. "మహాత్ములారా! నేనమిత భోజనుండ నెన్నిఁటి నేనిఁదిని యప్పుడ జీర్ణించుకొన

నేస్తు: నాకుఁ గోరిన యన్నంబిడి తృప్తుఁజేయుం"డని ప్రార్థింప "నీ కెట్టి భోజనంబు గావలయు నడుగు మిచ్చెద" మన "నేను జ్ఞానాగ్నిని నా కాహారంబు కర్త్రాధిదైవతంబగు నింద్రుని స్వాధీనమున నున్న సంసారారణ్యమను ఖాండవము. దాని నేను దహింపఁబోవ నింద్రు డజ్ఞానాంబుధారల నార్పుచుండుఁ గావున మహావాక్యవిచార మను నస్త్రజాలముల నాతని వారింతురేని దాని ననాయాసమున నాహారించి కృతార్థుండ నయ్యెద" నని యనిన దామోదరుం డతనిఁ జూచి "యేమి కారణమున దీని నాహారింపకున్న తీరని వ్యాకులంబు సంభవించెఁ దెల్పు" మన జ్ఞానాగ్ని "జీవుఁడు తన శతవార్షికంబగు జీవితము కడవరకును కర్మల నాచరించుట యను యజ్ఞవిధానమును నడుపుటం జేసి తదంగంబైన తృష్ణ యను నాజ్యంబునం దడిసి తడిసి జ్వాలారహితుండనై కృశీభూత శరీరుండనైతి. ఇదియొక మహారుజగా బాధింపంబడుచుంటి. మహాత్మా! నాయందుఁ గరుణించి నాచే సంసారారణ్య దహనము భంగరహితముగాఁ జేయింపు" డని దానికి సాధనములుగా తత్వవిచారమను రథమును, మహావాక్యములను నాల్గు శ్వేతాశ్వములును, విజ్ఞాన మయానందమయ కోశములను తూణీరద్వయంబును, ప్రణవమను గాండీవంబును, నేతి నేతి మహావాక్యములను బాణంబులును సత్యాత్మునకిచ్చి నారాయణునకు కాలచక్రమను చక్రమును, ప్రణవనాదమను శంఖమును నిచ్చె. ప్రమాణ (అవాంతర) వాక్యములను గదను వేదకామునికిచ్చె. ఇట్లుత్తమ సాధనంబులం బడసి కృష్ణ సత్యా-

ములు సంతసించి తత్త్వవిచారమను రథంబెక్కి విజ్ఞానాగ్నిం జూచి 'యింక నీకార్యంబు సాగింపు'మనియాజ్ఞాపించి చక్రంబు చేఁబట్టి చక్రాయుధుం డొక్కవలనను ప్రణవమును బూని సత్కాముఁ డొక్కవలనను నుండి రక్షింపుచుండ జ్ఞానాగ్ని తైజసంబగు రూపంబుఁదాల్చి సంసారారణ్యమును దహింప ప్రారంభించిన తద్రక్షకులగు దుర్విచారు లడ్డుపడి సత్కాముని వేదవాక్య బాణజాలముల నపహృత దర్పులై నశించిరి. ఆమీఁద కర్మాధి దైవతమను నింద్రుఁడరుదెంచి యజ్ఞాన వాక్యాంబుదధారల గురిపించిన నేతినేతి మహావాక్యములను బాణములచే వానినెల్లఁ బోకార్చి సత్కాముఁ డతని దర్పం బణంచె. ఇట్లా నారాయణుల సహాయమున జ్ఞానాగ్ని సంసారారణ్యమునంతయు దహించి యపగతరుజాభారుండై శమించె. అనంతర మింద్రుఁడు దామోదరసత్కాముల సన్నిధి కేతెంచి సఖ్యంబుఁ జూపి యంతటనుండి వారికి లోనై సంచరించు నట్లొడఁబడి నిజస్థానంబునకుం జనియె.

ముక్తిసౌధ నిర్మాణ కుశలుండగు దేవశిల్పి జ్ఞానమయుఁడు సంసారమున సత్కామునిచే రక్షింపంబడి స్నేహంబు పాటించె. ఇట్లు నిస్సార సంసారదాహకులు సర్వేశ సత్కాములు జ్ఞానమయుం దోడుకొని విదేహకైవల్యంబునకు వచ్చి నిష్కామునకు నమస్కరించి సంసార దహన విషయంబును నివేదించి జ్ఞానమయుం జూపి సంపూర్ణానందవారిధిని నోలలాడుచుండిరి.

శ్లో॥ జాగ్రద్దృష్ట్వా స్థూల పదార్థా నదమాయాం.
దృష్ట్వా స్వప్నేఽథాపి సుషుప్తౌ సుఖనిద్రామ్
ఇత్యాత్మానం వీక్ష్య ముదాస్తేచ తురీయే
తం సంసార ధ్వాంతవినాశం హరిమీడే.

హరిమీడేస్తవము.

ఆత్మభారతమున
సంభవ పర్వము
సంపూర్ణము.
ఓం తత్సత్





శ్రీరాధాకృష్ణ

# ఆత్మభారతము

## యోగపర్వము

———— :o: ————

శ్లో॥ రాగాముక్తం లోహయుతం హేమ యదాఽగ్నౌ
యోగాష్టాగ్ని రుజ్వలిత జ్ఞానమయాఽగ్నౌ
దగ్ధ్వాఽఽత్మానం జ్ఞం పరిశిష్టం చ విముక్తం
తం సంసార ధ్వాస్త వినాశం హరిమీడే.

హరిమీడేస్తవము.

నిష్కాముఁడు కృష్ణపరమాత్మ తోడుగా విదేహకైవల్యంబును పాలించుచుండ నొక్కనాఁడు జ్ఞానమయుఁడు శాంతేయుల యెడఁ గలుగు భక్తిభావంబున నపూర్వంబును నతి మనోహరంబును, నగణితామూల్యమణిగణ తేజోజాల సమన్వితంబును, దుర్విషయానపేక్ష్యంబును, వసంతమాయారంజితంబును, ముక్తపురుషానంద దాయకంబును, బద్ధపురుషా

ప్రవేశంబును నగు ముక్తిసౌధ మను మయసభను నిర్మించి యొసంగిన నిష్కాముఁడు బ్రహ్మజ్ఞదత్త శుభముహూర్తంబున పురుషోత్తమ పురస్సరంబుగా తమ్ములును తల్లియు దేవియు తోడరా శమ మను ధౌమ్యుని యొక్కయు దమ మను సాత్యకి యొక్కయు యాశీర్వాదంబులతో నందుఁ బ్రవేశించె. మాధవుఁడు మాతా పితృ సందర్శన కుతూహలియై వైకుంఠ మున కరిగె.

## అష్టాంగయోగములు నిష్కాముఁ గానవచ్చుట

నిష్కాముఁడు విదేహకైవల్యమున ముక్తిమంటప మున ననుజ తనుజ మంత్రి పురోహిత భృత్యవర్గములఁ గూడి నిండుకొలువున్న సమయంబున యమమను మార్కం డేయుండును, నియమ మను రోమహర్షణుండును, నాసనమను మైత్రేయుండును, ప్రాణాయామమను కణ్వుండును, ప్రత్యా హారమను గౌతముండును, ధ్యానమను జమదగ్నియు, ధారణ మనుయాజ్ఞవల్క్యుండును, సమాధియను వైశంపాయనుండును శిష్యప్రశిష్య గణములతో నాకైవల్య ప్రభు సందర్శనంబు నకుఁ జనుదెంచినఁ గనుంగొని భక్తియుక్తుఁడై తమ్ములుం దానును పలువిధ స్తోత్రములతోఁ బూజించి వారివలన "యోగశ్చిత్తవృత్తి నిరోధః" చిత్తవృత్తి నరికట్టు యోగ ముల నెఱుంగుచు సుఖంబున్నయెడ నిధిధ్యాసయను నార దుండు విజయంచేసిన, నిష్కాముఁడు తమ్ములఁ గూడి నమస్క రించి పూజించి యుచితాసనంబున నాసీనుం జేసిన యనంత



శ్రీరాధాకృష్ణ

# ఆత్మభారతము

## యాగపర్వము

—:o:—

శ్లో॥ రాగాముక్తం లోహయుతం హేమ యదాఽగ్నౌ
యోగాష్టాగ్నై రుజ్జ్వలిత జ్ఞానమయాఽగ్నౌ
దగ్ధ్వాఽఽత్మానం జ్ఞం పరిశిష్టం చ విదుర్యం
తం సంసార ధ్వాన్త వినాశం హరిమీడే,
హరిమీడేస్తవము.

నిష్కాముఁడు కృష్ణపరమాత్మ తోడుగా విదేహ కైవల్యంబును పాలించుచుండ నొక్కనాఁడు జ్ఞానమయుఁడు శాంతేయుల యెడఁ గలుగు భక్తిభావంబున నపూర్వంబును, నతి మనోహరంబును, నగణితామూల్యమణిగణ తేజోజాల సమన్వితంబును, దుర్విషయా నపేక్ష్యంబును, ననంతమాయా రంజితంబును, ముక్తపురుషానంద దాయకంబును, బద్ధపురుషా

ప్రవేశంబును నగు ముక్తిసౌధ మను మయసభను నిర్మించి యొసంగిన నిష్కాముఁడు బ్రహ్మజ్ఞదత్త శుభముహూర్తంబున పురుషోత్తమ పురస్సరంబుగా తమ్ములును తల్లియు దేవియు తోడరా శమ మను ధౌమ్యుని యొక్కయు దమ మను సాత్యకి యొక్కయు యాశీర్వాదంబులతో నందుఁ బ్రవేశించె. మాధవుఁడు మాతా పితృ సందర్శన కుతూహలియై వైకుంఠ మున కరిగె.

## అష్టాంగయోగములు నిష్కాముఁ గానవచ్చుట

నిష్కాముఁడు విదేహకైవల్యమున ముక్తిమంటప మున ననుజ తనుజ మంత్రి పురోహిత భృత్యవర్గములఁ గూడి నిండుకొలువున్న సమయంబున యమమను మార్కం డేయుండును, నియమ మను రోమహర్షణుండును, నాసనమను మైత్రేయుండును, ప్రాణాయామమను కణ్వుండును, ప్రత్యా హారమను గౌతముండును, ధ్యానమను జమదగ్నియు, ధారణ మనుయాజ్ఞవల్క్యుండును, సమాధియను వైశంపాయనుండును శిష్యప్రశిష్య గణములతో నాకైవల్య ప్రభు సందర్శనంబు నకుఁ జనుదెంచినఁ గనుంగొని భక్తియుక్తుఁడై తమ్ములుం దానును పలువిధ స్తోత్రములతోఁ బూజించి వారివలన "యోగశ్చిత్తవృత్తి నిరోధః" చిత్తవృత్తి నరికట్టు యోగ ముల నెఱుంగుచు సుఖంబున్నయెడ నిధిధ్యాసయను నార దుండు విజయంచేసిన, నిష్కాముఁడు తమ్ములఁ గూడి నమస్క రించి పూజించి యుచితాసనంబున నాసీనుఁ జేసిన యనంతర

రమున నిది ధ్యాసుఁడు నిష్కామున కాత్మధర్మ ప్రబోధ కంబుగా నిట్లనియె. "నిష్కామా! సత్యకాముఁడవై యాత్మధర్మముల నెఱిఁగి కైవల్య రాజ్యమును పూజ్యముగ నడిపించు చుంటివే? వేద సమ్మతుఁడైన పురోహితు శమంబును నాదరింతువే? ఆంతరిక శత్రువుల జయించి జితేంద్రియుండవై దైవబలంబున వెలుంగుచుంటివే? నాస్తికానృతంబులఁ దోలఁగించి సత్యమునం దసత్యదృష్టినిఁ బోనాడి యాత్మరక్షణంబుఁ గలిగి విషయములఁ దగులు వడక యథాశక్తి నన్యాయపథము విసర్జించి మహాత్ముల యుపదేశములఁ గొనుచు నానందమున నుంటివే?

"శుద్ధమానంతు తచ్చిత్తం ఈశ్వరార్పిత కర్మభిః
వైరాగ్యం బ్రహ్మలోకాదౌ వ్యనక్త్యథ సునిర్మలమ్.
సఙ్గ స్సత్సువిధీయతాం భగవతో భక్తిర్దృఢాఽఽధీయతాం
శాన్త్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాఽశు సన్త్యజ్యతామ్
సద్విద్యానుప సేవ్యతా మనుదినం తత్పాదుకే సేవ్యతాం
బ్రహ్మైకాక్షర మర్థ్యతాం శ్రుతి శిరోవాక్యం సమాకర్ణ్యతామ్"

— అద్వైతానుభూతి.

సత్పురుషులయందు స్నేహము చేయఁబడుఁ గాక. భగవంతునియందు భక్తి దృఢముగాఁ జేయఁబడును గాక. శమదమాదు లభ్యసింపఁ బడును గాక. కర్మసముదాయము శీఘ్రముగా గట్టిగా విడువఁబడును గాక. బ్రహ్మజ్ఞాని సేవింపఁ బడును గాక. నిత్యమును వారిపాదములు సేవింపఁబడును గాక. అద్వితీయబ్రహ్మము ప్రార్థింపఁబడునుగాక. ఉపనిషత్తుల

యందలి మహావాక్యార్థము చక్కఁగా వినఁబడునుగాక. విదేహాపతీ! నీముక్తిభవన మపూర్వము. ఇట్టి బ్రహ్మానంద దాయకానంత తేజోభవనము భూర్భువాది లోకములం దెచ్చటను లేదు. కైవల్యమునకు ప్రభుఁడవైన నీపుణ్యమగణ్యమని వచించి మఱియు "మహాత్మా! నీతండ్రి సదసద్వివేకుఁడు సంయమన మను మయసభనుండి నీకుం జెప్పమని పుత్తెంచిన వాక్యంబులుగల వవధరింపుము. ఆత్మయజ్ఞమను రాజసూయం బీవు గావించినంగాని తనకు జీవనివృత్తిరూపనిశ్శ్రేయస ప్రాప్తి సంభవింపదనియు నందులకు నిన్నుఁ బ్రేరేపింపుమనియు జెప్పిపంపె. ఆయజ్ఞము సకలేంద్రియాధిదైవతముల జయించినఁగాని కానేరదు. మఱియు నది బహువిఘ్నంబుల కాకరంబై యుండు. దుష్టదుర్గుణ రాక్షసగణము దాని భంగముసేయ నరయుచుండు. అట్లుఁ గానీయక జాగరితులై నిర్విఘ్నముగాఁ నిర్వర్తింపఁ జేసిన నిఖిలగుణగణ ప్రళయంబగు రణంబుగలుగు" నని చెప్పి నిధిధ్యానుఁడను నారదుండు చనియె.

## నిష్కాముఁ డాత్మయజ్ఞము సేయ నాలోచించుట

పిమ్మట నిష్కాముఁడు వేదపురుషుండును శమంబును తమ్ములునుఁ గూడియున్న సమయంబున వారితో "పుత్రజనన ఫలంబు తండ్రి యాజ్ఞను నిర్వర్తించుటయే కదా? కాని యీ యజ్ఞంబువలన పరలోకవాసులకు హితంబును, యిహలోక మారణంబునుఁ గలుగునని నిదిధ్యాసుఁడానతిచ్చె.

నేనేమి సేతు, దీని నెట్లు నిర్వహింతు, పితృదేవు నాజ్ఞ నెట్లు మన్నింతుఁ జెప్పం ” డనిన శమాదులు “ ప్రభూ! భయంపడకుము. ఈ యజ్ఞదీక్షం బూనుము. దీనివలన సమస్త బాహ్యాంతశ్శత్రుదోషంబులు నశించు. సకలేంద్రియములను ప్రజలితఃపూర్వము నీచే నిర్జింపంబడిరి. ఆత్మశక్తియందు నీతో సమాను లెవ్వరును లే ” రని ప్రబోధించిన నిష్కాముఁడు తెలివొంది తద్విధికిం బూని, యీ యజ్ఞంబు నిర్విఘ్నంబుగా నిర్వర్తింపం జేయుటకు యజ్ఞకర్త యనాదినిధనుం డాది పురుషుండు పురుషోత్తముఁ డొక్కఁడే నాకుం బరమప్రాప్యంబని యతనిం గొనివచ్చుటకుం గొందఱాప్తులం బంచిన, పుండరీకాక్షుండు ద్వారవతినుండి కదలి విదేహ కైవల్యంబునకు వచ్చి శాంతి నిష్కాములకు నమస్కరించి యందఱ కుశలం బడిగిన యనంతరమున నిష్కాముఁడు పరమాత్ముని హృదయ పుండరీక మను పుండరీకాసనముననునిచి ధ్యానధ్యేయధ్యాతృ రూపంబైన త్రిపుటిని సాకారపూజనం బాచరించి యిట్లనియె. యజ్ఞమూర్తీ!

కం॥ ధ్యేయుఁడవు సకలలోక
స్థేయుండవు నమ్రులకు విధేయుఁడవు నయో
పాయజ్ఞుఁడ విజ్ఞగముల
నీ యెఱుఁగని యవియుఁ గలవె నీరజనాభా!

— భారతము.

నా తండ్రి సదసద్వివేకుఁడు సంయమనంబున నుండి యాత్మయజ్ఞం బొనర్చునట్లుగా నియమించి నిదిధ్యాసునిఁ

బనిచె. ఇంతటి మహాకార్యము నాచే చేయంగలుగుట యెటులం గియె పంచనో ? పిత్రాజ్ఞయని దాని కొడంబడితి. కాని నీ నియోగం బాకాంక్షించుచున్నవాఁడ నాజ్ఞయేమి ?" యనిన మాధవుండు భావికార్యదశ నూహించుచు మెల్లన నిట్లనియె.

కం. కురువృషభ ! సర్వగుణముల
సురుచిర తేజమున రాజసూయాఖ్య మహా
ధ్వరమునకు నీవ యర్హుఁడ
వరిసూదన శౌర్యులయిన యనుజుల బలిమిన్.

— భారతము.

బావా ! నీవనంత కల్యాణగుణ సంపన్నుండవు. నీ తమ్ములంత శ్శత్రు నిరాసకులు. కావున నీవీ యజ్ఞంబునకు దీక్షవహింపుము. కాని దీనికొక్క కార్యంబు యజ్ఞమునకుఁ బూర్వమ సేయవలయు. ఇప్పటికి పాపప్రభుని యాక్రమణంబున దుర్గుణ కలుష వంశములవారు పెక్కురు మిక్కిలియు గర్వించి యుక్కుమిగిలి యున్నవారు. వారియందు కాపాలికుండను జరాసంధుఁడు చార్వాకుఁడను శిశుపాలుని తోడుఁ జేసికొని నన్ను లేనివానిఁగాఁ జూచుచు మత్సరించియున్నాఁడు. వాని కింగాక స్థూలమను మధురను విడిచి నీపాలకత్వములోనిదగు శ్వేతద్వీపమునుకుశస్థలంబున వికుంఠమను ద్వారకనునిర్మించు కొని యందున్నవాఁడ. వాఁడు బాహ్యశత్రువు. వానిం బరి మార్చికాని యజ్ఞంబునకుఁ బూనరాదు. వాఁడు తామసశ్రద్ధం గూడి తామస భక్తియుక్తుండై తామస దైవియగు భైరవిని

హింసాకర్మంబునఁ బూజించుచు దినమున కొక్కనింగా నరబలి నిచ్చుచుండు. వానిఁ జంపుట యంతర్యామినగు నాకుంగాదు. అనేక శతసంహితా బలయుక్తుండగు మన వేదకాముఁ డక్కార్యంబు నొనర్పఁగలఁడు. ఆతనిని సత్యాముని నాకుఁ దోడుగాఁ బంపుము. ఇక్కార్యంబు సఫలంబుజేసికొనివత్తు" ననిన నిష్కాముఁడు "కేశవా! నీ ప్రసన్నహృదయ మీప్రపన్నుల దెస ప్రవాలినంజాలు సర్వంబును చేకూరినట్లయెంచెద. మీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మరుగుం" డనిన

## దామోదర వేదకామ సత్యాములు కాపాలికునిఁ జంపఁబోవుట

అమ్మువ్వు రప్పుడ కదలి పాషాణహృదయుంబను గిరి వ్రజంబున కరిగి వేదమార్గమను సింహద్వారమునఁ జనక యసిమిత్రమను పెరమార్గమున పాషండ బ్రాహ్మణముల నతం డాదరించుఁ గావున నారూపంబులతో నాతని యాస్థానంబునకుఁ జనిన నతండు భక్తియుక్తుండై పూజింపం బోయిన నాపూజల నొల్లకున్న "మీ రెవ్వ రీరూపంబుల నేల యే తెంచితి" రన మాధవుండు "వాదమను యుద్ధమున నిన్ను నిర్జింప వచ్చినారము. నీవు మాకు పరమశత్రుండ" వనిన "నాకు మీరును మీకు నేనును నెన్నఁడును నపకారముఁ దలంచిన వారము గాము. అందేను దేవబ్రాహ్మణ భక్తుండఁ గదా? మీ కహితుఁడ నెట్లైతి" నని కాపాలికుండు పలుకఁ గృష్ణుం డిట్లనియె.

## హింసారాధన ఖండనము

పాపీ ! నీ దేవపూజ కేవల హింసాత్మకముగా జరుగుటంజేసి దేవునెట్లు పూజించువాఁడ వైతివి. "ఇష్టా పూర్తిం మన్యమానాం వరిష్ఠం, నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః" మూఢుఁడు తన కోర్కెను పూర్తిఁజేసికొనుట కింతకన్న వేరు శ్రేయము లేదని తలంచును. అట్లులే స్వసుఖమునుమాత్ర మాకాంక్షించి నీ పుత్రపౌత్రుల వృద్ధిని గోరి యాక్రోశించు ప్రాణుల హృదయ సంచలన తరంగములు తాకకుండ గుండెను బండవలె జేసి భైరవదేవా ! యీ యుపహారంబునుఁ గొని నాకోర్కెల నొసంగు మనియు, నీవలె నన్నొక పాషాణంబుఁగాఁ జేయుమనియు ప్రార్థించుచు ప్రక్కననున్న తల్లినిఁగాంచి నీకు దూరస్థుల మగుచుంటిమని కన్నీరు విడుచు బిడ్డలను, బిడ్డలఁ గాంచి మాకు పోషకు లింకనెవ్వరు తండ్రీ ! యని యేడ్చు తల్లులనుఁ బట్టి కఱకుకత్తులచే కుత్తుకలుగోసి దేవుని ప్రేమకు పాత్రుఁడనైతి ననుకొనుచుంటివి. ఓరీ ! దుష్టరాక్షసా ! నిన్నేమని తిట్టవలయునో తోఁచకున్నది. దేవునిపేరిట నిట్టి హింసల నొనర్చుటకన్న కేవలము నాస్తికుండవైయున్న నెంత మేలు. దుష్టా ! అహింసాతత్పరులై జీవితములఁ గడపు సత్పురుషు లనుభవించు సుఖంబునకు మించి నీ హింసారూప మహాపాప కార్యంబువలన వేఱైన ఫలంబేదేని పొందఁ గలిగితివా ! నీ దేవుఁ డిచ్చియుండెనా ? అందఱివలెనే దశేంద్రియ విషయము లనుభవించుచుంటివేగాని నీవుచేయు దుష్కార్య

మునకు విలక్షణముగ నీదేవుఁడు మఱి రెండింద్రియములనేని నెక్కుడుగ నీయఁగలైనే? ఆక్రోశితప్రాణుల నెన్నిఁటి నీపొట్టం బెట్టుకొంటివి? నీచా! ఇంతజేసియు నీజరామరణంబులనైనఁ దప్పించుకొనఁ గల్గితివా? ఎవ్వరిచిఁదబ్రేమచే నీపాషాణ హృదయము నుండి జీవకారుణ్యమును బాఱఁ ద్రోలితివో యట్టి నీకుటుంబ ప్రజలు శాశ్వతముగ నుండువారు కాఁ గల్గుదురా? ఇన్ని ప్రాణులఁ బోకార్చి నీ వొక్కండవు సుఖించుట కన్న నీ వొక్కఁడవు లేకున్న నెన్ని జీవములు హాయిగా బ్రతుకు! నీ పాపమును దలంచిన కొలఁది హృదయావేదనము బొడము చున్నది. వేదబాహ్యా! యిది యును వేదకర్మంబె యని వచించుచు వేదముల కపార్థంబును బోధించు చుంటివి. దుష్టమతీ! వేదము లెందేని కారుణ్య మును వీడి కర్మము లొనర్పు మనెనా? అట్టిదేదైన నది వేదమగునా? తాటాకులకట్ట యగునుగాని — జీవకారుణ్య మును జూపు మనని వాఁడు దేవుఁ డగునా? దయ్య మగును గాని — ఆక్రోశమునుజూచి కరుఁగని హృదయము మాంస పిండ మగునా? బండ యగునుగాని — చచ్చుచున్న బిడ్డలఁ జూచి దుఃఖించు తల్లుల కన్నీటి కాలువలు దాటఁ గలుగు వాఁడు కన్నవారు బిడ్డలగుదురా? గడ్డలగుదురుగాని — పిశాచీ! యింకనైన నిట్టిదుష్టకార్యంబుఁ గావింపనని ప్రమా ణంబుఁ జేసితేని నిన్ను విడిచి నీచే చెఱఁబెట్టఁబడి మరణ దీక్షాబంధములు వేసియున్న జీవులనెల్ల విడిచిపుత్తుము. కాదేని నిన్నిప్పుడ యమసదనంబునకుం బంపుదుము, ఏ మందువు?

నేను కృష్ణుండ నితఁడు వేదకాముఁ డాతఁడు సత్కాముఁ" డని పల్కుటయు కాపాలికుం డులికిపడి "ఓహో! కృష్ణా! నీవా? నాతో పదునెనిమిదిమారులు పోరాడి తుదకు కంటికిఁ గనరాకుండఁ బోయిన పోటుఁబంటవు గావా? ధూర్త గోపాలా! నాధర్మము నెఱుంగుదువా?

శా. మస్తిష్కాన్త్ర వసాభిఘారిత మహామాంసాహుతుల్ పావకో
పాస్తుల్ బ్రహ్మ కపాల కల్పిత సురాపానంబు మాపుష్టి స
ద్యస్త్రీవ్రాసి నికృత్తకంఠ విగళద్రక్తోగ్రమర్త్యోపహా
రస్తుత్యర్హబలిప్రదానముల యర్చల్ భైరవ స్వామికిన్.

— ప్రబోధచంద్రోదయము.

కావున నీ తులువ మాటలకుఁ దగినయట్లుత్తమ పురుషులైన మీ ముగ్వుర నిప్పుడ భైరవదేవునకు శ్రేష్ఠోప హారంబుగా నొసంగి సంతసింపం జేయుదు రం" డని వేదకాముని మార్కొనియె.

అంత వా రిరువురును పదుమూఁడహోరాత్రంబులు వాగ్వాద యుద్ధం బొనర్చిరి. అందు వేదకాముఁ డెంతకును తన వాదంబు నెగ్గకునికిం డిల్లవడి చూచుచుండ పరమాత్ముఁ డిట్లనియె. "వేదకామా! యితని యందద్వైతభావము తోఁచుచున్నను మనోవాక్కాయ కర్మముల యందంతటను ద్వైతమే ప్రధానంబై "అహమన్యోఽసౌ అన్యోన స వేదా యథా పశురేవం స దేవానాం" నేను వేఱు, వారు వేఱని చూచువాఁడు తెలియనివాఁడు. వాఁడు దేవతలకు పశువువంటి

వాఁడు. "ద్వితీయాద్వై భయం భవతి" రెండవది చూచి నప్పుడు భయము గలుగుచున్నది. యనునట్లు మనోవాక్కాయ కర్మంబులం దంతటను ద్వైతమే ప్రధానముగా నున్న వీని నెఱింగి జయింపు" మన్న నాతఁ డక్కీలకముం దెలిసి యతనియందున్న ద్వైతభావమును వెల్లడించుటయు నతండు నశించె. (అదియె యతని రెండుఁగా చీల్చుట) అప్పు డందఱు నానందమయులై పొంగుచు నతని కుమారునికి పట్టాభిషేకం బొనర్చి చెఱనున్న జీవులనెల్ల విముక్తులఁజేసి నారాయణ వేద కామ సత్కాములు విదేహ కైవల్యమునకేతెంచి నిష్కాము నకు నమస్కరించి వృత్తాంతమంతయు నివేదించి కొలిచి యుండిరి.

## నిష్కాముఁ డాత్మయజ్ఞము సేయుట

అంత నిష్కాముఁడు వాసుదేవాను మతంబున నాల్గు దిక్కుల జయించి వచ్చుటకు నలువురు తమ్ములం బంచిన వారును సర్వ విషయ దేశంబులఁ గ్రుమ్మరి విషయాధీశ్వరుల జయించి వారి తేజోధనము లుపాయనంబులుగాఁ గొని వచ్చి యన్న కొప్పగించిన తత్తేజోధనంబులచే ద్విగుణీకృత తేజ శ్శాలియై వెలుఁగుచు యజ్ఞపురుషునిచే ననుజ్ఞాతుండై శమవేద ముల యనుమతంబున నాత్మయజ్ఞంబుసేయ నుపక్రమించి, పురోహితుండగు శమంబుచే యజ్ఞశాల నిర్మింపంజేసి యజ్ఞోప కరణ ద్రవ్యంబుల సమాయత్తంబు సేయించి సత్యకామాప్త కాముల వలన బంధువర్గంబులనెల్లఁ బిలిపించె.

అప్పుడు పుత్ర మిత్రాదులతో యోగవిద్య యను విరటుండును, సంత్యాగ మను ద్రుపదుండును, చార్వాకుఁ డను శిశుపాలుండును, మోహ మను భగదత్తుండును, దమం బను సాత్యకియు, లోభ మను కృతవర్మయు, కాయపురినుండి బ్రహ్మచర్య మను భీష్ముండును, జీవుఁడను ధృతరాష్ట్రుండును, సద్విచార మను విదురుండును, బ్రాహ్మణ మను ద్రోణుం డును, యజ్ఞ మను నశ్వత్థామయు, ప్రబోధమను కృపుఁడును, ధర్మార్థకామము లను బాహ్లీక సోమదత్త భూరిశ్రవులును, దంభ మను శల్యుండును, మిథ్యాదృష్టి యను దుశ్శలఁ గూడి పాషండ మను సైంధవుండును, మహామోహ మను దుర్యో ధనుండును, నాస్తికమను దుశ్శాస నుండును, మనస్సను శకు నియు, నహంకార మను కర్ణుండును, మత్సర మను వికర్ణుం డును తమతమ బంధుమిత్ర పరివారంబులతో వచ్చిన నెల్ల ఐ నయ్యె తెఱంగులఁబూజించి నిష్కామ మను ధర్మరాజు.

ఆ॥ మీ యనుగ్రహమునఁ జేయంగఁ గడఁగితి
నిమ్మహాధ్వరంబు నెమ్మితోడ
దీనినిందఱును ననూనంబుగాఁ బూని
పెంపు మెరసి నిర్వహింప వలయు. భారతము,

అని ప్రార్థించి వారల యనుగ్రహంబు వడసి యజ్ఞ దీక్షంబూనె. దానికి శమమను ధౌమ్యుఁడు హోతగా, ధారణమను యాజ్ఞవల్క్యుఁ డధ్వర్యుఁడుగా వేదమను వేద వ్యాసుఁడు బ్రహ్మగా, సామ ముద్గాతగా, నిధిధ్యాసమనునార దాదులు సదస్యులుగా, బ్రహ్మచర్యమను భీష్మాదులు సహాయు

లుగా, జగన్నాథ రక్షితంబై సర్వచేతనానందకరంబుగా నాయజ్ఞంబు చెల్లె. అంత నిదిధ్యాసుఁ డందు నిండియున్న గుణలోకంబునెల్ల నిరీక్షించి "సర్వాణిరూపాణి విచరత్య ధీరో నామానికృత్వాఽభివదన్యదాస్తే" సర్వరూపములనుసృష్టించి వాని వానికి సరిపడు నామము లొసంగి వానియందెల్ల వ్యాపించియుండు దేవుఁడు జగద్భరణంబుకొఱకు భూమి యందు జన్మించి మానవ సమూహంబు నడుమ తానొక మానవుండుగాఁ గూర్చుండియున్న నారాయణదేవుం జూచి యభిజన విద్యా ధనబల గర్వితులగు వీరెల్లరు భవిష్యద్వే దాంతవాద రణంబున నీతనిచే సమూలముగా నశియింపగల రని సంతసించుచుండె.

## నిష్కాముఁడు వాసుదేవుని పూజించుట

అప్పుడు బ్రహ్మచర్యుఁడు నిష్కాముం జూచి "యజాత శత్రూ! యీ యున్నవారియం దెవ్వఁడు "(య) ఇదంచ లోకం పరంచ లోకం సర్వాణిచ భూతానిచ యోఽంతరోయ మయ త్యేషత ఆత్మా" ఎవఁడు (ఏది) యీలోకము పర లోకము సమస్తమైన భూతముల యొక్క లోపల నిండి యున్నాఁడో అదియే ఆత్మ, యనునట్టు లెవఁడు జగద్గురుం డును, వేదమార్గసంచారుండును,ననంతగుణగణపరిపూర్ణుండును నగునో యట్టివాని నొక్కని నగ్రపూజితుంగాఁ జేయు మనవుడు. "అట్టివాఁ డెవ్వఁడు నీవ యాజ్ఞాపింపు" మనిన నతం డిట్లనియె.

సీ. రోదసీ కుహరంబు రుచిరాంశుతతిఁ జేసి
యర్కుండు వెలిగించు నట్టు లమృత
సందోహ నిష్యంద చంద్రికఁ జేసి శీ
తాంశుఁ డానందించు నట్లు సకల
జనులకుఁ దన్నదైన సదమలద్యుతిఁ జేసి
తనరంగఁ దేజంబుఁ దనుపుఁ దాన
చేయుచు నున్న సత్సేవ్యుండు పుండరీ
కాక్షుండు గృష్ణుఁ డనాది నిధనుఁ

ఆ. డబ్జనాభుఁ డుండ నర్ఘ్యంబునకు నిందు
నర్హు లొరులు గలెరె యజ్ఞపురుషు
నఖిలలోక పూజ్యు నచ్యుతుఁ బూజింపు
మధిప యదియ చూవె యజ్ఞఫలము.

— భారతము.

అనిన విని నిష్కాముఁడు పరమాత్ము నున్నతాసనమున నుపవిష్టుం జేసి యాప్తకాముని చేఁ దేఁబడిన యర్ఘ్యంబున శాస్త్రోక్త విధిం బూజించి,

కం॥ హవరూపివి హవనేతవు
హవభోక్తవు నిఖిలహవ ఫలాధారుఁడవుᳵ
హవరక్షకుండ వగునీ
కవిదిత మగు నుతులొనర్తు మయ్య ముకుందా॥

భాగవతము.

అని ప్రార్థించు చుండఁ జూచి సహింప నేరక చార్వాకుం డిట్లనియె.

## చార్వాకుఁడు నిష్కాముని నాక్షేపించుట.

నిష్కామా! ప్రజ్ఞాన సంపన్నులైన బ్రహ్మజ్ఞు లిండ నుండ నీచకర్ముఁడైన వీని నేమని పూజించితివి, బ్రహ్మచర్యుఁడు వృద్ధ (సనాతన) బుద్ధియగుట జ్ఞానశూన్యుఁడై జడ స్వరూపుఁడైన కృష్ణునిఁ బూజింపు మనినంతన పూజించి నీ యజ్ఞానం బెల్ల లకుఁ జూపితివి. వీని జ్ఞాన వృద్ధని పూజించితివా; వీనిఁ గన్న యుపనిషద్విద్య గలదు. సనాతనుఁడని పూజించితివా? బ్రాహ్మణప్రబోధులు గలరు. సగుణుండని పూజించితివా? పుట్టుకయే యెఱుఁగరాని పరిపూర్ణజడస్వభావుఁడు. ఇట్టి వీఁ డెఱుక మఱచి నీవు పూజించు చున్నను 'నా వంటి వానికిం దగివదా? యనియైన దలంపక తగుదు నని పెద్ద గద్దియఁ గూర్చుండి యిందఱిలో సిగ్గు విడిచి యీ పూజ నెట్లు గొనియె.'' ననుచున్న చార్వాకునిం జూచి నిష్కాముఁ డతని డగ్గరి "చార్వాకా! నీవంటి యున్నత గుణులకు వాక్పారుష్యము తగునా? యీతనిఁ గూర్చి పవిత్రతాపుత్రుఁడు సత్యమునే వచించె!

చ. ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పద మైనవాఁడు వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁ డైనవాఁడు లో
కాది త్రిలోక పూజ్యుఁడని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తమ కాకిది యేమి దోసమే?

— భారతము.

అని పల్కుచున్న ముక్తినేతను వారించి బ్రహ్మచర్యుఁ డిట్లనియె. "ఓరీ! వాచాటా! చార్వాకా! బుది

లేనివాఁడవై జగద్ధితుని పూజించుట తగదంటి వాయనంతుని యనంత తేజంబు నెఱుంగ నెంతటి వాఁడవు "బ్రహ్మా తం పరాదాద్యో అన్యత్రాత్మనో బ్రహ్మవేదా క్షత్రం తం పరాదాద్యో అన్యత్రాత్మనో క్షత్రం వేదా వేదాం స్థాం పరాదుర్యో న్యత్రాత్మనో వేదాన్ వేదా ఇదం బ్రహ్మ ఇదం క్షత్రం ఇమే వేదాః ఇదం సర్వం యతయమాత్మా" అను నట్లును మఱియు

కం. పూజితుల తృప్త లగుదురు
భూజను లొరు లచ్యుతుండు పూజితుఁ డగుడుం
దేజమున జగత్త్రితయముఁ
బూజితమయి తృప్తిఁ బొందుఁ బుణ్యసమృద్ధిన్.

— భారతము.

బుద్ధియును మనంబును పురుషుండును నవ్యక్తమగు ప్రకృతియు భూమియు చంద్రుండును సూర్యుండును నగ్నియు గాడ్పును దిక్కులును కాలంబును తానై జంగమ స్థావరాత్మకమైన సకలభూత ప్రపంచమును తన యోగమాయం జేసి ధరించిన పరమాత్ముని కృష్ణుని యోగసంపన్నులగు యోగులు తత్త్వదృష్టి నెఱింగి నట్లెఱుంగుటకు పాపస్వరూపి వగు నీకెట్లు సాధ్యమగును. కావున నీపాపాలాపంబులు గట్టిపెట్టి యూఱక యడఁచిపడక కూర్చుండు" మనిన చార్వాకుండు.

## నాస్తికవాదము

ఓహో హో హో! తెలిసినది వీఁడు పేరులేని పెద్దదై
ం వీరందఱు దైవజ్ఞులును? వీనియందు మానవాతీత దే
ఁములు లెన్ని గాన్పించుచున్నవి? వేదాంతసారమని
ల మ్రింగుటయందును, జడప్రకృతియను జవరాలి
ఁటయందును, కాలచక్రమను పూచిన బండి చక్రముని
మటయందును, నింద్రియములను గోవులఁ గాయుఁ
రుసు, నింద్రియాధ్యాత్మికశక్తులను గొల్ల మిటారులతో
సలుపుటయందునుఁ కాపాలికుఁడను జరాసంధుని కోఁ
ఁటయందును, నింక నిట్టి వెన్నియోగలవు. ఇవియన్నియు
క్తులై యగుంగావలయు! ఎంత మూఢులు. జ్ఞానమని
న మున దైవం బొక్కనిఁ గల్పించి లోకముని
ంచి బాధించు మూర్ఖులు మీరు. ఎక్కడి దైః
డి ప్రపంచము! వాయ్వగ్ని జల భూములను నాల్గు
ముల సంయోగ మున జీవంబును, వియోగ
మరణంబును సృష్టికి స్వాభావికంబై చెల్లుచుండ వీని
నీ దేవుఁ డుండి చేయున దేమి గలదు. అస్తియస్తి
వాపోవువా రిందెవ్వరేని యా యస్తినిఁ జూచితి నని
విప్పి చెప్పఁగలవారు గలరా? అన్నిటికిని శాస్త్రము
మని చివికిపోయిన తాటాకుల కట్టలం బట్టుకొని
తు రవియెవ్వఁడిచ్చె. మేఘములనుండి యూడిపడెనా?
ంగములారా! దేవుఁడు లేఁడు, శాస్త్రములు లేవు,
ులు లేవు, కర్మానుభవ మంతకన్నను లేదు. తుదకు

వాదించుటకొఱకు మాత్ర మేర్పడిన పరలోకంబును లేదు. ఇవియెల్ల దుష్టస్వాభిమానులచే పొట్టలు నింపుకొనుటకొఱకు కల్పింపం బడినవి. సుఖమే స్వర్గము, కష్టమే నరకము, మరణమే మోక్షము. కావున నీ ప్రత్యక్ష సత్యమును నమ్మి యసత్య పరోక్షమున కఱ్ఱులు చాపక సుఖ సంపాదనంబునకుఁ గడంగుఁడు " ఋణం కృత్వా ఘృతంపిబేత్. కంటికింపైన కాంతను గవయవలయు. కష్టలేడ్చునని యావులు చెఱువు నీటిం ద్రాగకుండునా ? " ఈ మర్మముల నెఱిఁగి మన యెఱుకలో లేని పరలోక సుఖముల నమ్మి యిహసౌఖ్యములఁ బాడుసేసికొనక సుఖింపు " డనిన.

## ఆస్తిక సిద్ధాంతము.

నిష్కాముఁడు " చార్వాకా ! యూఱక ప్రల్లదము లాడినంతన ఫలం బేమి. కర్తయొక్కఁ డక్కఱలేక భూతసంయోగముననే సృష్టికార్యంబు జరుగునేని " కధమసత స్సజ్జాయేత " అసత్తు నుండి సత్తెట్లు గలుగును? జడములగు భూతములకు సంయోగజ్ఞాన మెట్లు గలుగును. 'అది స్వభావం' బన్న స్వభావమునకు భిన్నభిన్న రూపములుగా పరిణమించు టెట్లు గలుగు? కావున కర్తయొక్కఁ డావశ్యకము. మఱియు శుక్తిలేని రజతభ్రాంతియు, రజ్జువులేని సర్పభ్రాంతియు, పటములేని వర్ణచిత్రరచనయుఁ గాని యట్లధ్యాత్మ స్వరూపంబగు పరమాత్ముఁడు లేక సృష్టి యుండ నేరదు. " రజ్జ్వజ్ఞానా ద్భాతిరజ్జౌ యథాహిః, స్వాత్మాజ్ఞానా

దాత్మనో జీవభావః ఆప్తోక్త్యాహి భ్రాంతి నాశేన రజ్జు ర్జీవో నాహం దేశికోక్త్యా శివోఽహమ్ '' ఎట్లు త్రాటిని తెలిసికొనక పోవుటచేత త్రాటియందు పాము కనిపించునో యట్లాత్మను తెలిసికొనక పోవుటచేత ఆత్మయందు జీవుఁడను బుద్ధి గలిగినది. స్నేహితుల వాక్యముచేత పాము భ్రాంతి నశించి నప్పుడు త్రాఁడు త్రాఁడుగా కనిపించినట్లు సద్గురుని యుపదేశమున జీవుఁడు నేను జీవుఁడను గాను దేవుఁడ నను కొనును. అట్టి పరమాత్మ స్వరూపమును దెలియఁజేయు నవియే వేదములు. వానిఁ గాదని నిందించుచు వేదబాహ్యుండవై పాపముఁ గట్టికొనకుము. యుగయుగాంతరముల నుండి యాత్యంతిక జ్ఞానసంపన్నులగు మహర్షులచేఁ జెప్పంబడుచు ననాది విజ్ఞానమై వచ్చు శాస్త్రమును మందబుద్ధివై స్వాభిమానంబున నిందించి నరకలోక గామివి గాకుము. "శ్రుతి స్మృతేచ మమైవాజ్ఞే ఉల్లంఘ్యో నైవ కర్హిచిత్ '' శ్రుతి స్మృతులు పరమాత్మునాజ్ఞ ననుసరించును. కావున పరలోక మున్నది. పరమాత్మ కలదు. నీపామర బుద్ధికిఁ దోఁచు క్షణికరూప సుఖానందంబుకన్న నాత్యంతిక శాశ్వత బ్రహ్మానంద సుఖంబు గలదు. అది నీవంటి నాస్తికులకుఁ గోచరింపదు. కారణమేమన దాని నేనాఁడును నీమలీమస బుద్ధికిఁ దాకనీయకుంటివి. లేదని నాస్తిక వాదంబుఁ జేసిన ఫలమేమి? నీ యల్పబుద్ధి కెఱుంగరానంత మాత్రమున నాసత్యమును బోకార్ప నీతరమగునా ? వృథా జల్పంబులచే మహాత్ముల మానసంబుల నొప్పింపక మిన్నకుండుము. బుద్ధిమంతుడ

వయ్యెద" వనిన చార్వాకుండు 'వృథా సత్యవాదీ! నిష్కామా! ఎంతటి యమాయికోపన్యాస మిచ్చితివి. శాశ్వతుఁడని నమ్మిన గుణరహితుఁడైన నీ పాలు బోతు దేవుని నిప్పుడహతుం జేతుచూచుచుండు" మని యానీచుండు జడమైన బాహ్యశరీరమునే దైవముగాఁ జూచుచు దాని నతికిన పరమాత్మ హతుండైనట్లుకా నమ్మి కృష్ణుని మీదికిం దుమికిన నతండు "సత్యస్యసత్యం" అను మహావాక్యమున నతని హతుంచేయ చార్వాకుఁడు పంచత్వంబు నొంది ప్రల్లదులకేని పరమాత్మతోడ నభేదంబ యను వాక్యమును దెలియఁ జేయుచు నాతనిం గలిసె.

ఇట్లు ప్రశాంత విఘ్నంబై యామఖము పరిసమాప్తి నొందిన యనంతరమున నిష్కాముఁడు సకలవిషయాగతులైన గుణబృందములను, కృష్ణపరమాత్మను బహుమానసత్కారములు గావించి యనుప, వారు భగవానుని లీలలను స్మరించుచు వారి వారి యునికిపట్లకుం జనిరి. మానసుండును మహామోహుఁడును మాత్రము ముక్తిసౌధమును గనుంగొన వలయునను వేడుకతో నక్కడన యుండిరి.

## మహామోహుఁడు ముక్తిమంటపమున పరాజితుం డగుట.

ఒక్కనాఁ డక్కల్లతేఁ డద్దివ్య భవనంబునఁ బ్రవేశించి దాని బ్రహ్మతేజంబున కచ్చెరువందుచు ప్రవృత్తి నివృత్తి రూప ద్వారద్వయముఁ గలిగి దుర్గుణ దుష్ప్రవేశ్యంబై తెరువఁబడియున్న నివృత్తిద్వారము మూయఁ

## నాస్తికవాదము

ఓహోహోహో! తెలిసినది వీఁడు పేరులేని పెద్దదైవము ను వీరందఱు దైవజ్ఞులును? వీనియందు మానవాతీత దేవ లక్షణములు లెన్ని గాన్పించుచున్నవి? వేదాంతసారమను వెన్నల మ్రింగుటయందును, జడప్రకృతియను జవరాలిం జంపుటయందును, కాలచక్రమను పూచిన బండి చక్రమును విఱుచుటయందును, నింద్రియములను గోవులఁ గాయుట యందును, నింద్రియాధ్యాత్మికశక్తులను గొల్లమిటారులతోఁ గోష్ఠి సలుపుటయందునుఁ గాపాలికుఁడను జరాసంధుని కోడి పాఱుటయందును, నింక నిట్టి వెన్నియోగలవు. ఇవియన్నియు దైవశక్తులె యగుంగావలయు! ఎంత మూఢులు. జ్ఞానమని యజ్ఞానమున దైవం బొక్కనిఁ గల్పించి లోకమును వంచించి బాధించు మూర్ఖులు మీరు. ఎక్కడి దైవ మెక్కడి ప్రపంచము! వాయ్వగ్ని జల భూములను నాల్గు భూతముల సంయోగమున జీవంబును, వియోగంబున మరణంబును సృష్టికి స్వాభావికంబై చెల్లుచుండ వీని నడుమ నీ దేవుఁ డుండి చేయున దేమి గలదు. అస్తియస్తి యని వాపోవువా రిందెవ్వఁడేని యా యస్తినిఁ జూచితి నని నోరు విప్పి చెప్పఁగలవారు గలరా? అన్నిటికిని శాస్త్రము శాస్త్ర మని చివికిపోయిన తాటాకుల కట్టలం బట్టుకొని చూపింతు రవియెవ్వఁడిచ్చె. మేఘములనుండి యూడిపడెనా? వెఱ్ఱిమొగములారా! దేవుఁడు లేడు, శాస్త్రములు లేవు, కర్మములు లేవు, కర్మానుభవ మంతకన్నను లేదు. తుదకు

వాదించుటకొఱకు మాత్ర మేర్పడిన పరలోకంబును లేదు. ఇవియెల్ల దుష్టస్వాభిమానులచే పొట్టలు నింపుకొనుటకొఱకు కల్పింపం బడినవి. సుఖమే స్వర్గము, కష్టమే నరకము, మరణమే మోక్షము. కావున నీ ప్రత్యక్ష సత్యమును నమ్మి యసత్య పరోక్షమున కఱ్ఱులు చాపక సుఖసంపాదనంబునకుం గడంగుఁడు " ఋణం కృత్వా ఘృతంపిబేత్. కంటికింపైన కాంతను గవయవలయు. కప్పలేడ్చునని యావులు చెఱువు నీటిం ద్రాగకుండునా ? " ఈ మర్మముల నెఱింగి మన యెఱుకలో లేని పరలోక సుఖముల నమ్మి యిహసౌఖ్యములం బాడుసేసికొనక సుఖింపు " డనిన.

## ఆస్తిక సిద్ధాంతము.

నిష్కాముఁడు " చార్వాకా ! యూఱక ప్రల్లదము లాడినంతన ఫలం బేమి. కర్తయొక్కఁ డక్కఱలేక భూతసంయోగముననే సృష్టికార్యంబు జరుగునేని " కథమసత స్సజ్జాయేత " అసత్తు నుండి సత్తెట్లు గలుగును? జడములగు భూతములకు సంయోగజ్ఞాన మెట్లు గలుగును. 'అది స్వభావం' బన్న స్వభావమునకు భిన్నభిన్న రూపములుగా పరిణమించు టెట్లు గలుగు? కావున కర్తయొక్కఁ డావశ్యకము. మఱియు శుక్తిలేని రజతభ్రాంతియు, రజ్జువులేని సర్పభ్రాంతియు, పటములేని వర్ణచిత్రరచనయుఁ గాని యట్లధ్యాత్మ స్వరూపంబున పరమాత్ముఁడు లేక సృష్టి యుండ నేరదు. " రజ్వజ్ఞానా ద్భాతిరజ్జౌ యథాహిః, స్వాత్మాజ్ఞానా-

దాత్మనో జీవభావః ఆప్తోక్త్యాహి భ్రాంతి నాశేన రజ్జుర్జీవో నాహం దేశికోక్త్యా శివోఽహమ్ '' ఎట్లు త్రాటిని తెలిసికొనక పోవుటచేత త్రాటియందు పాము కనిపించునో యట్లాత్మను తెలిసికొనక పోవుటచేత ఆత్మయందు జీవుఁడను బుద్ధి గలిగినది. స్నేహితుల వాక్యముచేత పాము భ్రాంతి నశించి నప్పుడు త్రాడు త్రాడుగా కనిపించినట్లు సద్గురుని యుపదేశమున జీవుఁడు నేను జీవుఁడను గాను దేవుఁడ నను కొనును. అట్టి పరమాత్మ స్వరూపమును దెలియఁజేయునవియే వేదములు. వానిఁ గాదని నిందించుచు వేదబాహ్యుండవై పాపముఁ గట్టికొనకుము. యుగయుగాంతరముల నుండి యాత్యంతిక జ్ఞానసంపన్నులగు మహర్షులచేఁ జెప్పంబడుచు ననాది విజ్ఞానమై వచ్చు శాస్త్రమును మందబుద్ధివై స్వాభిమానంబున నిందించి నరకలోక గామివి గాకుము. ''శ్రుతిస్మృతేచ మమైవాజ్ఞే ఉల్లంఘ్యే నైవ కస్యచిత్ '' శ్రుతిస్మృతులు పరమాత్మునాజ్ఞ ననుసరించును. కావున పరలోకమున్నది. పరమాత్మ కలదు. నీపామర బుద్ధికిఁ దోఁచు క్షణికరూప సుఖానందంబుకన్న నాత్యంతిక శాశ్వత బ్రహ్మానంద సుఖంబు గలదు. అది నీవంటి నాస్తికులకుఁ గోచరింపదు. కారణమేమన దాని నేనాఁడును నీమలీమస బుద్ధికిఁ దాకనీయకుంటివి. లేదని నాస్తిక వాదంబుఁ జేసిన ఫలమేమి? నీ యల్పబుద్ధి కెఱుంగరానంత మాత్రమున నాసత్యమును బోకార్ప నీతరమగునా ? వృధా జల్పంబులచే మహాత్ముల మానసంబుల నొప్పింపక మిన్నకుండుము. బుద్ధిమంతుడ

వయ్యెద" వని చార్వాకుండు 'వృథా సత్యవాదీ! నిష్కామా! ఎంతటి యసమాయికోపన్యాస మిచ్చితివి. శాశ్వతుఁడని నమ్మిన గుణరహితుఁడైన నీ పాలు బోతు దేవుని నిప్పుడహతుంజేతుచూచుచుండు" మని యానీచుండు జడమైన బాహ్యశరీరమునే దైవముగాఁ జూచుచు దాని నటికిన పరమాత్మ హతుండైనట్లుకా నమ్మి కృష్ణుని మీఁదికిం దుమికిన నతండు "సత్యస్యసత్యం" అను మహావాక్యమున నతని హతుంచేయ చార్వాకుఁడు పంచత్వంబు నొంది ప్రల్లదులకేని పరమాత్మతోడ నభేదంబ యను వాక్యమును దెలియఁ జేయుచు నాతనిం గలిసె.

ఇట్లు ప్రశాంత విఘ్నంబై యామఖము పరిసమాప్తి నొందిన యనంతరమున నిష్కాముఁడు సకలవిషయాగతులైన గుణబృందములను, గృష్ణపరమాత్మను బహుమానసత్కారములు గావించి యనుప, వారు భగవానుని లీలలను స్మరించుచు వారి వారి యునికిపట్లకుం జనిరి. మానసుండును మహామోహుఁడును మాత్రము ముక్తిసౌధమును గనుంగొన వలయునను వేడుకతో నక్కడన యుండిరి.

## మహామోహుఁడు ముక్తిమంటపమున పరాజితుం డగుట.

ఒక్కనాఁ డక్కల్లరేఁ డద్దివ్య భవనంబునఁ బ్రవేశించి దాని బ్రహ్మతేజంబున కచ్చెరువందుచు ప్రవృత్తి నివృత్తి రూప ద్వారద్వయముఁ గలిగి దుర్గుణ దుష్ప్రవేశ్యంబై తెరువఁబడియున్న నివృత్తిద్వారము మూయఁ

బడి యున్నట్లును, మాయఁబడియున్న ప్రవృత్తిద్వారము తెరువఁబడి యున్నట్లునుఁ దోఁచిన. నాప్రవృత్తిద్వారమునఁ బోఁబోవ నదియొంతయుం దాకి బాధనొంది,యామీఁద వృత్తి రూప తరంగరహితంబై నిశ్శబ్దంబుగానున్న సాత్వికమయం బైన చిత్తసరోవరమును జలమయం బని వగచి యందుఁ బోక వృత్తిరూప తరంగ సహితంబై తామసజల పూరితంబై యున్న చిత్తసరోవరమును జలరహితం బనియునెంచి "పరత్ర పరావభాసం" యనునట్లందుఁ బోయి కూలఁబడి దిక్కు దోఁచక తల్లడించు చున్నం జూచి విద్యయు కామపంచకం బును నవ్విన లజ్జితుండై శిరంబువంచి యెవ్వరికిం జెప్పక మనస్సును గూడి యాత్మపురంబున కరిగి యాత్మయజ్ఞ వైభ వంబును ముక్తిసాధ సంపదయుఁ దన కత్యంతాసూయా జన కంబై దహింపం జొచ్చిన సర్వసుఖోప భోగంబులకు వెలియై దుఃఖించు చున్న తామసరాజుంజూచి మనస్సిట్లను. "తండ్రీ! మహామోహా! నీ యీ పరితాపంబునకుఁ గారణం బేది! నేను మనియుండ నీవింత వందురం బనియేమి యెఱిఁగింపు" మన, మిథ్యాకల్పనుఁడు, "మామా! నీవునుఁ జూచితివి గదా ? యా కైవల్యసభను. అట్టి దెందైనఁ గలదా ? అది కోరిన భోగముల నెల్లఁ గూర్చుటంజేసియె నిష్కాముఁడు నేఁటి కింత మహానుభావుం డయ్యె. దీన నతని తేజ మెల్ల దిక్కుల వ్యాపించె. అందఱు విషయాధిపతుల ముందు మాయావి యగు కృష్ణుఁడు పుణ్యాత్ముఁడైన చార్వాకుని

సత్యమును వెల్లడించిన యందులకై చంపుచుండ నతనికి మోమోడి యెల్లవారును జయజయ నాదములు వెట్టిరిగాని, తగదని దండింపరైరి గదా ? శాంతేయు లైశ్వర్యవంతు లగుటకు సహింపనోప. మానధనులగు ప్రభువులు జ్ఞాతుల యున్నతి కోర్తురె. యేమి సేయుదు. వారి సంపద నెవ్విధంబున నెడిచికొనఁ గల్గుదు '' ననిన మనస్సిట్లను.

## మానసిక దుష్ప్రబోధము

" దీనికి మీతండ్రి యనుజ్ఞఁగొనుము. నీ కోరిన నట్లంతయు లభింపఁ జేతు '' నని యతనిఁదోడ్కొని జీవుని కడకుం జని " బావా ! నీకొడుకు కృశత్వంబును బరికించితివా! '' యనిన నులికిపడి కుమారునిస్పర్శించుచు "కుమారా కర్మరాజ్యంబంతయు నీకవగతంబై యున్నది. ఇంద్ర భోగములు మనకుఁగలవు. సకల విషయాధిపతులును వశంగతులై యున్నవారు. నీవిట్లడలుటకుఁ గారణంబే''మనిన దుత్తారముసామి " తండ్రీ ! పంచకామ విభవం బాఖండల వైభవముసకంటె మిన్నయై యున్నది. సర్వక్షేత్రములను సత్కాముఁడు వశ్యంబులుగాఁ జేసికొనియె. సమస్తంబును వారి స్వాధీనము. నేను సాటిక్షేత్ర పాలక సుతుండనై యుండి యా వైభవంబెట్లు సూడనోపుదు. నాఁటి యాత్మ యజ్ఞమున నతని నిహలోక వాసులును, బరలోక వాసులును నెంతయుఁ బూజించిరి. అవియన్నియుం జెప్పి నాలుకఁ జెరుపనోప ''నని యేచ్చుచుండినఁ జూచి యాకల్మషప్రభువు నూదార్చుచు మనస్సిట్లను.

"కుమారా! దుఃఖింపకుము. మాయావాదంబున శాంతేయుల నోడించి వారి సంపదలెల్ల నీస్వాధీనమొనర్చెద. నిష్కాముఁడు తత్త్వవాదంబునకు ప్రియుండేకాని యందలి మాయమర్మముల నెఱుంగఁడు నేను మాయావాదమున సిద్ధహస్తుండ నగుటంజేసి యనాయాసంబుగా నతని నోడించి వారి యోగసంపద నంతయు నీ పాలొనర్తు వగవకుండుమన్నా! యన్న మహామోహుఁడు తండ్రిపాదముల పయింబడి "మాయ మతమున కోడంబడు" మని ప్రార్థించిన జీవుఁడు "తండ్రీ! సద్విచారుఁడు సర్వనీతి కోవిదుఁడును, మీ యుభయపక్షముల క్షేమముఁ గోరువాఁడును నోట నతనితో విచారింత" మన తవలిదార "సద్విచారుఁ డెప్పుడును శాంతేయపక్షపాతి,మనస్సు జేయుమాయల కతం డెప్పుడును నొడంబడఁడు నీవ దీని కాజ్ఞ యిమ్ము కాదేని తృష్ణాగ్నికిం జిక్కి ప్రాణంబులు విడుతు" ననిన జీవుఁడు దుఃఖించి కొమరున కానందంబు సేకూరునట్లు ముక్తిమంటపమునకుఁ బ్రతిగా నతివిచిత్ర ద్వార శతంబులతో నొప్పారు రక్తిమంటపం బను దాని నిర్మింపంజేసి యొక్కనాఁ డేకాంతమున సద్విచారునకు మహామోహ మనస్సుల యభిప్రాయం బెఱింగించిన, సద్విచారుఁ డాశ్చర్యపడి కలి రానున్నది. వీరు సేయనెంచిన వితండవాదం బఖిల గుణక్షయ కారణం బగునని యెంచి జీవునితో నిట్లనియె. "అన్నా! చెడ్డతనం బనక మత్సరమున బిడ్డలతో బిడ్డల కేల భేదంబు సేయం దలపెట్టితివి. వారును వారెట్లు కలిసి మెలంగెద రట్లు సేయవలయుంగాని కలహంబునకు మూలంబైన వాదం

బొడుట యెంత శాంత బుద్ధులకేనిఁ దగదు. "భేద ప్రతీపత్తేశ్చ సంసారగమనం దర్శయంతి, అభేద ప్రతిపత్తేశ్చ మోక్షం దర్శయంతి" భేదదృష్టివలన సంసారగమనమును యభేదదృష్టివలన మోక్షగమనమును గలుగును కావున నీ శక్తిగలంత వట్టును వీరిదుష్టప్రయత్నం బుడిపి మనవంశమును రక్షింపు" మనిన జీవుఁడు "ప్రేమవాదమాడి నంత మాత్ర మున బిడ్డలకేల విభేదంబు గలుగు. అందు నీవును నేనును బ్రహ్మచర్యుండును గలుగ నట్టిభయం బెట్లు సంభవించు. వీరి వాదంబు కలహకారణంబు గాదు. విజ్ఞాన దోహదంబ యగు కావున తమ్ముఁడా! యూఱక సందేహింపక దీని కొడంబడి వేగమ విదేహంబున కరిగి నిష్కాముఁ దోడితెమ్మని పంచిన నతండు విదేహమున కరిగె.

## జీవుఁడు రక్తిమంటపమున మహామోహానునితో మంతన మాడుట

ఇట జీవుఁడు తనచే నిర్మింపఁబడిన రక్తిమంటపమును సేగితేనికిం జూపి యేకాంతమున "కుమారా! భేదము నాపాదించు వాగ్వాదంబిది తగదు. దీన మీకకాక సకల గుణంబులకును క్షయముగల్గు. కావున యెప్పటియట్ల వారును మీరును పరస్పర ప్రేమంబుల నుండుట కార్యము. శాంతేయ లక్ష్మి నీకేల సహింపరానిదయ్యె. వంచనమున పరశక్తులఁ గొనుట మహాపాపంబగు. పాపుల కాత్మధర్మములు నిలువవు. ఆత్మానాత్మ వినిర్ణయుండగు సద్విచారుఁ దీని కొడఁబడఁడు.

నాయనా ! నామాట వినుము ? నన్ను డికింపకుము. నిష్కాము సంపదకంటె నైదురెట్లెక్కుడు దివ్యసంపద నీకుం గలదు. దాని యజ్ఞంబునకంటె నెక్కుడుఁగ నధికత్యాగ దక్షిణలతో నీ కిష్టంబైన యజ్ఞంబొనర్పుము. నీకును గుణలోకము తమసర్వస్వము నొసంగు" ననిన మహామోహుఁడు "తండ్రీ! నిష్కామునితో వాదమాడుటయే నాకు సర్వయజ్ఞములును, నాటి ముక్తిమంటపమునఁ గలిగిన పరాభవంబును, విద్య జూపిన యవినయంబును హృదయశల్యమువలె నిలిచియున్నవి. విధి నియమం బేమనవచ్చు, ఘనులు హీనులైరి, హీనులు ఘనులైరి. జనకా ! పగవారి గర్వోన్నతిం జూచి యెట్లు సహింపనేర్తు. ఇంక మనమూఱకున్న శాంతేయ దివ్యశక్తి మహావ్యాధియుం బోలె మనల మొదలంట నున్మూలించు. కావున నేవిధంబుననైన దాని నపహరింపన వలయు" ననుచుండ మనస్సు "పరివారము లేవియుఁ జెదరకుండ యొక్క రక్తబిందువేని చిందకుండ పగవారి బ్రహ్మశక్తుల నొడిచి యిత్తు వగవకుము. వేగమ ప్రియపూర్వకముగ వారిం బిలిపింపు" మనిన జీవుఁడు.

## జీవుఁడు మనస్సును నిందించుట.

"నేను దీనికొడంబడ సద్విచారు నాజ్ఞం బ్రవర్తిల్లెదఁ 'అతఁడీ వాదమువలన విరోధంబు తప్ప' దనియెఁ బలవద్విరోధంబు కూడదు. నాయనా ! నామాట విని నన్ను దుఃఖముల పాలుసేయక యెప్పటియట్ల సుఖంబుండుఁడు. ఓయీ ! మనసా ! నా యీ యాత్మసామ్రాజ్య పతనమున కంతకు

నీవ కారణుఁడ వగు చుంటివి. కర్తవ్యా కర్తవ్య ముల నెఱుంగక సంచరించు బిడ్డల దుర్విషయములఁ బ్రవర్తింపంజేసి నన్నును వారిని తీరని దుఃఖముల పాలు సేయు చుంటివి. ఇంకనైన కొమరుని దుష్కృత్యముల వైపునకుఁ బ్రేరేపింపక సుఖం పడనిమ్ము. నమస్కరింతు. గృహామునఁ జేరి గృహనాశకుఁడవు గాకు" మన్న మహామోహుఁడు "తండ్రీ! మన క్షేమమునుగోరి యీ సామ్రాజ్య భారము నంతటినిఁ దనపై నిడుకొని నీ నానిర్వహణమున కగు నెంతటి దుర్ఘట కర్మలనైతము మనవశమొనర్చుచున్న మామ నిట్లనఁ దగునా? ఆతండు లేనినాఁడీ సువిశాల కర్మక్షేత్రమున యేకించి త్కర్మయేని ముందునకుసాగునా! మామయందలి మహామహిమ నెఱుంగక మాటలాడుచుంటివి. మన పాల కత్వము సుప్రతిష్ఠిత మగుటకు కారణ మతఁ డనుకొనుము. ఆతఁడు లేనివాఁడు నీ నాయునికియే శూన్యముకదా?" యని పల్కిన జీవుఁడు "కుమారా! నీవెన్ని చెప్పినను సద్విచారుని శాసనమున వర్తింతుఁగాని యల్పబుద్ధులరగు మీ యాలోచనంబులకు సమ్మతింప" నన మహామోహుఁడు "తండ్రీ! యొక్కని యిష్టముతో తన కార్యంబు నడుపుకొను వెఱ్ఱి కలఁడా? అన్యుని యభిప్రాయంబును తన యభిప్రాయంబును నెన్నఁడేని యొక్కఁడగునా? సద్విచారుఁ డెప్పుడును శాంతేయ పక్షపాతి. వానిని మన యాప్తవర్గంబునఁ జేర్చుట నీతిగాదు. అదియునుంగాక వాదమను జూదము 'ద్యూతం ఛలయతాం' జూదమాడఁబడుఁగాక యని స్మృతులయందును

గలదు. కావున దానియందే దోషమును లేదు. ఇట్టి ప్రేమ వాదంబున సాయుజ్యసంపదయుఁ బొందుదురఁట. వేగమ దాని నడుపుటకు మనస్సున కాజ్ఞయిచ్చి నిష్కాముని టకు రావింపు'' మనిన జీవుఁడు పెద్దయుం బ్రొద్దు విచారించి యెట్టకేల కొడం బడి సద్విచారునిఁ బిలిచి 'తమ్ముఁడా! నేనొక్క వినూతన రక్తిమంటపమును రచియింపం జేసితి. నిది—

చ॥ అనుపమ రత్నకాంచన చయాచింత మీసభ దీనిధర్మనం
దనుఁ డనఘుండు దానుఁ దనతమ్ములు విందులకేగుదెంచి చూ
చినఁ గడుసంతసంబగు విశిష్ట జనస్తుత నీవు వానిఁ దో
డ్కొని చనుదెమ్ము భూసురసఖుఁ బుధబంధుజనానురంజనుఁ

— భారతము.

అనిన విని సద్విచారుఁ డన్నకు "మాయావాదంబు మతిమంతుల త్రోవగా'' దని యనేక విధంబుల బోధించియు వినకున్న విషణ్ణ హృదయుండై విదేహ కైవల్యమునకుఁ జని యందు నిష్కాముఁ బొడగాంచి యతనిచే సత్కరింపఁబడి తన వచ్చిన కార్యం బెఱింగించిన, నిష్కాముఁడు "తండ్రి యంతటివాఁడు మామీఁది ప్రేమవాత్సల్యమున నీయం తటి మిత్రుని మమ్ముఁదోడ్కొనిరాఁ బుత్తెంచె. ఇంతకన్న గానున్న దేమిగలదు. అంతటి మనోహరాపూర్వ మంటపమును దిలకింప వచ్చుఁగాని యందు సుహృద్వా దము నడుపఁ దగునా! దాన మాలో నంతర్వైరములు సంఘటింప కుండునా? అయినను తండ్రీ! నీ యాజ్ఞ మా కనుల్లంఘనీయము. ప్రభుని యాజ్ఞ దాటరానిది.'' అని

యప్పుడ పురాకృత కర్మప్రేరణమున నిష్కాముఁడు విదేహ మును విడిచి తమ్ములును విద్యయు శమమును పరివారమును వెంటరా సద్వివేకునిఁ గూడి కర్మదేహమునకు వచ్చి యందలి బంధువులతోఁ నా రాత్రిఁ గడపి మఱునాఁటి సూర్యోదయమున.

## నిష్కాముఁడు మనస్సుతో వితండవాద మాడుట.

జీవనిర్మాణమైన రక్తిమంటపమున పుత్రశత పరివృతుండై జీవుండును బ్రహ్మచర్య బ్రాహ్మణ యజ్ఞ ప్రబోధ మనోహంకార పాషండ ధర్మార్థ కామ సద్విచార శమ శాంతేయాదు లెల్లఱును సుఖాసీనులై యిష్టకథాగోష్ఠినున్నంత, దుర్గుణ ప్రభువు నిష్కాముఁజూచి "అన్నా! నీవు తత్వవాదంబున సమర్థుండవును నభిమతంబుఁ గలవాఁ డవును నని విందు. కావున ప్రోద్దుపోకకు నిందు సుహృద్వాదంబునకుఁ గడంగుదమా?" యనిన నిష్కాముఁడు నిరాకరణంబును వితండ వాదంబును నాత్మజ్ఞులకుఁ దగని పనులు. కేవల పాప రూపములును, కుటిలబుద్ధులగు వారితో వాదంబు సేయరాదు. దానివలన నెంతటి యాత్మజ్ఞులైనను విజ్ఞాన ధర్మములఁ గోలు పోవుదు" రన మనస్సు "నిష్కామా! వాదవిద్యా నిపుణుండును, బుద్ధిమంతుడును నగు వాఁడెవ్వఁడును దీని నిందింపఁడు బలహీనులు బలవంతుల నోర్చునవు డనేక యుక్తులం బన్నెదరు, విజయమేక దాయేరికిం గావలసినది. కావున వాదమునకు నీకుభయమైన మాను" మనిన నిష్కా

ముఁడు "బలవద్వాదమునకుఁ బిలువంబడి మరలిపోవచ్చునా?" యని వితండవాదమున కనువగు మిథ్యాప్రమాణ వాక్యములను పాచికల నమర్చుకొని యున్నమనస్సు మొదలగు దుష్టులం జూచి "మీలోనెవఁడు నాతో వాదించు వాఁ" డన సేగి సామి "నాకై మామామ మానసుండు వాదించు, అతఁ డోడిన సమస్తమునుఁ గాదనక నేన యిచ్చెద" నన నిష్కా-ముఁడు తనకుఁగల శాస్త్ర నియతములైన శమదమాదులను, వివేకమును మిథ్యా రూపములని నిరూపించినచో వారికి విడుచునట్లు పణంబొడ్డిన, మానసుఁడు మిథ్యాప్రమాణ వాక్యములను పాచికల దొర్లించుటయను వాదమున నొక్కొక్కటిఁగా నిష్కాముని సర్వస్వమును నోటువరిచినఁ జూచి సహింపనేరక సద్విచారుఁడు జీవునితో నిట్లనియె.

## సద్విచారుఁడు మిథ్యాకల్పుని నిందించుట

"అన్నా! నీచుఁడగు నీకొమరుని యపచారములచే ననేకోత్పాతంబులు పుట్టుచున్న యవి, సనాతనముగా పవిత్ర రూపమైవచ్చు నీవంశము నీపాపి కారణమున నేలపాపభూయిష్టంబుఁ జేసెదవు. ఆత్మనాశకుండగు వీనినొక్కనిం జంపి నీవంశమును క్షేత్రమును కాపాడుకొనుము. ఒక్కనక్కనిచ్చి యైదు సింగంబులఁ గొనుట యుఱువుగాదా? ఇంకనైన నీ దుష్టవాదం బుపసంహరింపఁ జేయింపు" మనిన జీవుఁడు పుత్రస్నేహమున నేమియుం జేయనేరక వినని యట్లు యూఱకుండిన నూర్వక సద్విచారుఁడు మహామోహునిం జూచి "దుష్టమతీ!

మహామోహా? పాపబుద్ధివై పంచకామ సర్వస్వము నిట్లు మాయావాదమునఁ గొన్న యీసంపద నీకు జీర్ణించునా? ఈ మిథ్యా విజయంబునకు గుణోత్తములు ఛీ యనకుందురా? ఇది నిశ్శ్రేయస మార్గంబుగా దుడుగు" మనిన పొల్లుకేడు "నిలచినయింటికి కపకారంబుఁ దలంచుచు నెల్లప్పుడును పరుల గుణములనె పలుమాఱుఁ బొగడుచు వారిపక్షంబులఁ గూయు చుందువు. మమ్మెప్పుడునుఁ దిట్టుచుందువు. నీవు మాకడ నుండుట యూరువున విషారంగంబు చేరినట్లున్నది. వ్యావహారికులకు కష్టమెఱుఁగకుండ పరుల సంపదలఁ దెచ్చికొనుట ధర్మముకాదా? ఇంక నెన్నఁడుఁగాని నన్నుఁగూర్చి యిట్టు లట్టులని చెప్పరాకుము. నీదారిని నీవుండుము. నీబుద్ధులతో మాకుఁ బనిలే"దనిన సద్విచారుఁడు "తండ్రీ! యెవ్వరును ముఖస్తుతులు సేయువారినే మెత్తురుగాని నిజమాడు వారి మాటల విననొల్లరు. బహుపుత్రవంతుడైన జీవునకుఁ గూర్చు వాఁడనౌట దీననెంతయు ననర్థంబువాటిల్లు నని యింతగాఁ జెప్పుచుంటిఁగాని వేరుగా" దని యూఱకుండె.

## నిష్కాముఁడు వితండ వాదమున సర్వము నోడుట.

మానసుఁడు నిష్కాముని జూచి "కైవల్యాపతీ! నీ వశమున నున్న సంపదలనెల్ల నోడితి వింక నేమి యొడ్డెద" వనిన 'నాప్తకామంబు గల' దని యొడ్డె 'నది మిథ్య' యని నిరూపించె. 'సత్యకామంబు గల' దనియె 'నదియు నట్టి' దనియె. 'సత్కామముఁ గల' దనిన 'నదియును

మిథ్యామాత్రంబె ' యని నిరూపించె. ' వేదకామంబున్న ' దన్న ' వేదంబులె శూన్యంబులై యుండ కామం బెక్కడిది ' దనియె. ' నిష్కామమగు నేనుంటి ' నన ' గుణరహితత్వ మును భోధించు నీ యునికియే శూన్య ' మని నిరూపించె. ఆ మీద ' విద్యగల ' దనిన " మాబోంట్ల కెవ్వరికిని కన రాక యనిర్వచనీయంబై మీ వంటి హుళక్కి పలుకుల వారికడ మాత్ర ముండు దానియునికి నెవ్వరు గొందు" రని చూపె. ఇట్లు వాదోపవాదంబులు నడుపుచు నధ్యాత్మ విద్య లన్నియు మిథ్యారూపంబులని వాదించి విజయము నొందిన మనస్సునకు తమ్మునెల్లఱ నోటువడి పురాకృత కర్మప్రేరణ మున బుద్ధి ప్రుంగుడునడి దేనిని గాదని నిరూపింప నేరక విషణ్ణాననుండై మిన్నకున్న నిష్కామునిఁజూచి సభామధ్యమున సుగుణాలంకారులై కూర్చుండి యున్న బ్రహ్మచర్యాదులును తత్కాల జనిత సంభ్రమంబులతో నెద్దియుం బలుక నేరక చెమ్మటలు గ్రమ్మిన శరీరంబులతో నిశ్శబ్దంబున నుండిరి. సద్విచారుఁడు మొగమువంచి తనయునికి నే మఱచి దుఃఖించు చుండె. దుష్టచతుష్టయం బత్యంతానందంబున నొకరినొకరు చూచుకొనుచు నవ్వుచుండిరి.

## సద్విచారుఁడు మహామోహునిఁ దిట్టుట

ఇట్లు దబ్బరసామి పంచకాములఁ దనకు దాసులుగాఁ జేసికొని 'దాస్యంబుసేయ విద్యం గొనిరమ్మ'ని సద్విచారున కాజ్ఞాపించిన నతండు 'మహామోహా! నీవంటియజ్ఞులు

ప్రపంచమున నుండరు. బాహ్యసంచార మెఱుఁగక మహా మహుల హృదయసీమల నానందమున నోలలాడించు నీ మహావిద్య యనాద్యజ్ఞాన పరీత మలీమస హృదయులగు మీ కడఁ బ్రవర్తిల్లఁ గల్గునా? మూఢా! నేనును విజ్ఞుఁడ నను కొని ప్రల్లదములాడకు నీవిజ్ఞానమంతయు నానురీబుద్ధి సంభ వము. ఈ సద్విద్యను నీయందలి యవిద్యకుఁ బొత్తుసేసి విద్య నాయింట నున్నదని లోకంబునకుఁ జూపనెంచుచుంటివి. నీ స్వాభావికాజ్ఞానావరణంబుచేత దీనిని నీస్వాధీనంబుగాఁ జేసికొన నేరవు. అదినీస్వాధీనముకానిపని. అదిసత్పురుషసేవ్యము. నీవంటి దుష్టవర్గము నంతటిని సమూలముగా నంత మొందింపఁ బుట్టిన ప్రళయకాళి యామె 'మఱియు నోనీచా! నీవంటిమాయావితన మాయాబలంబున నొడిచిన తేబుస్సంపదపూర్వాల్పతేజంబుతోఁ గూడి సర్వనాశంబునొందు, మూఢా! జడబుద్ధివై మారకులని యెఱిఁగి యెఱిఁగి శాంతిపుత్రులఁ గోపింప జేయుచుంటివి. ఈ నీచవాదమున నీనాశంబు దప్పదు. వెమరునఁ వెన్నునుం బోలె నిది సర్వనాశనంబునకుఁ గారణంబగు'' ననిన నతనిం దిట్టి పాపప్రభువు తనకింకరు జగన్మిత్యదృష్టి యను ప్రాతిగామిం బిలిచి "విద్యందోడ్కొని రమ్మ''ని పంచిన నాతఁడు విద్య కడకుఁజని "నిష్కాముఁడు మారాజుతో వాదమాడి తమ్ము లను తనను నిన్నును సకలశక్తులను నోడె, కావున నిప్పుడవి యన్నియు స్థూలపురాధీశ్వరుండు తనస్వాధీనముఁ జేసికొనుచు నిన్నుఁగొని రమ్మనిన వచ్చితి'' ననిన విద్యాదేవి దీనహృద యయ్యె యిట్లనియె. "ఎన్నడేని యెంతటి మహావాదియేని

విద్యను పణంబుగా నిడినవారుగలరె, నాథుఁడిట్లు సేయవలసె. ఏమందునో కింకరా! యీ జ్ఞానవాది తన్నోడి నన్నోడెనో? నన్నోడి తన్నోడెనో? నీవెఱింగిన జెప్పుము. లేకున్న నావాది నడిగివచ్చి నన్నుఁ దోడ్కొని పొమ్మన జగన్మిథ్యా దృష్టి మరలివచ్చి నిష్కామునడిగిన నతండు మాయావాద పరాజయ పరిత్రస్త హృదయుఁడగుట వానికి సమాధాన మీకున్న కింకరునితో మహామోహుఁ డిట్లను.

## నాస్తికుఁడు విద్యను పట్టితెచ్చుట.

"ఇంతటి సందిగ్ధ ప్రశ్నము నీ యున్న పెద్దల సన్నిధి యందు నిర్ణయించుకొన వచ్చు నిచ్చుటికే రమ్మను" మని పంపిన నతం డరిగి "నీ యడిగిన ప్రశ్నమును నిర్ణయింప సభికులు నిన్నచ్చుటికి రమ్మని" రన విద్యాదేవి సాత్త్వికై కావరణయు, దుఃఖబిందు సందోహ సంసిక్త పరిధానయు నగుచు నా సేవకు వెంట సభకుఁ జనుదెంచి జీవ సమీపంబున నుండె. ఆ యమం జూడనోపక లజ్జితులై దుఃఖించుచు తలలు వంచియున్న కామపంచకమును చూచి సంతోషించుచు దుర్గుణప్రభువు తమ్ముని నాస్తికునిం బిలిచి 'నీవు బోయి విద్య నిక్కడికి దె' మ్మనినఁ దన్నుఁ బట్టవచ్చు మహాపాపియు నిర్దయుండును నగు నాస్తికుం జూచి విద్య మిక్కిలి భయంబుఁగొని బుద్ధి చాటున కరిగి యొదిగియుండ వెనువెంటన పరువెత్తి నాస్తికుఁడు "కులటా! యింక నెక్కడికి పోగల్గెదవు నిన్ను వాదమున మనస్సు గెలిచె, ఇంక మా యున్న దానవైతివి. నీభర్తలు నిన్నునుఁ దమ్మును సమస్తమును మాకు

నోడి '' రని చెప్పుచు నాపెం బట్టబోవ '' నీచా! ముట్టకుము'
ఏకావరణను. గురుబాంధవగుణజుష్టం బైన సభకునెట్లు రానేర్తు''
నన ' నీవు సావరణవైననేమి నిరావరణవైననేమి తోడ్కొనియ
పోదు ''నని నాస్తికుండాయమకుం గానరాక వెనుకం బడి
యున్న యజ్ఞానావరణమను శిరోజములం బట్టి (దుర్బుద్ధు
లకుం గోచరించి వారికిం జిక్కిన దిట్టి యజ్ఞానాంధ కారావర
ణమే) సభామధ్యమున కీడ్చి తెచ్చిన, మహాదీనయు పరిత్రాణ
శూన్యయునై విద్యాదేవి యహంకారాది దుష్టపాలితంబైన
సభకువచ్చి కోప లజ్జాపరవశయై యిట్లనియె.

## విద్యావిలాపము

ఓసుగుణ వృద్ధులారా! మీరెల్లను నాత్మా నాత్మ
నిర్ణయస్వరూపులుకారా? నిత్యానిత్య వస్తువివేకము మీకు
లేదా? ఇంతటి యన్యాయ ప్రవర్తనమున నీనీచుండు నాస్తి
కుండు నన్నింత యలమటం బొందించుచుండ చూచుచు
నట్లూఱకుంటిరేల? కాలవశంబున నన్నాదరించువారు కదల
లేకున్నంత మాత్రమున మహాపురుష సంసేవ్యనై యొప్పు నే
నిట్టి నాస్తికుల చేతంబడి నశింపవలసినదేనా? వీనిని దండిం
పరా? సద్గుణాలంకారులమని సభల నలంకరించిన మీరెల్ల
ఱును మహామోహుని పరివారమేనా? మీ సనాతనమను
వార్ధక్యములు వల్లకాడొనర్చితిరా? మీ సర్వజ్ఞత్వములు
సమసిపోయెనా? మీయస్తినాస్తి వాదంబు లిప్పుడేమైనవి?
సర్వమును శూన్యమేనా? జగద్భరణమైన సత్యములేదా?

కర్మసాక్షి శూన్యమయ్యెనా ? వేదములు వాదమాత్రము లేనా ? కాదు—సత్యము కలదు—కర్మసాక్షి యున్నది—దుష్కర్మము దుఃఖఫలము నీయకమానదు — వీరెల్లఱు మూలముట్టుగా నశింపకతీరదు—ధన్యుండగు నా ప్రభువు, ముక్తిసాధవిహారి. యవిముక్తనిలయుఁడు, నిష్కాముఁడు దైవ యోగమున నిప్పుడిట్లపగత తేజస్కుఁడైనను బ్రహ్మపథము నుండి పతితుఁడు గాఁడు తండ్రీ ! పరమాత్మా ! కాపాడుము. ఈ దుర్గుణపశువుల దహింపుము—ఈ నాస్తికులకు నీయునికిని జూపుము—ఓలోక కల్యాణా ! నీవులేనినాఁడు లోకంబులు లేవు—లోకేశులులేరు — లోకస్థులు నాస్తి— సర్వమును శూన్యమేయగును. ప్రభూ ! నీయునికి నీయున్నదియే తెలియఁ జేయుచున్నది. నీశక్తిం జేసి వాయువు వీచుచున్నది— అగ్ని వెలుఁగుచున్నది—సూర్యచంద్రులు ప్రకాశించుచున్నారు—సర్వమును చలించుచున్నది — జడచేతనములు జ్వలించుచున్నవి. "వ్యోమవత్సర్వ భూతస్థ భూతదోషైర్వివర్జితః" సర్వభూతముల యందు నాకాశమువలెనే యణువు మొదలు బ్రహ్మాండమువరకు నంతర్విలీనుఁడవై యుండి భూత దోషముల కేనికి సంబంధ పడక సాక్షివై యుండు చిత్స్వరూపుఁడవు. "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ" నీవే దిక్కని నాయందు భక్తుఁడై ప్రార్థించువారిని వెంటనే యభయ మిచ్చి రక్షింతు. ఇది నాకు వ్రతమని కూర్చున్నవాఁడవు. కాని పామర బుద్ధులకుఁ బట్టుబడవు.

" మాత్రాఽతీతం స్వాత్మ వికాసాత్మ విబోధం
జ్ఞేయాఽతీతం జ్ఞానమయం హృద్యుపలభ్య
భావగ్రాహ్యానంద మనన్యంచ విదుర్యం
తం సం సారాధ్వా న్త వినాశం హరిమీడే "

ఇంద్రియ గోచరము కానిదియు, ప్రత్యగాత్మ స్వరూపము వలనఁ గలిగిన వికాసముతో కూడుకొన్న యంతఃకరణము యొక్క విశేషజ్ఞానము కలదియు, జ్ఞేయముల కన్నిఁటికి మీఁదిదియు, జ్ఞానస్వరూపమును నయిన దేనిని హృదయము నందు చూచి జ్ఞానులు కలదని తెలిసికొనఁ దగిన దానిని గాను, యానందముగాను, వస్త్వంతర రహితముగాను నెఱుఁగుచున్నారో యట్టిసంసార ధ్వాంతము నణచు నట్టి కృష్ణుని స్తుతించుచున్నాను. అనంతరూపా! నీశక్తి యనంతము. సర్వవ్యాపీ! యీనా స్థితినిబారినుండి నన్నుద్ధరింపుము. "విశ్వం త్వదీయంహృదయం త్వదీయం మదీయమేకం తవపాద పద్మం" బ్రహ్మాండము నీదై యున్నది. నా హృదయము నీదై యున్నది. నీ పాదకమలములె నమ్మితిని, రక్షింపుము రక్షింపుము. " అని ప్రార్థించుచు, నార్తయై యాక్రోశించుచు సభామధ్యమున నున్న విద్యం జూచి ప్రేమ యను వికర్ణుఁడం తటి మహాదారుణమును చూచుచు మిన్నకున్న సభాసదులఁ జూచి యిట్లనియె.

ప్రేమ విద్యాపరాభవమును చూచి యిది తగదనుట.

సమబుద్ధులగు సదస్యులీ మహాదేవి ప్రశ్నంబులకు సదుత్తర మీయవలయు. లేకున్న నరకభాగు లయ్యెదరు. సనా

తనులైన బ్రహ్మచర్య సద్విచారులును, నాచార్యులైన బ్రాహ్మణాదులునుఁ బలుకరైరి. ఈ యున్న పారిషదులెల్లను కామ క్రోధములు వీడి విచారించి చెప్పుఁడనిన నెవ్వరును నోరెత్తకున్నఁ జూచి ప్రేమ "మీరంద ఱూరకున్న నేన యిందు ధర్మ నిర్ణయంబు సేతు వినుండు. వాదము, జూదము, వేట, పానము నను నాల్గును వ్యసనంబులు. తద్వ్యసనంబునం దగుల్కొనిన పురుషుఁడు ధర్మవర్జితుండై సంచరించు. అట్టి వాని కర్మమును సత్యంబుగాఁ దీసికొనం దగదు. వాదమునకు మీచేఁ బిలువంబడి తద్వ్యసనంబున విమోహితుఁడై నిష్కాముఁడు తనయొక్కని ధనము గాని విద్యను పణంబుగాఁ జేసె. (విద్య యుపాధిరహితగా నుండదు.) కావున నీ యమ యధర్మ విజిత ఇట్టిదాని నిటకుఁ దోడితెచ్చుట యన్యాయం బని పలుకుచున్న నతని వారించి యహంకారుఁడు "వెట్టి వాఁడా! యెవ్వరికిఁగాని ధర్మము నీవొక్కఁడవ జూపింప వలదు. పెద్దలుగల సభయందు పిన్నవానికింత నిర్ణయ వాక్యములు తగ వ్రాఱకుండుము. ఇందఱుఁ జూచుచుండ నిష్కాముచే నోడబడిన యిది యధర్మవిజిత యెట్లయ్యె. కాకున్న వారంద ఱశ్లీల యొప్పుకొందురు. పలువుర సొమ్మగుట నీపె బంధకి యనంబడు. దీనిని విగతావరణనుగాఁ జేసినను ధర్మ విరుద్ధంబుగా" దనియె.

అది సంజ్ఞగా నెఱిఁగి మహామోహుఁడు దాని యావరణం బూడ్చుమనిన నాస్తికుఁ డది తనచే సాధింపరాని కర్మ యని కొంకక వివేకశూన్యుఁడై సాత్వికశ్వేతమై యొప్పు

విజ్ఞానావరణమను వస్త్రము నూడలాగిన, విద్య యెన్నఁడును సాత్త్వికవిజ్ఞానావరణ రహితగా నుండనిదాట నీశ్వరాను గ్రహంబున నామె యుపాధిని వదలక నాయావరణం బట్టులనె యుండె. భ్రాంతుఁడై నాస్తికుఁడు మఱల దాని లాగి వైవ నది యట్టులనె యుండె. మఱియు మఱియు లాగుచుండ పర్వ తోపమంబులై యావరణరాసులు దోఁచెఁగాని విద్య మాత్రము విజ్ఞానావరణ శూన్యతం బొందక నిర్వికారమై యుండె. అప్పటికి నాస్తికుండు తన శ్రమమంతయు విఫలం బగుటకు సిగ్గునొంది మిన్నక కూరుచుండె.

## వేదకాముఁడు నాస్తికాదులఁ జంపఁ బ్రతిజ్ఞ సేయుట.

ఇట్లు నాస్తికుఁ డొనర్చిన యసహ్యకర్మమునకుఁ గినిసి వేదకాముఁడు క్రోధారుణిత లోచనుం డగుచు నెల్లఱుఁ విన నిట్లనియె. ఇందఱుఁ జూచుచుండ నున్మదాంధుఁడై దేవి నింత జేసిన యీ నీచనాస్తికు భవిష్యత్సత్య వాదంబున నతిభీకరరూపమున ఛేదించి యీ దుష్టప్రభువు సూచుచుండ నీనాస్తికవాదంబును ఛేదించి తజ్జనితానందరస మను నస్రుక్పా నంబు సేసెద. అట్లు సేయనైతినేని సద్గతులకుం దప్పెద ననియె. సభాసదు లెల్లఱు జీవుని నిందించుచు నతని యుపే క్షయ యింత పాపంబునకును మూలమని యనుచుండ నా కలకలంబు వారించి సద్విచారుఁ డెల్లవారు విన చేతులెత్తి యిట్లనియె. ఇది మహాప్రళయకర్మము. దీన జీవ వంశ నాశనము కాక తప్పదు. విద్వత్సభంజేరి మొగమోడి బ్రహ్మ

నిర్ణయంబు సేయని సభికులు నరకంబునఁ దప్పక పడెదరు''
రని యనుచున్నను కల్లలసామి వలని భయమున నెవ్వరును
మాట్లాడరైరి.

అంత పొల్లుల తేఁడున్నదుండై తన తొడలఁగూర్చుండ
రమ్మని విద్యాదేవిం గనుసన్నఁ జేసినం జూచి వేదకాముఁడు
లయకాలకాలునివలె మండుచు సభికులెల్లను విన నిట్లనియె.
''అధికారమదంబుననే దురాత్ముఁడు సత్పురుషహృదయకమల
కర్ణికాధిష్ఠితయగు పవిత్రవిద్యం దనకామకర్మలచే ద్వైతరూప
ములగు యూరువులెక్క కనుసన్నఁజేసె నట్టియాతొడల నుగ్ర
వాదమున నాప్రమాణవాక్యములను గదకెరఁజేసెదను''ననియె.
ఆమీద బౌద్ధయాగారముల ననేకోత్పాతములుబుట్టిన నంతయు
నెఱింగి బుద్ధిదేవి సద్విచారునిఁగూడి జీవుని కడకుంజని శాం
తేయ పరాజయంబును, విద్యాదేవీ పరాభవంబును, మహో
త్పాతంబులు బుట్టుటయుం జెప్పిన జీవుఁడు మహా మోహునిఁ
బిలిచి ''కుమారా! పుట్టిననాటనుండియు దుష్టత్వముల
తోడనే పెరుగుచుంటివిగదా ? తపస్వరూపిణియు, దైవశక్తి
సంపన్నయునగు విద్యాదేవిని సామాన్యనుగానెంచి యపకార
ములు సేయనగునా ? నీవలన శాంతేయు లెంత దుఃఖితులైరి.
వారియందు విరోధంబు తగదుడుగు''మని కుమారుని నిందించి
విద్యంబిలిచి తల్లీ ! నాకోడంౘ్రడయం దభ్యర్చిత వీవెక్క తెవె
నీ సంతోసమునకుఁదగిన యట్లిచ్చెద నెద్దియేని కోరుకొ''మ్మ
నిన విద్య తమదాస్యవిముక్తి నివేడె. అనంతరమున జీవుఁడు
నిష్కాముఁ బిలిచి ''సర్వసంపదలు మీకొసంగితి వానిం

జేకొని విదేహంబున నుండుం'' డని పంచిన 'మహాప్రసాద' మని నిష్కాముఁడు "వికారహేతౌసతి విక్రియంతే యేషాం నచేతాంసి తయేవ ధీరాః'' వికారకారణము సంభవించినను వికారము నొందని మనస్సుగలవాఁరె ధీరులనుటకుందగిన వా రను నట్లు తనవారితో విదేహ కైవల్యమున కరిగె.

ఇదియంతయువిని మహామోహుఁ డహంకారాదులతో నాలోచించి తండ్రికడకుంజని యిట్లనియె. "జనకా! యీ పంచకాముల కెంత మేలుసేసియు మనము మంచివారల మౌ దుమా? విషోరగములఁ గోపింపఁజేసి విడిచినట్లు వారివిడిచి పుచ్చి వ్యవహారంబునకుం దప్పితిమి. వారు బ్రహ్మతేజస్సం పన్నులు. వారిని సత్యవాదంబున జయించుట సాధ్యముగాని పని కావున వారి మఱలరావించి మాయావాదమున జయించి వైదికమార్గ గాములంజేసిన మే లట్లుసేయింపు'' మనిన జీవుఁడొడంబడి యప్పుడ నిష్కాముఁ దోడితెమ్మని జగన్మిత్ర దృష్టిం బంచిన నిష్కాముఁడు "తండ్రియాజ్ఞను విధి నియోగం బును దాటనగునా? యని తమ్ములుం దానును విద్యయు మఱల శల్యపురంబునకు వచ్చిన, నెప్పటియట్లరక్తిమంటపమున నందఱును గూర్చుండియున్న యనంతరమున మనస్సను మాయావాది నిష్కామున కిట్లనియె.

## నిష్కాముఁడు మనస్సుతో ననువాద మాడుట

"నిష్కామా! మీ విదేహసంపదలన్నియు జీవుఁడు మీ కిచ్చి పూజించె. కావున నింక వాని నొక్కవలదు, ఇదిధర్మోక్త

యపూర్వమైన పణంబు, దీనియం దోడిన వారు వ్రతధారులై శాకాహారులై బ్రహ్మచర్యంబువీడక పంద్రెండేఁడులు వైదిక ధర్మమార్గ సంచారులు గావలయు. పదుమూఁడగు నేఁడు వారి యున్న జాడ శత్రులకుఁ దెలియకుండ నెచ్చటనేని దాఁగియుండవలయు. అందెట్టుఁగఁ బడిరేని మఱల పంద్రెండేఁడు లట్టుల చరింపవలయు. ఇట్లు సేయం గలుగుదేని వాదం బాడు'' మనిన నను వాదంబు కొఱకు పిలువంబడి మరలుదునే? యని యాపణం బొడ్డి మానసునితో వాదమాడియోడె.

## పంచకాములు వైదికారణ్యములకుఁ బోవుట

ఇట్లు తమ సర్వస్వమునోడి శాంతేయు లానందమయములైన విదేహాకైవల్యభోగములవీడి శారీరక క్లేశకరములైన వైదిక కర్మమార్గములను నరణ్యములకుఁ బోవ సమకట్టి బ్రహ్మచర్యాదులచే ననుజ్ఞాతులై కదలనున్న తఱి సద్విచారుఁడు వారికిట్లను "నిష్కామా! శాంతిదేవి వనవాస క్లేశముల కోపదు. మీరువచ్చునందాక నాకడన యుండు'' నని చెప్పి "తండ్రీ! నీవు సర్వజ్ఞుండవు. నీయంతవారు తమ్ములు. పాపరహితుండగు శముఁడు పురోగామి. కల్యాణగుణసంపన్న విద్య భార్య. ఇట్టి నీవును వీరును యొక్కచోఁగూడి యొప్పుచుండుటంజేసి మిమ్మెవ్వరును భేదింపనోపరు. ఇదియునుఁగాక వేదశిక్షులం బెరిగితిరి. నిదిధ్యాసునిచే రక్షింపంబడితిరి. మీకు ముందు దారిఁజూపి నడుపువాఁడు శముఁడు. దైవశక్తియాసమేత్యగము. ఇట్టి మిమ్ము భూమియు నాకసంబును చంద్రుండును

సూర్యుండును వాయువును రక్షింతురుగాక. సర్వకార్యములం దప్రమత్తులై ప్రవర్తిల్లుఁడు. పునర్దర్శనం బయ్యెడు'' మని దీవించి పొండనియె. అనంతరము పుత్రవియోగమునకు సహింపక యేడ్చుచున్న శాంతి నోదార్చి వైదికారణ్యములకుఁ బోవుచు వేదకామ సత్కామ సత్యకామాప్తకాములు "మాయావాదమున మమ్మింతలు పఱచిన యా దుష్టాత్ముల భవిష్యత్సత్యవాదమున నస్మన్మహావాక్యంబులచే నిహతులం జేయుదు'' మని ప్రతిజ్ఞలు సేసి స్థూలమునుండియె వైదిక కర్మ జాలారణ్యమునఁ బ్రవేశించిరి.

శ్రాద్ధేయ సభామధ్యంబున ననేకోత్పాతంబులు బుట్టె. అప్పుడందఱు వినుచుండ నిదిధ్యాసుఁడు 'నేఁటికి పదునాలవ యేఁట కర్మక్షేత్రవాదంబగు. అందు శాంతేయులు జయింతు' రని పలికిన నా మాటలు విని జీవుండు మిక్కిలియు దుఃఖించుచు బలవంతులతో పగఁగొంటి మిది సర్వగుణక్షయ కారణంబగు చున్న దేమిసేయుదు నని విలపించుచుండ వైరాగ్య మను సంజయుఁడు పొడసూపి " జీవా! స్వయంకృతాపరాధంబున కేల బొగిలెదవు. బ్రహ్మరూపులైన శాంతేయుల మహాతేజములఁ జూడనోపక యపహరించి వారిని దూరస్థుల జేసితివి. సద్విచారాదుల బోధలు పెడచెవులం బెట్టితివి. మానసాదుల మాటలకు లోనైతివి. పుత్రుని మీఁది మమకారమును వీడలేక బాధాకరమని యెంచక బలవంతులతో విరోధమును దెచ్చిపెట్టుకొంటివి'' అనిన పిమ్మట సద్విచారుఁడు "అన్నా! విషభోజనమివ

పరిణామ దుఃఖం ’’ అనునట్లు స్వయం కృతాపరాధంబున నగు దుఃఖముచే నయ్యేడిది లేదు. ఇప్పటి కింకను మించినది లేదు. నీతమ్ముని బిడ్డలఁ బిలిపించి వారి సంపదలు వారికిచ్చి దుఃఖరహితుండవై బ్రతుకు ’’ మనిన జీవుఁడు పురాకృత దుష్కర్మ విశేషంబున నమ్మాటలు పెడచెవులం బెట్టి విననియట్లు నటించుచు నూఱకుండె.

శ్లో॥ ముక్తేర్మూలం మునివర హృదానంద కందం ముకుందం
కూటస్థాఖ్యం సకల వరదం సర్వ చైతన్య రూపమ్
నాదాతీతం కమలనిలయం నాదనాదాంత తత్వం
నాదాతీతం ప్రకృతి రహితం రామచంద్రం భజేఽహమ్.

— రామకర్ణామృతము.

ఆత్మభారతమున – యాగపర్వము
సమాప్తము
ఓం తత్సత్





శ్రీ రాధాకృష్ణ

# ఆత్మభారతము

## వైదికపర్వము

—:o:—

శ్లో॥ వేదోనిత్య మధీయతాం తదుధితం కర్మ స్వనుష్ఠీయతాం
తేనేశస్య విధీయతా మపచితిః కామ్యేమతి స్త్యజ్యతామ్
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽను సంధీయతాం
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతామ్॥

— అద్వైతోపదేశం.

సదసద్వివేక సంతతి మహావాక్యాది మోక్షసాధనంబుల వీడక విద్యాదేవినిగూడి వైదికకర్మారణ్యమున జిజ్ఞాసా పథంబునఁ బోవుచుండనింద్రియములను పురజనులందఱు ధర్మప్రవర్తనమున మనలఁ బాలించు నిష్కాముఁడు దూరస్థుఁడైన యెడ నింకనీ మహామోహాహాతకుని పాలనంబునఁబడి బ్రతుకఁ గలమే.

కం. తిలలును నీళ్లును వస్త్రం
బులుఁ బుష్ప సుగంధ వాసమున సౌరభముం
బొలుపెసఁగ దాల్చుఁ గావున
నలయక సత్సంగమమున నగు సద్గుణముల్.

— భారతము.

కావున జన్మవిద్యాకర్మములఁ బ్రశస్తులరైన మీ తోడన యుందుమని వెంటనంటిన వారింజూచి నిష్కాముఁడు—

కం. మాయందులేని గుణములు
మీ యనురాగమునఁ జేసి మిగిలి వెలింగెన్
మీయనుగతి మాకు నభి
ప్రాయము వనవాస దుఃఖ భరమోపుదురే.

— భారతము

కావున మావచ్చునందాక నింద యడఁగి యుండుండని వారి నిలిపి చనుచుండె.

## పంచకాములకడకు బ్రాహ్మణములు వచ్చుట

అంత బ్రాహ్మణము లగ్నిహోత్రాదికంబులతో వేదఘోషలఁ జేయుచు తమతోడన వేదవిహిత కర్మారణ్య సంచారంబుఁ జేయుటకు నిశ్చయించి పంచకాముల కడకు వచ్చిన, వారి సగౌరవంబుగాఁ నర్చించి తదాశీర్వాదంబు లందికొని నిష్కాముఁడు వారితో నిట్లను. "మాకుఁగల సర్వ స్వమునుఁ గోల్పోయి నిష్కాములమై కర్మగహనంబులఁ గ్రుమ్మఱఁబోవు మాతో చరు పురోడాశంబులు లేక శుష్క

హవిస్సులతో నవియనేల చనుం'' డనిన బ్రాహ్మణంబులు దుఃఖితములై మీరకాని మాకొండు గతిలేదు. మహామోహుఁడు మీఁటు ది వైరంబున మమ్మాదరించినట్లు దోఁచుచున్నను నెప్పటికేని మమ్ము మొదలంటఁ ద్యజింపక మానఁడు. కావున ననన్య శరణ్యులమైన మమ్ము విడుచుట ధర్మంబు గాదు. మా పోషణంబునకై చింతింపకుఁడు. చరు పురోడాశములు లేకున్నను తపోజపాది కాహుతులతో తృప్తుల మగుచుందుము. మమ్మాదరింపని పొల్లులతేని పొంతనుండ నేర '' మనిన వారి రాకకంగీకరించి నిష్కాముఁడు నేన కాని యొండెఱుంగ మనివచ్చు నీబ్రాహ్మణములఁ బోషించుఁ టెట్లొకో యని దుఃఖించుచుండ శమ్ముం డిట్లనియె.

క. శోక భయ స్థానంబు ల
నేకంబులు గలిగినను విహీన వివేకుం
డాకులతఁ బొందునట్లు వి
వేకము గలవాఁడు బుద్ధి విగతుం డగునే.

— భారతము.

కావునఁ గలుషబుద్ధివిగాక గాయత్రీజపంబున సవితృదేవు నారాధించి తదనుగ్రహంబున బ్రాహ్మసమారాధనంబుఁ బడయవచ్చు, తద్విధింగావింపుమని విధ్యుక్తంబుఁగా నమ్మహామంత్ర ముపదేశించిన, దానిఁ బొంది నిష్కాముఁడు నియతేంద్రియుండై ప్రాణాయామంబుఁ జేసి వాయు భక్షకుండై (కుంభించి) భాస్కరుని జపించిన నతఁడు ప్రత్యక్షమై " నీ తపంబునకు మెచ్చితి. మీ కర్మవాసము పూర్ణంబగు నంతకును

మీరు చేకూర్చిన ఫలమూలాదికంబులు విద్యాదేవిచేత సాధితంబులై యక్షయ చతుర్విధాహారంబులై బ్రాహ్మణ సమారాధనంబున కనువగుచుండు" నని చెప్పి యంతర్హితుం డయ్యె. అనంతరమున నిష్కాముఁడు విద్యాదేవీ సహాయంబున బ్రాహ్మణసహస్రంబులఁ దనియింపుచు కామ్యక వనంబునకుం జనియె.

## జీవుఁడు సద్విచారుని వెడలనడచుట

ఇట జీవుఁడు సద్విచారునిఁ బిలిచి "తమ్ముఁడా! నీవు బుద్ధిమంతుఁడవు. బౌద్ధేయ శాంతేయులకు సముఁడవు. నిష్టుండవునుగాన నొక్కటియడిగెద. పంచకాములింక నేమిసేయఁగలరో చెప్పు" మన సద్విచారుఁ డన్నా! పంచకాములు దేవతాస్వరూపులు వారిమహిమ నీవుమాత్రము నెఱుంగనిదికాదు. వేదకామ సత్కాములు పగవారి బ్రతుకనిచ్చువారే? ఈ యధర్మవాదమున వీరికి వారికిని భేదభావములు గలుగునని నాఁడె చెప్పిన నామాటలు వినకుంటివి. ఇంకనైన వారి రావించి నీచే దత్తమైన వారి విదేహరాజ్యమున వారి నునిచి నీయాత్మ ధర్మమును రక్షింపుము. క్షేత్రంబును దాని గుణకర్మములును నీశ్వరమూలములు. కావున నాత్మధర్మ ప్రవర్తకుండవు గమ్ము. అనాత్మధర్మ సంచారివైమె దుష్టత్రయ శిక్షలం బెరిఁగిన దుర్గుణప్రభు దుశ్చేష్టలకులోఁబడకుము. పురనాశకు నశింపఁజేసి పురమును రక్షించుట ధర్మము. కావున నీస్వరూపావరణమును నశింపఁజేసికొని సుఖింపు" మని బోధించిన నతని

పలుకులకు మిక్కిలియుఁగోపించి జీవుఁడు "నాయందుఁబుట్టిన పెద్దకొడుకుం జంపి యెట్లుఁబ్రతుకుదు. కన్నబిడ్డల కట్టడి తన మునఁ జంపు క్రూరులెందైనఁగలరా? నీవిట్లనవచ్చునా? నీవు నాకొమరుల మేలెన్నఁడును సహింపవు. నీసహాయం బేనొల్ల. శాంతేయుల కడకేనియు మఱియొక్కడకేనియు నీయిష్టంబైన చోటికింబొ"మ్మనిన నాతండప్పుడ మనోరథం బను రథం బెక్కి త్వరితగమనంబున కామ్యంబుననున్న శాంతేయుల కడ కేతెంచిన, వారు మఱల వాదమాడం బిలువవచ్చెడినో యని భయఁపడుచు నమస్కరించి తదాగమన కారణంబడిగిన వారికి సద్విచారుం డిట్లనియె.

"నేఁడు జీవుఁడు నన్నుం బిలిచి "తమ్ముఁడా! నీ యుభయపక్షంబులకుం బ్రియుండవు సముఁడవును గదా? ఇంక శాంతేయులేమి యయ్యెదరు. మేము చేయఁదగిన కార్యం బెయ్యది" యని యడిగిన నేనుభయులకును లోకంబునకును మేలగు విధంబున బోధించిన సర్వజనరుచికరంబైన యాహారంబు రోగాతురున కరుచియైన యట్లు వానికి రుచింపదయ్యె. దానంజేసి జీవుండు నన్నొల్లక మీకడకుం బొమ్మనిన వచ్చితి.

ఆ. కార్యగతుల తెఱఁగు కలరూపు సెప్పిన
నధికమతులు దాని నాదరింతు
రల్ప కార్యబుద్ధు లగువారలకు నది
విరస కారణంబు విషమ పోలె? — భారతము

అని పలికి వారింగూడి యచ్చటన యుండె.

## జీవుఁడు వైరాగ్యునిచే సద్విచారుని బిలిపించుట.

ఇట జీవుఁడు పంచకాములకడ సద్విచారుఁ డుండుట నెఱింగి ధైర్యంబు విడిచి ప్రజ్ఞాచక్షుండగు తనకు బాహ్య దృష్టియుంబోలె నుండు తమ్ముని విడిచి నిముసమేని నిలువ నేరక వైరాగ్యునితో నిట్లనియె. వైరాగ్యా! నీవు త్వరిత గతిం గామ్యంబునకుఁ బోయి సద్విచారుఁ దోడి తెమ్మనిన, అతఁడు కామ్యంబున కరిగి యట నిష్కాముఁడు బ్రాహ్మణ సహస్రములతో శమంబును, సద్విచారుఁడును, తమ్ములును, విద్యయుఁ గూడి యానందమున దేలుచుండుటఁ గాంచి యీ మహామహునకు కర్మావాసంబును స్వారాజ్యంబునుంబోలె సంతోషదాయకంబుగా నున్న దనుకొనుచు నిష్కామునితో నిట్లనియె. "కైవల్యపతీ! మీ యనుమతంబున ధర్మస్వరూపుఁడైన సద్విచారునిఁ దోడి తెమ్మని మీ యయ్యపంచె" నన "నెల్లఱకు ననుశాసకుం డగుట నాతని యిష్టంబున మెలఁగ వలయుఁ బోయిరమ్మ" ని నిష్కాముఁడు పలుక సద్విచారుఁ డప్పుడ కదలి జీవసన్నిధికేఁ బోయె.

పోయిన జీవుఁ డతి స్నేహంబున గౌఁగిలించుకొని "తమ్ముఁడా! నీవు నిత్యక్షమారతుండవు. నాబుద్ధి హీమికి క్షమింపు" మనిన సద్విచారుఁడు "అన్నా! నీవును నీ కొమరుండును బుద్ధిలేక మాటలాడినను మేము న్యాయమునే పలుకవలయు కామపంచకముతో మీకు నైరము కూడని పని" యని చెప్పుచు నెప్పటి యట్లతని కడనుండె,

ఇట్లయ్యుద్దఱు మఱల కూడుటకు శంకించుచు మహామోహుఁడు నాస్తికాహంకార మనస్సులతో నేకాంతమున నిట్లనియె.

"పంచకామ పక్షపాతియగు సద్విచారుఁడు తండ్రిచే విసృష్టుండగుచు పోయిన పోకగాఁ బోక మఱల తండ్రింజేరికొని రహస్యాలోచనకుఁ బ్రారంభించినాఁడు. మఱల శాంతేయుల నిచ్చటికిం బిలిపింపనోపు. అట్లైద యయ్యోనేని మధుమతీ శాకినీ శాక్తేయాది తంత్రములఁ బ్రయోగించి వారి నంతమొందింత" మనిన మానసుండు "వెఱ్ఱివాఁడా! నీవట్లేల తలంచెదవు. విపరీతబుద్ధులై వీరిట్లాలోచించినను సత్య ప్రతిజ్ఞులగు పంచకాములు తమ సల్పిన ప్రతిన పూర్తిసేయ కట్లేల వత్తు" రనిన వారితో నహంకారుఁ డిట్లను "ఇన్ని మాటలేల యిప్పుడ సైన్యంబులతో గదలిపోయి యసహాయులై యున్న వారింజంపి శత్రురహితంబు సేసికొంద" మన సంతోషించుచు మహామోహుఁడు సైన్యముల సమకూర్చి ప్రయాణంబగుచుండ, దాని తన దివ్యదృష్టి నెఱింగి వేద పురుషుఁ డరుదెంచి యిది ధర్మంబుగా దుడుగుండని వారి వారించి జీవునిఁ జూచి —

## వేదపురుషుఁడు జీవుని ప్రబోధించుట

"కుమారా! పంచకాములు విదేహానందమును శాంతిని విడిచి యేకాంతమున దుర్గమ వేదవిహిత కర్మగహనముల నుండఁ నీ కొమరుఁడు దుష్టుఁడై వారి వధింపఁ గడఁగె నిదియా

సురీకృత్యము. ఈ త్రయోదశాబ్దములు దాటిన వారలె యకార్యమున కుపక్రమింతురు. అసహాయులు గదా యని వారిం జెనకి లేని మిక్కిలి భంగ మొందెదరు. వీరిని వారిం పుము. నీవును బ్రహ్మచర్యాదులును నుండియు నధర్మం బున వారి నిట్లు చేయుట తగదు. " అనిన జీవుఁడు దుఃఖిం చుచు " తండ్రీ! యేమిసేతు, నేనును బుద్ధియు సద్విచారా దులును కాదన్నను వినక మా సేగిజేఁడు వితండ వాదమునఁ బ్రవర్తించె. దుష్టకర్ముఁడని యెఱిఁగియు పుత్రస్నేహమున విడువనోప " నన వేదపురుషుఁ డిట్లను.

" అన్నా ! కాయపురీశా ! ప్రపంచమున నెల్ల జీవు లకు ప్రేమ లన్నిఁటను పుత్రప్రేమ మధికంబు. అయినను దీనులై యిల్లు విడిచి యొంటినున్న శాంతేయుల యెడ దయా ళుండ వగుము. తండ్రీ! నీవును, సదసద్వివేకుండును, సద్వి చారుండును నాకు నొక్కరూప. అట్టులె నీవును నీ బిడ్డల నీ తమ్మునిబిడ్డల నొక్కరూప గాఁ జూడవలయు. నిష్కాముఁడు బ్రహ్మద్రష్ట. అట్టివాని స్నేహము సర్వగుణ హితంబగు. కావున నీకొమరుఁడతని నుపాసించుచుఁ గొంతకాలముండునట్లు నియోగింపు మది యుభయపక్షంబులకు మేలగు " నని బోధించిన జీవుఁడు నమస్కరించి యిట్లను " మహాత్మా! వాఁడు నాపలుకాదరింపఁడు. నీవంశమును రక్షించుకొనుబుద్ధి గలదేని వానిని మీర శిక్షింపుఁ " డనిన " ఇది నాచే నగు కార్యంబుగాదు. ప్రాణాయామ మను మైత్రేయుఁడు వచ్చి శిక్షించు " నని చెప్పి వేదపురుషుండటిగె.

## ప్రాణాయామము మహామోహుని శపించుట

అంత కామ్యమున నున్న నిష్కామముని కడనుండి మహాత్ముండగు ప్రాణాయామమను మైత్రేయుఁడరుగుదెంచిన జీవుండుచితరీతిఁ బూజించి " భట్టారకా! యెందుండి విచ్చేసితి " రనిన నతండు.

> చ. అలఘు తపోభరంబున జటాజినముల్ ధరియించి రూక్షవ
> ల్కలములు గట్టి కూరలును గాయలుఁ బండులు భోజనంబుగాఁ
> నలయక కామ్యకంబను మహావిపినంబున నున్న పాండవేఁ
> యుల కడనుండి వచ్చితిఁగూరూత్తమ నీసుతు నిన్నుఁజూడగన్.
> — భారతము.

అయ్యె తీర్థములఁ జూచుచు కామ్యమున వారిఁ గాంచితి " ననిన శిరమువంచి జీవుండు.

" అయ్యా! యచ్చట శాంతేయులకు క్షేమంబె? మమ్ములం దలంతురె? ఆత్మబలసంపన్నులగుట భ్రాతృస్నేహంబునకు భంగముగా సమయాతిక్రమణంబుసేయ సమకట్టరుగదా? అనిన ప్రాణాయాముఁడు " నిత్యంబును యమనియమాదికములు తమంతనవచ్చి వారికిఁ బ్రియంబగునట్లు దీవించుచుండుటంజేసి కుశలంబె. వారెప్పుడును సమయంబుఁ దప్పెడువారు కారు. అకారణంబుగా నీకొమరుఁడు వారికెగ్గు సేయుచుండు " నని మహామోహుఁ జూచి " కుమారా! పంచకాములతోడి విరోధంబు మానుము. అట్లయిన మీకును వారికిని మేలగు. నామాటలు వినుము. వేదకాము నెదిరించి

పోరుట కెవ్వరికిని సాధ్యంబుగాదు. వారికి వాసుదేవాహింసులు సహాయ్యులు. అట్టివారితో నెదిరించి యెవ్వరును జీవింపనోప " రని బోధించుచున్న ప్రాణాయామువాక్యంబు లాదరింపక మహాహితమును చుల్కనఁ జేసి చేతులెత్తి తొడలు సరచి కల్లసామి నవ్వుచుండె. అట్టియెడ ప్రాణాయాముఁడు గినిసి 'నన్నిట్లు తిరస్కరించిన యపరాధంబునం జేసి భవిష్యద్వాద రంగమున వేదకాము ప్రమాణవాక్యాఘాతంబులచే నీ ద్వైత తంత్రమను నూరుద్వయము భగ్నమగుంగాక " యని శపించి చనియె.

అక్కడ శాంతేయులు కామ్య కర్మారణ్యమధ్యమున సంచరించుచు, నందు సంచరించువారి ననాదిగాఁబట్టి పీడించు పాపకర్మమను కిమ్మీరాసురుఁడు పర్వతాకారమునఁ గవిసి "మాయన్నయగు బకనిష్ఠం జంపిన పాపులుమీరు. మిమ్ముఁ బట్టి వధింతుఁ జూడుఁడన వేదకాముఁడు వానిఁ బట్టికొని "తరతి పాపమాత్మవి" త్తను ప్రమాణవాక్యమున నతని మొత్తి యమ సదనంబునకుఁ బంపి తత్కర్మ గహనచారులక్కు పాపరాక్షస భయంబు లేకుండ జేసె.

## వాసుదేవాహింసుల యాగనము

ఇట్లు పంచకాములు కామ్యంబున నుండ వికుంఠము నుండి వైకుంఠుఁడును నోంకారంబునుండి యహింసుఁడును, సపరివారముగా నేతెంచిన పరమ పూజావిధానముల వారి

నర్చించి పురుషోత్తము షోడశోపచార పూజా విధానములఁ బూజించి.

శ్లో॥ క్షేత్రజ్ఞత్వం ప్రాప్యం విభుః పంచముఖై ర్యో
భుజ్తే౽జస్రం భోగ్యపదార్థాన్ ప్రకృతిస్థః
క్షేత్రేక్షేత్రే౽ ప్స్విందువ దేకోబహుధా౽౽ స్తే
తం సంసార ధ్వాన్త వినాశనం హరిమీడే.

సర్వ వ్యాపకుఁడైన యేదేవుఁడు అవిద్యా తత్కార్యముల యందు ప్రతిబింబ రూపముగానుండి జీవభావమును బొంది పంచేంద్రియములచేత శబ్దాది విషయముల నెప్పుడు ననుభవించు చున్నాఁడో ఒకఁడైన తాను ప్రతి శరీరాంతః కరణోపాధులయందు ననేక పాత్రలయందలి యుదకముల్లయందొక చంద్రునివలె ననేక విధములుగా నున్నాఁడో అట్టి సంసార నాశకుఁడైన నారాయణుని ప్రార్థింతును.

సీ. సదసత్తులను భేద సరణిలేక వెలుంగు
విజ్ఞానమను పాలవెల్లి నడుమ
రాజస తామస రహితమౌ శుద్ధ సా
త్త్విక మనియెడు తెలిదీవియందు
అజ్ఞాన పరికల్పి తా నేకసంశయ
లుంఠనం బనెడు వైకుంఠనగరి
వివిధ సాంసారిక విషయాభిలాషా వి
రక్తతయను సౌధరాజమందు

గీ. రమ్యసమతాఖ్య శేష పర్యంకమందు
ప్రకృతి యనియెడు నా రమాభామఁ గూడి
లీల జగముల నన్నింటి నేలు దొరను
ఆదినారాయణునిఁ గొల్తు నధికనిష్ఠ.

భక్తపోషణ పరాయణా! నారాయణా! సమాహారమై యొప్పు గుణసమూహమం దెటుగన్నను నీవ కాని యన్యంబు గోచరింప కున్నది. నీవులేనిది లేదు. నీవు కానిది కాన్పింపదు. చుక్కలందు, సూర్యునందు, తరులందు, గిరులందు, మశకంబునను మహామేరువు నందును, చలిచీమ యందును, సామజంబునను సమముగా నిండి ప్రకాశించు చుంటివి. ఆనందరూపా! యనేకంబులై తోచు నీరూపములన్నియు నీవ కాచూచి యానందించు నాకు నారూపమందు విలీనమైపోవ నీవు నేనను శేషజ్ఞానము మాత్రము మిగిలి పొడకట్టుచున్నది. విశ్వమూర్తీ! దృశ్య మంతయు నీవయై కనిపించు చుండ యల్పమేధస్కులు కొందఱు సంస్కారరహిత హృదయంబులతోఁ దెలియనేరక నీవు లేవందురు. తండ్రీ! యింత మాత్రమున వారి యజ్ఞానము నెఱింగించు కాని నీయునికికి భంగంబు గలుగునా? స్వామీ! నీవాఁడ. నాపాపపుంజముల పటాపంచలుగఁ జేసి నీ పాదభక్తి నిమ్ము — నీ మూర్తి దర్శనమున ముక్తియు భాగ్యము నొసంగుము — నీ సోయగమును గాంచి సొక్కనిమ్ము — అహర్నిశంబును నాత్మానుసంధానముననగు నవ్యయానందపదానుభవంబునఁ దేలనిమ్ము — అనంతా! యీయనంత విశ్వరూపమునం దంతర్నిలీ

మండవై యంతయు నీవై నీవు నేనైన మీద నగు నానం దానుభవం బనుభవనీయ మగున ట్లనుగ్రహింపుము—పరమ పురుషా! నేను భావంబు నశించి నీవను యేకమాత్రమున గ్రథితుండ నగునట్లు దయసేయుము — ధ్యేయస్వరూపా! నీధ్యానమున మునుఁగు కొలఁది బంధమోక్షములను భేద మెఱుకలో లేనిదైనది. ఆనంద నిలయా! అవ్యయరూపా! అశేషభూతాంతర్యామీ! అనంతా! చరాచర భూత జనన స్థితి విలయ కారణ స్వరూపా!

" ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మేకోపమాభవేల్లోకే.
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః

నా తృప్తికి సాదృశ్యమేది కలదు. సర్వత్ర ధన్యుఁడ నైతిని" పురాణపురుషా! నీయనుగ్రహంబునఁగాదె? మా జీవయాత్ర సఫలంబగుట. మమ్మీకర్మగహమువనుండి యుద్ధ రించి యాత్మసామ్రాజ్య పట్టాభిషిక్తానందమున నెన్నిఁటి కోల లాడింతువో? భవనాశా! భారము నీయదియకాదె? నిన్నుఁ బొందిన యీకష్టములఁ దరింపనున్నారము. ఓ దయానిధీ! కాపాడుము. ఇట్లు పంచకాములు విద్యతోఁగూడి ప్రార్థించిన జనార్దనుండు సంతసించుచు వారింజూచి యిట్లనియె.

"మీకపకారులై యంతలు బరపిన యవినీతుల మాలభ్రాంత్యాదుల (దుర్యోధనాదుల) ప్రచండవాదమునఁ బరిమార్చి బ్రహ్మజ్ఞుఁడగు నిష్కాముని భ్రాంతి రహిత జీవ హృదయ కర్ణికా పీఠమున నిల్పి యాత్మసామ్రాజ్య పట్టాభి

షిక్తుఁ జేసినంగాని యీచక్రంబు విడువ వెఱవకుండు'' డని యాశ్వాసించి మఱల తన పురంబున కరిగె. అహింసుఁడును వారి ననేకవిధ శాంతవచనముల నోదార్చి చనియె.

ఆమీద శాంతిపుత్రు లనేక సహస్ర బ్రాహ్మణంబులతో కామ్యమును వీడి ద్వైతమునఁ బ్రవేశించిరి. అప్పుడు నిష్కాముఁడు తమ్ములతో నిట్లనియె. తమ్ములారా! యీ ద్వైతము మహారణ్యము. ఇందుఁ జొచ్చినవారికి జరావ్యాధులను సింహశార్దూలములును, నసూయయను వ్యాళంబులును, పరోత్కర్షాసహిష్ణుతయను వృశ్చికంబులును,స్వాభిమానమను మదగజంబును, వివిధ సంకల్పములను హరిణంబులును గలిగి తెలియగునప్పుడెల్లఁ బైకొని గారించుచుండుం గావున నిం దేమరుపాటులేక జాగరూకులమై మెలఁగవలయుననిన సత్కాముఁడు ''బ్రహ్మబోధంబులు తపోధనంబులు నగు బ్రాహ్మణంబులును నిదిధ్యాసాది మునిలోకంబును నీచే నుపాసితంబై నీ క్షేమంబ కోరుచుండు. అదియునుంగాక శమాదులు వెంట నుండ యమనియమాదులు వచ్చుచుఁ బోవుచుండ నెందున్నను మనకేమి భయం'' బని యనుచున్నంత యమమను మార్కండేయుఁడు వచ్చి యనేకంబులగు నాత్మధర్మములను నింద్రియముల నంతర్ముఖములు జేయుట కనువగు మార్గములను బోధించి చనియె.

## వేదపురుషుఁడు నిష్కామునకు ప్రతిస్మృతి విద్య నిచ్చుట

అనంతరము నిష్కాముఁ డనుజన్ములతో శాంతి శమాదులయు, నహంకారాది దుర్గుణ నిరాకరణంబులయు, మార్గముల ననేకవిధములఁ జర్చించుచు భవిష్యద్వాదమున బ్రహ్మచర్యాదుల నిర్జించుట యసాధ్యకార్యంబు. వారహంకారులై యుండుటం జేసి మనతో ప్రతిఘటింపక మానరు. ఏమిసేతుమని విచారపడుచున్న సమయంబున వేదపురుషుం డరుదెంచి వారిచే పూజితుండై నిష్కాము నేకాంతమునకుఁ దోడుకొని చని విధ్యుక్తముగా ప్రతిస్మృతి యను విద్య నుపదేశించి దీని శక్తిచే సత్కాముఁ డధిక తపోవర్యుఁడై యింద్రాదులను రుద్రుని ప్రత్యక్షముఁ జేసికొని వారివలన దివ్యమంత్రములను దివ్యాస్త్రములు వడసి శత్రుజయముఁ గాంచు వగపకుండుమని చెప్పి మీరుండుటం జేసి యీద్వైతవనము స్వస్వరూపమున రాణింపనేరకున్నది. దీని విడిచి మఱియొండుకడకుఁ బొండని బోధించి యతం డరిగె.

అతనివాక్యము ననుసరించి వారామీఁద ద్వైతమును వీడి బ్రాహ్మణంబులతో కామ్యమునకుఁ జని యందు సుఖంబున నుండుచు నొక్కనాఁడు నిష్కాముఁడు సత్కాముఁజూచి "సత్కామా! శత్రునిరాస నిపుణులైన బ్రహ్మచర్యాదులయం దనుబంధ చతుష్టయంబుతో శాస్త్రం బధిగతంబై యుండుటం జేసి వాదారంభమున మనతో తప్పక యెదిరింతురు.

అట్టివారిఁ బ్రతిఘటించుట కనువగు నుపాయంబును వేదపురుషుం డానతిచ్చె.

నీవా ప్రతి స్మృతియను విద్యను గ్రహించి రుద్రకవచధారివై ప్రణవ ధనువును జ్ఞానఖడ్గమును ధరియించి యరుల కజేయుండవై తపోబలంబున నంతరాత్మ యను నింద్రుని ప్రత్యక్షంబుఁ జేసికొని తత్ప్రసాదంబున శాస్త్రగుప్త మంత్రములను నాయుధముల వడసి తదుపదేశంబున రుద్రు నారాధించి వాని వలన నిష్టసిద్ధి వడయు''మని చెప్పి యప్పుడ వేదపురుషోప దిష్టంబైన యీవిద్య నుపదేశించి పంచె.

సత్కామున కంతరాత్మ ప్రత్యక్షమగుట

అంత సత్కాముఁడు విద్యా ప్రసన్నతఁ గాంచి రుద్రకవచ ధారియై ప్రణవధను వందుకొని విజ్ఞానమయానందమయ కోశములను తూణీరయుగళమును ధరించి జ్ఞానఖడ్గమునుఁ బట్టి వెడలిన, నతనిం జూచి సకలభూతంబులును 'నిర్విఘ్నముఁగా నీతపంబు కొనసాగుఁగాక' యని ఘోషించె. ఇట్లు తపశ్చర్యాని రతుండై మహాగహన మార్గములఁ గడచి చనుచున్న సత్కాము కడకంతరాత్మయను నింద్రుఁడు బ్రాహ్మవేషంబునఁ గనిపించి ''ఆర్య! నీవెవ్వరు తపోరూపుండవై యుండి శత్రు నిరసనకారి కృథా శస్త్రముల నేల ధరించితి విది ప్రశాంతనిలయంబు క్రోధాయుధంబులుకూడ నవి మానవల్లయ్యు'' నన్నిన తనమాటలకుఁ జలింపక యట్ల నిలిచియున్న

యతనివిశ్వాసమునకుమెచ్చి యంతరాత్మ నిజరూపంబుఁ జూపి 'నీ కిష్టంబగు వరం బిచ్చెద కోరుకొ' మ్మనిన నతండు 'నా కిష్టమైన వరం బుత్తమ మంత్ర లాభంబ' యనిన నతఁ 'డవి లభించుట యేమి కష్టము పుణ్యలోకంబులును, దేవత్వంబును సర్వకామంబులును వేడుకొను' మనిన సత్యకాముఁ 'డవి యేవియు నొల్ల. శాస్త్ర గుప్తమంత్రము లను నస్త్రంబులె నాకక్కఱ. అంతశ్శత్రు నిరాసంబుఁ జేయనేరక కామ్య దైవతములఁబడి యడలుచున్న సోదరుల కష్టంబులు తుద ముట్టించుటకుఁ దగిన పరికరంబులు గావలయు. అంతియ కాని మఱియొండగు నముత్రఫలభోగంబుల నాసింప'' నని దృఢ చిత్తుండై పల్కిన నతని యందు కరుణించి యంతరాత్ముఁడు "నీకు సర్వము ననుకూలంబై చెల్లు నిష్టమేని కవచధారణా యోగంబున రుద్రునిఁ బ్రసన్నునిఁ జేసికొనుము. అతఁడు నీ యభిమతంబొడఁగూర్చు'' నని చెప్పి యంతర్హితుండయ్యె.

సత్యకాముఁ డామీఁద నియతచిత్తుఁడై దపించుచు రుద్ర కవచ ధారణాయోగంబున శతరుద్రంబుతో నర్చించిన రుద్రుఁడు సంతసించి ప్రత్యక్షంబై పంచాక్షరియను పాశుతంబు నొసంగి ధ్యానజపములను సంధాన మోక్షములను జెప్పి దీనిచేఁ గానికార్యంబెద్దియు నుండదు. దీని నశుచిస్థానంబుల జపింప రాదు. దీని విధానం బెఱుంగుటకు దేవతలకేని నసాధ్యంబు. దీని ధారణంబుచే నన్ని లోకములను తృణ రూపంబుగా జయింపు'' మని వరంబిచ్చి యంతర్ధానము నొందె. ఇట్లు రుద్ర దత్తవరుండై యానందించుచున్న సత్యకాముఁ

గాంచి సంతసించి యంతరాత్మ మఱల దర్శనమిచ్చి "సర్వ గుణాతీత శుభకర్మంబుల నధికుఁడవైన నిన్నుఁగూర్చి సంత సించితిచి. నీకు దివ్యత్వంబును దివ్యదృష్టియు నొసంగితి. ఇంక సవికల్ప సమాధియను స్వర్గంబునకు విచ్చేయు" మని చెప్పి యచ్చటికేఁ గొనిపోయిన.

## సత్కాముఁడు సవికల్ప సమాధికి పోవుట

సత్కాముఁ డందలి యపూర్వసౌందర్యమున కచ్చెరు వందుచు నుత్తమ పురుషుండై యరుదెంచు తన్నుం గాంచి హర్షించుచు స్వర్లోక వాసుల జేగీయమాన మంగళగీతము లను నాదము నాలకించుచు,

సీ॥ నిఖిలేంద్రియములను నీలకంఠంబు ల
త్యంత సంతోష నృత్యములు సలుప
ధర్మామృతార్ద్రీకృత మనోవనీస్థలి
శమముఖ సుగుణ సస్యములిగుర్ప
సమరసానంద ఝర్ఝరముచేఁ దాపదా
వానలంబెల్లఁ జల్లార్పఁ బడఁగ
భ్రూమధ్యదేశ నభోవీధిఁ జిత్కళా
విద్యుల్లతాతతు ల్వెలయుచుండఁ

గీ. దతచిదాకాశమధ్యసంగత సమగ్ర
రాజయోగ సమాధి ధారాధరంబు
మోదవర్షంబుఁ గురియుచు మ్రోపె ననఁగఁ
బ్రణవదశమనినాద మొప్పారుచుంత.

ఆ. నాదుబిందుకళల నయమొప్పఁ జూచుచు
నింద్రియముల మనము నిగుఱఁజేసి
సత్కవీశ్వరుండు స్వప్రకాశాత్మ చి
త్సుఖముఁగాంచు పరమ సులభముగను.

— సీతారామాంజనేయము.

సహస్రార మను సుధర్మా సభామధ్యమున కర్ణిక యను చింతామణీ భద్రపీఠమున నధివసించి యున్న యంతరాత్మ నవలోకించి నమస్కరించినఁ గనుంగొని యంతరాత్ముఁడు కౌఁగిలించుకొని యంకతలంబునఁ జేర్చి నిజాసనార్ధముననునిచె. ఇట్లధిక విలాసమున దేవకామినీ కరకలిత చామరానిలాలోల కుంతలుండగుచు నంతరాత్మునిఁ గూడి యేకాసనమున నున్న సత్కాముఁ గాంచి దేవేశుశాసనమున నింద్రియాధిదైవతము లెల్లఱు ప్రేమ పురస్సరంబుగా నర్చించిరి.

## సత్కాముని రతి శపించుట.

అంతరాత్మశాసనమున సహస్రారాంతర్భాగ మను మణిమయాంతః పురమున ప్రణవనాద సంగత గోష్ఠి నుండ చంద్రుఁ డుదయించి చంద్రిక లలమి యున్న సమయంబున రతియను నూర్వశి సర్వాలంకార భూషితయై చనుదెంచిన నప్పురుషోత్తముండు ప్రత్యుత్థానంబుఁ జేసి వినయంబున నిట్లనియె. “నాయందు పుత్రస్నేహముంచి నన్ను శుభస్వరూపుం జేయుటకు విచ్చేసితివి. కృతార్థుండనైతి” నన రతి “మహా పౌరుషసంపన్నా! నీ యున్నతగుణములు నిదిధ్యాసాదుల

వలన విని పొందవచ్చితి''నన ఓహోహోహో! యివి యేటి మాటలు మావంటి సంగపరిత్యాగ శీలురకు రతిం బొందుట సర్వవిలయ కారణంబగు. కావున తొలఁగి పొ''మ్మని నిరాకరించిన నయ్యమ కోపించి "కామించివచ్చిన నన్ను తిరస్కరించిన కారణమున నీశ్వరీయమగు దివ్యశరీరముతోడి సంగమంబు విడిచి ప్రకృతి ప్రాధాన్యంబైన స్త్రీత్వమునువహించి యుండు'' మని శపించి చనియె.

మఱునాఁడు సూర్యోదయమున నంతరాత్ముఁడు శాప వృత్తాంతముఁ దెలిసికొని సత్కాముతో "కుమారా! నీ యింద్రియ జేతృత్వమునకు సంతసించితి. నీకు రతి వలనఁ గలిగిన శాపంబును వైదిక కర్మ గమనాంతమునఁ జేయనున్న తపంబను యజ్ఞాతవాస వత్సరంబున ననుభవించి వత్సరాంతమున నెప్పటియట్ల యుండుము. ఇదియు నొక్క కారణంబున బాధాకరంబు గాకుండుటయేకాక సాధకంబును నగు'' నని చెప్పుచు నందున్న మూఁడువత్సరములును మూఁడు నిముసంబు లగునట్లుగాఁ జేయుచు సత్కాము నక్కడన యునిచి కొనియె.

సదసద్వివేక సంతతి దైవబల సంపన్నమగుట కర్మ గహనంబులఁ బడియు దేవతల వరంబులచే ననేక మంత్ర శక్తులఁ బడయుటవిని జీవుఁడు తనకొడుకు వారి జయించుట దుర్ఘటంబని దుఃఖించుచుండె.

ఇట శాంతేయులు నలువురును తపోవనమున సమాధికిం బోయిన సత్కాముఁడు మరలి రామికి విచారగ్రస్తహృదయులై తపించుచుండ, ఒక్కనాఁడు ప్రత్యాహారమను బృహదశ్వ ముని యేతెంచిన నతనిం బూజించి నిష్కాముఁడు "యోగీంద్రా! మావలె నాత్మ భోగంబులఁ బాసి కర్మ గహనములఁ బడి దుఃఖించువారెందైనఁగలరా ?" యనిన నతండు "మహాత్మా! పురాకృతకర్మ విశేషమున ననేకు లిట్టి కష్టములఁ బొందిన వారు కల" రని యట్టి సుగుణరాజ చరిత్రములఁ బోధించి మఱియు నింద్రియములు విషయముల మీఁదికిం బోక యంత ర్ముఖములై వానివాని స్థానములనిలుచు మార్గంబును బోధించి చనియె.

## శాంతేయుల కడకు నియమము వచ్చుట

ఆమీఁద నిదిధ్యాసుం డరుదెంచిన "మహాత్మా! పుణ్యపురుష హృదయములను తీర్థములఁ దిరుగ వలయునను కోర్కి గద్దు, దానిఫలం బెద్దియో యానతి"మ్మని నిష్కాముఁ డడుగ నతఁడు "నియమ మను సోమశుఁడు తీర్థయాత్రలఁ జేయుచు సవికల్ప సమాధినుండి నీకడకు రాగలఁ డాతనిచే నెఱుంగునది" యనిచెప్పిచనియె. కొన్నిదినములకు సత్కామ పునరాగమన కుతూహలులై యున్నవారల కడకు నియమ మేతెంచిన నిష్కాముఁడు నమస్కరించి కూర్చుండంజేసి "మహాత్మా! యెందుండి విచ్చేసితి"రన నతండు సవికల్పంబు నుండి అచట సత్కాముఁ డంతరాత్మ సన్నిధానమున నధివ

సించి సర్వదేవగణ సంసేవ్యుఁడై బ్రహ్మానంద భోగ మనుభ
వించు చున్నాఁడు దివ్యులచే ననేక మంత్ర రహస్యములఁ
బడసె. "ఇచ్చట దేవకార్యమింకను కొంతంత గలదు. దీని
దీర్చి సత్వరంబుగ రాఁగలఁ"డని యంతరాత్ముఁడు మీకుం
జెప్పి పంచె. మిమ్ముల మహాపురుష హృదయములను తీర్థ
ముల నవగాహన మొనర్చి వచ్చునట్లాజ్ఞాపించె.

" సరస్వతీ రజోరూపా తమోరూపా కలిన్దజా
సత్వారూపాచ గంగాచ సయాంతి బ్రహ్మ నిర్గుణమ్.
ఆత్మానదీ సంయమతోయ పూర్ణా సత్యప్రహదాశీలతటా దయోర్మిః
తత్రావగాహనం కురు పాండుపుత్రనవారిణాశుద్ధ్యతి చాంతరాత్మా"

అనిచెప్పి నియమము శాంతేయులఁగూడి తీర్థగమ
నంబు సేయుచు నందందు నాత్మధర్మవిశేషములఁ దెలుపుచుఁ
గ్రుమ్మరుచు ధైర్యమను గంధమాదన పర్వతమునకుఁజేరి
యందుండిరి.

## వేదకాముఁడు వాసనామయ కర్మల నున్మూలించుట.

ఒక్కనాఁడు తృష్ణయను ప్రచండవాయు వ్రెక్కమొగి
వీచిన దాని వేగమునకు సహింపక యందఱుఁ దల్లడఁపడి
దుఃఖించుచుండ, విద్యాదేవి దానికిం దాళక మూర్ఛిల్లిన
ననేక విధంబుల నాయమ నాశ్వాసించుచుఁ దేర్చి యచ్చటన
యుండిరి. మఱియొక దినమున విద్యావేదకాము లిద్దరు నొక్క
చోట నుండినయవసరమున తృష్ణావాయు సంప్రేరితంబై యొక్క
వాసనామయ కర్మ మను సౌగంధిక కమలంబు ముందఱఁ

దోఁచినం జూచి విద్యాదేవి " ఇట్టివెందు బుట్టు నిది యపూర్వంబుఁగా నున్నది. ఇట్టి వాసనల యుత్పత్తి స్థానము నరసి వాని నెల్ల నూడ్చి తెచ్చి నాకిచ్చి మనః ప్రియంబుసేయుమన్న.

క. జీవుండగు నాతఁడవి
ద్యావశుఁడై స్థూలసూక్ష్మతను వాసనలన్
భావించుచు సేవించుచు
కేవల మూఢప్రపత్తిఁ గ్రీడించుమెయిన్.

— సీతారామాంజనేయము.

వేదకాముఁ డప్పుడ కదలి యంతఃకరణ మను కుబేర సరోవరంబుఁదఱిసి యందలి వాసనామయకర్మములను పుష్పములనెల్లఁ బెకలించి వైచుచుండ తదధిదైవతారూప రుద్రానుచరులగు భూత పిశాచాదులును, రక్షో యక్షాదు లును రక్షకులుగా నుండుటంజేసి (ఉత్తిష్ఠంతు భూతపిశాచాః య ఏతే భూమి భారకాః ఏతేషా మవిరోధేన బ్రహ్మ కర్మ సమారభేత్ " ధ్యాననిష్ఠకు ప్రారంభించిన యంతః కరణము నందణఁగియున్న పూర్వ వాసనలు భూత పిశాచరూపములతో సంకల్పరూపమున లేచుచనియు నవియ యీ దేహరూపభూమికి భారములనియు వానిని నివారించుట కొఱకే యీ బ్రహ్మకర్మ ప్రారంభించుట) అని చెప్పినట్లు వారందఱు వేదకాముఁ జుట్టుముట్టిన నందఱ నోడించి వాసనా యుక్త కర్మములనెల్ల నున్మూలించి చిత్తసరోవరమును తేఱికొనంజేసి మరలివచ్చి విద్యకక్కార్యము నివేదించి యందరుంగూడి సుఖంబున నున్నంత.

రుజయను జటాసురుఁడు మాయా రూపమున వారి తోడను కలిసితిరుగుచుండ నతనివిక్రృత గమనంబు తెలిసికొని "యెడరు వేచి మాకెల్లఱ కపకారంబు సేయనెంచి చుట్టి తిరుగుచుంటివి, ఇదియధర్మంబు, విశ్వసించినవారి కపకారముఁ దలంచిన పాపంబగు. కావున నీమాయలు విడిచి యెచ్చటికేనిఁ బొమ్ము. కాదేనిమాతో రణంబొనర్పు" మనుచు వేదకాముఁ డతని నదిమిపట్టి వేగరహితుంజేసిన నారక్కసుఁ డంతటంబోక నిష్కామ సత్యకామాప్తకాముల నాక్రమించిఁ గారించు చున్నంగాంచి వేదకాముఁ డంత్యకాల రుద్రునిపగిది నతనిం గవిసి తనవేదకర్మ శక్తింజేసి యమ్మహావ్యాధిని నిర్మూలించిన నందఱు నానందించిరి.

## సత్కాముఁ డాగామి సంచిత ప్రారబ్ధకర్మల నిర్మూలించుట

అంత నక్కడ సమాధియందున్న సత్కాముఁ డంతరాత్మ నాదేశమున సంచితమను సముద్రమధ్యమున నున్న ప్రారబ్ధ కర్మములను మూఁడుకోట్ల దానవుల మీఁదికింబోయిన వారు మాయావాదమున రూపుమాపనెంచిన, సత్కాముఁడు గాయత్రీ ధ్యానలబ్ధ విజ్ఞాన సూర్యబాణమున వారినెల్ల రూపుమాపి వచ్చుచు మార్గమధ్యమునఁ దోఁచిన హిరణ్యపురవాసుల నాగామి కర్మములను పౌలోమ కాలకేయుల నాఱువేలఁ బంచాక్షరీ జపప్రభావమను పాశుపతాస్త్రముచేఁ బొలియించి వచ్చి తండ్రికి నమస్కరించిన నతండు "మాకెల్లఁ బాధకులై పోతరించియున్న యాగామి

ప్రారబ్ధుల సమూలముగాఁ బోకార్చి మమ్ము సుఖింపం జేసితి'' వని సంతసంబునం బొదలి యప్పు 'దుత్తమాధికారి' వను బహు రత్నద్యుతి మేదురంబైన కిరీటమును, మఱియు ననేకములగు మంత్ర రహస్యములను నొసంగి పంపిన సవికల్ప కసమాధినుండి సత్కాముఁడు కామ్యమున నున్న సోదరుల కడకు వచ్చి వారిచే నాలింగనాది సత్కారములఁ బొంది తాను పోయివచ్చిన విశేషములనెల్ల నెఱింగించి, యేవురన్న దమ్ములను శమంబును నియమమునుఁ గూడి యిష్టకథా గోష్ఠి నుండె.

ఒక్కనాఁ డంతరాత్ముఁడు దర్శనంబిచ్చిన నందఱును నతని పాదంబులకు సాష్టాంగ దండప్రణామంబులు సేయ నంత రాత్మ నిష్కాముఁ జూచి "కైవల్యపతీ! సత్కాముఁడు మహామహిముఁడు. నావలన ననేక దివ్యమంత్రరహస్య యోగముల నెఱింగె. ఇతఁ డంతశ్శత్రుల నెల్ల వధియించి యాత్మ రాజ్యము నీ కిచ్చు'' నని చెప్పి యంతర్హితుం డయ్యె.

## వేదకాముని జర యాక్రమించుట.

వా రేవు రిట్లు సుఖంబున నుండుచుండ నొక్కపరి వేదకాముఁ డొక్కరుండు తన్ను మఱచి సంచరించుచుండ జర యను గొప్ప యజగరం బాక్రమించిన, ననేక శతసంహితా బలుండయ్యును తదంగ సంగంబున నటునిటు మెదల నేరక విభిన్నావయవుండై వడఁకుచు "నేను వేదకాముఁడ నిష్కాము తమ్ముఁడ. ఎంతటి యభేద్య ప్రవృత్తులనేని యిట్టి

పడఁగొట్టు వేదబల సంపన్నుఁడ ఇట్టి నన్ను చులకనం బట్టి బంధించుశక్తి నీ కెక్కడిది. నీ వెవ్వఁడ వెఱిఁగింపు'' మనిన నజ్జర "అయ్యా! ద్వైతమునఁ బడి తిరుగు వా రెంతటి జవసత్వ సంపన్ను లైనను నన్నుదాకి బలహీను లయ్యెదరు. మానవు లేమిలెక్క? సృష్టియందలి సర్వజీవులఁ బట్టి మ్రింగి మారురూపులఁ జేయుచుందు. నాకు లోఁబడని రూపముం డదు. ఇప్పుడు నీవు నాకు భక్ష్యమనైతి'' వనిన వేదకాముఁడు "నాయీపాటునకు దుఃఖింపఁగాని యపగతాత్మ రాజ్య భోగులై కర్మారణ్యములఁ గ్రుమ్మఱుచున్న మద్భ్రాతలు నన్నుఁ గాన కెంత దుఃఖింతురో యని వగచెద'' ననుచుండె.

ఇట నిష్కాముఁడు తమ్ముఁడు పోయి రాకుండుటకుఁ జింతించి విద్యారక్షణంబునకు ముగ్గురు తమ్ముల నియమించి తా నొక్కరుండ వెదకుచు వచ్చి జరాభారా క్రాంతుండై చేష్టలు దక్కి ప్రాకృతుక్రియఁ బడియున్న తమ్మునిం జూచి దుఃఖితుఁడై జరం గాంచి యిట్లనియె. "తల్లి! నీవు దైత్య దానవులలో నెవ్వరవో యెఱుంగ కాని యొక్కం డడిగెదఁ జెప్పుము. నీవు కేవలంబును మాంసాహారి వగుదువని తోఁచు చున్నది. అది నిజమగునేని యితనియందు జీవసామాన్యమైన భౌతిక పశు శరీరంబు లేదు. కావున నీకోర్కెఁ దీర్చుకొన వశంబుగాదు. ఇట్టి యాహారమెందుకడఁ జూపుదు నతని వదలు'' మనిన జరయిట్లను.

"మహాత్మా! నీతమ్ముఁడు దుష్టకాలప్రాప్తుండై నాకు భక్ష్యంబయ్యె. నే నడిగిన ప్రశ్నలకు సదుత్తరంబిచ్చి తమ్ము

విడిపించుకొ''మ్మని పల్కుచు "యేగుణంబులు గలవాఁడు బ్రహ్మజ్ఞుఁడు వాని కెఱుఁగఁ దగిన వస్తు వెయ్యది'' యనిన " సత్యము, క్షమ, దయ, తపంబు, దమము, దానము, శీలము నను నివి గలవాఁడు బ్రహ్మజ్ఞుఁడగు. సుఖ దుఃఖముల యెడ భ్రాంతి నొందక సమదృష్టి నుండుటయే వారెఱుఁగం దగినది '' " అపకారం బొనరించియు నన్నృతము లాడియు హింస చేయనివాఁ డుత్తమగతికిం బోవు నందురు. అహింస యంత యుత్తమం బెట్లయ్యె. '' " దానంబును ప్రియకార్యంబు సేయుటయు సత్యమును నహింసయు నను నాల్గును సమానంబులె. అయినను నం దహింసయ యుత్త మంబు. దేవమనుష్యతిర్యగ్జాతులయందు మనుష్యుఁడు దానాది గుణములు గలిగి యహింసాపరుండైన వాఁడు దేవత్వంబు నొందు '' అని యిట్లతని ప్రశ్నంబులకు సదుత్తరంబు లొసం గిన సంప్రీతంబై జర వేదకాము విడిచి చనియె. అంత న య్యిరువు రన్నదమ్ములును శీఘ్రయానంబున నాశ్రమంబునకు వచ్చి సుఖంబున నుండిరి.

## శాంతేయులకు యమము కర్మరహస్యమును బోధించుట.

ఒక్కనాఁడు కృష్ణపరమాత్మయు యమ మను మార్కండేయుండును నరుగుదెంచినఁ బూజించి యుచితాసనం బుల నున్నతఱి శాంతి పుత్రుఁడు యమముతో నిట్లను. " మహాత్మా ! బ్రహ్మపథమును వీడక ప్రవర్తించు మే మిట్లు దుఃఖముల పాలగుటయు, ఎప్పుడును ననాత్మ బుద్ధులై

పాపంబులే సేయు జీవ సంతతి సుఖముగా నుండుటయు, నేకారణమునఁ గలిగెనని యూహించుచుండు. మఱి పురుషుఁడాచరించు కర్మమునకు ఫలంబీలోకమునఁ బొందునా? లేక పరలోకముననా? ఇందునందునా? కాక దేహపతనంబుతోనే నశించునా? యెఱిఁగింపు'' మన నప్పరమ తపస్వి "విధాత ప్రథమ సృష్టియందు నిర్మలంబులు ధర్మంబులు నైన శరీరముల సృజించె. అట్లు పుట్టింపఁ బడిన జీవులు సత్త్వగుణ సంపన్నులు స్వాచ్ఛంద మరణులు బ్రహ్మభూతాత్ములునై దేవయానంబున సంచరించుచు, సర్వజ్ఞులు బహుతరాయుష్కులు విగత మత్సరులునై వర్తించుచుండిరి. కాలాంతరమున క్రమముగా కామక్రోధాది గుణములు తమ్ముం బొదువుటయు మాయా ప్రవర్తనులై, యల్పాయువులు నల్ప బల శరీర సత్త్వులు దరిద్రులు నిష్ఫలారంభులు బహురోగపీడితులు నాస్తికులునై యొండొరుల మెచ్చక పాపకర్మంబులఁ జేయుచు పశుపక్ష్యాది జన్మంబు లెత్తుచు నరకాగ్నులం గ్రాగుచు సంసార చక్రమున పరిభ్రమించు చుండిరి. కావున "అవశ్యమను భోక్తవ్యం కృతంకర్మ శుభాశుభం'' పుణ్యపాపకర్మము లెట్టివారికేని భోగ్యములు కాక మానవు.

చ॥ మనుజులు పుణ్యపాపములు మానక యిందొనరించుచుం దుదిం
దనువు దొలంగి పోవునెడఁ దప్పవు నీడయ పోలెగర్మముల్
వెనుకనయేఁగి భూరిసుఖ విశ్రుతియుంబటు దుఃఖదైన్యముం
దనుకఁగఁ జేయు గ్రమ్మఱఁగఁ దానయొనర్పు భవంబు దేహికిన్

క॥ విను మనుజున కెవ్విధమునఁ
దనచేసిన సుకృత దుష్కృతంబులు నెఱయం
దన కనుభవింపఁ బాలివి
తనువు వెడలంగాని కర్మతతి వెడ దనఘా!

— భారతము.

కర్మల యుచ్చ నీచభేదంబులం బట్టి ఫలంబు లొక్క తఱిగాక కాలాంతరంబులఁ బొందుచుండు. పుష్పవాసనలఁ జేకొనిపోవు వాయువువలె జీవుఁడు కర్మవాసనలం గైకొని యీదేహంబు విడిచి మఱియొక దేహంబునకుం బోవుచుండు. ఆకారణమున కర్మఫల మీయొక్క దేహమునంద యనుభవింపవలయునను నియమంబులేక జన్మజన్మాంతరముల యందెందేని యనుభవించు. ఇట్టి యీప్రకృతి నాట్యమును గన నేర కజ్ఞులు పాపము లొనరించుచు సుఖముల నొందవలయు నను కోరికలచే నీచకర్మంబులకుం జిక్కి యంతరాత్మ గృశింపం జేయుచుందురు. కావున కర్మము లవశ్యభోక్తవ్యములు. గహనా కర్మణోగతిః'' కర్మగతి నెఱుంగుట దుష్కటము. అనిచెప్పి వారి నాశ్వాసించి యమము దివంబునకును పరమాత్మ వైకుంఠమునకును జనిరి. ఆ మీఁద పంచకాములు క్రమ్మఱ ద్వైతంబున కరిగిరి.

## జీవుఁడు శాంతేయుల వైదికవ్రతక్లేశమునకు వగచుట.

స్థూలపురమున కుమారులంగూడి యున్న జీవుఁడు శాంతేయుల వైదిక కర్మారణ్య సంచారక్లేశములఁ దలంచి

కన్నీరు నించి అక్కటా! నా చేసిన యపకారంబునను నా కొమరుల దుష్టత్వంబునను సుఖార్హులగు శాంతిపుత్రుల కెన లేని యాపదలు సంభవించె. అనంత దైవమానుష బలసం పన్నులై యుండియు దుర్ఘట వ్రతములఁ గుంద వలసె. ఎంతవారికేని కర్మఫలము లనుభవింపక తీరునే? నా బిడ్డల కాత్మనాశ కాలమాసన్నంబై యున్నది. ఇంక విలపిం చినం బోము. నాఁడు నేను కాదన్న వాదంబుడుగదె? వ్రాతపెంపున కులక్షయంబున కేన యొడంబడితి.

ఉ॥ మేలున సంతసిల్లునెడ మే కొని యాపదలొందు నాపదల్
దూలఁగఁబూని సౌఖ్యములుదోఁచుఁ గృతంబులు దప్పవెమ్మెయిం
బోలఁగ నింతయుంగని ప్రబుద్ధమనస్కులు ఖేదమోద ని
ర్గాళిత ధైర్యసాగరులుగాక సుఖింతురు సర్వకాలముల్.

— భారతము

ఆత్మశక్తులఁ బాసి వైదిక ధర్మములఁ గ్రశించు నాఁడె సత్కాముఁ డీ శరీరంబుతో సవికల్ప సమాధికేఁగి దివ్యులచే ననేక వరంబులును బ్రాహ్మణ మంత్రంబులును బడసి వచ్చెనట. సమాధికిఁ జేరినవారు మఱల శరీరమునకువచ్చుట యెందైనఁ గలదా! ఇదియ కర్మ విపాకమని దురపిల్లు తండ్రి వాక్య ములు విని పాపప్రభువు మనోహంకారులఁగూడి యొక్క వివిక్త ప్రదేశంబునకుఁ జని 'రాజేల యింత భీతుండయ్యె'నని చెప్పుచు కార్యాలోచనంబున నున్నయెడ నహంకారుఁ డిట్లనియె.

## మూలభ్రాంత్యహంకార మనస్సుల మంతనము

అనుంగా! చైవులకుప్పముసామీ! మినుకులవెలయు సెత్తెము సాములు కడగంట్లపాలై చెయువుల పాలంబడిరి. వి దేహమునఁగల నిష్కామలక్ష్మి నీస్వాధీనయయ్యె. ఇంద్రియ రూప ప్రజలెల్లను నీశుభంబ కోరుచుండిరి. కావున క్షేత్ర సర్వస్వమును నిష్కంటకముగా నీవపాలింపుము. ఇప్పుడు వారు ద్వైతమునఁ బడియున్నవారని వినియుంటిమి. ఇట్టి సమ యంబుననె నీవిభవమెల్ల మెఱయ వారికన్నులు గమఱం జని తేజంబుఁ జూపింపుము. సంపదల కిదియేకదా? ఫలితం'' బనిన పొల్లులతేఁడు సంతసించి "యిది సేయందగిన కార్యంబ''యని పలికి కొండొక తడవు విచారించి మఱల నహంకారున కిట్లను "మిత్రుఁడా! నాయభిప్రాయంబును నిదియ. ఐనను మన మిప్పుడు ద్వైతమున కేఁగుటకుఁ దండ్రి యొడంబడఁడు. శాత్రువు లిప్పు డచ్చటన యుండుట యతం డెఱుఁగు. దానం జేసి మనము వారిమీఁది విరోధమున వెడలుచుంటిమని నిశ్చ యించు. ఇదియునుంగాక వారు దివ్యశక్తి సంపన్ను లనియు తపోవంతు లనియు భయఁపడి యెప్పుడును తపించుచుండు. సద్విచారుఁ డతనికడఁజేరి శాంతేయ పక్షపాతియై పొగడు చుండు. విశేషించి వాదమునాఁటి నుండియు నతఁడు మనయెడ విరోధించుచుండు. మన పూనిన యీకార్యము చిన్నసన్న నెఱింగెనేనియు సర్వవిధముల భంగముసేయు కావున నిది యంతయు రహస్యంబున విచారించుకొని తండ్రి దీని కొడఁబ

బడు మార్గము నాలోచించునది ఎట్టేని తండ్రి నొప్పించి వెడలుద" మనిన నహంకారుఁడు.

"ఎకిమీఁడా! నే నొక్క యుపాయంబుఁ గాంచితి. ఇప్పుడు మన యింద్రియములనుగోవులు ద్వైతమునయున్నవి. వానిఁజూచుట యను నెపమునఁ బోవుద" మనిన మనస్సు 'నేను నట్లభావించితి' ననిపలికి యందఱియభిప్రాయము లేకంబగుటకు సంతసించి నవ్వుకొనుచుఁ దండ్రి పాలికింజని తండ్రీ! క్షేత్రపాలా! మన గోగణములు ద్వైతమున నున్నవి. వానికా ప్రదేశము సుఖదాయకంబుగా నున్నదఁట కాని యందు ర్జజలను దుష్టమృగ వ్రాతములు సంచరించు చున్నవఁట. వానినశింపఁజేయుటకఁబోయివచ్చెద" మనిన జీవుఁడు కొండొక తడవు విచారించి యింద్రియ రక్షణంబునకై జరారూప దుష్ట మృగ సంహారంబు సేయుట మేల. ఐనను శాంతి పుత్రులిప్పు డందున్నవారు. ఇట్టియెడ మీరచ్చటికిం బోవుట సమ్మతంబు గాకున్నది. వారు వైదిక సంచారమున గృశించియున్నారని చెనకఁ జూతురు. వారు కోపించిన మిమ్మెల్ల తమ తపోమహిమంబున దహించి వేయుదురు. మఱియు సత్యము నాలోచింప, " అత్తా (ఆత్మా) హి అత్తనోనాథో అత్తా హి అత్తనో గతి। తస్మా సఞ్ఞమయఽత్తాణం అస్సం (అశ్వం) బద్ధం న వాణిజో" (ధమ్మపదము) తానే తనకు ప్రభువగుటచే తన యాత్మదక్క తనను మఱియొక యొడియును తరింప జేయునది లేదు. కావున నొక రౌతు తన షణ్ఠిచి గుఱ్ఱమును తానే స్వాధీన పఱుచుకొనునట్లు మనల

మనమే బాగుగ నిగ్రహించుకొన వలయును. మఱియు " యేధే కోణాచే కాయ బాగేలే, జ్యాచే త్యానే అనహిత కేలే " బుద్ధిపూర్వకముగ తనకు తానే యపకారముఁ జేసి కొనిన నితరులకేమి నష్టము, కుమారా ! సత్కాముఁ డస్త్ర విద్యల నారితేఱని నాఁడ జగమెల్లఁ గెలిచె. ఇప్పుడు సమాధికిం జని యందంతరాత్మని మెప్పించి యనేకంబులగు యోగశక్తుల గ్రహించి యరుగుదెంచె. అట్టివానితో నెదిరించుట కేరికేని సాధ్యమా ? కావలసిన నింద్రియ రక్షణంబు నకుఁ దగువారిం బనుతు మీరు మానుం " డని యొడఁబడ కున్నఁ జూచి మనస్సిట్లను.

" బావా ! దివ్యశక్తిసంపన్నులగు ముక్తినేతలతో నేల విరోధింతుము. మేమట్లు చేసినను సమయంబు నడుపుచున్న సత్యపాలుఁడు సత్యము దప్పునా ? వాని తమ్ములు వాని మాట దప్పుదురా ? ఇంతవరకు నిశ్చయము. నామాట నమ్ముము. మాకును రోగములను మెకములఁ జదుపుట యందు సంతోసము గలదు. అందును నింద్రియ రక్షణకార్య మఁట. ఏకీడేని యెట్లుగలుగు. కావున మాగమనమున కాజ్ఞ యి"మ్మనిన జీవుఁడు తడవు విచారించి 'బుద్ధిగలవారై పోయి రం'డనియె.

## స్థూలపుర్వేశ్వరుఁ డింద్రియ రక్షణంబునకు బోవుట

అంత వారత్యంత సంతుష్టాంతరంగులై వివిధాలంకార భూషితులై యనుబంధ చతుష్కమను చతురంగ సైన్యము

బడు మార్గము నాలోచించునది ఎక్కని తండ్రి నొప్పించి వెడలుద" మనిన నహంకారుఁడు.

"ఏకినిాడా! నే నొక్క యుపాయంబుఁ గాంచితి. ఇప్పుడు మన యింద్రియములనుగోవులు ద్వైతమునయున్నవి. వానిఁజూచుట యను నెపమునఁ బోవుద" మనిన మనస్సు 'నేను నట్లభావించితి' ననిపలికి యందఱియభిప్రాయము లేకం బగుటకు సంతసించి నవ్వుకొనుచుఁ దండ్రి పాలికింజని తండ్రీ! క్షేత్రపాలా! మన గోగణములు ద్వైతమున నున్నవి. వానికా ప్రదేశము సుఖదాయకంబుగా నున్నదఁట కాని యందు ఋజలను దుష్టమృగ వ్రాతములు సంచరించు చున్నవఁట. వానినశింపఁజేయుటకఁబోయివచ్చెద" మనిన జీవుఁడు కొండొక తడవు విచారించి యింద్రియ రక్షణంబునకై జరారూప దుష్ట మృగ సంహారంబు సేయుట మేల. ఐనను శాంతి పుత్రు లిప్పు డందున్నవారు. ఇట్టియెడ మీారచ్చటికిం బోవుట సమ్మ తంబు గాకున్నది. వారు వైదిక సంచారమున గృశించి యున్నారని చెనకఁ జూతురు. వారు కోపించిన మి మ్మెల్ల తమ తపోమహిమంబున దహించి వేయుదురు. మఱియు సత్యము నాలోచింప, " అత్తా (ఆత్మా) హి అత్తనోనాథో అత్తా హి అత్తనో గతి! తస్మా స ఞ్ఞమయఅత్తాణం అస్సం (అశ్వం) బద్ధం న వాణిజో" (ధమ్మపదము) తానే తనకు ప్రభువగుటచే తన యాత్మదక్క తనను మఱియొక ఱేఁడియును తరింప జేయునది లేదు. కావున నొక రౌతు తన ఘుంచి గుఱ్ఱమును తానే స్వాధీన పఱుచుకొనునట్లు మనల

మనమే బాగుగ నిగ్రహించుకొన వలయును. మఱియు " యేఢే కోణాచే కాయ బాగేలే, జ్యాచే త్యానే అనహిత కేలే " బుద్ధిపూర్వకముగ తనకు తానే యపకారముఁ జేసి కొనినవ నితరులకేమి నష్టము, కుమారా! సత్యాఖ్యముఁ డస్త్ర విద్యల నారితేఱిని నాఁడ జగమెల్లఁ గెలిచె. ఇప్పుడు సమాధికిం జని యందంతరాత్మని మెప్పించి యనేకంబులగు యోగశక్తుల గ్రహించి యరుగుదెంచె. అట్టివానితో నెదిరించుట కేరికేని సాధ్యమా? కావలసిన నింద్రియ రక్షణంబు నకుఁ దగువారిం బనుతు మీారు మానుం" డని యొడఁబడకున్నఁ జూచి మనస్సిట్లను.

" బావా! దివ్యశక్తిసంపన్నులగు ముక్తినేతలతో నేల విరోధింతుము. మేమట్లు చేసినను సమయంబు నడుపుచున్న సత్యపాలుఁడు సత్యము దప్పునా? వాని తమ్ములు వాని మాట దప్పుదురా? ఇంతవరకు నిశ్చయము. నామాట నమ్ముము. మాకును రోగములను మెకములఁ జదుపుట యందు సంతోసము గలదు. అందును నింద్రియ రక్షణకార్యమఁట. ఏకీడేని యెట్లుగలుగు. కావున మాగమనమున కాజ్ఞ యి"మ్మనిన జీవుఁడు తడవు విచారించి 'బుద్ధిగలవారై పోయిరం'డనియె.

## స్థూలపుర్వేశ్వరుఁ డింద్రియ రక్షణంబునకు బోవుట

అంత వారత్యంత సంతుష్టాంతరంగులై వివిధాలంకార భూషితులై యనుబంధ చతుష్కమను చతురంగ సైన్యము

లును వందిమాగధ నటవిట గాయకులును నంతఃపురప్రమదా జనంబులును బలసిరా బయలు వెడలి ద్వైతమున గోగణము లున్న ప్రదేశంబునకుంజని యం దందఱ విడియించి, భ్రాంతి వాది నేత్రపర్వంబుగా బలిసియున్న హృషీకంబులం జూచి తదధి దైవతములను పాలకులవలన వాని విశేషముల నెఱిఁగి వారికిం దగిన బహుమానములం నొసఁగి తదనంతరమున రజా సంహార కర్మంబుసేయుచు నయ్యెయెడల సంచరించి, క్రమ మున పరిజనంబులతోఁగూడ చిత్తసరోవర మను ద్వైతవన సరోవరంబు సేరం జనియె. అప్పటి కట కైవల్యపతి మంత్ర జపమను వన్య ఫలమూలంబులతో సద్యస్కందమను యజ్ఞంబు సేయుచుండె. అప్పుడు రవళిదార (దుర్యోధనుఁడు) యక్కో లని దరిని దన వారికినిఁ దనకును క్రీడామందిరముల నిర్మించు చుండ, గంధర్వ నగరమను చిత్రసేను సేవకులు వచ్చి " ఈ సరోవరము మాారాజునకుం జెందినది కాన దీనిదఱిఁ జేరక తొలగి పొండనిన మహామోహుఁడు సేవకులఁబిలిచి ' వారిఁ బారఁద్రోలుఁ'డనిన, మాయానగర సేవకులు వారిమార్గ్యం బున కొకరిమొగం బొకరు జూచుకొనుచు " మీా రాజున కిది యేటి వెఱ్ఱి, మమ్ముఁజెనకి సుఖింపఁడు. బుద్ధిమంతులై తొలఁగిపొం"డనుటయు వారు మృషాప్రభు ప్రేరితులై చతు రంగంబులతో నెదిరించిన ఆగంధర్వులు తమ మాయచే బింబ ప్రతిబింబ రూపంబులతో బహుసహస్ర సంఖ్యాకల్పి తులై యెదిరించి

" అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టోరూపం రూపం ప్రతిరూపో బభూవ
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ
ఏకోవశీ సర్వభూతాంతరాత్మా ఏకంరూపం బహుధాయః కరోతి
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాస్తేషాం సుఖంశాశ్వతం నేతరేషామ్"

నొక్కఁడైన పరమాత్మ యనేక రూపముల నొందినట్లా గంధర్వు లనేకరూపంబులఁ దోఁచి యందఱఁబారఁద్రోలినం భయపడి నాస్తికాదులు కల్లలజేని సమీపంబునకుం బఱతెంచిన నహంకారుఁ డొక్కరుఁడు స్థిరుండై నిలిచి యాగంధర్వులనెల్లఁ బొలియించె. పొలియించిన మఱియు ననంత శత సహస్ర సంఖ్యలుగా పుట్టివచ్చుచు "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" ఐంద్రజాలికుని మాయవలె బ్రహ్మాండ మంతయు గంధర్వ మయమైనట్లు నిండుచుండ భ్రాంతివాది, మామయు తమ్ములును పరివారమును వెంటనడువ మాయా రూప గంధర్వుల నెదుర్కొని కొన్ని యుక్తిబాణముల వారి నెల్ల బడలువరిచె. అప్పుడు గంధర్వ నగరమను చిత్రసేనుఁడు చనుదెంచి కోపమున వారినెల్ల నాక్రమించి యనేకములగు మాయాజాలములం గప్పి చతురంగపరివారముల నొక్కొక్కనికిపదుగురుగాఁగవిసిబొమికలగూటిదొర దళములబలవంతము సేయుచు నహంకారుని యరదంబుఁ జుట్టుముట్టి కొందరు సారథిని కొందఱు గుఱ్ఱములను కొందఱు రథమును కొందఱు చక్రములను విఱిచివైచిన నతఁడు నిలువనేరక తొలఁగిపాఱె.

## —: గంధర్వ నగరము మహామోహుని బంధించుట: —

పాపము సామి విముఖుఁడుగాక పెనంగుచున్నం జూచి కోపించి గంధర్వ నగరము వానిం దలపడి రథమును విఱిచి విరథుండగు నాతని కేశాకర్షణంబునఁ బడవైచి పెడకేలుఁగట్టి సింహనాదంబుసేసిన, మిగిలిన గంధర్వు లార్చుచుఁ జుట్టుముట్టి యాతని యంతఃపురకాంతాజనంబులను సోదరశతమును పుత్ర పరివారములను బంధించితెచ్చి గంధర్వనగరమున కర్పించిన, దుత్తారము సామి ప్రగ్గడలు కుయ్యిడుచుం జని తమ ఱేనిపాటు నిష్కామునకుఁ జెప్పుకొనిన, నతఁడు సత్వరంబున తమ్ముని విడిచిపుచ్చుటకుఁ దన తమ్ములఁ బంచిన వారు రయంబునం జని గంధర్వనగరమును గంధర్వులను తమ దివ్యమంత్రములను బాణముల బడలువరిచిరి. సత్కాముఁడు "జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" పరమేశ్వర జ్ఞానము గలిగిన పిదప సర్వబంధములనుండి విముక్తుఁడగును. అనునట్లు విజ్ఞానమను నాగ్నేయాస్త్రప్రయోగమున మాయారూపగంధర్వబలము నెల్ల రూపుమాయించినఁ జూచి గంధర్వనగరమెదిరించి కొన్ని మాయలు బన్నిన, సత్కాముఁ డలాతశంకా నివృత్తి రూప బాణ జాలములచే నాతని మాయ లవియించిన బెగడొంది స్నేహమున నతనికిం బొడసూపిన సత్కాముఁడు మహాత్మా నీకిట్టి విరోధంబు వలదు. కాయపతి నతని యువతీ పరివారంబులతో విడువు"మనిన గంధర్వరాజు "సత్కామా! వీని దుష్టత్వంబు నీవెఱుంగవు కర్మగహనముల నితాంతా

యాసుతై యున్న మిమ్ము పరాభవింపఁ దలఁచి వచ్చి యున్నాఁడు. దీనినెఱిఁగి యంతరాత్ముఁడు కోపించి కాంతా యుతముగా వీనిఁబట్టి తెమ్మన వచ్చినాఁడ. అతని పాలికిం గొనిపోదు. నీవేమియు ననవలదు. నీతో పూర్వమున బద్ధస్నేహుండనై యుంటి నీయం దలుగుదునా '' యనిన నతండు.

మా కితఁడు సహోదరుఁడు. కావున విడిపించుటయె కోర్కి. అట్లయిన మాయన్నయు సంతసించు. అంతరాత్మ నాజ్ఞయేని మఱియెద్దియేని యన్నకుం జెప్పి యిష్టము ననుసరించుట కర్జము. మ[త్ప్రి]యంబుఁ గోరితేని యచ్చటి కరుగుదెమ్మని యందఱుంగూడి నిష్కాముపాలికిం జనిన. అతఁడు గంధర్వపతిం జూచి మహాత్మా! నాతమ్ముఁడు మీచేతులం జిక్కి ప్రాణంబులతో నునికి మేలయ్యె. ఇతఁ డెట్టి నేరముఁ జేసిన వాఁడైనను సహించి మాకొఱకు విడువవలయు'' నని ప్రార్థించిన నతండు వారినెల్ల విడిచిపుచ్చి దివంబునకుం జనియె. ఆమీఁద నిష్కాముఁడు కామపతినీక్షించి తమ్ముఁడా! యెన్నడు నిట్టి సాహసము లొనర్పకుము. దుష్టుఁడు దుష్కార్యము లొనర్చి నశించు. ఇంక తమ్ములతో నింటికిఁ బొమ్ము. దీనికై విచారింపకు'' మని చెప్పి పంచిన.

## మహామోహుని విషాదము

కల్మషపతి లజ్జావనతముఖుండై చెదఱిన పరివారములఁ గలిపికొని కొంత దవ్వరిగి అక్కడ సైన్యముల విడియించి తానొక్కరుం డొక్క తల్పంబునం బడి దుఃఖించుచుండిన

యనసరంబున నహంకారాదు లతనిఁ జేరవచ్చిన నాదుష్టుండు అక్కటా ! యాతీవ్ర సంగరమున గంధర్వులచేఁ మృతినొందక యేల బ్రతికి యుంటి అట్లయిన నీయవమానంబులేక సుఖముగాఁ పరలోకముననుందు. కీర్తియుంగందు. కావున నింతటి దురవస్థల పాలైన నేను జీవింప నోప. ప్రాయోపవేశంబున ప్రాణంబులు విడుతు. మీరెల్లరు నాస్తికుఁగూడి స్థూలపురమున కరిగి యతనిఁ ప్రభునిఁగాఁ జేసికొని సుఖింపుఁ డతఁడ శత్రుసంహార క్రియకుఁ గడఁగు. నాగౌరవమెల్ల నీవిధమున వమ్మొనర్చికొని యేమొగమున సిగ్గు వీడి యక్కడివారిఁ జూడనేర్తు. ఇదియంతయు నాత్మదోషంబునఁ గలిగిన యపాయంబె కాని యొండుగాదు.

క. విను దుర్వినయాత్మకుఁ డగు
జనుఁడుజ్వలమైన సిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగ నేరక
చెనఁటి తెలంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్.

క. ఆకటకట ! యిట్టికష్టము
నకు వచ్చితి నయ్య యేను నన్నుఁ బెవైరి
ప్రకరములనిఁ బట్టినఁ గృప
నొకరుఁడు విడిపించె దైవమోపదె యెట్లుఁ,

— భారతము.

అని యేడ్చు నన్నను గాంచి నాస్తికుండును నేడ్చుచుండ అహంకారుఁడు వారలంజూచి "మూర్ఖులై యిట్లేడ్చెద

రేల ? "వికారహేతౌ సతి విక్రియంతే యేషాం నచేతాంసి త ఏవధీరాః" వికారకారణము గలిగినను యెవరి యంతఃకరణము మోహవికారమును బొందదో యాపురుషులే ధైర్యశాలురని చెప్పవలెను. ప్రభూ ! సదసద్వివేకసంతతిచే విడిపింపఁ బడితినని దుఃఖింతు వంతియకాని కార్యదశ నెఱుంగ నేరవుగదా ? పంచకాములు నీచే జయింపఁబడినవారై నీ పాలనంబున నున్నవారగుట నీకింకరులై నీకుంగలిగిన యక్కఱ దీర్చుట వారికిఁ దగిన కార్యంబ. దీనికింత దుఃఖింపవలయునా ! ఇంతయు నాలోచించి యింటికిం బయనంబుఁ గట్టుము" అని బోధించినను వినక మరణము నంద నిశ్చయంపడియున్న యతనింజూచి మనస్సు "నాయనా ! యహంకారుఁడు చెప్పినది నిజము. ఆవాక్యముల వినియైన శోకంబువీడుము. నాబుద్ధిబలమును క్షేత్రమును శత్రురహితంబుఁజేసి నీ పాలొనర్చితి. దాని ననుభవింపనేరక సర్వమును నేలపాలుజేసి ప్రాణములు విడుతునందు విది వెఱ్ఱితనముగాదా ? ప్రభువున కెప్పుడేని పిఱికితనంబు గూడదు. "ఆత్మానం సతతం రక్షేత్" అని ఆర్యులు బలుకుదురు. మరణించి చేయఁగల కార్యమెద్దియు నుండదు. కాదేని మఱియొక్కటిసెప్పెద వినుము. శాంతేయు లిప్పుడు నీకుపకార మొనర్చిరిగాన కృతమెఱిఁగి వారిం బిలిచి వారి పిత్రుతేజము వారి కొసంగుము. మీరును వారును నన్నదమ్ములుగాన నెక్కటిగ యీపుర పాలనంబు నడుపుఁడు. దాన పుణ్యంబును కీర్తియుఁ గలుగు" నని బోధించువారిం గాంచి నన్నేలఁ గాఱించెదరు. నేనిచ్చటన

ప్రాయోపవేశంబుఁ జేతు. మీరు మీయిష్టమైన యెడకుఁ బొండని సాయం సంధ్యా కాలమున వివిక్త దేశమున దర్భాస్తరణమున నాసీనుండై బాహ్యేంద్రియ వృత్తుల విసర్జించి తామస సమాధిం బొందిన.

## మహామోహుఁడు తామస సమాధికిఁ బోవుట

పూర్వ మంతరాత్మచే పాఱంద్రోలంబడి యాధారమను పాతాళంబున నున్న తామస కర్మములను రాక్షసులు దబ్బఱలేని జతనము నెఱింగి యాత్మీయ పక్షము క్షయ స్థితికి వచ్చుట గమనించి శుక్రమను శుక్రునిచే సంకర్షణ మను హోమంబుఁ జేయించి నందు తామసీ కర్మ యను కృత్యబుట్టినదానిఁ బంపి దుర్గుణప్రభువు నాధారంబునకుఁ దెప్పించి తామసకర్మ లతనిం గౌఁగిలించుకొని "స్వామీ! మిథ్యాకల్పనాశక్తియుతుండ వైన నీ విట్లుల సాహసంబునకుం జొచ్చితి విది కూడనిపని. ధైర్యము వహింపుము. శత్రు నిరాసము సేయుము. మే మొకప్పుడు జగత్సంహారకరుఁడైన రుద్రు నారాధించిన నతండు పొల్లుల దారను నిన్నుఁ బుట్టించి మా కిచ్చె. నీకుం దోడుగా నానా విధ దుర్గుణ సమూహ మను దైత్యదానవజాతుల సంభవింపఁ జేసె. బ్రహ్మచర్య ప్రబోధ బ్రాహ్మణులు దేవతాంశజులైనను. భావములు రాక్షసావేశము లగుట శాంతి కొడుకుల నెదిర్చి వారి బలములు నశింపఁ జేతురు. నీ పగవారు నీచే నిహతులగుదురు. తప్పదు. కృష్ణునిచే మడిసిన నరకాసురాంశ

మహాంకారుని యందు చేరినది. తత్కారణంబున నహంకారుఁడు వాసుదేవ సత్కార్యములఁ జంపఁ గలఁడు. కావున భయంబు విడిచి పురమునకుం జనుము. విజయంబుఁ బొందు'' మని చెప్పి తామసకృత్యముచే మఱల యథాస్థానంబునకుఁ జేర్పించిన (ఇది యంతయు తామససమాధియం దతనికిఁ దోఁచిన సంకల్పరూప స్వప్నప్రలాపము) "కామమయో యం పురుషః యథాకామో భవతి తత్క్రతు ర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే తదభి సంపద్యతే'' కామమయుఁడైన యీ పురుషుఁడు యేమి యనుకొనుచున్నాఁడో అదిచేయ నిశ్చయము కలుగుచున్నది. ఏ నిశ్చయము కలుగుచున్నదో యది చేయుట కలుగుచున్నది. ఏదిచేయుట గలుగుచున్నదో ఆఫలము గలుగుచున్నది.

మహామోహాఁడు ప్రకృతింబొంది స్వప్నమునువలె నావృత్తాంతమంతటిని దలంచుకొనుచు వాదమునఁ బగవారి నిర్జింతునను దురాశ నుదయింప నానందించుచు మానసికాదులఁ గూడికొని సంతసంబున స్థూలపురికిం జని సుఖంబుండుచు మిథ్యాకల్పనుఁడు, నిష్కామముఁ డొనర్చిన నాత్మయాగంబునకుఁ బ్రతిగా ననాత్మకంబను హింసాపూరిత వైష్ణవయాగంబొనర్చెఁ వల్ల భమతమునందలి రాసక్రీడాగోష్ఠి. ప్రకృతిస్థుల స్తోత్రములకుఁ బాత్రుండై యొప్పుచుండె.

—: విద్యాపాషండునిచే జిక్కి విలపించుట :—

ఇట సదసద్వివేక కుమారులు ద్వైతమును వీడి మఱల కామ్యాంబునకుంజని యందు విహరించుచుండు నెడ పాషండుం డను సైంధవుండు కతిపయ పరివారంబులతో పోవుచు, భర్తలు కామ్యకర్మంబులందగిలి ధూరస్థులైన నాశ్రమంబున విద్యాదేవి యొక్కతయ యున్నయెడ నాయమం గాంచి చిత్తవిస్మృతిం బొంది యప్పాషండుం డీసద్విద్య మహా పురుష సేవ్య మగునది యని యూహింప నేరక, గౌరవ పురస్సరంబుగా దన్నాహ్వానించు దాని నతి రయం బునం బట్టి తన మనోరథంబునం బెట్టుకొని పఱచుచుండ, నా ప్రచ్ఛన్ననాస్తికు పాలంబడుటకు సహింపక విద్య యాక్రో శించుచు ఓపుణ్యస్వరూపులారా! నాథులారా! శాస్త్ర దూషకుని పాలంబడితి నాలోని వ్యంగ్యాలంకార శయ్యా ధ్వని శ్లేషాదుల నెఱుంగనేరక నొక్కిఱక్కి యవయవములెల్ల ఛిన్నభిన్నములుగాంజేసి కన్నులు మాత్రమిచ్చి కామితమును బడయనేరని పుంస్త్వహీనుని వంటివాని పాలైతి. అక్కటా! నాకింక త్రాతలు లేరా! యుగాంతరములనుండి విజ్ఞాను లెల్ల ఱచే బాలింపఁబడుచు సేవనీయనై వచ్చుచున్న నేను నేఁటికీ సంశయాత్ముని పాలఁబడి యింతతో మొదలంట నశింపవలసిన దేనా? ఈశ్వరా! నాభాగ్య మెంతహీనంబో యీ మహా మోహ పాతకుని పాలన కాలమున నడుఁగడుఁగున నీ నాస్తి కాదులచే బాదువం బడుచు క్షణక్షణమును శంకాకలిత జీవ

నన్నై బ్రతుకవలసి వచ్చెఁగదా ? అని మహానాదమున విలపించుచుఁ బోవుచుండ, నయ్యార్తనాదం బాలించి శాంతిసూనులేవ్వురుం బరతెంచి పాషండు మిథ్యాపరివారంబులఁ జుట్టుముట్టి యనేక వాదవిద్యానైపుణ్యంబులం బడలించుచు పాషండు పయిం గవిసిన బెగడొంది విద్యనక్కడ విడిచి పఱవంజొచ్చిన నప్పుడు నిష్కాముడు లయ్యమ నాశ్రమంబునకుఁ దోడ్కొని చనిరి. వేదకామ సత్కాము లాదుష్టు వెనువెంటంజని పట్టుకొని పడవైచి యనేక విధంబుల మోది యాశ్రమంబునకుఁ దెచ్చి నిష్కాము ముందిడి యాకృపాళుననుజ్ఞచే " ఎవ్వరేని నీవెవ్వండవని యడిగిన నిష్కాముని దాసుఁడనని చెప్పికొను " మని చెప్పి విడిచిపుచ్చిన, నతండు పాపచిత్తుఁడగుట ప్రాణంబులు గొనక విడుచుటయు నేరంబకాయెంచి యాపాపి తమోమయంబును, హింసాత్మకంబును నగు జపరూప యజ్ఞంబొనర్చి రుద్రు మెప్పించి యాతనివలన సత్కాముఁడక్క తక్కిన నలువురు శాంతేయుల నెక్కనాఁడు జయించునట్లు వరమును బొంది కృతకృత్యుఁడై గృహంబునకుం జనియె.

శాంతేయులు మఱల సమాగతుండైన యమమను మార్కండేయువలన ననేకములగు కథల నాకర్ణించుచు కర్మావాసవత్సరంబు లోకఁటి రెండు దినంబులు కడఁగా బుచ్చిన మీఁద ధర్మదేవత వారియం దనుగ్రహించి మహాధర్మంబులైన వానిఁ గొన్ని ప్రశ్నంబులడిగి వానికిందగిన యుత్తరంబులు వడసి పదుమూఁడవదియగు నజ్ఞాతవాస వత్సరంబునశత్రు గోచరంబులుగ్గాని రూపంబులు కోరినయట్లలవడ వరంబిచ్చి

చనిరి. ఇట్లు పంచకాములు పంఢ్రెండేఁడులు వైదిక కర్మ గహన సంచారంబును పూర్ణంబుగాఁ గడిపి యజ్ఞాతవాసంబు నకు వలయు మార్గం బాలోచించు చుండిరి.

శ్లో॥ మూలాదిషట్సరసిజాంత సహస్రపద్మ
పత్రాంతరాళ నిలయం భవబంధనాశం
నాదాంత చంద్రగళితా మృతసిక్తరూపం
నాదాంతనాద మహిమాస్పద రామమీశే.

రామకర్ణామృతము.

ఆత్మభారతమున - వైదికపర్వము
సమాప్తము
ఓం తత్సత్





శ్రీ రాధాకృష్ణ

# ఆత్మభారతము

## తపః పర్వము

శ్లో॥ ప్రాణోఽత్రాహం వాక్శ్రవణాదీని మనోవా
బుద్ధిర్వాఽహం వ్యస్తఉతాథాపి సమస్తః
ఇత్యాలోచ్య జ్ఞప్తిరిహాస్మీతి విదుర్యం
తం సంసార ధ్వాంత వినాశం హరిమీడే.

హరిమీడే స్తవము.

పంచకామములు కర్మగహన సంచారమును తగురీతిఁ గడపి ధర్మదేవతా ప్రసాదంబున నజ్ఞాతవాసమునకు భంగము గలుగకుండ వరములు నడసి యారణ్యములఁ దమతోడ నగ్ని కార్యములు నిర్వర్తించుచుఁ జుట్టివచ్చు బ్రాహ్మణంబులతో నిట్లనిరి "మిథ్యాకల్పనుఁడొనర్చిన దుశ్చేష్టలన్నియు మీకునుఁ దెలియును కదా? మాకొఱకు మీరును చెప్పనలవి కాని యాపదలఁ బడితిరి. ఇంతకాల మెట్టులో యొక్కరీతిం

గడచె. ఇంక నీ పదుమూఁడగు వత్సరమున మేమెవ్వారికినిఁ గనరాని మార్గంబున నెగడవలయు. శత్రులు మమ్ములఁ గాంచుటకై విశ్వప్రయత్నం బొనరించుచుందురు. మాజాడ నేమాత్రముకన్నను చాలనెగ్గగు. కావున నిర్విఘ్నముఁగా నీయబ్దంబుఁ గడుపునట్లు మీరెల్ల అనుగ్రహింప వలయుననిరి.

నిష్కాముఁడు విచారగ్రస్త హృదయుండై, యేనాటిఁ కేని మే మీ యాపదలం గడచి శాంతిని బొంది సుఖంబున నుండఁ గల్గుదుమా? అని వగచుచుండ బ్రాహ్మణంబులును తమ్ములును నతని నాశ్వాసించు చుండ శముం డిట్లనియె.

నిష్కామా !

ఉ॥ ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్ మహనీయవృత్తిస
త్కర్మవిధిజ్ఞతం జతురతా మహిమన్ దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజు పాటిగా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడవైన యట్టి నీ
పేర్మికి నీడె దుర్దశల పెల్లునకున్ దురపిల్లు టారయన్

— భారతము.

దేవతలకైన నరివర్గసంహార విషయంబున కాలంబు కొఱకు వేచియుండవలయు ” ననియె.

## కౌంతేయులు యోగవిద్యకడ నుండవలసిన రూపములు నిశ్చయించుకొనుట.

నిష్కాముతలం పెఱింగి బ్రాహ్మణంబులు మీ సంకల్పంబునకు దైవ మనుకూలమయ్యెడు మని దీవించి యెందేనిం జనియె. పిమ్మట పుణ్యప్రభువు, సవిచారంబుఁగా తమ్ములతో నిట్లనుః మనమీ యైదుగురము విద్యయు నెరులకుం గనకుండ నెట్లుండఁ గలము. అక్కటా! యీ వత్సరం బెట్లీగగలమోకదా? మన ముండుటకుం దగిన స్థానమేది యీ చుట్లనున్న యమ నియమాదిక దేశంబులం దన్నిట తప మను మత్స్యనగరంబు యోగవిద్య యను విరటునిచే పాలింపబడుచు మన నివాసంబునకు యోగ్యంబై యొప్పుచున్నది. కావున నందుండుట మేలని తోఁచుచున్నది. కాని యిట్టి మన మేవ్వురము నేరూపంబున నుండఁ గలుగుదుము నిర్ణయింపు" డనిన సత్కాముఁడు సవిషాదంబుఁగా నిట్లను "అన్నా! సర్వంబును నేలఁగలుగు ప్రభుత్వమహిమంబును, కోరివచ్చు శాంతి దాంతి కరుణా సత్యంబులుఁ గలిగి యొప్పారు నీవు కాలవశంబున కష్టములపాలై నిన్ను సేవించిన యోగవిద్యకడ మనసురాఁగొల్చుచు "తృణాదపి సునీచేన తరోరివ సహిష్ణునా, అమానినా మానదేన కీర్తనీయ స్సదాహరిః" గడ్డివలె వంగి చెట్టువలె సహించి యనభిమానులనుకూడ మన్నించి యెట్లుండఁగల" వనిన తమ్మునింజూచి నిష్కాముఁడు.

" నాకుం దగినట్లు సన్యాసి వేషమున ప్రాణవాయుమూర్తింబొంది యోగవిద్యకడనుండి చిజ్జడ సంయోగ వియోగంబులచే నడుచు జగన్నాటక రహస్యంబును దెలిపి మెప్పించుచు ప్రాణుఁడను నామంబున వర్తింతు. ఇంతకుముం దెందుందువని యడిగెనేని నిష్కాము పాలనని చెప్పుదు " నని చెప్పుచు వేదకామునింజూచి యింతటి మహనీయమూర్తిని దీని నెందు దాచనగు నేమిసేతు " నని వగచిన నతండు.

"అన్నా! నేను సమానవాయుమూర్తింబొంది యోగవిద్యకడ భుక్తాన్న పచనకార్యంబునకుం బూని బానిసీఁడనై వర్తించుచు సమానుండను పేరున సంచరింతు. నీవెక్కడివాడవనియడిగిన నిష్కాము వంటవాఁడనందు. అనిన నిష్కాముఁడు సత్కామునిఁజూచి దుఃఖించుచు నితఁడు మానవాతీతములగు దేవకార్యము లెన్నేని యొనర్చిన మహనీయుఁ డిట్టివాఁ డితరుల నెట్లు సేవింపం గలుగు నని యంగలార్చు నన్నంగని సత్కాముఁడు.

అన్నా! నేను సవికల్పసమాధికిఁ బోయిననాఁడు రతి నన్ను ముట్టవచ్చిన నొల్లనంటి. ఆ కారణమున రతి ' పురుష రూప విజ్ఞానశక్తి నీయందు నశించి కేవల జడప్రకృతిం బొందుదువు గాక ' యని శపించె. ఆ శాపంబు నా కజ్ఞాతవాస వత్సరంబున ననుభోగ్యం బగునట్లంతరాత్ముఁ డనుగ్రహించె. ఆ కారణమున పేడితనముఁ దాల్చి స్త్రీ ప్రకృతితో నపాన వాయుమూర్తిం బొంది యోగవిద్యకడ నాధారస్థానంబున నుండి కుండలినీకన్యలను కన్యలకూర్ధ్వసంచార మును

నాట్యంబు నేర్పుచు నపానుం డను నామంబున నా నగరున నుందు. నీ వెక్కడివాడవని యడిగిన విద్యకడ నుందునందు ” నని చెప్పినమీఁద సత్యకాముఁ డన్నతో నిట్లను.

“ అన్నా! నే నుదానవాయుమూర్తిఁబొంది యోగ విద్యకడ పురకంఠదేశంబున నుండుచు జాగ్రత్స్వప్న సుషుప్తులను త్రివిధావస్థలకు నొకదానినుండి మఱియొకదానికి జీవుఁడు పోవునపుడు పోకరాకలకుఁగావలసిన వాహనత్వంబు నడుపుచు నశ్వశిక్షకుండను నధికారంబువహించి యుదానుఁడను పేరున వర్తింతు. నీవెక్కడివాఁడవని యతండడిగెనేని మీ దగ్గఱి వాఁడనందు ” ననిన నాప్తకాముఁడు.

“ అన్నా! నేను వ్యానవాయుమూర్తిఁబొంది యోగ విద్యకడ నింద్రియములను గోవుల నాస్వాధీనమున మెలపుచు వానిని సద్విషయములను విషయంబులఁ ద్రిప్పుచు కామితములను క్షీరముల విరివిగ బిదికియిత్తునని చెప్పి వ్యానుఁడను పేరుతో కీలారితనంబున సంచరింతు. నీవెక్కడివాఁడ వన్న నీగోష్ఠంబులోనివాఁడ నందు ” ననిన శాంతేయాగ్రజుండు విద్య నాలోకించి ఖిన్నాంతః కరుణుండగుచు నిట్లను.

చ॥ ఇది గడుముద్దరాలు పనులేమియుఁ జేయఁగనేర దెంతయుకా
మృదువొక కీడుపాటునకు మేకొనఁజాలదుదాత్తచిత్తయొం
టిదిరుగుదాని కోర్వ దొకటిందనుఁ దాసవరించు బొప్పెఱుం
గదు తగ నొండులం గొలువఁగా వెరవెమ్మయుఁగల్గ నక్కటా!

— భారతము

అని దురపిల్లుచున్న నాథునింగాంచి విద్యయిట్లను.

"దేవా! నేను గంధవతీ మూర్తిందాల్చి యోగ విద్య భార్య రాజసశ్రద్ధ యను సుదేష్ణకడ నుండి నీచకృత్యముల వెంట నన్నుఁ బనుపకుండునది. వివిధములగు విషయ వాసనలను గంధములతో నిన్నలంకరించి యానందింపఁ జేతునని చెప్పికొని యాకెకడనుందు. నీవెక్కడిదానవని యడిగిన విద్య కడ నుంటినందు.

## పంచకాములు యోగవిద్యను కొలిచియుండుట

ఇట్లయ్యాఱ్వురుం దమతమ యునుకుల నేర్పరించి చెప్పుకొనిన యనంతరంబునఁ దమతోనున్న పరిచారకులనెల్ల ప్రణవపురంబునకును వైకుంఠమునకును బోవునట్లాజ్ఞాపించి, మా వార్త నెవ్వరేని యడిగిన ద్వైతమున మమ్ము విడిచి పోయి రామీఁద నెఱుఁగమనుఁ" డని చెప్పి వారలంబంచి, శమమను ధౌమ్యునిచే తపోధర్మము లెఱింగికొని నిత్యాగ్నులతో నాతని ద్వైతంబునకుఁ బంపి, కతిపయ ప్రయాణంబులతోఁ దపోనగరంబు సమీపించిన మీఁద నిష్కామాదులు తమ తమ రూపంబులు మార్చుకొనుటకును మంత్రములను నాయుధముల నిక్షేపించుటకును నచ్చట నిలిచి పరిసరములఁ బరికించి తమ రహస్యమున కనువైన దానిఁగా నెంచి యనాహతచక్ర మను రుద్రభూమియందు(రుద్రాధిదైవతమగుహృదయము) ఓంకారాది బ్రహ్మసాధనంబులనెల్ల నిక్షేపించి (అన్యజన భయంకరమైన) యాజ్ఞా చక్ర మను పుణ్యానదీ సంగమంబున తానంబాడి ( త్రివేణీ సంగమస్థానము. ఇదియే తపో

రూప యోగస్థానము ) పథిశ్రమమును బాసి ప్రాఙ్ముఖులై ధర్మదేవతం బ్రార్థించిన వారందఱకు నున్న యునికిన దమ సంకల్పంబుల కనువగు రూపంబు లేర్పడిన సంతసించుచు నొక్కొక్కరుఁగా తపోనగరంబునం బ్రవేశించి దైవయోగం బున నప్పటికి బయలి కొలువై యున్న ( బహిర్వ్యాప్తి నున్న ) యోగవిద్యయను విరటునిఁ బొడఁగాంచి యతనిచే ననేక విధంబుల సత్కరింపంబడి, పూర్వము తాము తాము నిరూపించుకొనిన చందంబునన యోగవిద్యకడంబల్కి యతని వలన నుండుట కొప్పించుకొని తమ తమ స్థానంబుల నుండిరి.

విద్యాదేవియును రాజసశ్రద్ధచేఁ బిలుపించుకొనఁబడి గంధవతీవృత్తింగుదిరియుండె. ఇట్లు కామపంచకము విద్యతోఁ గూడ తపంబున యోగవిద్యచేనాదరింపబడుచు నెవ్వరికినిదమ యునికిఁ దెలియరానివిధంబున నుండుచుఁ దమ చేయు కర్మం బులచే యోగవిద్యాశ్రద్ధల సంతసఁ పెట్టుచు నుండిరి. ఇట్లు కతిపయ దినంబులు కొంతగా నేఁడుఁ గాలంబుఁ గడిపిన సమయంబున నొకనాఁడు.

## దిగంబరసిద్ధాంతి విద్యను పట్టబోవుట

రాజసశ్రద్ధ సోదరుఁడు దిగంబరసిద్ధాంతియను కీచకుఁ డక్కడ బ్రొక్కనేతెంచి యామె కనతిదూరంబున నున్న విద్యంగాంచి యామె దివ్యసౌందర్యంబునకు మోహితుండై యామెం దన వశ్యముగమ్మని ప్రార్థించిన, నతనిందిట్టి లో నగరికిం జనియె. అంత నా నీచుఁడు భగినింగాంచి “యెట్లని

నామెం దన వశవర్తినిఁగాఁ జేయు" మని వేడిన, రాజసశ్రద్ధ యతని నూదార్చి "తండ్రీ! యాయమ శుద్ధసాత్వికశ్రద్ధాలభ్య గాని మనవంటి వారికిం దొరకునది కాదు. మాయారూపులై యితరులకుం గానరాక యామెఁ గాపాడుచుఁ దిరుగు భర్తృపంచకముఁ గలదఁట. అదియునుంగాక మనవంటివారు చేరఁ దీయందగినదిగాక నికృష్టమై యున్నదానిపై నీకింత మోహము తగదు. అది చేరినప్రాకృతిక వంశములన్నియు నశించు. తమ్ముఁడా! యిట్టిదానిపై నీ వంటివానికి వలపు దగ దుడుగు"మన్న నుడుగక "యామెను గూర్చినంగాక లేకున్న ప్రాణంబులు విడుతు" నని అక్కయడుగులంబడి విడువకున్న నెట్టకేల కొడంబడి "తృష్ణాశాంతికి కామమను కల్లుఁ దెమ్మని నీ యింటికింబుత్తు కోర్కెఁదీర్చుకొ" మ్మని యప్పటి కిం దగినట్లు చెప్పి యతని నంపె.

రాజసశ్రద్ధ సాయంసమయమున విద్యను బిలిచి యతితృష్ణ నభినయించుచు "దిగంబరు నింటికిం జని కామమను మదిరఁదె" మ్మని పల్కనెల్లంబోయిన హృదయంబుతోఁ దల్లడిల్లుచు విద్య యా పాపి చేతులఁ బడుట కోర్వక "తల్లీ! యీ పనికి నన్నంపకుము, దానికిం దగిన పరిచారకుల నియోగింపుము. ఎవ్వరి యింటి కే పనికైన నన్నుఁ బంపకుండునది యని నీ సన్నిధికిఁ జేరిననాఁడ చెప్పికొంటి పో నెల్ల" నన నది యనుచితంబని యెఱిఁగియు తమ్మునిమీఁది మమకారంబున "రాణినైన నా కోర్కెఁ దీర్చుకొన సామాన్యులఁ బంపనెల్లక నిన్నుఁబొమ్మనఁ గాదనఁదగునా? అది లాతిగృహంబె

పోయిర" మ్మనిన విద్యాదేవి చేయునది లేక దీనమాకా రంబుఁ దాల్చినట్లు పోవుచు తన కీడని యాపదలకెల్ల భగవ న్నామస్మరణంబ తరణంబని యెన్నుకొనుచు హృదయపుండరీ కమున పుండరీకాక్షు నిక్షేపించుకొని దిగంబరునింటికిం జని రాణియాజ్ఞ నెఱింగించిన నతండు "రాణియాజ్ఞ నొక్కరిచే దీర్పింతు నాతురుండనై యున్న నాతృష్ణందీర్చి బ్రతికింపు"మని పల్కుచు విద్యను పట్టంబోవ చిక్కక భయంబునం బరువిడిన, వెంటనంటి వాఁడును వచ్చుచుండ భ్రాంతయై యెటు బోవు టకుం దోచక దైవయోగంబున బయలి కొలువై యున్న యోగ విద్యంగని తత్సమీపంబునకుఁజనుచుండ నాదుష్టుండు తమోమయంబైన యామె జడముడింబట్టికొని పడలాగిన, నామె యందనూనంబై దాఁగి యున్న దివ్యశక్తి యతనిం దృణప్రాయంబుఁగాఁజేసి కూలనేసిన నతండు సొమ్మసిలి లేచి స్వగృహంబునకుం జనియె.

ఇదియంతయు నాస్థానంబున నుండి చూచుచున్న వేదకాముఁడు కుపితుండై సమయభంగంబు మఱచి దిగంబరుఁ జంప నుద్యుక్తుండై యిట్టి నీచునిఁ దనపరివారంబులోఁ జేర్చు కొని యున్న యీతండును శిక్షార్హుండేయని యోగవిద్య నంతమొందింప గమకించుచున్న తమ్మునింజూచి నిష్కాముఁడు సాభిప్రాయంబుగా నిట్లనియె. మన సమానుఁడు తన జఠరాగ్ని ప్రేరణంబున కనుకూలంబగు సాధనంబులు లభింపవో మా వంటి వారికి నిలువ నీడయగు నియోగమును భంగింపఁబూని

నాఁడిది తగనిపని, యన నాతని యుపశమన సంజ్ఞా వాక్యం బులం జేటికొని వేదకాముఁడు శమించి యూరకుండె.

విద్యాదేవి యంతటి తన పరాభవంబును జూచుచు నూఱకయ యున్న భర్తల భావగర్భసంభాషణంబుల నిందించి దుఃఖించుచు రాజస్త్రశ్రద్ధపాలికిం బోయిన, నెఱుఁగని యట్లు విద్యంజూచి " గంధవతీ ! దుఃఖింతువేల ? యెవ్వరేమి యప కారం బొనర్చిరి చెప్పుము. వా రెంతటివారేని దండింతు " ననిన క్రుద్ధయై విద్య " నీవు దండింప నక్కఱలేదు. వాని రూపుమాప నా భర్తలు గలరు శాంతింపు'' మనియె.

## వేదకాముఁడు దిగంబరసిద్ధాంతిని చంపుట.

విద్య యారాత్రి నాభిస్థాన మను పాకశాల నున్న సమానుని కడకుంజని " నా పరాభవంబునకు నిష్కృతి నాలో చింపక సుఖంబున నిద్రించుచుంటివా ? '' యనిన నతండు " సమయభంగంబునకోడి యిట్లుండవలసె. అయిన నింతట దీని దా దుష్టుఁడు మూర్ఖుండును, భీతిరహిత నీచకర్ముండును, నీయందు బద్ధానురాగుఁడును నగుట రేపు మఱలరాక మానఁ డప్పుడతని యం దీవును ననురాగవతివైనయట్లు నటించి యాధార మను నర్తనశాలకు వచ్చువానిఁగా నియోగింపుము. అచ్చట నెరు లెఱుంగకుండ నాతని బ్రమందింపవచ్చు " ననిన వల్లె యని తన గృహంబున కరిగి మరునాఁడరుణోదయం బున సర్వాలంకార శోభితుండై దిగంబరుఁడు వచ్చిన విద్యా దేవి యతనిం గాంచి సిగ్గును ననురాగంబును నుట్టిపడు

నట్లు నటించుచు, వేదకాముఁడు నేర్పినట్లు క్రమముగా నంతయు నేర్పడం జెప్పి కార్య మంతయు నతి రహస్య రూపంబున నడుచునట్లేర్పరించి పంపిన, దిగంబరుండును నతి విరహంబుతో నా దినమును గడిపి యస్తమయంబునే నాధారబిలమును నర్తన శాలకుం జనియె. చని తనకన్న మున్న వచ్చియున్న వేదకాముంగాంచి "స్యాదేకః స్యాదనేకః స్యాదేక స్యానేకశ్చ స్యాదవక్తవ్యః స్యాదేకశ్చావక్తవ్యః స్యాదనేకచావక్తవ్యః స్యాదేకశ్చా నేకశ్చావక్తవ్యః" అని యతండు సప్తభంగిమ న్యాయమున కలిమిలేములు రెండును నియతములుగాను ననియతములుగాను కలవను తన సిద్ధాంతమును నిరూపించిన వేదకాముఁడు "నైకస్మి న్నసంభవాత్" కలిమిలేములు రెండును నొక్కచోట నుండుట యసంభవమని వాదించి యతని నంతమొందించి, భ్రాతృ మరణంబునకుఁ గోపించివచ్చిన యాతని యనుయాయుల నూఱ్వుర నారాత్రియంద నశింపఁజేసి స్వస్థానంబున నుండె.

కొలఁది దినంబులన యావార్త సకల దేశంబుల వ్యాపించె. కర్మపురమున దుర్గుణాగ్రజుండు సభఁజేసి యంత ర్నాదులను వేగులవలన నన్ని యింద్రియస్థానంబులను దేశం బుల వెదకించియు నెందునుఁ బంచకాములున్న జాడఁ దెలియ నేరక వారిప్పటికి మడిసియుందురని నిశ్చయించి, బ్రహ్మ చర్యాదులచే పంచకాములు ప్రచ్ఛన్నరూపముల నెందేని యున్నయట్లు గ్రహించి దిగంబర వంశమంతయు జను లెరుఁగు రీతి నొక్క యనామకునిచే విహతంబగుటవిని మహామోహుఁ

డది వేదకామ్య కృత్యంబనియు దానివలన తపోనగరమున శాంతేయు లున్నారనియు నిశ్చయించి "యోగవిద్య నాకు శత్రుపక్షంబులోని వారగుట సైన్యంబులతో నతని ముట్టడించి తదీయేంద్రియములను గోధనమును గ్రహింతము. నిష్కామాదు లందుండి రేని యద్దుపడ నేతెంతురు. అప్పుడు వారి యోగభంగమగుట నెఱుఁగఁజెప్పి మఱల పంద్రెండేడులు ద్వైదికారణ్యావాసంబునకుఁ బుత్తము. అట్లైన నప్రతిహతంబుగా మన పాలనంబు సాగుచుండు. శాంతిపుత్రులు తపంబున లేకున్న యోగవిద్యకు సంబంధపడు సమస్తంబును చూఱఁగొంద మదియును మనకు లాభంబ" యనియె.

## క్రోధుఁడు విశుద్ధచక్రమున నింద్రియములనుగోవుల నాక్రమించుట

అట్టియెడ క్రోధమను సుశర్మ తన్నేలినవాని పనికిం బూనుకొని "కర్మపురాధీశ్వరా! పూర్వమొక్కతరి తపః పురనాథునిచే భంగపడియుంటినిప్పుడు నన్నుచ్చటికిం పంపుము. వారినందఱ నోడించి గోగణము నెక్కపెట్టఁదెత్తు" ననిన కర్మసామి "క్రోధుఁడు తన సేనఁ గొని తపమను పేరుగల యాజ్ఞాచక్రమునకు దక్షిణభాగమును విశుద్ధచక్రము నాక్రమించి యందున్నగోవులను నింద్రియములఁ బట్టఁగలఁడు. ఇట మనమెల్లఱమును నుత్తరదేశమను సహస్రార మాక్రమించి యం దానందమున నివసించు గోగణముల వెలికిం దోలిన మ్ముక్తినేతలం దుండు రేని గోరక్షణంబు కొఱకే తెంతురు.

అప్పుడు వారిం జూడవచ్చు. ఇదియ కార్యంబని నిశ్చయించి యెల్లరును బరివారంబులతో బయలు వెడలిరి.

క్రోధుండు తన జేని పనిం బూని సేనలతోఁ గదలి పోయి నాడీ సంచారుల వలన నింద్రియము లాఁగు కేంద్ర స్థానమునుఁ దెలిసికొని గోరక్షకుల నొడిచి గోవుల వెలువరించి కొనిపోవుచుండ, దద్వార్త యోగవిద్య విని కోపించి సర్వపరివారములతోఁ గ్రోధునిమీఁదికిం జని తలపడి పోరాడుచుండ క్రోధుండు యోగవిద్యం బొదివిపట్టి తన యంధచక్షువను రథంబునం బెట్టుకొని పోవుచుండం జూచి నిష్కాముఁడు వేదకాముని కిట్లను "తమ్ముఁడా! యీతని యాశ్రయంబున నింతవఱకు పగవారి కంటకుండ క్షేమంబున నుండఁ గంటిమి. ఇప్పుడితఁడు శత్రువుచేతం బడియె రక్షింపు" మన్న వేదకాముఁడు క్రోధుని వెంటనంటి నానావిధ సహిష్ణుతాది బాణంబుల నొప్పించి మీఁదికిం జని క్రోధునిఁ బట్టి బంధించి యోగవిద్యను విడిపించి నిష్కాము సన్నిధికిఁ దెచ్చిన నతఁడు క్రోధునం దనుగ్రహించి మిథ్యాకల్పనఁ దడంగనిది యితఁడు ప్రమందుట కల్లయని గ్రహించి విడిచిపుచ్చి తా మెల్లరును యోగవిద్యతోఁ గూడి తమకుఁ గల్గిన విజయంబునకు సంతసింపుచుండిరి.

## సహస్రార గో గ్రహణము

అక్కడ కతిపయ ప్రయాణములఁ గదలివచ్చి మహామోహుఁడును నాస్తికుండును నహంకారుండును మనస్సును

ధర్మార్థకాములును బ్రాహ్మణుండును యజ్ఞుఁడును ప్రబోధుఁడును బ్రహ్మచర్యుండును లోనైన వారెల్లరును సహస్రార చక్రంబునుఁ బొదివి తమ్ము మఱచి యానందమున నున్న రోగణంబులనెల్ల వెలికిఁబోఁద్రోలి వెంటన తగిలి సైన్యంబులతో ప్రభువు లెల్లరునుఁ బోవుచుండ నింద్రియ రక్షకులు తపంబునకు వచ్చి యందు నందఱును విశుద్ధేంద్రియ రక్షణంబునకుం జనియుంట శూన్యంబై యుండ, నంతిపురికిం బోయి యందున్న కంప మను నుత్తరునకుం జెప్పిన నతండు "జీవేయుల నెల్ల నవలీల జయించివత్తుఁ దగిన సారథి లేఁ" డని విచారపడుచుండ నప్పటి కచ్చోటనున్న విద్యాదేవి "మనయపానుండు నీ యరదంబుఁ నడపఁ గలఁ డతనిఁ దోడ్కొని పొమ్మనిన, రయంబున నపాను బిలిపించి యొప్పించి సారథిం జేసికొని జీవసంతానముమీఁదికింజనిదూరంబున నపారంబై కన్పట్టుచున్న చెయువులకోటికదొర మూఁకలం జూచి వడఁకుచు "బాలుండ నకృతాస్త్రుండ నేనేడ వీరితోయుద్ధమేడ" నని పల్కుచు నపానునిచే నివారింపఁబడియు నాగక యరదంబు విడిచి తపంబుత్రోవం బోవుచున్న వానిం బట్టుకొని సత్త్వాముఁడు, తాను శాంతిపుత్రుండ ననియు కారణాంతరమున నిట్లుంటి ననియుఁ జెప్పి తన తొల్లిఁటి రూపంబునుఁ జూపి యనాహత చక్రంబున నిక్షేపించియున్న యోంకార ధనువుంగొని ప్రణవనాదమను దేవదత్తంబును బట్టి యొక్కపెట్ట పూరించె. ఆనాదంబునకు సహింపక పాపయూథంబెల్ల డిల్లపడియె. ఆమీఁద బ్రాహ్మణుఁడెల్లరు విన నిట్లనియె "ఆ

వచ్చువాఁడు తప్పక సత్కాముఁడ యగు. నెండొక్కండైన నింతటి తీవ్రతర ప్రణవనాదంబు సేయనోపఁడు. కాన నింక మాయా వాదంబునకుం జోటులేదు. ఆత్మశక్తులఁ జూపు కాలంబయ్యె. దుర్నిమిత్తంబులా యనేకంబులు దోఁచు చున్నయవి. ఇంక నూఱక చూచుచున్నం గాదు. సైన్యంబులు మొనలు దీర్చి మంత్రముఁలను నాయుధంబుల సవరించుకొని జపించుచు నిలుచునది" యనిన మహామోహుఁడు సంత సించుచు "నల్లని సత్కామునితోఁ కయ్యంబుసేయం బనిలేదు. ఇతఁడు శాంతేయుండ యయ్యెనేని యజ్ఞాతభంగంబు గల్గినట్ల యగు. అక్కారణంబున మఱల పంచకాములు కామ్యంబుల కేఁగవలసినవార" యనుటయు బ్రహ్మచర్యుఁడు కాల గణ నంబుఁజేసి "నిన్నటి దినంబునకె వారి సమయంబు పూర్ణం బయ్యె. కావున్న నతండు బయలుపడ నంతయవివేకియే, ఇంక విజ్ఞానంబుననేకాని మాయోపాయంబుల నిర్జింపరాదు. ఆదినం బులు గడచనినవి. దబ్బరదొరా! నీవెంత తపించినను స్వభా వంబునన యెల్లఱకు నజయ్యుండగు కైవల్యపతిసోదరుండు నేఁడంతరాత్మాది దివ్యులచేత దివ్యమంత్రశక్తి లాభంబు నొందియున్నాఁడు. అట్టి యతని నెదిరి యేరికిం బ్రతుకరాదు. నామాటలఁ బాటించి యిప్పుడేని వానితో సంధి సఖ్యముం జేసికొనుట మేలట్లు గావింపు" మనిన నామాటలు వీటిం బుచ్చి "యాత్మసామ్రాజ్యమున నేనేమియు నీయను వారితో నెట్లు సఖ్యంబు వాటిల్లు. కావున కయ్యంబునకె కడంగుఁ" డనియె.

అప్పుడు దివంబున దుర్గుణంబుల పెక్కండ్రతో సత్కాముఁ డొక్కరుం డెదిరింపఁ బోవుచున్నాఁ డది యెట్ల య్యెడినో చూతమని యంతరాత్మాది దివ్యులెల్లరు దహరం బను నాకాశంబున నుండి చూచుచుండిరి. సుదర్శన విమా నాధిరోహితుండై యున్న యంతరాత్మ సమీపమున సదసద్విచా రుండును కుమార విజ్ఞాన విజయాలోకన కుతూహలిరై కూర్చుండి యుండె.

అట్టియెడ సత్కాముఁడు తత్త్వవిచారమను రథంబెక్కి సత్సాంగత్యమను హనుమద్ధ్వజంబెత్తించి యోంకారంబు చేఁ బూని ప్రణవనాదమును పూరించుచుండ నంతరాత్మ దత్తం బైన నుత్తమాధికారియను ముకుటంబు శిరంబున మెఱసె. కంపనుఁ డల్పుఁడయ్యు రథికవరుశక్తింజేసి రథం బతివేగంబున ముష్కరసేనఁ దఱియం దోలిన, సత్కాముఁడు ముందఱరై పోవుచున్న హృషీకంబులఁ గాంచి వాని మఱలించిగాని వీరి పనిఁ జూడనని చెప్పి రథం బావైపునకుఁ దోలించి పోవుచు పితామహుండగు బ్రహ్మచర్యునకును, నాచార్యులగు బ్రాహ్మణ ప్రబోధులకును పాద నమస్కారంబులుగా రెండేసి వాక్యం బులు బఱపి విన్నపంబులుగా రెండేసి వాక్యంబులు శ్రవణంబు లకును దాకించి చనుచున్నంజూచి పితామహాదులు ముగ్గురు సంతసించుచుఁ దమలోనిట్లనుకొనిరి. ఔరా! సత్కాముఁడెంతటి వివేకశీలుండు. అతండు సద్గుణశీలుండని యెఱిఁగియు శత్రుపక్షమునఁ జేరి తనతో పోరాడవచ్చిన మనల నెట్లుసత్కరించె. ఇత నికి సర్వవిధంబుల విజయంబగుగాక యని దీవించుచుండిరి.

## సత్కాముఁడు మహామోహాదుల నోడించుట

సత్కాముఁడును గోగణముల నిముసమునఁ దఱిసి చుట్లనున్న వారిం గొట్టి, వానినెల్ల వెనుకకు మరలించి, తపః పురంబునఁ జేర్పించి, బొమికల గూటిపౌఁజు పయింగవిసి వివిధం బులగు విజ్ఞానవాక్య బాణంబుల సర్వసైన్యంబులను నుగ్గాడి యుత్తమాధికారులనెల్ల విభ్రాంతి నొందించి, భ్రాంతికల్పను భ్రమింపఁ జేసి పరిభవించి, యంతరాత్మాధిదైవతం బగు సమ్మోహన విద్య యను బాణంబును ప్రయోగించిన నెల్ల రును సొక్కి గాఢనిద్రం గూఱిన యట్లై పడియుండ, సత్కాముఁడు కంపనుం జూచి "కుమారా! మనము వచ్చి నెడ ధారణావతి యను నుత్తర వీరియధికారంబులను నుష్ణీ షంబులఁ దెమ్మని యడిగెఁ గావున నిప్పుడ మహామోహుని మందాధికారి యను తామసంబైన నల్లని యుష్ణీషంబును, నహంకారుని మందమధ్యమాధికారి యను రాజస తామస యుక్తంబైన పచ్చని యుష్ణీషంబును, బ్రాహ్మణ ప్రబోధుల యుత్తమాధికారులను సాత్వికంబులైన తెల్లని యుష్ణీషంబు లును గొనిరమ్ము. పితామహుం డీ మంత్రశక్తి నెఱుంగుం గావున నతఁడు ప్రజ్ఞానంబు తోడన యుండు, నతని కడకుం బోకు" మని చెప్పిన నతం డట్టులన చేసివచ్చి రథంబెక్క, అనంతర మిరువురును వాదభూమి విడిచి యవ్వలికిం జని చూచు చుండిరి. బౌద్ధేయులు కనువిచ్చి చూచి సత్కాముఁ బొడఁగాంచి యెదిరింపఁ జూచుచుండ వారించి బ్రహ్మచర్యుఁడు "ఖిూరింకనుఁ దెలియరు సుగుడి యగు శాంతిపుత్రుఁడు

మీామీా యధికారములను నుక్షిప్తములను నుత్తరించుట తోడనే తృప్తింబొందరె? గాని మొదలఁ గోయింప డింకనేని సిగ్గు గలిగి పురిదారిం బట్టుట మే '' లన పాపప్రభువు నిట్టూర్చి చేయునది లేక మిగిలిన వారితో విషాద హృదయుఁ డగుచు పురికిం జేరె.

## శాంతేయులు యోగవిద్యకుఁ దమ్మెఱింగించుట.

ఇక్కడ సత్కాముఁడు దివ్యవాద పరికరముల నెల్ల నెప్పటియట్లు పోవంబనిచి యోంకారంబు ననాహతంబున నిడి మఱల నపానరూపంబుతో నిలిచి కంపనుని రథికునింగాఁ జేసికొని తపంబున కఱిగి యా నిశిఁ గడపి మరునటి దినంబున సూర్యోదయంబునన పంచకాములు యోగవిద్యా నాస్థానంబునఁ బొడసూపి తమ యమానుష కృత్యంబులకు వింతపడుచున్న యతనికిఁ దమ రూపము లెఱింగించి చూపిన నతం డానందభయ విస్మయంబులతో లేచి నిష్కామునకు నమస్కరించి నలువురు తమ్ములం గౌఁగిలించుకొని విద్యాదేవిం గౌరవింపఁ దగువారి నంతిపురి కంపి యెంతయు నాశ్చర్య సంతసంబులం దేలుచుండె. అట్టియెడ సత్కాముఁడు యోగవిద్యంజూచి,

గీ. చాల దుస్తరమైన యజ్ఞాతవాస
వత్సరంబు భవద్గర్భ వాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖావాప్త చిత్త
వృత్తి నేము నిర్భయులమై యిందులట్ల.

అనిన యోగవిద్య యిట్లను. “ మహాత్మా! నిన్న మొన్నటి వాదంబుల పగవారి బారింబడిన కొమరుని నన్నును రక్షించి యీ యున్న యాసనాదికంబులును, నాధారాది చక్రంబులును, సర్వంబును మీ రిచ్చినవియ. ఇందేది మీ కిచ్చియు మిమ్ముఁ దృప్తినొందింపనేర నా కొమరిత ధారణా వతిం బరిగ్రహించి నన్నానందింపఁజేయుం ” డని వేడికొనిన, సత్కామ్యుఁ డీమెయందు గురుత్వంబు నడిపిన కారణంబున నే నామెం జేపట్టుట నీతిగాదు. సమస్త దర్శనభేది, నిరాఘాట పరాక్రమశాలి, హరికి నల్లుఁడు, నాకు కొమరుండునగు తర్క దృష్టి యీ యమం జేకొనుఁగాక. ” అనిన నందఱును సంత సించి కాలజ్ఞుల రావించి లగ్ననిరూపణంబు సేసి వైకుంఠేయుల నోంకారేయులఁ బెండ్లికిఁ బిలువ దూతలనంపి యానందం బున వివాహకర్మంబుల నొనరించు చుండిరి. అంత పంచకా ములు తమ యేడుఁగాలంబును నుపద్రవ రహితంబుఁగా నడి పించి నందుకు యోగవిద్యంజూచి నీవు మాకు వాసుదేవు నంతవాఁడవు గాని సామాన్యుండవు గావని సంభావన గౌర వంబులఁబూజించి తదనుజ్ఞాతులై యుపప్లావ్య మను మణిపూ రక చక్రంబున నుండిరి.

## తర్కదృష్టి ధారణావతుల వివాహము.

అంత వైకుంఠమునుండి నారాయణుండును సంకర్షణుం డును దమ మను సాత్యకియును లోభ మను కృతవర్మయును కృష్ణకుమారులును తర్కదృష్టియును సమతయును వచ్చిరి.

ఓంకారము నుండి యహింసాంతర్యాసులును వారణాసి నుండి యనసూయుడను కాశిరాజును పరివారంబులతో విచ్చేసిరి. ఇట్లు పంచకాములు సకల బంధుమిత్రులతోఁ గూడుకొని యానందించుచు లగ్నమాసన్నమయ్యె నని వేగిర పడుచున్న యోగవిద్య యాదరంబు నంగీకరించి తర్కదృష్టిం దోడుకొని బంధుమిత్ర పరివారంబులతో తపఃపురమున కరిగి యందు ధారణావతీ తర్కదృష్టులకు వేదోక్త విధానంబునఁ బరిణయం బొనరించి నానావిధ మంగళాశీర్వాదంబులతోఁ జెలఁగుచుండిరి.

సీ. బుద్ధి మాత్రముచేతఁ బొడమె నీ సంసార
మజ్ఞాన కారణం బగుచు మొదల
మన మున్న దృశ్యంబు మానక కన్పడు
నది పోవ సర్వంబు నణఁగి పోవు
కలవోలె నిక్కంబు గాదు సంసారంబు
స్వప్న జాగరములు సమము లింతె
గుణశూన్యుఁ డయ్యును గుణయుక్తుఁడై హరి
చావు పుట్టువు లొందు చాయ దోఁచు
గీ. నిజముఁ గనుఁగొన్న నివ్వి లేవజుఁడు శౌరి
గుణమయములైన కర్మల నణఁచివైచి
పూర్ణ విజ్ఞాన ఘనమును బొంది సర్వ
మయుని నారాయణునిఁ గని మనుట మేలు.

ఆత్మభారతమున — తపఃపర్వము
సమాప్తము
ఓం తత్సత్



శ్రీరాధాకృష్ణ

# ఆత్మభారతము

## సమాధానపర్వము

———o———

శ్లో. తారాకారం నిఖిల నిలయం తత్త్వమస్యాది లక్ష్యం
శబ్దావాచ్యం త్రిగుణరహితం వ్యోమ మంగుష్ఠమాత్రమ్
నిర్వాణాఖ్యం సుగుణ మగుణం వ్యోమరంధ్రాంతరస్థం
సౌషుమ్నాంతః ప్రణవసహితం రామచంద్రం భజేఽహం.

— శ్రీరామకర్ణామృతము

తర్కదృష్టి వివాహానంతరమున నిష్కాముఁడౌ కర్క-నాఁడు యోగవిద్య సమ్ముఖమున తమ్ములును గొడుకులును బంధుమిత్రులును నిండియున్న సమయంబున నారాయణుఁ డెల్లఱుఁ గలయంజూచి యిట్లనియె. "పంచకామములు మాయావాదమున మనస్సుచే నిర్జింపంబడి త్రయోదశవర్షంబులు ననేకములగు కష్టములపాలై సమయంబుఁ బాలించి నేఁటికిట్లు తమ శక్తులనే చూప నిచ్ఛగించు చున్నవారు. వారును వీరి యభి

ప్రాయంబెఱింగి యల్పగుణశక్తులై యున్న యప్పుడ పరిమార్ప ననువగు నని యెదురుచూచుచుందురు. ఇది మన యభిప్రాయంబు. ఇక్కడి మిగిలినవారి తలంపెట్టిదో తెలియక కార్య నిశ్చయంబు సేయుట తగదు. కావున నియ్యవసరంబునకుఁ దగిన యుత్తమగుణు నొక్కని నక్కడికిఁ బంపవలయు. మహామోహుఁడు వీరికి కైవల్యపథంబు సుపథంబుఁ జేసి తన యవరోధంబు వీడిన మేలగు. కాదేని యప్పటికిం దగిన పనిఁజూచుకొంద" మనిన నంతర్యాగుఁ డిట్లనియె.

## కృష్ణుఁడు కౌంతేయులతో సమాధానపడుట

"కాయపురాధీశ్వరుండు మిథ్యాకల్పనా బలుండును, కామాదిదుర్గుణ సంపన్నుండును, స్వభావదుష్టుండునునై యొప్పుచుండుటం జేసి ప్రియవాక్యముల సంతసించి పాలిచ్చుట కియ్యకొనఁడు. దుర్జనహృదయములు మృదువాక్యములఁ బ్రసన్నంబులుగావు. బ్రాహ్మణ బ్రహ్మచర్యులు నీచుండనక సన్నిహిత సంబంధంబున నాగ్రుడ్డిఱేని ననుసరించిరి. జీవుండును పుత్రతృష్ణంబడి విచారశూన్యుండయ్యె. అహంకారాదు లెల్లను నతనిన సద్బుద్ధియంద్రుడు. ఎన్నివిధముల నాలోచించి నను వాదంబ యగు. కావున నిప్పుడు వాదయుద్ధమునకుఁ బిలువందగు సద్విషయ వాసులనెల్లఁ బిలువఁబంప వలయు. మదీయ పురోహితుని జీవునికడకుఁ జెప్పందగు మాటలఁజెప్పి పంపు" డన వాసుదేవుం డిదియ కార్యంబన, నోంకారేశ్వరుండు తన పురోహితునితో వలయు వాక్యంబు లుగ్గడించి స్థూలపురం

బునకుఁ బంపిన నతం డచ్చటికిం జని పేరోలగంబున నున్న పెద్దరాజుం గాంచి " పంచకాములు సమయంబుఁ దీర్చి మీతోడి పగ కొల్లక, యఖిలగుణక్షయంబున కోడి సంధియ కోరుచున్నవారు. ఇది యనదతనం బని యనుకొనకుఁడు. వారికిని సప్తధాతుబల సంపదలుఁ గూడియున్నవి. విశేషించి జగన్నాథుఁ డా దిక్కున నున్నవాఁడు. కావున నీ యదనుఁ దప్పకుండ వారల రావించి న్యాయంబుగాఁ గొంత వారికిచ్చి కలిసి బ్రతుకుట మే " లనియె.

ఆ మాటలకాసభం గొంత కలకలంబు దోఁచె. అప్పు డదియంతయు వారించి జీవుఁడు " నేనును పెద్దలును బంధుమిత్రులును నెల్లవారునుఁ దగురీతి నాలోచించి నిఖిలగుణ ప్రవృత్తికి భంగమురాని రీతి బిడ్డలకడ కొక్కనిఁ బుత్తెంతు నీ వలుగు " మని బహూకరించి పంపిన, నతఁడు శాంతి పుత్రుల కడకుం జని తన పోయివచ్చిన కార్యం బంతయు నెఱింగించె.

జీవుఁడు పెద్దకొలువు సేయించి వైరాగ్యుఁ బిలిపించి యతనితో నిట్లను. " వైరాగ్యా! నీ విప్పుడ మణిపురంబున కరిగి వాసుదేవ సహితులగు శాంతేయులఁ బొడఁగాంచి వారి దుఃఖంబు లడఁగునట్లు మాట్లాడి మీ కర్మవాస నిస్తరణంబునకు మీ యయ్య సంతోషించె ననుము. మఱియు నా కొమరుఁడు కార్యాకార్యజ్ఞుఁడు గామిం జేసి యిట్టి కలహంబులు బుట్టె నంతియకాని పంచకాములు దోషయుక్తులే ?

వారుమాత్రము కష్టములఁ బొందఁ దగియెడువారే ? తండ్రిపా లనుభవింపఁ దగినవారు కారే ? అదియునుం గాక వారు దైవబలసంపన్నులు. అట్టివారిం జెనకి యెవ్వారు బ్రతుకగలరు. కావున నీవు కైవల్యనాథు పాలికిం జని యతనివారి కెల్లఱకు నింపగునట్లు మాటలాడి పగలన్నియుఁ దీరి వాదమను మాట బుట్టకుండ స్నేహంబుఁ బూనునట్లుగాఁ జేసి శాంతిరూపంబునఁ గార్యంబు నడిపి రమ్మి వౌ " మ్మనిన నప్పుడ చని మణిపూరమున ( ఉపప్లావ్యమున ) నొడ్డోలగంబున్న విదేహకైవల్యపతిం గాంచి నమస్కరించిన నతండు ప్రియపూర్వకంబుగా నాదరించి తన సమీపంబున నునిచికొనిన గొలిచియుండి యతని కల్లన నిట్లనియె.

## వైరాగ్య ప్రబోధము

"సుగుణప్రభూ ! నీ దర్శనంబునం జేసి నా జన్మము కృతార్థంబయ్యె. నీవును విద్యయు తమ్ములును పుత్రులతో సుఖంబుండుట విని మీ యయ్య మిక్కిలియు సంతసించె. మీ క్షేమముగా నుండుటఁ గనుఁగొన నన్నుఁ బనిచె." ననిన నిష్కాముఁ డా పెద్దరాజు ననుగ్రహంబునన యిట్లున్నవారము. నిన్ను తానై నిలుపుకొన నేరకున్నను మా మీఁది ప్రియంబునం జేసి యిక్కడికేనిఁ బనుచుట మేలయ్యె. అచ్చటి పితామహాదులకుఁ గుశలంబె. మహామోహాలునింట కార్యవాదంబులకుం జాలువాఁడై యొప్పు నహంకారు పెద్దతనంబు సెల్లుచున్నదియె " యన వైరాగ్యుఁడు.

"మహాత్మా! జీవసన్నిధి నవినీతులు నీతిమంతులునుం గలరు. వా రొకరినొకరు రనుసరించెడివారు కారు. కాని నా విన్నపం బొక్కటి చిత్తగింపుము. నీవు చల్లని హృదయంబును బొందియుండఁ దలపెట్టుటం జేసి యింతకు మున్నులేకున్నను నిప్పటినుండియేని క్షేమంబు. జీవుఁడు వృద్ధును గ్రుడ్డియు నగుట మనం బొకవిధంబున నుండమింజేసి కుమారుని క్రూరత్వమును మాన్పఁడయ్యె. అనంతరమునఁగలిగిన మనస్తాపంబుచే నిప్పుడు శాంతుఁడయ్యె. నారాయణుం డాదిగా మీయెల్లరకు మీ తండ్రి చెప్పుమనిన వాక్యంబులు గల వవధరింపు" మని నిష్కాముసకు నమస్కరించి యిట్లనియె. "మహాత్మా! మీ వంటి యాత్మధర్మజ్ఞులు చులుకని వృత్తికిం జొరరు. శుద్ధ వస్త్రంబునకు మసిదాకినట్లు మీ పవిత్రవంశమునకు మహా మోహమువలన కళంకం బేర్పడియె. దానిఁబాప నీవ సమర్థుం డవు. శాంతులై వా రెప్పుడును నఖిలగుణ క్షోభంబైన వాదంబుఁ గోరరు. అందును వేదబ్రాహ్మణాది సర్వవిజ్ఞాన క్షయంబునఁ గలుగు విజయంబును నీయంతవాఁడ విచ్చగిం తువె. కావున కరుణానిధీ! యజాతశత్రూ! నీ క్రోధశాం తికై చేతులొగ్గి ప్రార్థింతు నుపశమిల్లుము. ఇట్టి కార్యం బున కులవృద్ధ పవిత్రతాపుత్రుండును సంతసించు" ననిన నిష్కాముఁడు. వైరాగ్యా!

ఉ. వెయ్యము దప్ప నొండొకటి నీ చెవి సోకెనె నాదుపల్కులం
దియ్యెడ సంజయా! యనికి నిమ్మెయి నల్కొదు నీవుమాకువాఁ
గయ్యము దక్కమన్కి తగు కార్యము గాదొకొ పోరితంబులే
కయ్యెడు నర్థసిద్ధి వెడఁగై నను నొల్లక యొండు సేయునే?

— భారతము

మమ్మునెవలిగా మా తండ్రి యింక శ్రేయంబు నిచ్చ గించునే? కాని యొక్కటి సెప్పెద వైరాగ్యా! తాను సెడుపవలసి వచ్చిననాఁడు న్యాయమార్గంబు విడిచినను చీకు లేదు మమ్మున ముంచి త్రోవను మనుండను చున్నాఁడు. ఇన్ని సోల రమ్మని మమ్ములంబిలిచి పాలిమ్మని కొడుకునకుం జెప్పి వి దేహ క్షేమల్యాంబునుగాని మఱి దేనిఁగాని యిచ్చిన తనప్రేమ ప్రవృత్తికిం దగదే? యన్నిన వైరాగ్యుఁడు,

"యదాసర్వే ప్రముచ్యంతే కామాయేస్య హృది శ్రితాః అథమర్త్యో అమృతో ఇహాభవతి" హృదయమునందలి కామము లన్నియు నెవనికి వీడునో యా మనుష్యుఁడు దేవత యగు చున్నాఁడు. మహాత్మా! ఇహామునం దేదియుఁ గాం క్షింపన్ని నీ మానసంబును దెల్పునదియె నీ యజాతశత్రు నామము. పాపులైనవారు తమ పాపంబునఁ దారె చెడుదు రంతియ. అందు నీ కర్తృత్వంబొండుచేర్చి మీ నిష్కామ కర్మసంచలనంబునకు మలినంబుఁ గూర్చుటకంటె వైదికా ర్గాగమనలంబ యొయులువు కాదె. అందును సకలగుణాక్షయంబు సౌఖ్యావహంబుగాదు, అహింసావృత్తికి భంగంబుగానిరీతి నవ

లంబించుట నీకు నీతి శాంతింపు"మనిన శాంతిపుత్రుఁడు "కుటి లవృత్తిప్రేరకులై యీశ్వరచింతాపథకంటకులై సద్గుణమార్గ ణోత్సుకులై యున్నవారి నంతమొందించుటయ యహింస. అట్లు గావింపనేరక హింసయను బుద్ధితో దుర్గుణంబుల వెంటవెంటన హింసింపక యూరకుండుటయె హింస యగు. దీనిఁ గాదందు వేని నీవ చెప్పుము. సర్వధర్మ నిర్ణయుండగు నారాయణుం డున్నవాఁ డతండ సర్వంబును నిర్ణయించు " ననిన కృష్ణుండు వికసిత వదనారవిందుండై,

" మహాత్మా! వైరాగ్యా! వృద్ధరాజు మానసుని స్వాలకుండను నభిమానంబునఁ దనయింటి తీర్పరినిఁ జేసిననాఁడ యింతవినాశంబు సేకూరె, ఆతనివాఁడై పుత్రుండును జెడియె. వినయసంపన్నులును శాంతిదాయకులును మోక్షదులును నగు వీరిని భేదదృష్టింజూచుచు నాయను సమ్మోహమును మోహా నియం దేనాఁడు జూపెనో యానాఁటి నుండియు తాను సుఖ లేశ మెఱుఁగని మహాదుఃఖములఁ గృశింపవలసి వచ్చె. భవి ష్యత్కార్మ కంతటికిని కర్తనై నేన నడిపింప వలయుటం జేసి యింతగాఁ జెప్పవలసె. బహుపుత్రవంతుండును సనాత నుం డును నగు నా క్షేత్రజ్ఞుఁడు ముందు తీరని దుఃఖములపాలు గావలసి వచ్చుట కోర్వకఁ జెప్పు చుంటిని. వైరాగ్యా! చెవియొగ్గి వినుము. మీ మహారాజునకుం జెప్పుము. తన వా రెల్లఱు మడియక తీరదు. నిష్కామ విజయంబు మాఱదు. ఈ దుర్గణసామ్రాజ్యం బింకమీఁద సాగదు. కాని యెల్లఱకు

నంతర్యామి నగుటంజేసి నిష్కామముఁ బ్రార్థించితివైన నచ్చటికి నేనె వచ్చి సర్వవిషయంబులు పెద్దలకడన చెప్పివత్తు ” ననిన వైరాగ్యుఁడు,

“ జగన్నాథా ! యింతకన్న భాగ్యంబుఁ గలదే ? తమ దివ్యచిత్తంబునకుఁ దోఁచిన రీతిం గావింతురు గాక. ఇంక నేఁ బోయివత్తు నని యెల్లరచే ననుజ్ఞాతుండై నాఁడ స్థూలపురంబునకు విచ్చేసి నిండోలగమున నున్న జీవుని బొడఁగాంచి తన పోయివచ్చిన విశేషం బంతయు నెఱింగించి మఱియు నిట్లను. “ క్షేత్రపాలా ! మనస్సును నహంకారుండునుఁ గూడి నిన్నును నీకొమరుని బొమ్మలనువలెఁబట్టి యెట్లాడించిన నట్లాడెడు వారైతి రింతియకాని పరమగతిం గాంచరైతిరి. ఎన్నడేని నాగ్రహం బెఱుఁగని శాంతేయు లాగ్రహంబునకుం బూనిరేని మీ దుష్టత్వంబును మిమ్ములను నొక్క నిముసంబునఁ గంటికిం గనరాకుండ నంతమొందింపఁ గలరని యెఱుఁగరు. వారు పితృధనమునుఁ బొందకుండ మాటల నాఁగెడు వారుగారు. ఎల్ల కార్యములఁ గూర్చి మీసన్నిధియందు విచారింప నేన వత్తునని నారాయణుండు నన్ను బంపె ” నని చెప్పిన సభయం దున్న బ్రహ్మచర్యాదులును, జీవుండును మహామోహునితో ననేక విధంబుల శాంతేయుల నిందుండ నిచ్చి కలిపికొని బ్రతుకుండని చెప్పి విఫలప్రయత్నులైరి.

## పరమాత్మ కాయపురంబునకు వచ్చుట

అంత నక్కడ మణిపూరకమున పరమాత్మ కాయపురంబునకుఁ బోయివత్తుననిన నిష్కాముఁడు పురాణపురుషా!

క. ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁ గూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁజూపి చనియె మహాత్మా!

— భారతము

తండ్రీ! నీకుమేము ప్రద్యుమ్నాది కుమారుల వంటి వారము. మే మెట్టులేని పాపంబులచేఁ బట్టువడకుండఁ జూచి రక్షించుభారము నీయందున్నది. ఎట్టులేని దాటరాని యీ మహాభ్రాంతిరూప సంసార సముద్రమునుండి తప్పించి యొడ్డుఁ జేర్పుము. మా యేవురకు నిలువ నాధారమగు నల్లే మాత్రం బేది యిచ్చినను చాలు. ఇవ్విధంబునఁ దగునట్లు మాటలాడి వాదంబుఁగాని తెలుఁగున కార్యంబు నడుపుకొని రమ్ము. ఎల్ల విధంబుల శుభంబగుఁ బోయి రమ్మనిన మాధవుండు వల్లెయని యప్పుడ యస్థి పురంబునకుం జనియె.

జనార్దనుండు వచ్చుచున్నవాఁ డనువార్త విని జీవుఁడు తాను జేయు సత్కారంబుల చేతను (అంతశ్శుద్ధంబులు గాని బాహ్యపూజా విధానముల చేత) స్థూలవస్తు ప్రదానంబుల చేతను పరమాత్మను తన వశఁగతుం జేసికొందునని యుబ్బుచుండ, నతనింజూచి సద్విచారుఁడు "అన్నా! ఎంతవెఱ్ఱివి.

ఈశ్వరుండెన్నఁడేని పరిశుద్ధాంతః కరణంబుతో నొసర్చు ధ్యాన యోగంబునగాక మిథ్యారూపైహిక వస్తు ప్రదానంబులచే సంతసించునా ?

క. చిక్కఁడు వ్రతముల క్రతువుల
చిక్కఁడు దానముల శౌచశీల తపములఁ
జిక్కఁడు యుక్తిని, భక్తికిఁ
జిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ !

— భాగవతము

భ్రాంతుండవుగాక యతండెద్దాని నభిలషించి వచ్చుచుండె నద్దాని సమకూర్చి సంతసింపజేసి సుఖింపు" మనుచుండ నయ్యెడ పరమాత్ముఁ విజయంచేసె ననువార్త వచ్చిన బ్రహ్మచార్యాదులతో కొమరుల నెదురుకొనం బంపి తోడి తెచ్చె. అనంతరమున పరమాత్ముండును సముచిత సంభాషణంబులఁ గొంత తడవుఁ గడపి, సద్విచారు నింటికిజని యచ్చట విందారగించి, యామిాద శాంతి నికేతనంబునకుంజని పుత్ర వియోగంబునను శత్రుసదన నివాసంబునను కృశించి దుఃఖించుచున్న దానింజూచి దామోదరుండు వినయసంభ్రమంబులతో నమస్కరించి అత్తా !

చ. సుగుణవు పుట్టినింటికిని చొచ్చినయింటికిఁ దేజమెక్కఁగాఁ
దగుచరితంబునఁ నడచు ధన్యవు ధీరవు దేవి ! నీ వెడ
న్వగలడగింపకున్న భువనంబుల నింకిట నెవ్వరోర్చు వా
రు గలఁకదక్కుమీ హృదయరోగములన్నియుఁ బుచ్చివై చెదఁ.

— భారతము.

నీ కొడుకు లైహిక సుఖంబులు సేకొనరు. పరానం దంబ కరం బాకాంక్షించు చున్నవారు. కావున నచిరకాలం బునన పుత్రపరిష్వంగ సుఖం బనుభవింతువు. శోకింపకు '' మని యోదార్చి మహామోహాంధుల గృహంబులకును వేఱు వేఱం బోయివచ్చి సద్విచారు నింట సాత్వికాలాపంబుల చే నా నిశిం బుచ్చి ప్రభాతంబున!

పరమాత్మ జీవుని సమాధాన పరుచుట.

జీవుఁడు నిండు కొలువిచ్చి బ్రహ్మచర్య ప్రబోధాదు లొక్కవంకను, మానసికాదు లొక్కదెసను, నిదిధ్యాస నియమాదు లొక్కయెడను, తక్కుంగల బంధువర్గ మొక్క చోటనుఁ గూర్చుండి వాసుదేవరూప సందర్శన సంభాషణా కర్ణన కుతూహలులై యుండు నవసరంబున:

వాసుదేవుం డొక్కవంకసద్విచారుని నొక్కవంక దమంబును ( సాత్యకి ) చేయూతగాఁ గొని వెనుక వైరా గ్యుఁడు (సంజయుఁడు ) రా మత్తశుండాలంబు లీల సభకు నేతెంచిన నెల్లవారును ప్రత్యుత్థానాదికంబుల గౌరవించి మణిమయాసనంబున నునిచి కొలిచి యున్నంత, నారాయణుం డెల్లఱు విన జీవునితో నిట్లను, క్షేత్రజ్ఞా!

శా. ఈ వంశంబునకెల్ల నీవకుదు రిందెవ్వారి చందబులె
ల్లైవర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయందొందెడుం గాన స
ద్భావం బారసిలోని పొత్తు వెలి వృత్తంబుల్ జనస్తుత్యముల్
గావింపదగు నీక యెవ్విధమునన్ గౌరవ్య వంశాగ్రణీ!

— భారతము

జీవా! నీవెంతటి యనంతుఁడవో తెలియ నేరకుంటిః నీసర్వలోక నియంతృత్వమును నీవుమఱచి యీ యుఁ సామ్రాజ్యమున కట్టుఁబాఁచు వాఁడ వైతివి. నీయనంత దివ లక్ష్మీవిలాసంబును బోఁగొట్టుకొని యనిత్య స్వప్న సంప లకుఁ జేయి సాచుచుంటివి. ముత్యపుచిప్ప యందలి వెండి మూఁటగట్ట నెంచుచుంటివి. "తమేవ భాంత మనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి" ఆబ్రహ్మము ప్రకాశించు చుండ సర్వలోకములును దాని ననుసరించి ప్రకాశించును సర్వపదార్థముల యందునుఁ గానవచ్చు ప్రకాశము పరబ్రహ్మ సబంధ మైనదియే. కావున విభావముని భాసింపఁ జేయు తేజ మయ మూర్తివి నీవు. తత్వవిచారమునఁ గానరాని మాయా రూపానాద్యజ్ఞానావరణంబునం బడి యంధుఁడనని దిక్కు దోఁచక తల్లడించుచుంటివి. "విశ్వసర్వేహే తురంగ మోాత ప్రాణిమాత్రైర్హైఖైదీ పదార్థధర్మా చియాశృంఖలాత్మ్యా తేకో నభేదీ" ఈ ప్రపంచమంతయు నొకగొప్ప కారాగృహము ప్రాణులందఱును ఖైదీలు. పదార్థముల యొక్క గుణ ధర్మము లనునీసంకెళ్ల నెవరును త్రెంపఁజాలకున్నారు. కాని క్షేత్రజ్ఞా నీవు దీనుఁడవు హీనుఁడవుకావు. నీవు దుఃఖివికావు మిత్రత్వ శతృత్వములు నీకులేవు. స్థూలసూక్ష్మ కారణ దేహ ములు నీకు లేవు. క్షుద్బాహాది క్షేత్రధర్మములు నీకులేవు. ఇన్నిఁటి కతీతుఁడవునీవు "యదావై పురుషస్స్వపితి ప్రాణంతర్హి వాగ ప్యేతి ప్రాణం చక్షుః ప్రాణం మనః ప్రాణం శ్రోత్రం సయదా ప్రబుధ్యతే ప్రాణాదేవ అభిపునర్జాయతే" పురుషుఁడవగు నీవ

నిద్రించు నప్పుడు వాగాది కర్మేంద్రియములును శ్రోత్రాది జ్ఞానేంద్రియములును మనంబునుఁగూడ ప్రాణమునందు విలీన మగును. మరల నీవు మేల్కొనఁగానే యావాగాదు లన్నియు నాప్రాణమునుండి జనించును. "భీషాస్మా ద్వాతః పవతే భీషో దేతిసూర్యః భీషాస్మా దగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతిపంచమ" ఆ బ్రహ్మమువలని భయమున వాయువు వీచుచున్నది. సూర్యు డుదయించు చున్నాఁడు. అగ్నియు, నింద్రుఁడును ప్రవర్తించు చున్నారు. అయిదవ వాఁడగు మృత్యువుతనకార్యము నందు ప్రవర్తించు చున్నాఁడు. "నాన్య అతోఽస్తి ద్రష్టా నాన్య అతోఽస్తి శ్రోతా" నీ కంటె (జీవుని కంటె) భిన్నుఁడగు ద్రష్టయు లేఁడు, శ్రోతయు లేఁడు. "స ఏషో అణిమా ఐత దాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేత కేతో", ఆ సృష్టికర్తయే సూక్ష్మరూపుఁడు. ఈ కనఁబడు ప్రపంచమంతయు నాయనకంటె భిన్నము కాదు. వికారము లన్నియు ననిత్యములు. కావున జగత్కారణ మగు పదార్థ మొక్కటియే సత్యము. అదియే యాత్మ, ఆ యాత్మయే నీవు. ధృతరాష్ట్రా! (దేహధారీ) దేహాళియందెల్ల మేటి వగు నీవు మహామోహాహంకారులకు లోనై మనసు ద్రిప్పు త్రిప్పుడులం బడి నిన్ను నీవు మఱచి గ్రుడ్డివైతి వంతియు ఇమ్మహాక్షోభంబున కంతకుం గారణంబు నీవకాని నీ కొడు కుం డెన్నఁడునుఁ గాఁడు. నీకుం దెలియకుండ కృత్యాకృత్య ములగు నే యొక్క కర్మయేని తన పరివారంబులతోఁ గూడియు నీ కొడుకు కేవల జడుండు కావున నిన్నుఁ గూడ

కున్న నెద్దియుం జేయనేరఁడు. నీ తూష్ణీం భావమున గావింపం బడు నీ యకృత్యము లన్నియు నెఱుకలేనివారి యెదుట నతనివియిం జేర్ప నేర్పరివైతివి.

జీవా! తృష్ణాపాశంబులం జుట్టువడి పట్టుపురుగు రీతి నీకు నీవ బంధించుకొని వ్యత్యస్తబుద్ధివై యెన్నఁడును సుఖలేశం బెఱుంగక యుంటివి. సర్వవిధంబుల నీకుం దెలియకయె నిన్నడియాసల పాలుసేసి యేడ్పించువారి నావారని చేరఁదీసితివి. నీ చీకుఁదనమునుఁ బాపి యానందసాగరమున నిన్నోలలాడింప వలయునను కుతూహలంబున శాంతిభంగంబుఁ గాని యహింసను బూని యెల్లకడలు జయించి యాత్మయోగం బొనర్చిన శాంతి సంతతిని దూరస్థ మొనర్చితివి. ఇదియ నీ సర్వనాశనంబునకుం గారణంబు. దీనంజేసి నీ దుఃఖ మెక్కనాఁడును దీరదు. నీ యుండునంతకాలంబును నిన్ననుసరించు నదియ. క్షేత్రపాలా! ఒక్కపరి నా మాటలు చెవిఁ జేర్చి వినుము. ఈ యహంకారుఁడు నీ యింట నుండునంత కాలంబును నీకు సుఖలేశంబును శూన్యంబు. ఈ భ్రాంతివాది బ్రతికియున్నంత వఱకును నీ స్వరూప దర్శనము నీకు లేదు. ఈ మానసుండు మనియున్న వఱకును నీ యాశానిగళంబు నిన్ను వీడదు. ఈ నాస్తికుఁడు నాశమొందు వఱకును నీకన్ను విచ్చుకొని పరంబుఁ గానదు. నిన్నుఁ జుట్టి బాధించు యీ పరివారం బంతయుఁ బాడువాఱినఁగాని యాత్మానంద రాజ్యస్థాపనంబుఁ గాదు. కావున నావాక్యముల నాదరించి ముందు మహామోహుఁ జంపి, మనస్సును వాని జన్మస్థాన

మున కనిచి, యహంకారుఁ బాఱఁద్రోలి, నాస్తికుమొగంబుఁ జూడక, పవిత్రులైన శాంతిపుత్రులరావించి వారింగూడి యీ వీడును వీడి విదేహాకైవల్యంబున నుంటివేని మిగిలిన యీ యెల్లఱును ప్రాణంబుల నుందురు. ప్రసన్నాత్మని స్థిత్వా సుఖమక్షయ మశ్నుతే '' తేరుకొనిన బుద్ధిఁ గలవాఁడవై నిలిచిన శాశ్వతసుఖము గలుగుచున్నది. అట్లుఁ గాదేని నీ వాక్రోశించుచు వారువ్రాయిరి, వీరువ్రాయిరని చూచుచుండ నేనై పూని యుండజా నంతమొందింతు. మఱియు సదసద్వివేకుని కుమారులు నీకుఁ బరమభక్తిం బ్రణమిల్లి యిట్లను మనిరి. '' తాను గల పదివేలేండ్లకేని తన్నుకాని యన్య మెఱుంగము. మాకుఁ దల్లియుం దండ్రియు నెల్ల చుట్టంబులును దాననేఁడుగడయుఁదాన. తనబిడ్డల యిరుగడలవారి వలనం గలిగిన పుణ్యాపాపంబులకుఁ దాన కర్తయగుంగాని యొరులు గారు. తనయం దాత్మవిజ్ఞానంబుఁ గలిగిన నెవ్వరు కొఱగాకున్నను నాత్మసామ్రాజ్యంబు చెదరక సాగునను '' మనిరి. ఇంతకును.

ఉ. సారపు ధర్మముఁ విమల సత్యముఁ బాపము చేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడబారినదైన యవస్థ దక్షులై
వ్వారలుపేక్షసేసి రది వారల చేటగుఁగాని దర్మ ని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవముండెడుఁ.

— భారతము

అని ప్రబోధించుచుండ నిదిధ్యాసాది మానులెల్లఱు పొల్లులతేనిం బొడఁగాంచి తండ్రీ! నీ తండ్రిని బాధింపకుము. ఈతఁడు ''ఆత్మ భాసాశ్ర యాజ్ఞానాత్ సంసర్గం త్వవివేకితః''

తనయందావరించిన యజ్ఞానమున నవివేకియై సంసారమునఁ జిక్కుకొను చున్నాఁడు. పుత్రమోహమునన్నిన్నుఁ గాదన నేరకున్నవాఁడు. ఆతఁడు సుఖంబున నుండుటయె మా యెల్లఱ సుఖంబును కావున యింతగాఁ జెప్పవలసె. మా మాటల నాదరించి సదసద్వివేక సంతతిం గూడియుండుము.

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు త్రోవఁ బో
వన్న! కుమార! యట్లయిన నాయువు శ్రీయును నీకుఁగల్గు మా
కన్నులు సల్లగా నకట! గన్గొనుచుందుము మేము నట్లు గా
కున్నను నీవనేర్తునిను నొండననేరము నిండుకొల్వునన్.

— భారతము

ఇట్లు సెప్పుచున్న వారి మాటలు గీటు సంబుచ్చియప్పాపి "కృష్ణుండు తన్నుఁజంపుమని జనకునిఁ బ్రేరేపించు చున్నాఁడు. దిక్కులేక యొక్కఁడై మన సభనున్న యీతని నిప్పుడ పట్టి బంధించిన పంచకాముల పంచత్వంబున కెంత తడ" వని మానసికాదులతో నాలోచించుచున్న యెడ నాసన్న నెఱింగి పురుషోత్తముండు జీవునిఁ గూర్చి యిట్లనియె.

## శ్రీకృష్ణుఁడు విశ్వరూపమును జూపుట

"మామా! నీకొఱకుఁ డెంతటి మతిహీనుఁడు. నే నొక్కండన యింటివని తలంచి యలవి నెఱుంగక నామీఁదఁ గోపించి బంధింపఁ దలంచె. భక్తుల హృదయంబులం దప్ప మఱి యెచ్చటను దగులువడు వాఁడఁ గాను. నా నిజరూపం బెఱుంగక నింతపనిం జొచ్చె. దీన నేమయ్యెడిని నాకుఁ దోఁచి

నంతవట్టు శత్రుల శత్రుత్వంబుం జక్కఁబెట్టి పోయివత్తు" నని పల్కుచు యెదురనున్న మిథ్యాకల్పనుం జూచి "బావా! బాలిశ బుద్ధిం జేసి బోధింప వచ్చిన నన్నుఁ బట్టనెంచితి వేదీ! పట్టుము! చూత" మనుచుఁ జిఱునవ్వు నవ్విన, నవ్వు వెంటన యా దేవుని ఫాలంబున బ్రహ్మయు, వక్షంబున రుద్రుండును, వదనంబున వహ్నియు, పార్శ్వంబుల నింద్ర యమ వరుణాదులును, కుడి యెడమ భుజంబుల సంకర్షణ సత్కాములును, నిష్కామ వేదకామ సత్యకామాప్తకాములు వీపునను, వైకుంఠ లూరువులను జనించి తోఁచుచుండిరి. శంఖ చక్ర గదా ఖడ్గాదులతో ననేక నేత్ర శ్రోత్ర నాసాదులునుం గలిగియున్న యా దేవుని సర్వాంగంబుల నుండి దుర్నిరీక్ష్యంబగు మహాతేజం బుద్భవించిన, నా తేజోజాలంబులఁ గనుంగొన నేరక యెల్లవారును నయనంబులు మొగిడ్చిరి. బ్రహ్మచర్య బ్రాహ్మణ నిదిధ్యాస సద్విచారులు మాత్రమా విశ్వరూపంబును సందర్శింపఁ గలిగిరి. నారాయణ సందర్శన కుతూహలి యగుచున్న జీవునకుఁ బురుషోత్తముండు దివ్యదృష్టి నొసంగిన నతం డద్భుతంబును నానందంబునుఁ గదుర నా విశ్వరూపుని రూపంబు సందర్శించి భక్తియుక్తుండై నమస్కరించి పులకితగాత్రుం డగుచు నిట్లని స్తుతియించె. పుండరీకాక్షా! పురుషోత్తమా! పురాణపురుషా! నాపురాకృతపుణ్య విశేషంబున నిన్నుం దర్శింపఁ గంటి కృతార్థుఁడనైతి ప్రభూ! ఈ సందర్శనమును స్థిరస్థాయిగా నుండున ట్లనుగ్రహింపుము. క్షణమున నొకలీల వేఱొండు క్షణమున మఱియొక లీలగా మార్చి మార్చి

మావంటివారి నాడించుట నీ లీలావిలాసము. అట్లొనర్చకుము. చేతులొగ్గి ప్రార్థింతు నయాచితముగా లభించిన యీ యానంద ధనమును చెదరక నిల్పుము తండ్రీ!

శా. నీమాయన్ దెలియంగనేరక సదా నీరేజగర్భాదులున్
వ్యామోహంబును బొందుచుండ జడుడన్ వ్యర్థుండ నల్పజ్ఞుడన్
సామాన్యుండ ననంతునిన్ గనుటకే శక్తుండ నెట్లౌదు నో
భూమానంద సురూప కావవె కృపన్ భూతేశ! లక్ష్మీపతీ!

సీ. అష్టాంగయోగ సమాభ్యాస పటిమంబు
దేవ! నీ తత్వంబు దెలియు కొఱకె
కామాది షడ్వర్గ ఖండ చండిమ మెల్ల
కమలాక్ష! నీమూర్తి గాంచుకొఱకె
తాపత్రయాభీల దావాగ్ని హరణంబు
నిఖిలేశ! నీభక్తి నిలుచు కొఱకె
జప తపాది విశిష్ట సత్క్రియా చరణంబు
లవ్యయా! నీపదంబందు కొఱకె

గీ. కడగి నిత్యంబు నేజేయు కర్మలెల్ల
తండ్రి! నీ సన్నిధినిజేరి తనరు కొఱకె
భావనాతీత గుణజాల! భవ్యశీల!
భరిత గర్భస్థ బ్రహ్మాండ భాండజాల!

స్మరణ మాత్ర సకల పాపహరణా! నారాయణా! భవిష్యద్విద్యా వాదమున నన్నుజుట్టి బాధించు నీ మమకార మహా మోహ పాశంబుల నెల్ల భేదించి నాహృదయకమల కర్ణికా పీఠంబున నిష్కామకర్మ పట్టాభిషేకం బొనర్చి

యానంద రాజ్యంబు సుస్థిరంబుఁజేసి నీ యందు జేర్చుకొనుము. జగన్నివాసా ! జనార్దనా ! నీ కివే నా యనంత నమస్కారములు. తండ్రీ ! యఖండరూపంబుననున్న నిన్నుఁ జూచిన యీ నేత్రంబులతో ఖండప్రకృతినిఁ గాంచనేర. లోపలనకాని యీ వెలుపలి చూపు నుపసంహరింపు '' మని ప్రార్థించి ప్రకృతిస్థుండై పరమాత్మ ననుగ్రహంబున నెప్పటియట్ల నుండె. నారాయణుండునుఁ దనమూర్తి నుపసంహరించి " పోయివత్తు '' నని చెప్పి పయనంబగునెడ బ్రహ్మచర్యుఁడు " కాలపక్వ మిదం మన్యే సర్వం క్షత్రం జనార్దనా '' " కాలావధి యయ్యెఁ గావలయు నక్కట! వారికి వారివారికి '' అనియె. నిదిధ్యాసాదులు తమతమ నివాసంబులకుం జనిరి.

## శ్రీకృష్ణుఁడు శాంతినికేతనమున కేఁగుట,

మాధవుండు శాంతినిలయంబునకుం　జని దుర్గుణసభావృత్తాంతం బంతయు నెఱుకపడం జెప్పి " కొమరులకేమి సందేశ మంపెద'' వన " తమతేజంబునకు దోహదంబొసఁగు కర్మంబున మెలఁగ వలయుంగాక యిట్టి మొఱకుల పొత్తుఁ గోరి తామునుఁ జెడుట న్యాయముగాదు, సత్కాముసంత వాఁడు నిజాత్యుచితంబగు సత్వవృత్తంబున శాంతిసమరంబు నడిపినంగాక కల్యాణంబు గలదె. వేదకాముఁడు వీరి పొత్తున నెట్లు బ్రతుకఁ గలఁడు. ఇదియెల్ల నిష్కాముసకుం జెప్పుము. పోయిర '' మ్మనిన నయ్యమకు నమస్కరించి, యటనుండి వెడలి మార్గమధ్యంబున నహంకారుం గూడుకొని యతిరహ

స్యంబున నతనితో “ నీవును శాంతేయుండవ, వారిఁ గూడి యాత్మసామ్రాజ్యం బంతయు నీదిగా ననుభవింతువు ర ” మ్మనిన నహంకారుండు “ కృష్ణా ! యిది వెడవెడ నెఱుంగుదు నైనను తామసగుణముచేఁ బోషింపంబడి మహామోహుని మన్ననకుఁ బాత్రుండనై యొప్పుచున్న నేను నేఁ డందు వచ్చుట విరుద్ధప్రవృత్తిగాదా ! ఇంతయు నశించి నిష్కామునఁ డొక్కఁడె జీవునకు బ్రహ్మపద ప్రదర్శకుండు గావలసియున్నది. ఇదియంతయు నీ సంకల్పరూపంబె యని యెఱుంగుదు. నీ దివ్యచిత్తంబునకుం దోఁచినరీతి జీవనిర్వాణంబును గోరి చేయ వలయున దంతయుం జేయుము. పోయివత్తు ” నని యతండు ననియె. పరమాత్మ యటనుండి కదలి కతిపయ ప్రయాణ ముల మణిపూరకంబునకు విచ్చేసి పంచకాములను యోగ విద్యాంతర్యాగులను వీక్షించి తన పోయివచ్చిన తెఱంగంతయు నెఱింగించి “ యీ సర్వంబునకుఁ గర్త జీవుండ కాని మఱి యొండుగా డతండు సరళహృదయుండైన నెట్టి యకార్యం బునుఁ బుట్టదు. ఆవృష్ణిని సంకల్పంబెనుమా? యీ కుమార వర్గరూపంబునఁ బుట్టినది. తత్త్వమార్గమున నంధీభూతుఁడై యున్న యతండేల సత్పథంబున నడుచుట కియ్యకొను ? “ నిమిత్తాచా దనీ కేలా అనే ప్రాణీ, మోఝే మోఝే మ్హణేని వ్యర్థ గేలా ” జీవుడు నిమిత్తమాత్రముగ స్వతంత్రుడుగాన వ్యర్థముగ నిదినాది యిదినాది యనుకొని చెడిపోవును. ఆతని యపత్యంబు నీవారశూకవత్తన్వీస్థానంబేని మీ రుండుటకుఁ జూపననియె. సత్యంబును నంతియ ప్రకాశాప్రకాశము లొక్క

కడ నుండరాని యట్లుగాదె ? వారును మీరును నొక్కచోట నుండుటకు వలను పడకుండుట దీనినెఱిగియు మీరు వారి పొత్తుఁగోరుట యాశ్చర్యంబుగాదె ? అది యట్లుండె ఆపైన నా పొల్లుల దొరకు నిదిధ్యాసాదులతోఁ జెప్పించితి, నేనును శాంతి వచనంబులఁ బల్కితి, ధిక్కరించితి, ఎన్ని భంగులఁ జెప్పిన నొడంబడక యతం డశక్తదుర్జనకర్మంబు సేయం జూచిన నంతనేనును నమానుషంబులగు గొన్ని వెడమాయలం బన్ని పెక్కు పోకలం బోయితి, యెన్ని భంగులను సంధానము కావలయు నని పొరలంగల యంతవట్టునుం బొరలితి, ఆపాపి యెట్లును సన్మార్గగామి గాఁడయ్యె, ఇకమీాద మీాకుంబోలిన తెఱఁగు నిర్ణయింపు" డనిన నిష్కాముఁడు తమ్ములంజూచి "జీవసభం గలిగిన విశేషంబులు వాసుదేవుండు సెప్పుచుండ వింటిరిగదా ? పితామహాదులగు చుట్టంబులఁ జంపుట యన్న మనంబు క్షోభించుచున్నది. యేమిసేయుదు" ననిన కృష్ణుం డిట్లను.

## అహింసాదులకు సేనానాయకత్వంబు నిర్ణయించుట.

ఇప్పటికి వాదంబ ధర్మమై యున్నది. శాంతిదేవి యాజ్ఞయు నిదియ. ఇది యిట్లు జరిగిన మహావిద్యామనోరథంబు సేకూరు" ననిన నిష్కాముఁడు మనకుం గూడినవి యేడక్షౌహిణులు. వీని నెల్లఁ జెదరకుండఁ గూర్చి నడిపింపం దగు సేనానాయకు నొక్కని నిర్ణయింపుఁ" డనిన సత్కాముఁ డిట్లను. "సర్వసుగుణ ప్రవృత్తులకు మొదలై, యీశ్వర

సమిష్టిసేవకుఁ బ్రథమపుష్పమై, హింసాత్మిక బ్రాహ్మణంబుల ఖండింప నెవ్వఁ డంతర్యాగంబున జన్మించెనో యట్టి యహింసుండ సర్వసేనా నాయకత్వమునకుం దగువాఁ" డనిన నెల్లరును నట్లయని యతని కప్పుడ పట్టంబుఁ గట్టి తక్కిన యక్షౌహిణీ నాయకులను నిర్ణయించిరి. వారు —

అక్రోధాపారుష్య శాంతిక్షమా కరుణాదృష్టి కార్పణ్య నాశన ధైర్యకవచాది సేనాపరివృతుండై యహింసుండును, (దృష్టద్యుమ్నుఁడు) జ్ఞానవిజ్ఞాన సాత్త్విక దుర్గుణ హరణైక త్వరూప బ్రహ్మలాభాదిసేనా పరివృతుండై యంతర్యాగుఁడును (ద్రుపదుఁడు) కంపనుఁడను కొమరుండును (ఉత్తరుఁడు) పద్మాసన సిద్ధాసన బద్ధాసన ప్రాణనిరోధ నాసికాదృష్టి సరళ వీణా దండాది సేనాపరివృతుండై యోగవిద్యయు (విరటుఁడు) అహం నాశక కూర్మ చేష్టాంత ర్వృత్త్యాది సేనలంగూడి దమంబును (సాత్యకి) నిస్తంభేంద్రియ నిరస్తగుణాది సేనలతో నుపరతియు (శిశుపాలుని కొమరుఁడు దృష్టకేతుఁడు) ఈశ్వర సేవాపరితోష శాశ్వతలోకాభిలాష మనీషాత్రయ నిరసనాది సైన్యంబులతో తితిక్షయు(జరాసంధుని కొడుకు సహదేవుఁడు) ఈశ్వరాస్తిక్య వేదాస్తిక్య సత్యాస్తిక్య పరలోకాస్తిక్యాది పరివారములతో విశ్వాసుఁడును (యాదవపతి చేకితానుఁడు) సక్తతా తృణమేరు కరణాది సేనా పరివృతుండై యభిరతియు (శిఖండి) గూడి సప్తాక్షౌహిణీ నాయకులైరి. ఇట్లు గూడిన సైన్యంబులతో ప్రయాణభేరీ నాదంబును గావించి పంచ కామ్యులును తర్కదృష్టి(అభిమన్యుఁడు) మోక్షము సంతోషము

ప్రీతి యానందము దయ యను కొమరు లాఱ్వురను శ్రీహరి యను దమంబును నాత్మవిజయ వాదోచితాలంకారంబులతో విద్యాదేవి యున్నయెడ కరిగి యాయమచే నామంత్రణంబు వడసి తత్కృత మంగళాక్షతలు గైకొని యెల్లఱును సాత్విక వాదోత్సాహంబున దృఢనిశ్చయం బను కవచధారణంబులు చేసి ధర్మభూమియైన కురుక్షేత్రమను కర్మదేహంబునకుం జని యందొక్క వివిక్త సమప్రదేశంబున పరివారముల నిల్పి పరమాత్మ సత్కాములు ప్రణవనాదములను తమ శంఖముల పూరించినం దక్కిన యోధులును నట్లు గావించిరి. అంత వారికిఁ దగునట్లుచిత దేశంబుల విడిదిపట్లు గావించి యహింసుఁడు వీటినెల్లను సురక్షితంబుగాఁ జేసె.

## బ్రహ్మచర్యాదుల సేనానాయక నిర్ణయము.

స్థూలపురమున దుర్గుణప్రభువు చారులవలన నవ్వార్త విని యహంకారాదులతో నాలోచించి "మన సేనలన్నియు నొక్కచోఁ గూడునట్లు చాటింపుఁడు. ఎల్లి పయనంబై కర్మక్షేత్రమున విడియింత" మని యాజ్ఞాపింప విని యగుఁ బొమ్మని నాస్తికుండును నహంకారుండును ప్రభువు నానతి నందఱ నొక్కెడఁ గూర్చి యతనికిం జెప్పిన విని మహామోహుఁడు పితామహు కడకుం జని నమస్కరించి యిట్లనియె.

"తాతా ! యీ నిండిన సైన్యములు సంకుల వాదములందు కూడి నడువ నేరవు, వీరందఱు నొకరి వృత్తి నొక రెఱుంగని బహు విషయవాసు లగుటం జేసి యొక్కటిగా

మెలంగుట దుర్ఘటంబగు. ఇట్టి వీరి నెల్ల నిటు నటుఁ జెదర కుండ నిల్పి నడిపింపఁ దగువాఁడ వీవకాక యీ కూడిన వారి యందు మఱియొకరు లేరు. కావున మమ్ముఁజేకొని పట్టంబుఁ గట్టికొని రక్షింపు " మని ప్రార్థించిన బ్రహ్మచర్యుండు " నాకు మీరును వారును నొక్కరూప మైనను మీ కడ నుండుటం జేసి యీహింసాకర్మంబు నా కుచితంబ యగు. సేనాధిపత్యంబు వహించెద. నాతోఁ బోరఁగల పురుషర్షభుఁ ప్రపంచమున నొక్కనిం గాన. సత్కాముని కొక్కనికి వెఱతు. నతం డెక్కుడు విద్యల నభ్యసించి యున్నవాఁడు. పరసైన్యము లెన్నియేని ద్రుంతుఁ గాని యీ నియతకర్మము లకుఁ గట్టువడి పంచకాముల మాత్రము కొట్టనోప. వారును నాముందు నిలువనోడుదు " రని పలుకుచున్న సత్యవ్రతు మాటలకు సమ్మతించి యప్పుడ యతని సర్వసేనలకుం బతిఁ గాఁ బట్టంబుఁ గట్టి మిగిలిన పదునొకం డక్షౌహిణులకు వేరు వేర నధిపతుల నియమించె నట్టి సైన్యంబులు—

ఋక్కు పద ఘన జటానుదాత్తోదాత్త స్వరితంబులను పరివారములతో బ్రాహ్మణుండును (ద్రోణుఁడు) సర్వో త్కృష్టుఁ డనుకొమరుండును (వృషసేనుఁడు) పరనాశకుతూహల పరనిందాపరాయణ పండితమ్మార పామరవిచారులను వారితో నహంకారుండును (కర్ణుఁడు) ఆజ్య సమిధ స్రుక్కు స్రువ శరావ పేటికాది పరివారంబులతో యజ్ఞుఁడును (అశ్వత్థామ) నియమ పాలన జీవతోషణ పారమార్థికాది పరివారంబులతో ధర్మాం ధుఁడు (శాస్త్రికుఁడు) అస్వప్నపాలన భంగభయాసంతృప్తాంధీ

కరణ సంఖ్యాసమీకరణాది పరివారములతో సర్ధుండును (సోమదత్తుడు) రూప మద యౌవన మదులను కొమరులును చంచల నేత్రోష్ఠపీడనాంగ చలన నిందాత్మణీకరణాది పరివారములతో కాముండును (భూరిశ్రవుడు) అతివినయుండను కొమరుండును, తులసీదామ రుద్రాక్షహార కౌపీన కమండల భస్మాంగ రాగోర్ధ్వపుండ్ర శూన్యజప నిమీలితాక్షాది పరివారంబులతో దంభుడును (శల్యుడు) త్రైత్తిరి బృహదారణ్యాదులతో ప్రబోధుండును (కృపుడు) సంకల్ప వికల్పలను కొమరులును, మిథ్యానిరూపణ సంచలనాత్మక సర్వ పరిభ్రమణ మాయావాద వంశనాశక శూన్యదృష్ట్యాది పరివారంబులతో మానసుండును (శకుని) పిశు నాస్వప్నాహారాదత్తాసంతృప్తాదులతో లోభుండును (కృతవర్మ) ప్రకృతి నిత్యేశ్వరానిత్యాణుపరిణామ స్వభావజననాదులతో పాషండుడును (సైంధవుడు) హింసా పారుష్యులను తమ్ములతో దంత దష్ట రక్తాక్ష సర్వాంగకంపన బధిరకర్ణ ముష్టిప్రియ భృకుటి విక్షేపాది పరివారంబులతో క్రోధుండును (సుశర్మ) అంధనయన తిరస్కార ధీరత్మణీకరణాదులతో మదుండును (కాంభోజరాజు) బ్రహ్మమిథ్యయను కొమరుండును, (దౌశ్శాసని) సర్వమిథ్య సర్వశూన్య మూలాభావ స్వప్నతుల్య పిచండిల ఘృతపీనాదులతో నాస్తికుండును, ( దుశ్శాసనుడు ) అంధుడను కొమరునితో ( లక్ష్మణుడు ) విభ్రమ మిథ్యాదృష్టి సర్వనాశ కాహంకర్తృత్వాదిక పరివారంబులతో మహామోహుండును. ( దుర్యోధనుడు ) శీతోష్ణ సుఖదుఃఖ

మానావమాన కాంచన లోష్టాదులను వారితో ద్వంద్వంబును, ( విందానువిందులు ) మఱియు మత్సరంబును ( వికర్ణుఁడు ) అసూయయును, ( దుర్ముఖుఁడు ) గూడిరి. ఇందఱకుం దల కట్టయి ధృతిధారణేంద్రియనిగ్రహసుఖలేశతృణీకరణశాశ్వతా నందకాంతాది పరివారంబులతో సర్వసేనాధిపతి బహ్మచర్యుం డును ( భీష్ముఁడు ) నిందఱునుఁ గదలి భేరీ నాదంబులు సెలంగ కురుక్షేత్రంబుఁ గదియం జొచ్చి యం దొక్క రమ ణీయ ప్రదేశంబున విడిసిరి. ఇట్లు రెండు వీడులును సన్న ద్ధంబులై కర్మక్షేత్రమునఁ గూడి యుండె.

శ్లో. క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతా మనుదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాదన్నం నతు యత్యతాం విధివశాత్ప్రాప్తేన సన్తుష్యతామ్
ఔదాసీన్య మభీప్స్యతాం జనకృపా నైష్ఠుర్య ముత్సృజ్యతాం
శీతోష్ణాది విషహ్యతాం నతు వృథా వాక్యం సముచ్చార్యతామ్.

శంకరాద్వైతోపదేశము.

ఆత్మభారతమున — సమాధానపర్వము.

సమాప్తము.

ఓం తత్సత్.



శ్రీ రాధాకృష్ణ

# ఆత్మభారతము

# బ్రహ్మచర్య పర్వము

---

శ్లో॥ మాత్రాఽతీతం స్వాత్మవికాసాత్మ విబోధం
జ్ఞేయాతీతం జ్ఞానమయం హృద్యుపలభ్య,
భావగ్రాహ్యానంద మనన్యంచ విదుర్యం
తం సంసారధ్వాన్త వినాశం హరిమీడే.

## కర్మదేహమున సుగుణ దుర్గుణ వ్యూహములు సాత్వికవాదంబున కుపక్రమించుట

రాత్రి శేషంబుఁ గడపి మరునాఁ డరుణోదయంబున దుర్గుణప్రభువు వాద నిపుణనాదంబు సేయించిన సర్వగుణ సముదాయంబును చంద్రోదయ కాలఘూర్ణమానమహార్ణవంబు కరణి భూరి నాదంబుతో వెడలి రణవాద భూమిం జేరె. అయ్యవసరంబున సర్వసేనాధిపతి వాదనిపుణుల నెల్ల వీక్షించి యిట్లనియె "బ్రహ్మవాదంబు వివృతమోక్షద్వారము. దేహ

మున జిక్కి తెవులునం జచ్చుటకంటె పాపంబులేదు. కావున తత్త్వవిచారంబున కోడక సర్వవిలయం బాకాంక్షించి యాత్మ విజయంబు నొందవలయు." నని చెప్పి వాదుల నయ్యై స్థానంబుల నిల్పి మానుషంబను దృఢవ్యూహంబును బన్నిన దాని రచనా విశేషంబున కందఱును నచ్చెరువందుచుండిరి.

శాంతేయులును వాదంబున కనువగు హఠసాంఖ్య ముద్రాయోగ యమ మహావాక్యాది వరసాధన సన్నాహంబుల సమకట్టి బయలువెడలి కర్మక్షేత్రమున రణవాదభూమిం జేరిరి. అంత నిష్కాము ననుమతంబున సర్వసేనాధిపతి యహింసుం డచలవ్యూహంబుం బన్ని సర్వజన శ్లాఘాపాత్రుం డయ్యె. ఇట్లుభయసేనలును తమతమవాహనంబులను, నాయుధంబులను సవరించుకొని వాదోత్సాహంబులై యొప్పుచున్న యవసరంబున; నిష్కాముఁడు కవచంబు విడిచి యాయుధంబులు రథంబునం బెట్టి మౌనియై బ్రహ్మచర్యు దెసకు చనుచుండ, తమ్ములును, నారాయణుండును, తక్కుంగల గుణజాలంబును నాతనిచిత్తం బెఱుంగక యుత్తలం పడుచు వాహనంబులు డిగ్గి యతనిం గూడం జని "మేమెల్లర నిట్లుండ గాల్నడ భీతుండునుంబోలె నొంటివై శత్రుమధ్యంబునకుం బోవచ్చునే?" అనుచుండ మాఱువలుకక పోవు నాతనిం జూచి మాధవుం 'డీతని యభిప్రాయం బేనెఱింగితి బ్రహ్మచర్య బ్రాహ్మణ ప్రబోధంబులకు నమస్కరించి వారిచే ననుజ్ఞాతుండై వాదంబు సేయందలంచి చనుచున్నవాఁడు. పెద్దలైనవారి యాజ్ఞంబొంది వాదంబుసేత విజయప్రదంబనియార్యు

లువకాఁ గింతురు. కావున నిది సుకర్మంబ'' యనియె. పాప యోధులెల్లరు నబ్బురలెత్తి కనుంగొనుచు 'నిదియేమి యీ రాజిట్లయ్యె'నని యనేకవిధంబులఁ జెప్పుకొనుచుండి రట్టియెడ.

నిష్కాముఁడు బ్రహ్మచర్యాదులచేత వాదమున కనుజ్ఞాతుండగుట

నిష్కాముఁడు బ్రహ్మచర్యుఁ పాలికింజని నమస్కరించి సవినయంబుగా నిట్లను "మహాత్మా! నీవు శత్రుమండలిం జేరిన వాఁడవైనను వర్గభేదంబున మావాఁడవయాటను, నిన్నాదరించి వాదము సేయవలసియుండుటం జేసియు, ననుజ్ఞ నాకాంక్షించి వచ్చితి. నీదీవనం బొంది పగవారి నడంతు''ననిన నతండు చిరునవ్వునవ్వుచు నజాతశత్రూ! నీవిట్లు రాకతక్కిన నశించునట్లు శపించియుందు. విజ్ఞానకార్యం బొనర్చితివి. విజయంబుఁ బొందుము. ఇదియునుంగాక నీవై పునకుం జేరి వాదించుట దక్క యొద్దియేని వరంబుఁగోరు మొసంగెద'' ననిన "జీవసన్నిధిని నుండియ వాదంబొనర్తుము కాని నాకు మేలగు కార్యంబును మాత్రము మీదివ్యచిత్తమున దలంపు మిదియ వరం'' బనిన "నట్లయగుఁగాక యిందు నీయభిప్రాయంబేమి'' యన "పితామహా! తీవ్రవాదంబున నిన్నుఁ గెల్చు నుపాయం బానతి''మ్మనిన

క॥ ననుమార్కొని సెలవఁగన
యనిమిషులకు నరిదియనుడు నట్లగుటఁగదా
నినువేఁడెద నని కుంతీ
తనయుఁడు వలుకుటయుఁ దత్పితామహుఁడు గృపతో

నాచేత ధృతిధారణ యను నాయుధంబులుగల యంత వట్టు నెవ్వరికిని సాధ్యుండఁ గాను. "ధర్మమేవ జయతి" పోయి రమ్మనిన సంతసంబునం బొదలి నిష్కాముఁ డచ్చటి నుండి కదలి బ్రాహ్మణుని కడకుం జని బ్రహ్మచర్యా నట్ల ప్రార్థింప నతండు "నారాయణుండు నీకు మంత్రియై సర్వ కర్మంబులు నడుపుచుండ నెరుల విజయంబుఁ గోరి ప్రార్థింప నేల. ధర్మ మెందు గలదందు దామోదరుం డుండు. అక్కడన విజయంబుఁ గలుగు" ననియె. నిజవిజయోపాయంబు వేడిన నతండు "నాచేత బుక్కను నాయుధం బుండునంతవర కెవ్వరి చేతను నోడింపఁబడు వాఁడఁగాను. నమ్మఁదగిన వారిచే సహింపరాని నాస్తిక వాక్యంబు వింటినేని యప్పుడ సన్యస్త వాదుండ నయ్యెద. అట్టియెడ నెవ్వరేని జయింప నోపుదు" రనియె. అటనుండి ప్రబోధు కడకుం జని తద్విజయోపాయం బడుగ నేరక చూచుచుండ నాతని యభిప్రాయం బెఱింగి ప్రబోధుఁడు "నే నెవ్వరిచేతను నోడెడి వాఁడఁ గాను. విజయి వగుము పో" మ్మన,

ఆమీఁద నిష్కాముఁ డాలోచించి యహంకార మెప్పు డును దంభము నాశ్రయించి వెలుఁగొందుట నెఱుంగుం గావున దంభుని కడకుఁ బోయి నమస్కరించి "మామా! నీ కహంకారుని సారథ్య మవశ్యము సంభవించుం గావున నప్పు డతనిఁ దూలం బలికి చిక్కువరచి మమ్మా వాదార్ణ వంబునుండి యుద్ధరింపు" మని కోరిన "నట్లయొనర్తు విజ యివగు" మని దీవించినం బొంగి మరలివచ్చి సత్యవాదం

బను తన రథంబెక్కి శాంతియను కవచంబుఁ దొడిగి సామ వాక్యంబులను బాణంబులు చేతఁ బట్టిన, తక్కినవారును తమ తమ రథంబు లెక్కిరి.

భగవద్గీత,

" ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ "

క్షేత్రం = దేహమును, ధర్మక్షేత్రం = ధర్మదేహమునుగా, కురు = చేయుము. అని ప్రబోధింపఁ బడుచున్న కురుక్షేత్ర మను కర్మక్షేత్రమున సుగుణ దుర్గుణము లను పాండవ కౌరవ బలంబులు గూడి ధృత = ధరింప బడిన, రాష్ట్రం = పురం ( శరీరం ), పురంశరీరం తస్మిన్ శేతే ఇతి పురుషః " నవద్వార పురం పుణ్యమేతైర్భావైః సమన్వితమ్, వ్యాప్య శేతే మహాత్మా యస్తస్మాత్పురుష ఉచ్యతే " ఇతి భారతే " దశద్వారపురం దేహం దశనాడీ మహాపథమ్, దశభిర్వా యుభిర్వ్యాప్తం దశేంద్రియ పరిచ్ఛదమ్.

శ్లో॥ షడాధారాప వరకం షడన్వయ మహావనమ్
చతుష్పీఠ సమాకీర్ణం చతురామ్నాయ దీపకమ్
బిందునాద మహాలింగ విష్ణు లక్ష్మీ నికేతనమ్
దేహం విష్ణ్వాలయం ప్రోక్తం సిద్ధిదం సర్వదేహినామ్. "

ఈ దేహము పదిద్వారములుగల పట్టణము. దశనాడులే దశవిధరాజమార్గములు. ఇందు దశవిధవాయువులు వ్యాపించి యున్నవి. ఈ పురమునకు దశేంద్రియములావరణముపళ్లె

నున్నవి. షడాధారములు పైకప్పుగా నున్నవి. షడన్వయములు మహావనముగనున్నవి. వీరి చతుష్టయముచేత వ్యాప్తమయి చతురామ్నాయ దీపకమయి యున్నది. బిందువనగా మనస్సు. నాదమనగా బుద్ధి. మనోబుద్ధి వృత్తి సహస్రప్రకాశకమగుటచేత బిందునాద మహాలింగమని చెప్పఁబడినది. జీవ కుండల్యాధార మగుటచేత లక్ష్మీవిష్ణువులకు నివాసస్థానమగుచున్నది. "దేహో దేవాలయః ప్రోక్తస్సజీవః కేవలశ్శివః, త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోఽహం భావేనపూజయేత్" అని చెప్పఁబడినట్లు ధరింపఁబడిన శరీరముగలవాఁడు జీవుఁడు. ఇతఁడే ధృతరాష్ట్రుఁడు. ఇట్టి జీవుఁడు దేహాహంకరణంబును బొందుటంజేసి యాత్మదృష్టి నశియించి గ్రుడ్డివాఁడనిపించుకొని సుగుణ దుర్గుణ ప్రేరణంబున సుఖదుఃఖములఁ బొందుచుండు. ఈ కారణమున ప్రతిదేహమొక్క కురుక్షేత్రంబుగాను నందలి శతవార్షిక జీవితరూపశరీరయాత్రయందుజరుగు సుగుణ దుర్గుణముల మహాసంగ్రామమే భారత సంగ్రామముగాను నగుచున్నది.

## సత్కామ విషాదము

ఇట్లుభయ సైన్యంబులును వాదసన్నద్ధంబులై యున్న తఱి మహామోహుఁడు శాంతిపుత్రుల వాదసన్నాహమును వ్యూహంబును జూచి బ్రాహ్మణుకడకుం జని యిట్లనియె:-

"ఆచార్యా! నాశిష్యుఁ డహింసుఁడు పన్నిన యనుబంధ చతుష్టయ వ్యూహంబునుగంటివే? ఎంతయుదృఢంబై యొప్పు

చున్నది. ఆత్మబల సంపన్నులగు మహానిపుణులచే నిండి కొంచెంబయ్యును వేదకాముచే నభిరక్షితంబగుచు మిక్కిలి సమర్థమై యొప్పుచున్నది. మన వ్యూహంబు మీరును పితా మహులునునైన ధీరులతోఁగూడి ఘనంబయ్యును ససమ ర్థంబై యొప్పుచున్నది'' యనుచుండ నతనిభీతహృదయంబును గాంచి ధైర్యంబు నొల్కొనం జేయుచు సర్వసేనాని తన నాదమను శంఖంబుఁ బూరించె. తక్కటి యోధులును నట్లె యొనర్చి రట్టియెడ.

తత్వవిచార మను రథంబు నకు మహావాక్యము లను శ్వేతాశ్వములఁగట్టి విజ్ఞాన మయానంద మయ కోశములను రెండమ్ముల పొదులనుధరియించి యేకాంతభక్తియనుకవచంబుఁ దొడిగి యోంకారమను గాండీవముఁబట్టి నేతినేతి మహా వాక్యములను బాణములఁబూని యుత్తమాధికారియని యంత రాత్మఁ డిచ్చిన కిరీటము శిరంబున మెరయ సత్సంగతియను హనుమ ధ్వజంబెత్తి నీలవర్ణుఁడు లీలం గోలఁబట్టిం రథంబు నడుపువాఁడై నొగలపయింగూర్చుండ సంప్రమోదుండగుచు సత్కాముఁ డుత్తమాధికారియై వాదభూమిం బ్రవేశించి " బావా ! యని పరమాత్మునింబిలిచి యింపు ముందెవ్వరితో వాదింప వలయునో దుర్బుద్ధియైన దబ్బర యెకిమీని సాయ మునకు చావఁగోరి యెవ్వరెవ్వరు వేంచేసి యుండిరో వారి నెల్ల నొక్కపరిఁ జూతుఁ దత్వవిచారం బించుక ముందునకు *సాగిపోనిమ్మన, నతం డుభయసైన్యంబుల మధ్యమునకుఁ బోవ నిచ్చి రథంబు నిల్పి ' వారె చూడు ' మనిన — సత్కా

ముఁడు గుణగణంబు నలవ్వంకలఁ గలయంజూచి యందున్న వారు తాతలు, తండ్రులు, గురువులు, స్నేహితులు, నన్నలు, దమ్ములు మొదలగు వార లగుటంజేసి నేనను నహమావే శించి మమత్వంబున భ్రాంతుఁ డౌటం గలిగిన మహాదుఃఖం బుచే తపించుచు పరమాత్మ్మ సందర్శించి "కృష్ణా! నన్నెది రింప నిలిచియున్న యీ బంధుగులం జూచిన నా యవయవం బులు వికలంబులై కంపము నొందు చున్నవి. మనంబు స్వాధీనముఁ దప్పె. ప్రణవంబు పట్టు వీడుచున్నది. గోవిందా! యానందరాజ్య సుఖంబుఁగాని యిందునఁ గల్గు విజయంబును గాని కోర. ఎవ్వరి బోకొట్టుకొని సుఖంబులు బొందరాదో వారేకదా యీ సన్నద్ధులై యున్నవారు. మా యెల్లఱ తేజోజాలంబులకు మూలకందమైన బ్రహ్మచర్యమును జంపిన మీఁద మాకు నోజశ్శక్తు లెక్కడివి? వైదిక యజ్ఞంబుల రూపుమాపిన మీఁద నుత్తరలోకగతి గలదె. ప్రబోధంబుఁ బోకార్చిన పుణ్యగతికిం దప్పుటయే గదా? ధర్మార్థ కామం బుల సమయించిన పురుషార్థం బేది. జీవిత సంసరణంబునకు ప్రధానంబులగు క్రోధంబును మొదలంటఁ జంపి, మోహం బును దిగనాడి, లోభంబుఁ బోకార్చి, మదంబు విడిచి, మత్స రంబు మాయించి, యిన్నియుఁ బోయినమీఁద జీవింప నెట్టు వచ్చు. ఇందఱు నున్ననేకదా? నీవును నేనును నుండుట. ఇందఱు లేకున్న నీ వెక్కడ నే నెక్కడ. వీటిఁ జంపుట నన్నుఁ జంపుకొనుట యగుంగాని యొండగునె. దీన నాత్మ హత్యరాదె. దాన నంధకూపంబె కదా శరణ్యంబు. ఇట్టి సర్వ

ప్రాణ ప్రళయంబున వినుటకేది, తినుటకేది, చూచుటకేది, యాఘ్రాణించుటకేది, స్పర్శించుటకేది, హృషీకేశా! నేటి వఱ కెవ్వరివలన కష్టించితి ననుకొను చుంటినో వారు లేకున్న నుత్తరదివసంబున సర్వంబు నాకారంబునొందియు శూన్యంబై జడప్రాయమైన మీఁద నింక నానందమునకు స్థానంబేది. ఇంతయు నాలోచింప నా మనం బత్యంతాకులత్వంబును బొందు చున్నది. దీనిం దీర్ప సమర్థుండవీవ, సద్గురుమూర్తీ! శిష్యుండనైన నన్నీ సందేహాంధకారమునుండి బయలుపరచి రక్షింపు మనిన దామోదరుండు.

## సాంఖ్య యోగము.

సత్కామా! యెంత వెఱ్ఱివైపోయి? కేవల మజ్ఞుండవై దేహాహంకరణబుద్ధితో మాట్లాడుచు పండితుల మించిన ప్రజ్ఞాశాలి వనుకొనుచుంటివి. నీ వెన్నఁడును పెద్దలసేవఁ జేసియెఱుఁగవు నీ యందు శాస్త్రానుభవంబును శూన్యమై యున్నది. తాత్కాలిక జనిత భ్రాంతుండవై యాత్మయం దనాత్మత్వంబును, అనాత్మయం దాత్మత్వంబును నారోపించుచుంటివి. యే స్థూల దేహమును జూచి వీరున్నారు, వీరిం జంపిన బ్రతుకనేర ననుకొనుచుంటివో వారెప్పుడును లేనివార. ఏ స్థూల రూపముల యందంతర్గతమై నీకు గోచరింపక శాశ్వతంబై యే యాత్మ ప్రకాశింపుచు నామరూపంబులు విడిచిన మీఁద "ఇది" యని నిరూపింపఁ బడుచున్నదో యది యొక్కటియె యుండునదిఁ, సిద్ధమైనది, "యథా సోమ్యైకేమృత్పిండేన సర్వం

మృణ్మయం విజ్ఞాతం వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం ఏవం సోమ్యస ఆదేశో భవతి ” ఓ శాంతుఁడా ! మృత్తికను తెలిసికొనిన యెడల మృణ్మయములగు పదార్థము లన్నియు కార్యకారణముల కభేద మగుటచే నెట్లు తెలిసికొనఁబడునో, కుండ మొదలగు వికారము లన్నియు నెట్లు నామమాత్రములో కారణమగు మృత్తిక యొక్కటియే యెట్లుసత్యమో అట్లే యీ ప్రపంచ మంతయు కారణమాత్రము. కారణ భిన్నముగ దీనికి నునికి లేదు. కారణము నెఱింగిన నంతయు నెఱింగినట్లే యగును.

అట్టియాత్మ అగ్నిచే దహింపఁబడదు. కత్తిచే నఱుకఁబడదు. ఎవ్వఁడు దెగిన నీవు జీవింపనేరనని పల్కుచుంటివో వారెల్లఱు తత్త్వవిచారమున లేనివార. ఈ యున్న నావారు పెరవారు మేలువారు కీడువారు ననుకొనువారిలో నీవు నేను దక్క మిగులు వారెవ్వఁడునుండరు. బాహ్యదృష్టియందు తాత. తండ్రియని నామరూపాత్మికంబులై యే దేహములుకాన్పించుచుండెనో యవియన్నియు నిత్యపరిణామమున క్షణికములై నశించునవియ కాని యుండునవికావు. బాల్య యౌవన వార్థక్యాద్యవస్థలు పూర్వరూపంబు నశించుచు నాస్థానంబున నుత్తర రూపంబు నిల్పుచు నొకదాని కొకటి గాక బాల్యరూపంబు యౌవనమునఁ గాకరాక యౌవనరూపంబు వార్ధక్యమునఁ గనరాక యెప్పటికప్పుడు కాలరూప వర్తమాన క్షణంబున మాత్రము గోచరించుచు నున్నట్లుండుచు నేదియుంగాక

క్షణభంగురమై యున్నది. ఈ దేహమునకు స్థిరత్వమెన్నడును లేదు. ఈ దృశ్య దేహమధ్యమున 'ఇది'యని చేత నామమాత్ర కంబై నిలిచియున్న యాత్మ జన్మజన్మాంతరములనెడు వ్యక్తా వ్యక్త దశలను జాగ్రత్స్వప్న సుషుప్తులను బొందుచు బహూకృత రూపంబులై యొప్పు దేహముల యంతరంబున త్రికాలముల యందు నేకరూపంబై యబాధ్యంబై పరిణామంబులేక వృద్ధిక్షయములులేక శాశ్వతంబై యుండు. అదియ నీవు. "బాలాదిష్వపి జాగ్రదాదిషు సదా స్వవస్థాస్వపి వ్యావృత్తాస్వను వర్తమాన మహమిత్యంతః స్ఫురంతం సదా స్వాత్మానం ప్రకటీకరోతి" అట్టియాత్మను చంపుటకుఁగాని యిట్టిదేహమును నిల్పుటకుఁగాని యెన్నడును సమర్థుండవు కావు. ఘట భిన్నమాత్రంబున ఘటాకాశంబెట్లు నశింపదో యట్లె దేహపాతమాత్రంబున నాత్మ నశింపక శాశ్వతమై యుండు. దీనిఁ దెలియనేరక యజ్ఞానంబున దేహతాదాత్మ్యత నొంది చంపుచుంటి చంపఁబడుచుంటి ననుకొనుచుందురు. ఈ రహస్యమును విజ్ఞానదృష్టిఁ దెలిసికొని చంపుటకుఁగాని చంపఁబడుటకుఁగాని నేనెన్నఁడును కర్తనుగాను సర్వమునకు వాను దేవుఁ డొక్కరుండ కర్తయని భారము నాయందుంచి నిష్కాముఁడై విహిత కర్మముల విడువక నెవ్వఁ డాచరించునో వాఁ డొక్కఁడే యీ సంసార సాగరంబును తరియించి సుఖదుఃఖములఁ బొరయక శాశ్వతానందంబుఁ గాంచఁ గలుగు. సుఖదుఃఖములు లాభాలాభములు సమముగాఁ జూచుచు నిష్కామకర్మల నాచరించిన నవియాత్మ కెన్నఁడును బంధంబులుగావు.

రాగయుక్తములైన కర్మచే బంధములై జననమరణ ప్రవాహ మున కీడ్చుచుండు. దీని నెఱిఁగి నడిపింపవలెనన్న వ్యవసా యాత్మికబుద్ధి గావలయు. అట్టి వ్యవసాయాత్మిక బుద్ధితో గూడి ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వమునొందుటయ యోగ మందురు. జ్ఞానులీయోగంబు నెఱిఁగి ఫలాపేక్షా రహిత కర్మములఁ జేసి జన్మబంధములఁ ద్రెంచి యనామయంబగు మోక్షము నందిరి. ఫలాపేక్షా సహితంబులై పైవన్నెలం జూపు వైదిక కర్మంబులం దగిలిన చంచలమానసం బేనాఁడు నిష్కామరూపంబు నంది యచంచల సమాధిం బొందునో యానాఁడ యోగసిద్ధిఁ బొందనగు.

సత్య:— కేశవా! యిట్టిసమాధిఁ బొందినవారి లక్షణంబు లెట్టివి? ఎట్లుమాట్లాడుదు రెట్లునడతురు.

కృష్ణ:— మాయావికారంబులగు దేహేంద్రియ ప్రవర్తనంబుల విడిచి దేనికినంటక నొంటియై వెలుఁగు ప్రత్య గాత్మునందు తనకుతానై యానందించుటయే సమాధి. కూర్మము తన కరచరణాద్యవయవముల లోనికీడ్చుకొనురీతి నింద్రియముల నింద్రియ విషయములపైఁ బోవనీక యంత ర్ముఖంబుగాఁ జేసి శుభాశుభంబులందు సుఖదుఃఖములఁ బొంద యక యాశాపాశంబులఁ గట్టువడక చెలరేగి ప్రక్కత్రోవల కీడ్చు కామక్రోధముల నరికట్టి శరీరపోషకమాత్ర విషయాను భవంబున నుండి యెందును లిప్తుండుగాక నిర్వికారుండును, శాంతుండునై యహంకారమమకారములు రెంటికిఁ గడియలు

వైచి కర్మమొనర్చుటయె జీవితపరమావధి. ఇదియ యోగం బును మోక్షంబును "యద్వ్యప్యసౌ చిరంకాలం సమాధిః దుర్లభోన్నృణాంతథాపి క్షణికో బ్రహ్మానందో నిశ్చాయత్యసౌ" ఈ యోగమున మానవుఁడు క్షణకాలమైనను సమాధి నొందఁ గలిగిన కృతార్థుఁడగును.

## కర్మయోగము

**సత్యా:–** జనార్దనా! వాంఛారహిత ప్రవృత్తిమార్గ మగు వ్యవసాయాత్మిక బుద్ధివృత్తి శ్రేష్ఠ మనుచుంటివి. ఘోర కర్మయందు ప్రేరేపించు చుంటివి యిదెట్టులు. "వ్యామి శ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహ యసీవమే, తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోహ మాప్నుయామ్" ఇట్టి సంశయ వాక్యములచేత నాబుద్ధిని కలవర పెట్టక యేది శ్రేయమో దానిని మాత్రమే నిశ్చయించి చెప్పుము. శ్రేయ ప్రేయము లలో నాకర్మ విశేషము ననుసరించి వచ్చు నైహిక సుఖము నిచ్చు ప్రేయమును గూర్చి నేను విచారించుట లేదు. క్షణి కములైన యీ యిహలోక భోగముల లెక్క సేయను. శాశ్వ తానందమును పరలోకసుఖానుభూతిని గూర్చు శ్రేయమును మాత్రమే నీచేఁ దెలియఁగోరు చుంటిని. దాని వివరింపుము.

కృష్ణు:– సత్యామా! జ్ఞానయోగ కర్మయోగములు రెండును నాచేఁ జెప్పఁబడినవియె. ఐనను బాహ్యకర్మను విసర్జించినంత మాత్రమున నైష్కర్మ్యసిద్ధి పొందనేరదు. జీవలోక మంతయు ప్రకృతిజన్యములైన గుణములకు లోనై

గాక తీరని కారణంబున నస్వతంత్రమై క్షణమైన కర్మరహితముగా నుండనేరక పరిభ్రమించుచున్నది. ఈ జీవులెల్లఱు కర్మదేహము గలవారై కర్మచేఁ బుట్టి కర్మచేఁ బెరిగి కర్మచేఁ జచ్చుచు నుండు నపుడు కర్మరహితంబుగా నెక్కడ నేరూపంబున నుండఁగలుగు, సర్వమును త్యజించిన యోగికైనను కూర్చుండుట లేచుట నిద్రించుట యాఘ్రాణించుట తినుట త్రాగుట యను కర్మంబులు దేహ ముండునంత పర్యంతమును దేహజన్యములై నడువక మానవు. కావున కర్మయే ప్రకృతి రూపము నొంది జీవుల నస్వతంత్రులనుగాఁ జేసి త్రిగుణములచేఁ జుట్టి కర్మను జేయించుచున్నది. దీని నెఱిఁగి యేనాఁటికి మానవుఁడు మనసుచే నింద్రియముల నిగ్రహించి ఫలాకాంక్షారహిత కర్మంబును జేయుచు జగంబెల్ల నీశ్వర కుటుంబ మనియు, నందలి జీవులెల్లఱుఁ దన సోదరులనియు, నిందు దేని కేయపరాధం బొనర్చినను నీశ్వరాపరాధంబే యగు ననియును నిశ్చయించి సమిష్టి తత్వంబున నడుచుకొనువాఁ డొక్కండె యుత్తముఁడు. వాఁ డొక్కఁడు మాత్రమే శాశ్వతానంద మోక్షసుఖము నందఁ గలఁడు. విషయసక్తుండు గాక యాత్మరతుండై యాత్మయంద సంతోషించుచు నుండువానికిఁ గర్మచేయుటచేతఁగాని చేయకుండుటచేతఁగాని ప్రయోజనంబు లేదు. వాని వలన లోకంబునకును ప్రయోజనముండదు. జనకాదు లిట్టివారై కర్మాచరణంబున జ్ఞానసిద్ధిం బొందిరి. పామరుఁ డత్యాసక్తితో నెట్లు కర్మములఁ జేయు

చుండెనో విజ్ఞానియు నట్లే యపేక్షారహితుండై లోకంబు కొఱకు కర్మల నాచరించు చున్నాఁడు.

అజ్ఞాని ప్రకృతి గుణములచేతఁ బ్రేరేపింపఁ బడిన వాఁడై యహంకరించి తాన కర్త ననుకొనుచున్నాఁడు. విజ్ఞాని గుణకర్మ విభాగంబుఁజేసి యింద్రియ విశిష్టములైన గుణములు విషయములయందుఁ బ్రవర్తించుచున్నవనియెఱింగి వానియం దాసక్తుఁడుగాక సంచరించుచున్నాఁడు. కావున సమస్తకర్మల నాయందుంచి విజ్ఞానయోగమున నిష్కాముఁడవై యహంకారమును సంతాపమును విడిచి కర్మం బొనర్పుము. నన్నెఱిఁగిన విజ్ఞానిగూడ తన జన్మాంతర కృత కర్మ వాసనకుఁ దగినట్లు ప్రవర్తించుచుండు. సర్వజీవులును జన్మాంతర కృత కర్మవాసనలఁ బొందకతీరదు. కావునఁ గర్మేంద్రియ నిగ్రహ మాత్రమున నగు ఫలంబేమియు నుండదు.

శాంతిపుత్రా! యింద్రియముల కింద్రియ విషయము లందు రాగద్వేషంబులు గలుగుచున్నవి. అట్టి శత్రురూపంబులైన రాగద్వేషంబులకు లోనుగాకుండుటయె నైష్కర్మ్యంబు. ఇందు రజోగుణ జన్యంబులైన కామక్రోధములు రెండును పరమ శత్రువులై యున్నవి. పొగ నిప్పును, మాలిన్య మద్దమును, మావి గర్భపిండమును గప్పియున్నట్లు కామము విజ్ఞానము నావరించి తృష్ణారూపంబున నిత్యశత్రువై యాత్మజ్ఞానమును, ననుభవజ్ఞానమును నశింపఁజేయుచు మానవుని పాపిం జేసి స్వర్గమర్త్య నరకంబులకుఁ ద్రిప్పుచు బాధించుచున్నది.

కావున సర్వదుఃఖములకు మూలకారణంబైన కామమును నశింపఁజేసి సర్వశ్రేష్ఠంబైన యాత్మనెఱింగి సుఖింపుము. "కామబంధన మేవేదం నాన్య దస్తీహ బంధనం, కామబంధన ముక్తోహి నేహాభూయోభి జాయతే."

## జ్ఞానయోగము

శాశ్వతమైన యీ యోగమును ప్రారంభమున నేను సూర్యున కెఱింగించితి. అతఁడు తన కొమరుఁడైన వైవస్వతున కెఱింగించె. అతఁ డిక్ష్వాకున కిచ్చె. ఇట్లు పరంపరా రూపంబున నుపదేశింపఁ బడిన యీ విద్యను రాజపురుషు లెల్లఱుఁ దెలిసికొనిరి. అది ప్రస్తుత కాలమున నాదరణలేక యడుగంటి యున్నది.

సత్యా:— కృష్ణా! నీకంటె పూర్వ మెన్నఁడో జన్మించిన సూర్యునకు నీవె ట్లుపదేశించితివి. ఇది సత్యమని యెట్లు గ్రహింతును.

కృష్ణు:— సత్యామా! నాకు పెక్కు జన్మములు గడచినవి. సాక్షినై వాని నెల్ల నే నెఱుంగుచుంటిని. నీ వెఱుఁగవు. ఎప్పుడు ధర్మమునకు భంగము కలుగునో యప్పు డప్పుడంతయు సాధురక్షణమును, దుష్టశిక్షణమును గోరి జన్మించు చుందును. ఈ కర్మాచరణంబున దేహమునకు వర్తించెడి బ్రాహ్మణాది జాతిగాని వాని విశిష్టకర్మములుగాని నన్ను బంధింప నేరవు. కావున వానికెల్ల నతీతుఁడ. ఇదియే

కర్మరహస్యము. నటకుం డనేక నాటకములయందు రాజ భృత్య స్త్రీ పురుషాది వేషంబులు ధరియించి యేవేషంబు ధరించినప్పు డావేషంబున కనువగు నటనం బాచరించుచు నిం దేదియుం దాను గాక యందలి సుఖదుఃఖంబులు తనవిగావని యెఱింగియుండియు ప్రేక్షకుల మెప్పున కన్నియుంజూపి తాను మాత్ర మీనటనంబునందలి యేకర్మంబునకును కర్తంగానని యెఱిఁగి తన్ను మరువక కేవలుండై యుండునో యారీతి విజ్ఞాని యెన్నిజన్మములు తనకు సంభవించినను ననాదియైన యాత్మ తాననియు నామరూపాత్మకములైన యీదేహంబులు సముద్రమున తరంగములట్లు వచ్చుచుబోవుచునుండు నంతియ కాని యిందు దేనికిని నేను కర్తనుగానని గ్రహించుచుండు. ఈకారణమున సూర్యునకు పూర్వంబునను పరంబునను నాత్మ రూపుండనై నేనుంటిని. నీవును నుంటివి. కాని యీమర్మ ము నేనెఱుంగుదును. నీవెఱుంగవు. నశ్వరములై కానిపించు నీదేహాదులకెన్నఁడును నిలుకడ లేదు. శాశ్వతమగు నాత్మ కెన్నఁడును నాశంబు లేదు. (తత్వమసి) అదియ నీవు. ఇట్టి యాత్మ నొక్కఁడానినె యెఱుంగవలసినది. చావుపుట్టుకలు, స్థూలసూక్ష్మంబులు, వ్యక్తావ్యక్తములు, జాగ్రత్స్వప్నసుషు ప్తులు, సుఖదుఃఖములు, మానావమానములు గమనా గమ నంబులు, ఇహలోకపరలోక యాతాయాతంబులు నన్నియు ప్రకృతి స్వరూపిణియైన దేహంబునకె కాని యాత్మ కెన్నఁ డును లేవు. అదియెనీవు. కామసంకల్ప వర్జితుండై జ్ఞానాగ్నిచే దహింపఁబడిన కర్మములు గలిగి యదృచ్ఛా లాభసంతు

ష్టుండై ద్వంద్వంబులు విడిచి సిద్ధ్య సిద్ధులయందు సముండై బ్రహ్మమేహవిస్సు బ్రహ్మమేయగ్ని బ్రహ్మమేకర్మ బ్రహ్మమే కర్మఫల మని బ్రహ్మార్పణ బుద్ధితో "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని కర్మల నాచరించువారె ముక్తులు. ఇట్టి యీ బ్రహ్మజ్ఞానమును, తత్వజ్ఞుల నాశ్రయించి శుశ్రూషఁ జేసి శ్రద్ధాళుండవై పొందుము. పరబ్రహ్మ జ్ఞానంబున బుద్ధి మోహము విడువుము. ఈ జ్ఞానము నొందుటకు సంశయ రహిత శ్రద్ధాళువు కావలయు. ఈ జ్ఞానమున చరాచర భూతంబులను నా యందు దర్శింపసమర్థుండ వయ్యెదవు. సత్యాకామా! కర్మాకర్మల విషయమున జ్ఞానులును విభ్రాంతులైరి. కావున కర్మయందు కర్మాభావమును, కర్మభావమునందు కర్మను నెవఁడు తెలిసికొను చున్నాఁడో వాఁ డొక్కఁడే బుద్ధిమంతుఁడు.

## కర్మసన్యాసయోగము

సత్యాకామా! "యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః, సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి నలిప్యతే" కర్మయోగి మనోధికృతుండై విజితేంద్రియుండై సర్వభూతములు తాను గాను, తాను సర్వభూతములుగాను, భావించి "అహమేవచ భూతేషు సర్వేష్వేకో న భోయథా, నైవసర్వాణి భూతాని పశ్యన్నేవం నజాయతే" తన దశేంద్రియములు విషయంబులయందు స్వాభావికములై ప్రవర్తిల్లు చున్నవిగాని యిం దేవిషయంబునకును కర్తనుగానని బ్రహ్మ

భావనం బొంది, తామరాకును నీళ్లంటనట్లు పాపంబులచే నంటఁబడక మమతాశూన్యములైనకర్మములచిత్తశుద్ధికొఱకుఁ జేయుచుండును. 'తరతిపాప మాత్మవిత్' ఆత్మవిదిత్వమున పాపములనుండి తరించిన కర్మయోగి బ్రహ్మమునందే బుద్ధి గలవాఁడై యదియ యుత్కృష్టగతియని నమ్మి సర్వమును బ్రహ్మరూపంబునఁ జూచుచు సద్బ్రాహ్మణుని, గోవును, ద్వీపమును, కుక్కను దానిని దిను పంచముని సమానముగాఁ జూచుచు మోక్షమొందఁ గలఁడు, "యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః, తత్రకో మోహః కశ్శోకః ఏ తత్వ మనుపశ్యతి"

## ఆత్మసంయమన యోగము

ఇట్లు గృహస్థుండయ్యును యోగిచిత్తవృత్తి నిరోధంబు కొఱకు పంచేంద్రియముల బాహ్యవిషయములనుండి మరల్చి భ్రూమధ్యంబున దృష్టినిల్పి ప్రాణాపానముల సమంబుఁజేసి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబుల విసర్జించి బుద్ధిని స్వాధీనముననిల్పి లఘ్వాశియు, వివిక్త ప్రదేశియునై కంఠమును, శిరంబును సమముగా నిల్పి భయ రహితుండై బ్రహ్మచర్యంబు వదలక నాయందు మనస్సును జేర్చి నాస్థానమగు మోక్షమును గాంచు. సత్యా-మా! యీ యోగము మితభోజన మితసంచార మితస్వప్న మితప్రజ్ఞ మిత కర్మంబులు గల వారికే లభ్యంబగు. ఇట్టి యోగాభ్యాసంబు వలన నుపరతిం బొందిన మనస్సు గలిగి, యింద్రియా

గోచరంబై బుద్ధిమాత్ర గ్రాహ్యకంబైన పరమాత్మ సందర్శ నంబునం గలుగు పూర్ణానందంబు నొందు. ఆ సమాధియం దైహిక దైహిక సంబంధ మెఱుఁగక యాత్యంతిక సౌఖ్యం బనుభవించు "అంధస్సన్ ఆనందోభవతి విద్ధస్సన్ అవిద్ధో భవతి ఉపతాపీచ అనుతాపీ భవతి" అదియ దుఃఖా తీతంబగు యోగము. సంకల్ప వికల్పాత్మకంబై చంచలమగు మనస్సును నిగ్రహించి సంకల్ప ప్రభవంబులైన కోర్కెల నణఁచి యోగారంభి గానలయు. మఱియు సర్వభూత సుఖ దుఃఖంబులు తన సుఖంబులు దుఃఖంబులుగా భావించుచు 'వాసుదేవ స్సర్వ' మని సర్వభూతములయందు నన్నును నా యందు సర్వభూతములను జూచువాఁడొక్కఁడె నాకు సమ్మ తుఁడు.

సత్యా:— సద్గురూ! నీవు బోధించు సమిష్టియోగ మసాధ్యమనుకొందును కారణంబేమన మన మతి చంచలము వాయువునైనఁ బట్టవచ్చుఁగాని దానిఁబట్టుట దుస్సాధ్యము చూచుచుండగనే చూచువాని నచ్చట డించి జగంబు నలు గడల నిముసంబున సంచరించి వచ్చుచు ధ్యానంబు నిలువ నీయక యలజడిం బెట్టుచుండు. దీనికన్న బంధరూప వరమ శత్రు వింకొక్కడుండదని యెంతు.

కృష్ణు:— అగునయినను నాత్మాను సంధానాభ్యా సము చేతను వైరాగ్యముచేతను దాని స్వాధీనమొనర్చుకొన్న వల్లయును. చిత్తస్వాధీనము నొందనివాఁడు యోగికానేరఁడు

తగిన యుపాయంబుల చిత్తమును వశపరచుకొని[illegible] యోగి కాఁగలఁడు.

సత్యా :— కృష్ణా ! యిట్టియోగమునందు శ్రద్ధయు ప్రయత్నంబును గలిగియు నియతముగాని చంచలచిత్తుఁడు పరమాత్మానుసంధానముఁ జేయ లేక కర్మజ్ఞానములకు రెంటికిం జెడినవాఁడగుంగదా ? యింక వానిగతియేమి.

కృష్ణు :— కౌంతేయా ! యోగభ్రష్టున కిందును నందును నాశము లేదు. వెఱ్ఱివాఁడా ! శ్రేయమున కెన్నఁడును చెరుపు లేదు. యోగభ్రష్టుఁడు పుణ్యలోకముల కరిగి యందుఁ గొంతకాలముండి తిరిగి సదాచార సంపన్నులగు శ్రీమంతులగృహంబులనేని యోగులవంశంబులనేని జన్మించి పూర్వ మెంతవరకు శ్రమించి పతితుండయ్యెనో యక్కడి నుండి మఱలనభ్యసించువాఁడై జ్ఞానసిద్ధుఁడై ముక్తినొందును.

## విజ్ఞాన యోగము

జడరూపమగు ప్రకృతిచేత నామరూపాత్మకంబైన జగత్తు నాసాన్నిధ్యముం బొంది యయస్కాంత సాన్నిధ్యంబున సూదియుంబోలె చలనంబుఁ బొంది భూమి రాపోగ్ని వాయ్వాకాశ మనోబు ద్ధ్యహంకారంబులను నష్టధాత్వంబును బొంది ప్రపంచరూపంబునఁ బరిణమింప నావిశ్వము మణులయందు సూత్రంబునువలె నాచే ధార్యమాణమై యొప్పుచున్నది. సత్యామా ! జలముల రసశక్తి వాయువునందు చలనశక్తి సూర్యచంద్రులయందు తేజోశక్తి పురుషులయందు పౌరుష

శక్తి సమస్త భూతములయందు జీవశక్తి తపస్వులయందు తపశ్శక్తి బుద్ధిమంతులయందు మేధాశక్తి తేజస్వులయందు తేజశ్శక్తి యిట్లు సర్వభూతములయందుండు బీజమును (ప్రాణస్య ప్రాణః "ప్రారబ్ధక్రియమాణ భక్తాసంచిత నాహీజాణా, అవఘూదేవచి జాల పాహీ భరోనియా అంతర్బాహీ" ప్రతివాదములు భక్తుల కవసరము లేదు. ఈశ్వరుఁ డొక్కఁడే లోపలను వెలుపలను నంతటను నిండియున్నాఁడు) నేనయని గ్రహింపుము. సత్వరజస్తమములను ప్రకృతిగుణములు నావలనఁ గలిగినవి. అవి నాకుస్వాధీనములు. నేను వానికి స్వాధీనుఁడను కాను. త్రిగుణ వికారములచే మోహము నొందియున్న జగత్తు వికారరహితుఁడనగు నన్నుఁ దెలిసికొననేరక నామాయందగిలి జ్ఞానశూన్యులు నాసురస్వభావులు హింసాకర్ములు పాపులునునై జనన మరణ ప్రవాహంబునఁ గూలుదురు. అనన్యగతికులై నన్నే శరణుబొందిన యేకాంతభక్తులు నామాయ నతిక్రమించి శాశ్వతలోకంబు బొందుదురు. కొందఱ అన్యదేవతా రాధకులై శాశ్వతంబులుగాని ఫలంబులం బొంది యాయా దేవతాస్థానంబుల కరుగుచున్నారు. ఆధ్యాత్మికాధిదైవతాధిభూతరూపంబున నున్న నన్నెవ్వరు తెలిసికొనుచున్నారో వారుమాత్రము మరణకాలమునందు చిత్త చలనంబు లేనివారై నన్నుఁ దెలిసికొందరు.

## అక్షర పరబ్రహ్మయోగము.

సత్యా:- పురుషోత్తమా! అధ్యాత్మ మన నేది యధి దైవతంబన నేది? అంత్యకాలమున నిన్నెట్లు తెలియనగు? నిది యంతయు నెఱింగింపుము.

కృష్ణు:- ఈ దృశ్యము సర్వమును లేనితఱి నేది పూర్ణంబై యేకమై సత్యమై యొప్పునో యది బ్రహ్మ మనం బరగు. నామరూపాత్మకమగు దృశ్యజగత్తునకు చిత్రమునకు పటంబునుం బోలె నాధారంబై 'అహ' మను నామమును బొందుటయె యధ్యాత్మ మనంబడు. నశ్వరభావంబులగు చరాచరంబు లధిభౌతికంబు లనంబడు. ఇట్లంతర్యామినై అధియజ్ఞుండుగానున్న నన్ను బ్రాణప్రయాణకాలమునస్మరియించిన వాఁడు నన్నే పొందును. అన్యదైవములఁగాని యన్యంబులగు పశుపుత్ర క్షేత్రాదులఁ గాని స్మరించుచు బ్రాణోత్క్రమణంబు నొందినవాఁడు దేనిని స్మరించుచు దేహంబువిడుచునో యా జన్మమునే పొందువరకును పరిభ్రమించు చుండును.

జ్ఞాని యింద్రియముల నరికట్టి మనస్సును హృదయంబున నిలిపి ప్రాణములు సహస్రారమునఁ జేర్చి ప్రణవోచ్చారణఁ జేయుచు యోగము నభ్యసింప వలయు. పరమాత్మకు ప్రతినిధియై ప్రతీకం బనంబరగిన యోంకారంబును నకారోకార మకారార్ధ మాత్రలను నాలుగు పాదంబులు; జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయంబు లను నాలుగవస్థలు వ్యష్టిరూపంబున విశ్వతైజసప్రాజ్ఞ అంతర్యాములును సమిష్టిరూపంబున

విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృ తానందమయులునుగా నెఱిఁగి యొక్కొక్క పాదముగా నాల్గుపాదముల నుపాసించి ప్రణవం బును నట్టుల బ్రహ్మంబును ధ్యానించువాఁడు మోక్షపద మును బొందును. "ఓ మిత్యేత దక్షరమిదం సర్వం తస్యోప వ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ, యచ్చాన్య త్రికాలాతీతం తదప్యోంకార ఏవ, సర్వంహ్యేత ద్బ్రహ్మయ మాత్మాబ్రహ్మ సోఽయ మాత్మా చతుష్పాత్, పాదోస్య విశ్వాభూతాని త్రిపాద స్యామృతం దివి." ఓం కారమే అక్షరము, ఏక వర్ణాత్మకము. ఈసమస్తము నాయోం కారము యొక్క స్పష్టీకరణము. పూర్వము నేఁడు రేపను నదంతయు నీ యోంకారమే. ఈ సర్వము బ్రహ్మమే జీవా త్మయే బ్రహ్మము. ఆ యోంకారాభిధేయుఁడగు యీ యాత్మ నాలుగు పాదములు గలవాఁడు. ఈ ప్రపంచము నందలి సర్వ భూతములు నొక్కపాదము. తక్కినమూఁడుపాదములు ద్యులో కమున నున్నవి. "జకడే పహావేతికడే అపార, కోణీకడే నాహీ పార, ఏక జననీ స్వతంత్ర దూసరే నాహీ" ఎటు జూచిన నది (బ్రహ్మము) యపారముగనే యున్నది. ఎక్కడను దాని కంతము గానరాదు. అది యొకటే విధము గలదియు, స్వతం త్రమైనదియునై యున్నది. దానియందు ద్వైతము లేదు. ఇట్టి ప్రణవానందుఁడు దేహాంతమునఁగలుఁగు నర్చిరాది ధూమాది మార్గములకు సంబంధపడక యతీతుఁడై కేవల బ్రహ్మస్వరూ పుఁడై యుండును.

## రాజవిద్యా రాజగుహ్య యోగము

(విద్యానాం రాజా - రాజవిద్యా) ఇట్టి యీనిష్కామ కర్మయోగమను బ్రహ్మవిద్య రాజలోకంబున బ్రవృత్తంబై రాజవిద్యయనంబరగి గుహ్యాతిగుహ్యంబై యొప్పుటంజేసి రాజ గుహ్య మనం బరగుచుండె. ఇట్టి యీవిద్య రాజయోగులకు రాచబాటయని చెప్పంబడుచు గృహస్థులైయున్న రాజులచే నాచరింపంబడి తదాది మానవసర్వస్వమునకు సులభమగు కల్యాణమార్గంబుగా నొప్పుచున్నది. సత్కామా! స్థావరాది బ్రహ్మ పర్యంతమగు భూతజాలంబులన్నియు నాయందుండియు లేకున్నవానిగా నెఱుంగుము. సర్వప్రపంచమును పుట్టించుచు పెంచుచునున్నను దానికిం దగులువడకయుందు. మహా ప్రళ యమునందు వీనినన్నింటిని నాప్రకృతియగు నవ్యక్తమున లయింపంజేసి సృష్ట్యారంభమున దానినుండియె మఱల వ్యక్త స్థితికిం దెచ్చుచుందు. ఈసమస్తంబునకు సాక్షినైయుండుటయె కాని కర్తృత్వంబు వహింప. అక్కారణంబున బ్రకృతివైన కర్మంబులు నాకుం గాకయుండు. కావున నాశములేని నా తత్త్వము నెఱింగి యన్యచింతల విడిచి "ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" నామరూపాత్మకమై కనంబడుచున్న యీ ప్రపంచమంతయును నాత్మరూపముగానే యుండెనను జ్ఞానంబు నను, నద్వైత భావనచేతను, నుపాస్యోపాసక భావంబుల చేతను, సమిష్టిరూపంబున సర్వదేవతామూర్తిగను ధ్యానింప వలయు.

స్వలోకంబులకు కర్తయగు నప్పుండరీకాక్షుండ తల్లియు దండ్రియు, తాతయు, త్రాతయు, ధ్యాతయు, ధ్యేయంబును నని నమ్మి నశ్వరంబులగు స్వర్గాది భోగముల నభిలషించి యన్యదేవతారాధనంబులు సేయక నా సర్వంబునకు వాసుదేవుండ కర్త. తినుట, త్రాగుట, చూచుట, వినుట, నడచుట మొదలగు నాకు వలయు సర్వకర్మంబులను జలాగ్నివాయ్వాది భూతంబులతోడి బాహ్యప్రపంచము నంతయు నొసంగి యాదరించు చున్నాఁడు. ఈశ్వరాధీనంబుగాని యే కించిత్కార్యము నాచేఁ గానేరదని యెంచుచు సర్వప్రదాత యగు నాతని దాతృత్వము ప్రకృతియం దంతటను నిండి గోచరించుట నను భవించి స్మరించుచు సర్వకాలంబును సర్వగతుండగు నా పరమాత్మునిఁ జూచుచుండు వాఁడె భక్తపురుషుఁడు. అట్టి భక్తుఁడు ప్రేమతో నిచ్చు ఫలమేని, పత్రమేని, తోయమేని, దేనినైన నానందముగ గ్రహింతు. కావున నీచేఁ గావింపఁబడు విహితకర్మంబెల్ల ఫలంబుల సిద్ధ్యసిద్ధుల కెదురు చూడక సర్వభూతంబులకు సముఁడవై "తత్సద్బ్రహ్మార్పణమ"స్తని బ్రహ్మార్పణబుద్ధితోఁ జేయుచుండుము. ఇట్లు స్థిరచిత్తుండవై నా నిజతత్వంబు గ్రహించి భక్తిమార్గమున సేవించితివేని నన్నే పొందఁ గలవు.

## విభూతియోగము

సత్కామా! ఆద్యంతరహితుండనై యొప్పు నన్నింద్రాది దిక్పతులును నెఱుఁగ నేరక భ్రాంతులైరి. "యతో వాచా నివర్తంతే అప్రాప్య మనసా సహ"

సత్యా:— పురుషోత్తమా ! నీవు చెప్పినది సత్యము. దేవతలుగాని, యసురులుగాని నీ యున్నరూప మెఱుఁగ సాధ్యంబు గాదు. నిన్నెఱిఁగి ధ్యానించిన యసిత, నారద, దేవల వ్యాసాదులు పరబ్రహ్మవని శాశ్వతుఁడవని సత్యమని సర్వోత్కృష్టుఁడవని పురాణుండ వని పురుషోత్తముఁడ వని యెఱిఁగి ధ్యానించిరి. లోకంబునకుఁ జాటిరి. నీవును నట్లె నాకు బోధించు చుంటివి. తండ్రీ! లోకనాథా! అనంతా! అచ్యుతా! భూతేశా! భూతవృద్ధిప్రదా! ఆనందరూపా! నీ మహిమమెల్ల నెఱుంగుట కీనకాని యెవ్వరును నేరరు. మహాత్మా! నీ దివ్యమహిమ మెటుజూచినను నిండి విస్తారంబై బుద్ధ్యతీతంబై యానంద పరమావధికంబై తోఁచు చున్నది. ప్రభూ! నీ విందెల్ల నెట్లెట్లు వ్యాపించి ప్రకాశించు చుంటివో తెలియఁ గోరెద. ధ్యానంబున కాధారంబగు ధ్యేయరూపంబు ననుగ్రహింపుము. నీ నిత్యవిభూతి విస్తారము, నెంత విన్నను తనివి దీరని వాక్యామృత ధారలతో నెఱిగింపుము.

కృష్ణు:— సదసద్వివేకా! నా మహిమ లసంఖ్యములు. అందుఁగొన్నిటి నెఱింగింతు నాకర్ణింపుము. నానావిధ భూత జాలముల హృదయమధ్యముల 'సోఽహం' మ్మని జంటగా బలుకు నోంకారంబు నేనై ముమ్మూర్తుల యుత్పత్తి స్థితి నాశంబులకు కారణంబుగా నుంటిని. ఆకాశమునఁ దోఁచు చుక్కలలోని కాంతిని సూర్యునిలోని తేజంబును నేను. వేదములలో సామవేదమును, నింద్రియముల మనస్సును, పర్వ

తంబుల మేరువును, వృక్షముల నశ్వత్థంబును, ఋషులలో నారదుండును, పాములలో శేషుండును, రాక్షసులలో ప్రహ్లాదుఁడును, జలజంతువుల మకరంబును, రాజులయందు దశరథ రాముఁడును, నదులలో గంగయును, విద్యలయందు బ్రహ్మ విద్యయును, యాదవులయందు వాసుదేవుఁడును, కామముల సత్కామమును, యజ్ఞములయందు జపయజ్ఞమును, పాండవుల యందర్జునుండును, విజ్ఞులలోని విజ్ఞానంబును నేను. ఇంతయేల సర్వభూతంబులకు బీజంబును నేను. మరణంబును నేను. ఈ దృశ్యంబెల్ల నా చతుష్పాద్విభూతియం దేకపాదమాత్రంబున విలసిల్లు.

## విశ్వరూప సందర్శన యోగము

సత్కా :— కేశవా ! నాయందలి సంపూర్ణాను గ్రహంబున పరమ గుహ్యంబగు నాత్మానాత్మ వివేకజ్ఞాన ముపదేశించితివి. సృష్టిస్థితి లయకారణంబగు నీ విభూతి యోగంబును దెలియుటంజేసి నాయజ్ఞానము నశించి జంగమ స్థావరాత్మకంబగు బ్రహ్మాండమునం దంటను నీతత్వంబు గోచరించుచున్నది. కాని యందు చాంచల్యంబున్నది. స్థిరరూప ప్రత్యక్షానుభవంబు నెఱిఁగింపఁ బ్రార్థింతు. అది నాకు శక్య మని నీ దివ్యచిత్తంబునకుఁదోఁచిన నధ్యాత్మికంబగు నీయవ్యయ రూప దర్శన మిమ్ము.

కృష్ణుః— సత్కామా ! మాంసలంబులగు నేత్రముల బాహ్యదృష్టితో నాదివ్యరూపంబుఁ గనుంగొన నశక్యంబు

భ్రూమధ్యాంతర్గతంబగుసుషుమ్నానాళాంతర్గత దివ్యతేజశ్శక్తిం జేసి యంతర్ముఖంబగు దృష్టి నలవరచి బిందువును (బుద్ధిని) చలింపనీక నాదమును సహస్రారమునఁ బదిలపరిచి కళామయంబగు నావిశ్వరూపమును దర్శింపుము. ఇంకను నీవేమేమి చూడ నిచ్ఛగించితివో వానినెల్ల నందుఁ జూడు మట్టి స్వరూపానుభవంబున "అశ్రుతం శ్రుతం భవతి అదృశ్యం దృశ్యం భవతి అమతం మతం భవతి" యని పరమాత్మ బల్కిన నామీఁద ననంఖ్యంబులగు పాదంబులు చేతులు తలలు కన్నులుం గలిగి దివ్యాంబర దివ్యహార దివ్యగంధంబులు గల్గి యనేక సూర్యుల తేజోజాలంబుల కేకస్థానంబై వెలుఁగు నాదేవదేవుని దివ్య దేహంబు సందర్శించి పులకితగాత్రుండై సత్కాముఁడు విశ్వరూపునకు నమస్కరించుచు నిట్లను.

సత్కా:- దేవా! చతుర్ముఖాది దివ్యులు వాసుక్యాది నాగులు నీయందుఁ దోఁచుచున్నారు. విశ్వమూర్తీ! సర్వవ్యాపకంబగు నీయపరిమిత మూర్తికి నాదిమధ్యాంతములు గోచరించుట లేదు. ఇట్టి నీమూర్తి సూర్యచంద్రులు నేత్రంబులై యాకాశంబు మూర్ధంబై ప్రజ్వలాగ్ని ముఖమ్మై నీ తేజంబుచే లోకములనెల్లఁ దపింపం జేయుచున్నది. "తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" ఆబ్రహ్మము ప్రకాశించుచుండ సర్వలోకములు దాని ననుసరించి ప్రకాశించును. ఈ లోకమునందు సర్వపదార్థములె యందును, గానవచ్చు ప్రకాశము పరబ్రహ్మ సంబంధమైనదియె, ' యను నట్లు పట్టరానిదైన నీతేజం బంతటను నిండి

నింద్రియాధి దైవతములగు దేవతలెల్లను స్వస్థానముల నంటి పట్టి యుండనేరక గడగడ వడంకుచు నాశ్చర్యచకితులై నిన్నే చూచుచున్నవారు. ఆహా! కాలమూర్తీ! యీరూపంబేమి జ్వలన్నేత్రములు, వివృతవదనంబులు, దీర్ఘదంష్ట్రికలుం గలిగి భయదాయకం బగుచున్నది. అందీ యుభయ సైన్యంబులం జేరిన బ్రహ్మచర్య మహామోహాహింసాది గుణవర్గంబెల్ల నీ ముఖంబులం జొచ్చి చూర్ణీకృతులై సంద్రంబునం జేరు నదుల వలె నీయందు జీర్ణించు చున్నారు. ఓ లయమూర్తీ! నీకు వేయి నమస్కారములు. ఈ భయంకర మహాప్రళయమూర్తి నుపసం హరించి యెప్పటిదగు నీ ప్రశాంత దివ్యమూర్తి దర్శనం బిమ్ము.

కృష్ణు:—సత్యా—మా! యిప్పటికేనిగ్రహించితివా! చంపుటకుంగాని చంపంబడుటకుంగాని నీవెన్నండును కర్తవు గావు. సృష్టించుటకె ట్లశక్తుండవో లయంబునకును నంతియ. ఈయున్న సమస్తంబునందును నీవును నేనునుదక్క మిగులున దేదియును లేదు. నావారనియు నున్నవారనియు భ్రాంతిచే నెవ్వరినిం దలంచుచుంటివో వారెల్ల నామరూపంబులు వేరు జేసిన నింపు నిల్చువారొక్కరును లేరు. ఈ రహస్యంబును దెలిసికొంటివేని తాతలు తండ్రులునని చూచు మోహదృష్టి నశించి, యెవ్వరులేకున్న బ్రతుకుం దెరువులేదని శోకించితివో వారు లేకున్నంగలుగు నపూర్వబ్రహ్మానంద మప్పు డనుభ వింపం గల్గుదువు. కావున నీయున్నభ్రాంతి బంధంబులగు మహా మోహ బలంబులనెల్ల మూలమట్టంబుగా నున్మూలించి బాహ్య సంబంధ విరహితంబైన శాశ్వతానందమ్మును బొందుమ్ము.

సత్యా :— ఓ జగద్గురూ ! నీపూర్ణతత్వం బిప్పటి కెఱింగితి ఓ జగన్నాయకా ! నీవు భర్తవు కర్తవు హర్తవునై యుంటివి. దేవాదిదేవా ! సదసత్తులకు పరుండవై యొప్పువాఁడవు నీవు. విశ్వవేత్తా ! వేత్తలగువారి గమ్యంబునీవు. తండ్రీ! సర్వమూర్తీ ! నీకు నమస్కారము. మరల నమస్కారములు. నీకు ముందువెనుక నన్నిదిక్కుల నమస్కారములు. తండ్రీ ! యింతవాఁడవని యెఱుంగక నాలోనుంటివని నావాఁడవని బావవని సామాన్యునిఁగాఁ జూచితిని. అప్రమేయుండవని యెఱుంగక యేకాంతముననను నన్యుల సన్నిధిని పరిహాసంబులు తిరస్కారంబులుపల్కియుంటి, వానినెల్ల బిడ్డనేరమును తండ్రి వలెను భార్యతప్పును భర్తవలెను మిత్రుని యపరాధంబును మిత్రుఁడువలెను మన్నించి స్వామీ ! ప్రపన్నుఁడనగు నాకుఁ బ్రసన్నుఁడ వగుము. అనిన యనంతుం డామూర్తి నుప సంహరించి,

కృష్ణః— సత్యామా ! నీ యందలి కారుణ్యంబుచేఁ జూపిన యీ రూపంబు తపో దాన యజ్ఞంబులొనర్చిన వారికేని దుర్లభంబు నిష్కామయు నాచంచలభక్తి యోగంబున నుండు వారికి మాత్రము సులభంబై యుండు. అని బోధించిన సత్యాముఁ డాంతరిక దృష్టినుండి మరలి ప్రకృతిస్థుఁడై యిట్లను.

## భక్తి యోగము

" కృష్ణా ! నీ చెప్పిన యట్లు భగవదర్పణబుద్ధితో నిత్యనైమిత్తిక కర్మలొనర్చుచు నీ ధ్యానముఁ జేయువారి

లోను నైష్కర్మ్యయోగంబున నింద్రియాతీత బ్రహ్మానుసంధానంబుఁ జేయువారిలోను శ్రేష్ఠు లెవ్వ రెఱింగింపుము.

కృష్ణు:— సత్యా! సర్వకాల సర్వావస్థల యందును నా యందు మనస్సుంచి యింద్రియ నిగ్రహంబును, సమబుద్ధియు, సమదృష్టియు, జీవకారుణ్యంబునుఁ గలిగి రాగద్వేష రహితుండై శత్రు మిత్ర భావంబులు లేక యదృచ్ఛాలాభసంతుష్టుఁ డగుచు భయసంతోషాసూయాదులకు లోను గాక నిష్కామకర్మయోగి యగువాఁడు మత్పదమును బొందును.

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము.

సత్యా:— మాధవా! ప్రకృతి యన నేది? పురుషుఁ డెవ్వఁడు? క్షేత్రమన నేది? క్షేత్రజ్ఞుఁ డెవ్వఁడు? జ్ఞాన మన నేమి? జ్ఞేయ మేది? వీని వినవలతుఁ జెప్పుము.

కృష్ణు:— సత్యా! క్షేత్రమనునదియె దేహము. ఇది దేహమని దేహమందుండి చూచువాఁడె క్షేత్రజ్ఞుఁ డనంబడు. ఈ రెంటిని వేఱుజేసి తెలిసికొనుటయె జ్ఞానమనంబడు. పృథివ్యప్తేజోవాయురాకాశములున్ను, మనోబుద్ధ్యహంకారావ్యక్తములున్ను, త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణ వాక్పాణి పాద పాయూపస్థలున్ను చేరి యిరువదినాల్గు తత్వంబులయ్యె. వీని యేకత్వంబ క్షేత్రమనంబడు. ఇట్టి యీ క్షేత్రమునందు జేరి సర్వసాక్షియు సర్వవిలక్షణుండునై ప్రకృతి జన్యాహంకారంబుగాక, 'నే' నని చూడఁబడు విజ్ఞానమే నేనై యుంటి.

ఇట్టి యీనేను, నేను కేనినాఁడు జడప్రాయమగు దేహంబునుఁ గాను. నేను కేనినాఁడు తమవృత్తులం బొందలేని యింద్రియంబులుఁగాను. నేఁడు నామనస్సు సంతోషముఁగా నున్నదనియు నాబుద్ధి మందముఁగా నున్నదనియు నెంచుచు వాని వృత్తుల వేత్తై చూచుచుంటిని గాన మనోబుద్ధులునుఁగాను. నేను చూచుచుంటి నేను తెలిసికొనుచుంటినను జాగ్రత్తను, నేఁడేవియో కలలఁ గంటినను స్వప్నంబును, నేఁడు సుఖముగా నిద్రింతినను సుషుప్తిని, నెఱుఁగుచుంటిని గాన నీ మూఁడవస్థలును నేనుగాను. ఇన్నియుఁగాక యిన్నింటికి వేత్తై సాక్షినై యిన్నియుఁ గలవని లేవని కలిమిలేములఁ జూచుచు త్రికాలములయందును నేను నేనుఁగా మార్పులేక యేనే నుంటినో యానేన సర్వక్షేత్రములయందును నిత్యమై నిర్వికారమై నిరంజనంబై యుంటి.

ఈ 'నే' నను భావనయ చుక్కలందు సూర్యునందు గ్రహంబుల గ్రహనక్షత్ర మధ్యాకాశంబున లోపల వెలుపల సర్వదిక్కుల సర్వంబున సర్వకాలంబుననుఁ గతిగియుంటి నను నీ విజ్ఞానంబె పరిపూర్ణ భావంబై యొప్పు. ఇట్టి యీ నేన బ్రహ్మంబు. అదియ నీవు. ఇదియ యనంతం బచలంబు, సత్యంబు, తత్, సత్, ఆనందంబు నాఁబరగు. మఱియు నీ యాత్మ సత్తైన ఘటపటాదుల కంటెను నసత్తైన శశశృంగాదులకంటెను విలక్షణం బగునది. ఇట్టి యీ బ్రహ్మమును మాయాకల్పితంబగు నంతఃకరణము తనయందు ప్రతిఫలింపఁ జేసికొని దాని సాన్నిధ్యంబుచేత చేతనత్వ మొంది యంతః

కరణంబు పరంపరావృత్తుల నొందుచు నదియ సుఖదుఃఖముల
బొల్పుచుండును. అట్టి యంతఃకరణా భాసమాత్రుండగు
చేతనుఁడే క్షేత్రజ్ఞుఁడు. ఇతఁడు మాయామయములు జడంబులు
నగు బుద్ధీంద్రియ వ్యాపారములనెల్లఁ దనపైఁ బెట్టుకొని
పుట్టితిని, చచ్చితిని, తింటిని, వింటిని యనుకొనుచు నిహలోక
పరలోకంబులను యాతాయాతంబు లొందుచుండు. అచంచ
లుండగు చంద్రుఁడు జలాభాసుండై జలసంచలన హేతువున
చలించు చున్నట్లు దోచినను నెట్లుచంచలుఁడో యట్లె
యీశ్వరుం డంతఃకరణాభాసమాత్రమున జీవుం డనం బరగు
చున్నను సాక్షాద్బ్రహ్మంబ యగు. "జీవశ్శివః శివోజీవః
సజీవః కేవలశ్శివః, తుషేణబద్ధః వ్రీహిస్స్యాత్ తుషాభావేతు
తండులః" జీవుఁడే శివుఁడు, శివుఁడే శివుఁడు, జీవుఁడే కేవ
లుఁడైన శివుఁడు, పొట్టుతో నున్నపుడు వడ్లగింజ యనియు,
పొట్టు లేనపుడు బియ్యమనియు నన్నట్లు — జీవ బ్రహ్మలకు
భేద మెన్నండును లేదు. దానంజేసి బంధమోక్షములునులేవు.
ఇదియంతయు రజ్జు సర్ప భ్రాంతి రూపంబున వివర్తంబు నొందు
టయె. ఇట్లని తెలియుటయే ప్రజ్ఞానము. అదియెనీవు. ఇట్టి
జ్ఞానమున పూర్ణుఁడైన పురుషుండు బాహ్యలక్షణంబు లగు —
నహింస, గురుశుశ్రూష బాహ్యాంతరశుద్ధి, క్షాంతి, దంభరహి
తత్వము, ఈషణత్రయ పరాఙ్ముఖత్వము, ఇష్టానిష్టసమత్వము
నిష్కామ కర్మముం గలిగి మోక్షంబునొందు.

## గుణత్రయ విభాగయోగము

సత్యాకామా! ఇట్లు నాకు యోనిరూపంబు నొంది యున్న ప్రకృతియందు బీజరూప మగునా తేజము నుంచిన వెనుక సత్వరజస్తమో గుణంబుల నాశ్రయించి యవ్యక్త ప్రకృతి వ్యక్తరూపంబునొంది సూక్ష్మము నుండి స్థూలంబై భూతప్రపంచముగా విస్తరిల్లు - నది యెట్లనిన, జడమగు దర్పణంబు మూలబింబమును తనయందు ప్రతిబింబింపఁ జేసి కొని తాను భిన్నత్వమునుఁ బొందుచు ననేక బింబంబులఁ గల్పించి యందు నానారూప సుముఖ విముఖంబులఁ బరిక ల్పించి, తన చలనంబుచేఁ బ్రతిబింబంబుల నెన్నియో యాట లాడించి, యిన్ని వికల్పములఁ గల్పించిన తాను నశించిన నెద్దియులేక యేకబింబంబు వెలుఁగునట్లు మూలమాయ నశిం చిన యాత్మ యొక్కటియె ప్రకాశించు. ఇట్టి దురత్యయ యగు నా మాయ బంధరహితుండ నగు నన్నుఁ దనయందు భాసింపం జేసికొని బద్ధునిఁగాఁ జేసి, సాత్వికప్రధానమైనప్పు డుపద్రవరహితంబగు సుఖజ్ఞానములు గలవానిఁగాను, రజః ప్రధానమైనప్పుడు కర్మలయందు రాగంబుఁ గల్పించి విషయ ప్రవిష్టుఁడగు నట్లుఁగాను, తామసప్రధానమైనప్పుడు నిద్రా లస్య ప్రమాదంబులు గలవానిఁగాను చేయు చున్నది. ఇట్టి యీ ప్రకృతి గుణంబులు మూఁడును నొకదానియం దొకటి హెచ్చుతగ్గు కొలఁతల కూడికలతో ననేకత్వము నొంది స్వర్గ మర్త్యపాతాళాది లోకంబుల యందు దేవ మానవ తిర్యగాది

జీవభేదంబులతో వెలుఁగు చుండు. ఇట్టి యీ గుణకర్మల మర్మము నెఱింగి వీనికి లోనుగాక వానివాని కర్మల వాని యందు లయింపఁజేసి తానువేఱై చూచుచు నుదాసీనుండై యుండువాఁడు త్రిగుణాతీతుఁ డనంబరగు.

## పురుషోత్తమప్రాప్తి యోగము

సత్యకామా! మాయాశబలిత బ్రహ్మమే కూఁకటి వేరుగా గలిగి మహదంకారములు కొమ్మలై త్రిగుణ రసములఁ బోషింపఁబడుచు సుఖదుఃఖములను మధుతిక్త ఫలంబులును, పంచతన్మాత్రలను చిగుళ్లును, రాగద్వేషములను సన్న వేళ్లును, జీవేశ్వరులను రెండుపక్షులునుగలిగి యూర్ధ్వమూలంబును, నధశ్శాఖలునుఁ గలదై సంసారమను వృక్షంబు పరగుచుండు. "ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిష స్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్న న్యోఽభి చాకశీతి" ఎల్లప్పుడు కలిసి యుండుచు సమాన నామములు గలిగి మంచి గమనములు గల జీవేశ్వరులను నిద్దఱు పక్షులు దేహమను వృక్షమును నాలింగనముఁ జేసి కొని యుండు చున్నారు. వారిద్దఱిలో నొకఁ డజ్ఞానమువలన రుచిగా గనంబడు సుఖదుఃఖ లక్షణమయిన యనేక విచిత్ర వేదనా స్వరూపమైన కర్మఫలము ననుభవించుచుండును. మఱొకఁడు నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వభావుఁడగు పరమేశ్వరుఁడు కర్మఫలము ననుభవింపని వాఁడై సాక్షియై చూచు చుండును. ఇట్లు జీవుండను పక్షి యావృక్షముపందలి ఫలములఁ

దినుచు రుచింపకుండక దుఃఖించుచు నెడనెడంగలుగు కించి
త్స్వాదు రసంబున సుఖతృప్తంబగుచు నాతృష్ణచే మఱలఁ
గొన్ని ఫలంబులఁ గొఱకి యవితృప్తంబులైన సేవగించుచు నొక
ప్పుడు "ఈశ్వరా! యెట్టిఫలంబుల ననుభవింపఁ జేయుచుంటి"
వని యాకసంబున కత్తెత్తి చూచి, యందీశ్వరుండను పక్షి యే
ఫలంబులఁ దినక తటస్థముగానుండి సుఖించుటఁ గాంచి, తాదా
త్మ్యంబు నొందు బుద్ధిగలిగి కొంతదవ్వరిగినమీఁద తత్తేజంబున
విలీనంబై తత్ప్రతిబింబరూపంబెకాని వేఱుగాదనిమెఱఁగించుచు
"జుష్టస్తతస్తేన అమృతత్వమేతి" ఇట్టి సంసార వృక్షమును
జ్ఞానాసిం జెండినవాఁడె శాశ్వతమోక్షంబుఁగాంచు. అనాది
యగు పరమాత్మాంశమే జీవుఁడై యొప్పుచున్నది. 'జీవో
బ్రహ్మైవ నాపరః' ప్రకృతి జన్యములగు నింద్రియములు
మనస్సుచే జీవుని విషయముల వైపున కాకర్షించుచుండు.
అందుఁ జిక్కువడి జీవుఁడు దేహముల విడుచునప్పుడును,
ప్రవేశించునప్పుడును వాయువు పుష్పవాసనలఁ గొనిపోవు
చందంబున నింద్రియ వాసనలఁ గొనిపోవుచుండు. ఇట్టి జీవుని
యథార్థరూపంబు నజ్ఞులైనవారు ప్రయత్నించియుఁజూడనేరరు.
జ్ఞానదృష్టులు మాత్రము జీవరూపంబుననున్న యాత్మనిఁ
దెలిసి తరింతురు. అతండ సర్వంబును ప్రకాశింపజేయుచు
తాను దేనిచేతను ప్రకాశింపబడక చంద్రరూపంబున నోష
ధులనెల్లఁ బోషించుచు, జఠరాగ్ని రూపమున వానినెల్ల
జీర్ణింపంజేయుచు నుండు. అట్టి యాత్మను నేను. లోకమున
క్షరుఁడనియు, నక్షరుఁ డనియు నిరువురుగలరు. దేహా

స్వరూపుఁడు క్షరుఁడు, కూటస్థుఁడక్షరుఁడు వీరిద్దఱికంటె విలక్షణుం డొక్కఁడు గలఁడు. ఆతఁడే పురుషోత్తముఁడు. వాఁడె యాత్మ. ఆయాత్మయే నేను.

## దైవాసుర సంపద్విభాగ యోగము

కౌంతేయా! యీ లోకమున జీవులకు దేవాంశమనియు నాసురాంశ మనియు రెండు విధముల జన్మములు గలవు. అం దసురాంశ జనితులగువారు శ్రౌతస్మార్త కర్మంబుల నిందించుచు, వేదమప్రమాణమని వాదించుచు, శాస్త్రముల హేళనంబు సేయుచు. కామహేతువుచే స్త్రీపురుష సంయోగంబునఁ గలుగు సృష్టికి పరమునఁ గాననిచోట కర్తయొక్కఁడు గలఁ డనుట కేవలావివేకం బనియు, ధర్మార్థంబులు సదాచార సత్యంబులు సోమరుల సౌకర్యంబు కొఱకుఁ గల్పింపఁబడిన వనియుఁ జెప్పుచు హింసాకర్ములై, దంభమానయుక్తులై, కామోపభోగరతులై, యాశాపాశంబులఁ జుట్టఁబడి, ధన నిక్షేపణంబులఁ గోరుచు, కామక్రోధయుక్తులై నేను భోగిని, బలవంతుఁడను, దాసదాసీజనంబులు గలవాఁడను, ఘన కులీనుండను, సుఖిని, తుష్టిని యని తలంచుచు నాత్మస్తుతి పరనిందా పరాయణులై పరుల యున్నతి సహింపక యంతరాత్ముండనై యున్న నన్నుఁ దెలియనేరక ద్వేషించుచు నిప్పటి కింత జేసితి నింత నాదిగా నున్నది; యింకను నింత జేయనుంటి ననుకొను చుందురు. ఈలో నెప్పుడో కాలుఁ డీడువ నేడ్చుచుం బనుచుండ్రు. దేవాంశ సంభూతుఁ డగువాఁడు పై వానికి

వ్యతిరేకంబులగు నుత్తమ గుణంబులు గలిగి శాస్త్రోక్తములగు కర్మములం జేసి శుద్ధుండగు. నీవు దేవాంశ సంభూతుండవు.

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

సత్కామా! త్రిగుణముల ననుసరించి శ్రద్ధ సాత్త్విక శ్రద్ధయనియు, రాజస శ్రద్ధయనియు, తామస శ్రద్ధయనియు మూఁడు విధములై యాహార విహార తపో దాన దేవతారాధన యజ్ఞంబులందు త్రివిధరూపములగు కర్మమయత్వంబు నొంది త్రివిధఫలముల నొసంగు. అందాహారవిషయంబును గూర్చి వక్కాణింతు. కౌంతేయా! త్రిగుణముల యలజడిం బడి మానవుఁ డాహారంబుఁ గోరుచుండు. పురాకృత పుణ్యాపాప విశేషంబులం జేసి సుకృత దుష్కృత కర్మలయందు బుద్ధి ప్రసరించు నట్టుల యాహారవిషయంబునను యవశుండై పురుషుఁడు నాల్కతీపునకుం జిక్కి విరుద్ధాహారంబుల నాహారించి తన పాపముల రోగరూపంబున ననుభవించు.

"అనాత్మవంతః పశువత్, భుంజంతియే అప్రమాణతః
రోగానేకస్యతే మూలం, అజీర్ణం ప్రాప్నువంతిహి"

అజ్ఞాని తాను తినవలసిన ప్రమాణమును మించి పశువు తినినంత తినుచున్నాఁడు. అందుచే ననేక రోగములకు మూలమైన యజీర్ణమును పొందుచున్నాఁడు. కావున భక్తి జ్ఞాన వైరాగ్యములనలవరుచుకొనుటకు, సత్వశుద్ధమగు దేహ మావశ్యకమగుటం జేసి, సత్వశుద్ధమగు నాహారమునే దేహాధారణమాత్రకంబుగా జిహ్వాచాపల్య రహితుండై మనుజుఁడు భుజింప

వలయు. నియతాహారమున నాయుస్సత్వబలారోగ్యములు సిద్ధించు. ఆత్మశక్తి సంపన్నుఁడు, విజ్ఞాని, దృఢదేహుఁడు, చిరంజీవి కాఁగోరువాఁడు, సుపరిపక్వ ఫలములు యథాసంభవముగా యథాకాలమున మితముగా భుజించుట ప్రకృతి శోధనా శాస్త్రనియమితమైన సాత్త్విక లక్షణము.

" ఆయుస్సత్వ బలారోగ్య, సుఖప్రీతివివర్ధనాః

రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా, ఆహారాస్సాత్త్వికప్రియాః.

సాత్త్వికాహారము, ఆయువును, ఆత్మశక్తిని, దేహశక్తిని, దైహిక మానసిక నైర్మల్యమును, సుఖమును, తాత్త్వికానందమును గూడ నొసంగును. ఆహారపదార్థములు ధాతుశక్తి గలవిగను, చమురు గలవిగను, కొన్ని దినము లున్నను క్రుళ్లక నిలిచియుండునవిగను, మనస్సున కింపైనవిగను నుండునవి సాత్త్వికములై భుజింపఁదగినవి. "

" కట్వామ్ల లవణాత్యుష్ణ, తీక్ష్ణ రూక్ష విదాహినః,

ఆహారారాజసస్యేష్టాః దుఃఖశోకామయప్రదాః.

వండబడి కారము, పులుసు, ఉప్పునుగలిగి, తినుచున్న నుద్రేకమును, విశేషదాహమును గలిగించు రాజసాహారముల మానవుఁ డాహారించి తద్దోషంబున వివిధరోగంబులకు బలియై దుఃఖించు చుండు. "

" యాతయామంగత రసం, పూతి పర్యుషితంచయత్

ఉచ్ఛిష్టమపిచామేధ్యం: భోజనం తామసప్రియమ్.

వండినమీఁద జాము గడచినదియు, పేల్చుట, యెండఁ బెట్టుట మొదలగువానిచే తడి లేనిదిగా చేయఁబడినదియు, చద్ది బడినదియు, తినఁగా మిగిలినదియు తామసాహారంబుగాఁ జెప్పంబడు. పండ్లేనియు తినుటకు కోసిజాము మిగిలినచో తామసాహారంబగు.

కడుపునఁ జేరినది మొదలు ౖకుళ్లనారంభించుమాంసము మానవుని బలవంతముగా (నాల్కరుచికి చేప గాలమునఁ దగుల్కొని నశించునట్లు) రోగములపాల్జేసి యిహమునను నరకములపాల్జేసి పరమునను, దుఃఖభాజనునిగా నొనర్చుచున్నది. తెల్లనూనె యెఱ్ఱనూనె మడ్డినూనె మూఁడు విధముల వత్తియందుఁ జేరి మూఁడురూపములైన గాఢ మధ్యమహీనకాంతుల నొసఁగుచున్నదో యట్టుల ౖతివిధములైన యాహారముల రసములు బుద్ధియను వత్తియందుఁ జేరి దాని వలనఁ గలుగు నాత్మవృత్తిచే నుత్తమ మధ్యమ నీచ కర్మములఁ బుట్టించి దేవమనుష్య తిర్యగ్యోనులయందు జన్మింపఁ జేయుచుండు. నూతేండ్లు ౖబతుకఁగోరువాఁడు సాత్వికాహారి గావలయు. పలలభక్షణంబుచే యిహమున దేహస్వాస్థ్యము లేక దుఃఖించుటయు, పరమున జీవకారుణ్యమునువీడి హింసాపరుండైన దోషమున శాశ్వత నరకావాసమునుఁబొందు. ఆటవిక ౖకూరమృగములు దక్క సాత్వికములగు మృగజాతియు మాంసాహారము నొనర్పదు. ౖకూరమృగము, తన పరాౖకమమున సంపాదించి ౖపాణముగల జంతువుయొక్క వేడినెత్తురుఁ ౖదావి చర్మమును రోమములను విసర్జింపక తిని దానిజీర్ణింపఁ

జేసికొనుచున్నది. మానవుండో తనకొఱ కెవ్వఁడో హింసించి తెచ్చిన జంతుమాంసమును నానావికారములగు మిశ్రమములతో మూలస్వరూప నాశమొనర్చి దేహమునకును, జీర్ణకోశమునకును, భారమగు రోగరూపపదార్థముఁగా నొనర్చికొని యాహారించుచున్నాఁడు. ఇది మనుజుని మనుజత్వమున కెంత తగనికర్మయో యోచింపఁడు. మఱియు పశువులు, ఎద్దు గేదె మేక కోడి మున్నగు జంతువులు నిత్యజీవనమున తమ కెంతయు తోడ్పడుచు వ్యవసాయమునకును, యెరువునకును, పాల నిచ్చుటకును. ఉన్ని నిచ్చుటకును, గృహశౌచమునకు నుఁగా నాచేఁ బుట్టింపం బడినవి. అట్టివాని దానికి వ్యతిరేకముగా నుపయోగించుకొని శిక్షారూపమైన శోకదుఃఖముల మనుజు లనుభవించు చున్నారు. దీనం జేసియె దేవమార్గమునఁ జనవలసిన మనుజుఁడు రాక్షస పైశాచిక కృత్యములకులోనై నరకభాక్కును నీచజన్మముల నొందువాఁడును నగుచున్నాఁడు.

ప్రకృతిసహజముగాఁ జూచిన మత్స్యము నీటి నుండి తీసినది మొదలుకొని ముఱుగ నారంభించుటం జేసి యది మిక్కిలియుఁ ద్యాజ్యము. ఒకగృహమునందొక పక్షియుండి యది బ్రతికిన గృహస్థుని గృహశుద్ధి కెంతయుఁ దోడుపడుచున్నది. అట్టి పక్షిజన్మమునకు హేతువైన యండములను, పక్షులను జిహ్వాచాపల్యముచేఁ దినుట యాత్మనాశన హేతువు.

గీ. వసుధ శవములఁ బూడ్చంగ వల్లకాడు
పేరు గల్గెను, కడుపిరుపేద జంతు

గాత్రములఁ బూడ్చు మానవ గర్భములను
నేమి పేర్వెట్టి పిలువఁగా నెంతురయ్య!

మానవులచే హింసింపఁ బడిన జంతువుల యాక్రోశము ప్రకృతియం దణఁగియుండి, అతీంద్రియ శ్రవణులైన వారికి వినబడుచుండు. అది మోక్షాపేక్షులైనవారి యుత్తమ గతులకు ప్రతిబంధకం బగుచుండు. *

## మోక్ష సన్యాస యోగము.

సత్యా:—మాధవా! సన్యాస కర్మయోగంబుల భేదము వక్కాణింపుము.

కృష్ణు:—శాంతిపుత్రా! వేదోక్తమగు జ్యోతిష్టోమాది కామ్య కర్మత్యాగమే సన్యాస మనియు, వేదోక్త కర్మంబుల నెల్ల ఫలంబుల నీశ్వరార్పణంబుఁ జేసి చేయుటయె కర్మయోగం బనియుఁ జెప్పంబడు. ఇందు కేవల జ్ఞానయోగులు సురచే

---

* దివ్యజ్ఞాన సమాజస్థాపకులలో నొకరగు డాక్టరు: అనిబిసెంటుగారొకపరి తమ యనుభవము నిట్లు వెల్లడించిరి. "నే నొకసారి రైలునందు ప్రయాణముఁ జేయుచుంటిని, కొంతదూరము వచ్చునప్పటికి నా కసంఖ్యాకములగు జంతువుల యాక్రోశము వినిపించినది. అప్పుడు ప్రక్కనున్నవారిని ప్రశ్నింపగా తమకట్టి దైన్యాలాపములు వినుపించుట లేదనియు, నీ ప్రదేశము నగరవధ్యశాలకు చేరువ యనియు, నచ్చట వేలకొలది జంతువులు ప్రతిదినమును వధింపఁ బడుననియుఁ జెప్పిరి. అదియె యా దీనాలాపములకు కారణమని గ్రహించితిని" ఇది యతీంద్రియ శ్రవణమున నుత్తీర్ణురాలగుటచే వార్తు విన్నగల్గిరి.

సురాభాండము నుగడిగి శుద్ధి నొనర్పరాని తెఱఁగున కర్మలచే కర్మముల నంతమొందించుటకు సాధ్యముగా దందురు. కర్మ యోగులు, సన్యసించితి మన్నను తినుట తిరుగుట మొదలగు విడువరాని కర్మముల విడువ నెవ్వారికిని సాధ్యంబుగాదు. కావున వేదోక్తములగు సర్వకర్మముల ఫలాకాంక్షా రహితంబుగాఁ జేసిన యెడల నాకర్మం బెవ్వారిం జెందక నిష్ఫలంబగు ననియు, నామీఁద కర్తృత్వంబు లేక యొక్కఁడై వెలుఁగు నా నిష్కామ కర్మకర్త తాను తానై బ్రహ్మభావంబు నొందు నందురు. ఇదియె కర్మయోగ రహస్యంబు. ఇది సాత్వికమయంబు. ఇట్లు నడచుటయె యుత్తమ మార్గంబని నా మతము. క్లేశభయంబున వేదోక్త నిత్యనైమిత్తిక కర్మముల విడుచుటయె తామసత్యాగమగును. సత్కామా! యొక్కొక కర్మఁ జేయుటకు దేహమును, నహంకారమును, నింద్రియము లును, పంచప్రాణములును, వీని యభిమాన దైవతంబులును నను నయిదు వర్గంబులు కారణంబులుగా నున్నవి. వీనికి త్రికర ణంబులను మనోవాక్కాయంబులు తోడుకాఁగాఁ గర్మకు కారణంబు లనేకంబు లగు చున్నవి. ప్రతి కర్మమున కిన్ని కారణములు గలుగ వాని నెఱుఁగక, నేను కర్తనని యెవ్వఁ డభిమానించునో వాఁడు కేవలాజ్ఞాని. ఇంతయు నెఱింగి నా కిందెందును నెప్పుడును సంబంధము లేదని యుదాసీనుండై యుండువాఁ డొక్కఁడే జ్ఞాని. మఱియు జ్ఞానము కర్మ కర్త బుద్ధి ధైర్యము సుఖము నను నివి సత్వరజస్తమో గుణాత్మి కంబులై వేరువేరు రూపముల వర్తించు. ప్రకృతి జన్యము

లగు నీ మూఁడు గుణంబులలో దేనికేని లోబడని దృశ్యవస్తు వెద్దియు లేదు. ఇందు సత్వగుణమువలన బాహ్యాంతరింద్రియ నిగ్రహ తపశ్శుచిత్వంబులును, క్షాంతిరార్జవంబులును, శాస్త్ర జ్ఞానానుభవజ్ఞానేశ్వరాస్తిక్యంబులును గల బ్రాహ్మణులును, రజోగుణంబున శౌర్య తేజో ధైర్య సామర్థ్య దాన ప్రభుత్వం బులు గల క్షత్రియులును, రజస్తమో గుణంబు వలన కృషి గోరక్షవ్యాపారంబులుగల వైశ్యులును, తమోగుణంబు వలన సేవాధర్మముగల శూద్రులను బుట్టించితి. కావున తమ తమ కులధర్మములు కించిద్ధర్మములు గలవైనను, శ్రద్ధా రూపంబున నొనర్చిన పరధర్మంబున కంటె శ్రేష్టములై యొప్పు. దోషయుక్తంబులుగా కనిపించినను సర్వధర్మము లును నగ్నిని పొగక్రమ్మిన రీతి దోషమయంబులుగానే యున్నవి. కావున స్వధర్మమును వీడరాదు.

ద్వైవమున్నది లేదను చింతయే లేని ప్రాథమిక స్థితి శూద్రత్వంబు నందుండి కించిద్వికాసంబు నొంది నాకు నా జీవిత ప్రవృత్తికిని నడుమ కూర్చియుంచిన దేదేని కలదా? కల్గిన నది యేది? దానిఁ బొందు టెట్లు! పొందిన గలుగు లాభమెంత? నష్టమెంత? యని చూచు స్థితి వైశ్యత్వంబు. అందుండి మఱికొంత వికాసంబు నొంది దైవంబు కలదు. దానిం బొందు ప్రయత్న మొనరింతు. తప్పక దాని సాధింతు నను స్థితి క్షాత్రంబు. అనంతరమున సంపూర్ణ వికాసంబు నొంది తత్వమసీత్యాది మహావాక్య విచారణంబున బ్రహ్మనిర్ణయం బొనర్చి యా పరమాత్మకును తనకును భేదంబు లేదని తెలిసి

కొని తాదాత్మ్య స్థితిం బొందుట బ్రాహ్మణత్వము. ఇట్లొక్క జన్మయందె నాలుగవస్థా భేదంబులఁ బొందుచు క్రమ వికాసము నొంది ముక్తుఁడగుటయె నాలుగు వర్ణంబులుగాఁ జెప్పంబడియె.

సత్కామా! యిట్లు మానవుఁడు భార్యా పుత్ర గృహ ధనాదులు గలిగి గృహకర్మములనెల్ల నడుపుచు సక్తుండు గాక వచ్చుదానికై సంతసింపక రానిదానిఁ గోరక నష్టమగు వారింగూర్చి దుఃఖింపక వైరాగ్య పరుండై యహంకార మమకార వర్జితుండై చిత్తచాంచల్యము నరికట్టుట కొఱకు దినంబునఁ గొంత కాలము రహస్య స్థలంబునఁ జేరి యోగా భ్యాసియు ధ్యాననిష్ఠ నలవరుచు వాఁడును నగుచు నన్నే ప్రాప్యస్థానంబుగా నెంచి భక్తిం జూపుచు బహ్మ సమర్ప ణంబుగా వేదోక్త నిత్యనైమిత్తిక కర్మంబుల నొనర్చుచు నిష్కామ కర్మయోగంబు నడుపుచు నన్నే చూచుచు నన్నే తలంచుచు నన్నే యాశ్రయముగాఁ గలిగి నాయందు రతిం బొందువాఁడు నా శాశ్వత మోక్షస్థానంబు నొందు.

గీ॥ క్రందుకొను సర్వధర్మ వికల్పములను
నెడల విడిచి దృఢంబుగ నేనొకండ
శరణముగ నాశ్రయింపుము సకల దురిత
ములకుఁ దొలఁగింతు నిన్నుఁ బ్రమోదమొంద" — భారతము.

శాంతేయా! నీ వహంకారంబు నొంది యేకర్మను జేయనని నిగ్రహింతువో దానినే ప్రకృతి నీకుఁ దెలియ

కుండఁ జేయించు. కావున "యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్" మద్భక్తుండవు మన్మనుండవు మన్నమస్కారణుండవు నగుచు మదీయ స్థానంబు నందుము. ఇట్లు గృహస్థులైన వారికి సులభ తరణోపాయంబుగా నెఱింగించిన యీ నిష్కామ కర్మయోగశాస్త్రంబును నిత్యాను సంధానమున నిడి యన్యుల కుపదేశించుచు బహుజన ప్రీతిపాత్రుండగు వాఁడు మత్ప్రీతి పాత్రుండగు ననిన, సత్కాముఁడు తండ్రీ! పరమాత్మా! నీ యనుగ్రహంబున నా యజ్ఞానము తొలఁగినది, జ్ఞానోదయమైనది. సందేహము నివర్తించినది. ఇంక నీ యాజ్ఞ శిరసావహింతు. తత్వ విచారమును సాగిపో నిమ్మనిన నతండట్ల చేసె. తదనంతరంబున —

భగవద్గీత సమాప్తము.

---

## బ్రహ్మచర్యుని ప్రథమ దివస వాదము.

బ్రహ్మచర్యపాలితంబై కల్లలయొకిమీని మూఁకలును, నహింసా పాలితంబులై తేగముసామి దళంబులును దలపడి యుత్తమాధికారు లుత్తమాధికారులును, మధ్యమాధికారులు మధ్యమాధికారులును, మందాధికారులు మందాధికారులును దలపడి హోరాహోరి వాదం బొనర్చుచుండ బ్రహ్మచర్యుండు సనాతనుం డయ్యును యువకునిలీల సైన్యంబులఁ

బోదివి ధృతిధారణాదుల సాహాయ్యంబున ననేకుల రూపంబులు శూన్యంబు లొనర్చి సత్కామాదులకు నోరాడకుండఁ జేయు చుండె. ప్రథమదివసవాదంబున దంభునిచే కంపనుఁడు సమసె. ద్వితీయ దినంబునను బ్రహ్మచర్యుఁడు తమదే విజయంబుగాఁ గడపె. తృతీయదివసంబున బ్రహ్మచర్యు నాటోపంబున కోహ టించిన సత్కాముఁ జూచి జనార్దనుండు, జీవబలంబున కంతకు మూలశక్తి యీతండ ముందీతని దుదముట్టింపకున్న శత్రువర్గ సంహారంబునకు మార్గమేర్పడదని నిశ్చయించి సత్కామున కుత్సాహంబుఁ గలిగింప నెంచి యీవాదంబున నేకర్మకునైన సాక్షినై యుండువాఁడనే కాని కర్తృత్వంబు వహింప నన్న వాఁడు తద్విరుద్ధంబుగా రథంబుడిగ్గ నుఱికి కాలచక్రంబును కేలం గీలించి నిముసంబున నీబ్రహ్మచర్యు దుదముట్టింతుఁ జూడు మనుచు నతనిమీఁదికిం బోవుచుండ సత్కాముఁడు వెంటనంటి ప్రభూ! తటస్థుండవగు నీవిప్పు డీకర్తృత్వంబు వహించి నీ నిర్గుణ స్వభావంబును మలీమసంబుఁ జేయనేల. ఆగుమాగుము. విజయకాంక్షుల మమ్మనుగ్రహింపుము. నీవే తలకొన్న నీతఁడొక్కఁడ యేమి నిముసంబున లోకములనెల్ల నామరూప రహితంబుగాఁ జేయఁగలుగుదువు. కావున తండ్రీ! నన్ననుగ్రహించి మరలిరమ్ము? రథంబెక్కుము? చేయందగు కర్మంబెల్ల నాచేతన చేయింపుమని ప్రార్థింప మరలివచ్చి నొగలెక్కె. ఆదినంబున శాంతేయులకే విజయంబుగాఁ గడచె. నాలవనాఁడు వేదకాముని ప్రమాణవాక్యములను గదాప్రహా రంబులచేత భ్రాంతివాది సైన్యంబు లనేకంబులు మడిసె.

ఎడనెడ నహింసుండును తర్కదృష్టియు దమంబును లోనైన వారు బ్రాహ్మణ యజ్ఞ దంభ కామాములతో నెదుర్కొని పోరుచుండిరి. అందు దంభుని కొడుకతివినయుం డనువాఁ డహింసుని మార్కొని నశించె. బ్రహ్మచర్యుఁ డంతర్యాగ సైన్యంబుల నెల్ల బడలువడం గొట్టి రూపరహితంబుగాఁ జేయుచుండె. జాగరణుం (ఘటోత్కచుఁడు) డొక్కచక్కి బౌద్ధయ సైన్యంబుల బడలువడం గొట్టుచుండె. ఇట్లా దినంబు గడువ పంచమ షష్ట సప్తమ దివసంబుల యందును నుభయ సైన్యంబులు సరాసరిం బోరాడి రందు బ్రహ్మచర్యు నాత్మతేజంబు కన్నాకై యంతర్యాగ బలంబుల నెల్ల బరిమార్చుచు వచ్చె.

## వినయుఁడు కలిచేత మడియుట

ఎనిమిదవనాఁడు మొదటి పోరున తవలిదార తోబుట్టు లేడుగురు వేదకాముఁ దాకి రూపడంగిరి. నమ్రత (ఉలూచి) కొమరుఁడు వినయుఁడు (ఇరావంతుఁడు) కలియను నలంబసునితోఁ బోరాడి మడిసె. అప్పుడు సోదరుని మరణంబునకుఁ గోపించి జాగరణుండు విజృంభించి జీవసైన్యముల బడలువడం గొట్టుచుండ నతని కోల్తల కాగక సైన్యంబులెల్ల పాఱిపోవుచున్నం గని సర్వసేనాని మోహుఁడను భగదత్తునితో నిట్లనియె. "జాగరుఁడు రాక్షసాంశ సంభూతుండగుట మాయావాదియై సైన్యము నుఱుమాడు చున్నవాఁడు. నీవాతని జాతికిం జెందినవాఁడ వౌట నతనిం దలపడుమన నతం డతని నెదుర్కొని ఘోరంబుగాఁ బోరాడె. ఆమీఁద సత్కాముఁడు

వేదకాముపలన తనయుం డీల్గుట విని పుత్రప్రేమంబునఁ గలిగిన దుఃఖము నాపనేరక మహామోహుని యవినయంబున నింత వాటిల్లె నని శోకింపుచుండ, నతనిం గాంచి గోవిందుండు నగినఁ గనుంగొని తెలివొంది "గోవిందా! మున్ను నీచే విన్న యర్థంబు మఱచి చేలనైతి. తత్త్వవిచారంబు సాగనిమ్మని నతం డట్లుసేయ సత్కాముఁడు పాపసేనల సాయంతమున కనేక విధంబుల బడలువడం గొట్టె.

## బ్రహ్మచర్యుని వాదమును విరమింపు మని కల్లతేఁడనుట.

ఆ రాత్రి మహామోహుఁ డహంకారాదులఁ దన నగరికిం బిలిపించి వారందరునుఁగూడి బదటికొని బ్రహ్మచర్యు మందిరంబున కఱిగి "పితామహా! నిన్నెంతయు నమ్మి శాంతి పుత్రుల లెక్కింప కుంటిమి. కాని నీ కయ్యపు చందంబుఁ గాంచ పంచకాముల మీఁది ప్రేమంబున నగ్గమైనను వారిఁ జంపకుంటి వని తోఁచు చున్నది. నిన్నెదిరించి విజయంబు గొన దేవతలకేని సాధ్యంబు గాదు. ఇట్టి నీ వెనిమిది నాళ్ల నుండి పోరుచుండియు సత్కాము నశింపఁ జేయ నేర వైతివి. నిన్నుఁ బ్రాంతు నీ వాదం బుపసంహరించి యహంకారు బంపు మతండైన సర్వంబు నిర్వహించు" ననిన నమ్మాటలు మనమ్మున నమ్ములై నాట విషాదమ్మున మానమ్మాని యవనత వదనుండై నిట్టూర్చి యిట్టులను.

"కుమారా! నీ కొఱకు ప్రాణముల దాపక యోపి నట్లు పెనగుచున్న నన్ను నింత చుల్కనఁ జేసి మాటలాడఁ

దగునా ?" అని పాడుచున్న యుడుకున కాఁగలేక "మిథ్యా కల్పనా ! సత్యకాముఁ డెట్టివాఁడో యున్న యెఱుంగుదువు. నిన్నును నన్నును నీవుజూపు నీ యహంకారుని నింద్రియ గ్రహణకాలమున నెంతజేసె. మఱియుఁ బెక్కుడల నెంతెంత వింతమహిమలం జూపె. అట్టివాని నెఱిఁగియు తగని పగం బెట్టుకొంటివి. ఇంక తెగించి సత్యవాదంబునఁ బౌరుషంబుఁ జూపుము. మావంటివారిని సూడుమాటల వాడిఁ జూపిన ఫలంబు గలదా ? అతనిం గెలుచుట యభిరతి నెదికించుట నాకుం గానిపని. నడిరేయి వచ్చి నన్ను నువ్వానాడి నంతన విజయంబురాదు. నే నెక్కడ నంతర్యాగ యోగవిద్యల పరివారంబుల ద్రుంతు మీ రెల్లఱు శాంతి పుత్రుల గెలువుఁడు. నా శక్తి సామర్థ్యముల నేఁడు చూతువుగాక " యని పల్కినఁ బ్రియంబంది మహామోహుఁడు తన విడిదికిం జనియె.

## బ్రహ్మచర్యుని తొమ్మిదవనాఁటి పోరాటము

వేగుటయు నాత్మవాద సన్నాహులై నవమ దివసంబున నొకరి నొక రెదిరించి వాదించునెడ నానాఁడు బ్రహ్మచర్యుఁ డెవ్వరికిఁ దేరిచూడరాక సేనలనెల్ల నేలమట్టంబునకుం దెచ్చిన శాంతేయ పరివారంబులు పాఱఁజొచ్చిన నక్కోలాహలంబుఁ గనుంగొని గోవిందుండు సత్యకామునిఁ జూచి.

"సత్యకామా ! చూచితివా ? మన సేనలగతి పవిత్రతా కుమారుని పోరు మాఱులేని పరాక్రమంబుగానున్నది చూచుచు నూఱకున్న నెట్టు "లనిన సత్యకాముఁడు "కృష్ణా !

యిట్టి పరమప్రాప్యుల బడలువడంగొట్టి యేమి పుణ్యంబుఁ గట్టికొందునను విచారంబు వాదంబునకు నూలుకొలుపదయ్యె నేమిసేతు నయిన నీతో నప్పటప్పటి కేటిమాటలు రథంబతని సమ్ముఖంబునకుం బోవని" య్యనిన కృష్ణుఁ డట్లచేసిన పవిత్రతా పుత్రుఁడు మహానాదంబుఁజేసి సత్కాముని, గోవిందుని, తురగములను, రథంబునుగూడ శాశ్వతబ్రహ్మనిష్ఠాతేజంబను బాణములఁ గప్పిన తత్తేజంబునకుంగాక మహావాక్యములు మాఱుమొగంబు వెట్టిన శౌరి వాని నిమిఱి తరిమిన సత్కాముఁడు నొచ్చిన యంగంబులతో నతనిఁ గొట్టనేరకఁ బంటుతనంబునఁ బాఱిపోనేఱక పెనంగుచుండ, నతని దీనస్థితిం జూచి చక్రాయుధుండు చక్రంబుఁగొని భూచక్రంబు గదల ధారుణికి లంఘించి పీతాంబరంబుజీరాడ ముంగురులల్లాడ 'బ్రహ్మచర్య నడంతు' నని వచ్చుచున్న పరమాత్మ నీక్షించి వికాసోల్లసిత ముఖుండై బ్రహ్మచర్యుఁడు

బ్రహ్మచర్యుఁడు శ్రీకృష్ణుని స్తోత్రముచేయుట

మ॥ "త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప ప్రాభాతనీ
రజబంధుప్రభమైన చేలముపయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుంబ్రోచెడు వన్నెలాఁడు మదినావేశించు నెల్లప్పుడున్

మ॥ ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దానొక్కొక్కఁడై దోఁచు
పోలిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచు నుండు నట్టి హరి నేఁబ్రార్థింతు శుద్ధుండనై"

—భాగవతము

జగన్నాథా!

శా॥ నీవాఁడన్ దయఁజూడుమో వరద నిన్నే నమ్మియున్నాఁడ నో
భావాతీతాగుణ ప్రపూర్ణ! యభవా! భక్తార్తి సంహారకా!
త్రోవన్ రాక తపించు నీభవము పోఁద్రోపంగ నుత్సాహివై
రావే మాధవ! కావవే వరద! నిర్వాణైక సంధాయకా!

ఉ॥ కన్నుల నిన్నుఁగంటిఁ గడగంటిని జన్మపరంపరాళికిన్
మిన్నక దాటఁగంటి మిడిమేలపు భౌతికవాంఛలెల్ల నిం
కెన్నడు పుట్టుపొందు పనియేమియులేని పదంబుఁ గంటి నా
పిన్నటినుండి కోరికొను పెన్నిధిఁ గంటిని, మంటి, నీశ్వరా!

తండ్రీ! నేను నీ సంహారక్రియ కాటంక మనియా యిట్లు బూనుట. ప్రభూ! సమస్త స్థూలరూపాంతర్గతములగు నోజస్తేజో బలములకు నేను కర్తననియు, నేను మనియుండ నీ యరివర్గ మడంగదనియు నీ దివ్యచిత్తమున నెంచుచుంటివి గాని స్వామీ! నాయనంతశక్తికి మూలశక్తివి నీవుకావా! నామూర్తి నీ మారటమూర్తిగాక నిన్నువినా నాకు స్థితి గలదె? నేనేల? పితా! బ్రహ్మాండమునం దెటుగన్నను నీవ కాక యన్యంబుగలదా? ఈశ్వరా! నీలీల లనంతములు. నీ విలాసములు దురూహ్యములు. నామరూప రహితుండ వగు చుండియు సంకల్పమాత్రమున సకల ప్రపంచమును మూల మాయా సహాయంబునఁ గల్పించి సాకార రూపము నొంది సృష్టలోకమునం దాత్మరూపమునఁ బ్రవేశించి రూపొందితివి. అనంతా! ఇట్టి నిన్ను తపోదాన జ్ఞానాదుల దేనిచేతను లభింపని

భక్తసులభుండవగు నిన్ను మెప్పించితి నను నేవంబున ననుగ్రహ ప్రదాతనుగాఁ జేసికొంటి ధన్యుఁడను ధన్యుఁడను.

" ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే నవిద్యతే కించిత్,

ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ "

నాకు చేయదగినది కొంచమైనను లేదు. ఇక్కే పొందఁదగిన సమస్తము నిప్పుడు లభించినది. ధన్యుఁడను. స్వామీ! యీ సంఘటన మంతయు నీ కృపావిశేషము. ప్రాణపతీ! సర్వాంగ చలనములు, సర్వాంతః కరణములు, సర్వప్రాణములు నీ సేవకొఱకు నడచునట్లనుగ్రహింపుము. గోవిందా! యహర్నిశలును, నన్ని యవస్థలును మఱపులేని నీ ధ్యానంబు కొఱకుఁ బ్రవర్తింపనిమ్ము. "

అని ప్రార్థించుచున్న సమయంబున సత్యాకుఁడు సరభసంబున రథంబు డిగ్గ నుఱికి కృష్ణునకు వెనుకవైపునం గదిసి పట్టుకొని " మాధవా! మానధనుండ నగు నా మానంబు వీటఁబుచ్చి యీ సంహారకార్యంబునకు నీవ గడంగిన నెట్లు యింక నీతనిపాటుఁ జూతుగాక! రమ్ము " ని ప్రార్థించి వెనుకకుఁ ద్రిప్పి తెచ్చి రథం బెక్కించి బ్రహ్మ చర్యతోఁ బోరుచుండె. కాని నాఁటి కయ్యంబును జీవేయు లకే విజయంబుగా సమాప్తంబు నొందె. సాయంసమయమున నిరువాగులును సమరంబు చాలించి విడిదలకుం జనిన యనంతరంబున :—

## నిష్కాముఁడు కృష్ణుని విడిదికిఁ బోవుట

నాఁటి రాత్రి నిష్కాముఁడు తమ్ములతోఁ గూడి వాసుదేవు గృహంబునకుం జని "జనార్దనా! బ్రహ్మచర్య్యు బ్రహ్మతేజంబుఁ జూచితివ కదా? మనవా రెవ్వరు నతని కోల్తల కోర్వరు. దురభిమానంబునఁ బోరి సచ్చిన నీయధిరాజ్య సంపాదనం బెవ్వరి కొఱకగు? ఆకారణంబున నిన్ని యిడుమల కోర్చిన యీ తమ్ములఁ గన్నారఁ గాంచుచు మఱల ద్వైతకామ్యముల నైన నుందుఁ గాని బ్రహ్మచర్య్య పాలు సేయనోప" ననిన శౌరి సాంత్వన వాక్యముల నోదార్చుచు "బావా! నీవఖండ సత్యస్వరూపుఁడవు. నీతమ్ములు నీకుం దీసిపోరు. అట్టివారి కెట్టి బాములునుఁ గల్గనేర్చునే? నేనై నీకు సాచివ్యంబాచరించి యాత్మసామ్రాజ్య స్థాపనంబుఁ జేతు వెఱవకుండు" మని పల్కుచున్నంత నిష్కాముఁడు మురాంతకున కిట్లను "మధుసూదనా! పితామహుండు పాపసైన్యంబుల వైపున నుండి సమరంబు సేయుటకును" నాకాత్మరాజ్య ప్రదానం బొనర్చి హితంబు సేయుటకునుఁ బూనియుండె. కాని కట్టా! సదసద్విచార దూరులమైన మమ్ము బాల్యంబున దగ్గఱఁ దీసి లాలించి పోషించిన యతనిం బోకార్చిన మీాద మాకు బింమధారణమ్ము గలదె యేమిసేతు" ననిన నరకాంతకుండు "బావా! నీయభిప్రాయంబుఁ దెలిసికొంటి. నీతని యొక్కని తెగుటకుం దిగులొందకు మిట్టివా రట్టివా రననేల యెల్లవారునుఁ దెగినఁ గాని మన బ్రహ్మ

సామ్రాజ్యంబు నిలువ నర్హంబు గాదు. కావున నీయందు సుముఖుండగు నతనిపాలి కిప్పుడ యఱిగి తద్వధోపాయంబుఁ దెలిసికొని వర్తము. మహామోహాసుర దుర్నయంబునకుం గనలి యతండు నిజప్రచారం బుపసంహరింప నెంచి యున్నవాఁడు. ఇదియ సమయంబు కదలు" మన నయ్యజాత శత్రుండు తమ్ములును దామోదరుండును వెంటరా నతి రహస్యంబున దేవవ్రతు మందిరంబున కఱిగి యాతనిం గాంచి భక్తిపుర స్సరంబుఁగా నమస్కరించిన నెల్లఱ నాదరించి,

"ఇందఱునుఁ గూడివచ్చిన పనియేమి యడుగు డది యెంతటి దుష్కరంబేనిఁ దీర్చెద" నన్న దీనాననుండై నిష్కాముఁడు "మహాత్మా! మాసైన్యక్షయంబుదక్క యానంద రాజ్యంబు సేకురువిధంబు నెఱింగింపవే?" యనుటయు నతండు "నేను గలన నున్నంతమేఱకుగుణసైన్యక్షయంబగు. సామ్రాజ్యము మీ హస్తగతంబుఁ గానేరదు. కావున నన్నులోబరచు కొనిన నెల్లశుభంబులు నగు"ననిన నిష్కాముఁడు "మహాత్మా! మదనోన్మథనుండైన పరమేశ్వరుఁడుసైతము నిన్ను నిల్వ కొన నేరక పార్వతిపాలంబడియె నేమెంతవార మనుగ్రహించి నీవాదక్రీడ నుపసంహరించి మమ్ముద్ధరింపు"మని ప్రార్థించినఁ బవిత్రతా పుత్రుండు కరుణించి "వనజోదరునిఁగూడి మీ రందరువచ్చి నన్నింతవానిగా నెఱిఁగి యడుగ మీకు హిత కార్యం బొనర్పకుందునె? ఇంతకన్న పుణ్యంబుఁగలదె? నేను వాక్యవాదంబుమాని యుదాసీనత నొందినంగాక నన్నుఁ

మీఁకుఁ గెలువవచ్చునె? దానికిం దగిన యుపాయం బెఱిఁగింతు. మీయం దభిరతి కలఁడుగదా? అతని కెదురేయ. కావున మనసత్కాముఁ డాతని బురస్కరించుకొనివచ్చి సేవాదించుట మానినయెడ నొప్పించి పడవైచునది. పదంపడి జీవసంతానముఁ గెలుచుట సుకరంబగు. ఇది నాయాజ్ఞకా నిర్వహించునది.'' యని చెప్పిన మోదించి యందఱునుఁ దమ శిబిరంబులకుం జని సుఖనిద్రం జెందిరి.

## సత్కాముఁడు బ్రహ్మచర్యునిఁ బడఁగొట్టుట.

మఱునాఁ డరుణోదయమ్మున దశమ దివస వాదంబునకుఁ గదిసి వ్యూహంబులు బన్ని యిరువాగును నొండొంటిం దాకి పోరునెడ సత్కాముఁడు తన రథంబునకు ముందు యభిరతి ( శిఖండి ) రథంబు నిడుకొని దేవవ్రతు నెదుటికిం జని పోరాడుచుండ నతఁడు వాదంబు వర్జించి వెనుకకు మరలిన శాంతేయుఁడు వెనుకనై నేతినేతి వాక్యములను బాణంబులు ప్రయోగించి బ్రహ్మచర్యు పరివారముల ధృతి ధారణ యింద్రియనిగ్రహ సుఖలేశతృణీకరణ శాశ్వతానందకాంక్షాదుల నడంచిన బ్రహ్మచర్యుండును తన దేహయాత్రపై విసుగునొందినవాఁడై యభిరతి మొగంబుఁజూడక తనదీక్షానుకూలముగ వెనుదిరిగి సత్కాముచేఁ బ్రయోగింపఁ బడిన నయ్యనల్ప మహావాక్యముల నూతఁగొని శరతల్పగతుండయ్యెనని లోకులెంచునట్లు ప్రశాంతభావనం బొందిన నిరుకక్ష్యల వారును దీనాననంబులతో నమ్మహాత్మునిసన్నిధికిం జేరి,

వైరంబులు దక్కి కొలిచియుండిరి. అట్టియెడ దేవవ్రతుండు తన పాన్పునకుఁ దగిన తలగడ నేర్పరుపుఁడన, జీవపుత్రు లా మెలుకువ నెఱుఁగనేరక మెత్తని తలగడలు దెండని సేవకులఁ బంచిన, నతఁడు సత్యాముఁ జూచి పాన్పునకుం దగిన యుప ధానంబుఁ గూర్పుమన్న, బాష్పావరుద్ధ నేత్రుండై సత్యా ముఁడు ప్రణవ మనుసంధించి తదాజ్ఞంగొని మహావాక్యతల్పం బునకుఁ దగునట్లు సచ్చిదానందంబులను లేక యస్తి భాతి ప్రియములను బాణంబులు మూఁట నాతని పెడతల యెత్తి పట్టి నిలుచునట్లేసినం దాత మోదించి యభినందించి, జలం బులు ద్రావంగోరిన ననేకులు జలకలశంబులు గొనివచ్చిన వానిం గొనక " యీ శయ్యనుండు నాకీ జలంబులు కొఱఁ గావు. సత్యామా! దీనికిం దగిన క్రమం బెఱుఁగుదే " యనిన నతండు " సహస్రార ద్వార భేదనంబొనర్చి తదంత ర్నాళ గత గంగాజలం బను యోగరసంబును లంభికాముక్తం బుఁజేసి యాస్వాదించుటయ " యనిన సత్యాముని యనుభ వంబును మాహాత్మ్యంబును నెల్లఱకుఁ దెల్పి " యీతనిప్రభా వంబు నిదిధ్యాసాదులచేత పూర్వంబె యెఱింగితి. నారాయ ణుండును, నితండును గూడిన నసాధ్యం బేమియుండు, నిట్టి వారితోడ పగగొంట మేలుగాదని యెన్ని జెప్పినను దురభి మానంబున కల్లసామి వినక చెడియె. ఇంకమీఁద వేదకాము చేత మడియువాఁడకాక యేలదక్కునని మహామోహుఁ జూచి " కుమారా! నా మాటవిని యిప్పటికేనిఁ దెలివొం దినవాఁడవై యజాతశత్రునకు విదేహకైవల్యంబిచ్చి కాము

పురంబు నీవుగొని యీ వున్నవారినేని బ్రతికించుకొని సుఖింపు'' మనిన మారు వలుకక దనవారిం గూర్చికొని విడిదలకుఁ బోయె.

## అహంకారుఁడు బ్రహ్మచర్యుని దర్శింపఁ బోవుట

ఇల్లిల్లలునుఁ బోయిన యనంతరంబున నహంకారుఁ డొక్కరుండ బ్రహ్మచర్యు కడకుం జని మ్రొక్కి తన్నెఱిం గించి, మహాత్మా!

ఆ॥ "అలుకదక్కి నన్ను నధిక వాత్సల్య శీ
తలముగాఁగఁజూచి తగినమాట
లాడవే మహాత్మ యనుటయునాతండు
గారవమున నతనిఁ జేరఁ బిలిచి"

— భారతము

కౌఁగిలించికొని పరిజనముల నావలకుఁ బంపి కుమారా! అహంకారా! నీవు బిడ్డలకు భేదంబగునట్లు బల్కుచుంట సహింపక నిష్ఠురోక్తు లాడుచుందు నంతియకాని నీయం దెప్పుడును కోపింప. అదియు శిక్షగాని రోషంబుఁ గాదు. నీ జన్మప్రకారంబు వేదపురుషు వలన నెఱింగితి. నీవును శాంతే యుండవ యగుట పంచకాములయం దొక్కండవ. ఒక్కటి సెప్పెద నాకర్ణింపుము. నారాయణుండు వారికిఁ దోడై యున్నవాఁడు. వారితో మత్సరంబుఁ గొనక కలిసి యుండు'' మనిన నహంకారుఁడు "నేను శాంతేయుఁడనని కొందఱివలన మున్న యెఱింగితి. ఐనను శాంతిపుత్రులపొత్తు నావంటివానికిం

దగునా ? వారు యోగబలసంపన్నులు జనార్దనుని ప్రాపునుఁ గలదు. కావున వారలజయింపరాదని యెఱుంగుదు. ఐనను మహామోహునిచే నేఁటివర కింతటి మన్ననలఁ గాంచుచు బ్రతికిన నేనాతని ఋణవిమోచనంబుఁ జేయవలసిన కాలంబున విడిచిపోవుట ధర్మంబగునా ? కర్యంబు నడుచుఁగాని వేఱొండు గానేరదు. సర్వంబును దైవాధీనంబు. నీవింక మఱియొం డాజ్ఞాపింపక వాదంబున కనుజ్ఞనిచ్చి పంపుము. నా సేవాధర్మంబు నిర్వర్తింతు " నన " నహంకారా ! సత్యముఁ బలికితివి. రవళిద్వార నీసహాయమునునమ్మి యింతకుఁ దెగించె. ఆతనికిఁ బ్రియంబగునట్లు సంచరింపుము పో"మ్మన బ్రహ్మచర్యుని బంధుభావంబున కానందించుచు నిజ నివాసంబునకుఁ జనియె.

శ్లో॥ "నమామి నారాయణ పాదపంకజం
కరోమి నారాయణ పూజసంపదా,
వదామి నారాయణ నామనిర్మలం
స్మరామి నారాయణ తత్వ మవ్యయమ్"

ముకుందమాల—

ఆత్మభారతమున — బ్రహ్మచర్యపర్వము.

సమాప్తము

ఓం తత్సత్.



రాధాకృష్ణ

# ఆత్మభారతము

## బ్రాహ్మణ పర్వము

---

సీ. నామరూప వికార నాశమొందిన వేళ
సత్యవాచక మయి జరుగునెద్ది
సర్వత్ర ప్రాణ సంచలన మాగిన తఱి
విజ్ఞానమాత్రమై వెలయునెద్ది
వివిధ లోకానీక విభవముల్ చనుమీదఁ
దలఁప ననంతమై తనరునెద్ది
సకల మాయాగుణ వికృతిఁ బాసిన వెన్క
నానందమయమౌచు నలరునెద్ది

గీ. యున్నదనునది యెదియు లేకున్నవేళ
రెండవదిలేక యేకమై యుండునెద్ది
సత్తుచిత్తుల కేకైక సదనమెద్ది
యట్టి నిర్గుణ తత్వంబు నాశ్రయింతు.

జీవుఁడు వైరాగ్యవలన బ్రహ్మచర్యఁ డుపశమిత తేజస్కుఁడగుట విని విలపించి విలపించి యింతటి యోజశ్శాలి పోవ నింక నెవ్వరిఁ గొని నా కొమరుఁడు విజయంబు నొందు నని వగచు నతనింజూచి వైరాగ్యఁ "డిన్ని మారణంబులకు కారణంబు నీవకాన రానున్న కీడుల నెల్ల వినుచుండు" మని వాదక్రమ మంతయు నతని కెఱింగించు చుండె,

పదునెకండగు వాసరము నుదయంబున కలుషప్రభు సైన్యంబులెల్ల పవిత్రతా పుత్రుఁడులేమికిం జింతా క్రాంతంబులై రణభూమింజేరి తమకెల్ల నింకరక్షకుం డహంకారుండ యని యతని రాక కెదురుచూచుచుండ, నహంకారుఁడు చండగర్వ మను రథంబెక్కి, దుస్సంగతి యను హస్తికేతువు గ్రాల, నాత్మశ్లాఘ్యం బను ధనువుఁబట్టి, క్రూరదృష్టులను బాణంబులు గొని, కొమరుఁడు సర్వోత్కృష్టత యను వృషసేనుండును, పరనాశ కుతూహల, పరనిందా పరాయణ, పండితదూర, పాపవిచారు లను పరిజనంబులతోఁగూడి రంగస్థలం బలంకరించె. అంత నెల్లవారు నతనిం బరివేష్టించి 'మాకు నెల్ల రక్షకుండవై నడుపు' మని ప్రార్థించిన నతండు సత్యంబును తపంబును దమంబును శీలంబునుఁగల మహాత్ముండు వాదంబున నోటుపడె నన నింక మన కెక్కడి గర్వంబులు. అక్కటా! భ్రాంతివాది సంపద యిట్లాఱడి యయ్యెఁగదా? యని కన్నీరుంచిన నెల్లవారును నట్టివారైరి.

## బ్రాహ్మణునకు సర్వసైన్యాధిపత్య మొసంగుట

అప్పుడు తన్నుఁ దాన యుపశమించుకొని యహం కారుఁడు "మీరు భీతినొందకుఁడు. బ్రహ్మచర్యుఁ డెంత యగ్గలిక సూపె నంత నేనునుఁ జూపుదు. శాంతేయుల నెల్ల వాయూడకుండఁ గొట్టి నిలువరింతు. నింకను నెంత సేతునో చూడుఁ" డని చెప్పుచు మహామోహు కడకుఁ జనిన నతఁడు "మిత్రమా! నీవలన సేన సనాథంబుగా నలరు చున్నది. ఇంక చేయందగు కార్యమేది యెఱింగింపు" మనిన నహంకారుండు చతుర్వింశతితత్త్వ సంఘాతజాతుండవగు నీకుఁ దెలియని యాత్మధర్మంబులు గలవె. ఐనను సర్వతత్త్వ మూలశక్తియగు బ్రహ్మచర్యుండు ప్రావృటంజేసి నిప్పు డియ్యనీకంబుల సమర్థుండై యెవ్వఁడు నడుపఁ గలఁడని యనుచుంటివి. వినుము చెప్పెద. నీపరివారమున చాలనివా రొక్కరును లేరు. ఐన నిందొక్కనిఁ గొన్న తక్కిన వారికి మత్సరంబు గల్గనివాని వరింపవలయు. అట్టివాఁడు బ్రాహ్మణుం డొక్కండ. అతఁ డన్నిటం సమర్థుండై యుండు నాతనిక పట్టంబుఁ గట్టు" మన్న నెల్ల దొరలం గూర్చుకొని యతని పాలికిం జని నమస్కరించి "సర్వసేనాధిపతిత్వముం గొని నన్నును సైన్యంబును రక్షింపు" మని ప్రార్థించి యొడం బరిచి సర్వగుణ సమక్షంబున నతనికి పట్టంబుఁగట్టి సంతసించుచున్నంత, అందఱ ముందుఁ దన్నుఁ బొగడి నందు కుబ్బి బ్రాహ్మణుండు "బ్రాధ్దేయా! నన్నింత పెద్దఁజేసి నందుకు ముదం బొందితి. దీనికిం దగిన ఫలంబుఁగా వరంబు వేడు

మిత్తు"ననిన నతం డహంకారాదులతో నాలోచించి మహాత్మా! నన్ననుగ్రహించితివేని ప్రాణంబులతో నిష్కాముఁ బట్టి యి " మ్మనిన బ్రాహ్మణుండు నగి,

" అక్కటా ! యజాతశత్రుఁ డను నామము నిష్కామున కే చెల్లె. స్థూలపురాధీశా ! యతనిఁ జంపుమని కోరక పట్టుకొను మంటి వది యసాధ్య కార్యంబు. ఈ రీతిం గోరుటకు కారణంబేమి. వారిం గెలిచి మఱల యర్ధరాజ్య మీఁ దలంచితివో ? నీ నిశ్చయంబేమి యతనిం బట్టి యిచ్చిన నేమిసేతు వెఱింగింపు " మన తన కోర్కె యెల్లఅకుఁ దెలియ దబ్బర దొర యిట్లనియె. " ఆచార్యా ! నిష్కాముని వాదమున నోడించితిమేని సత్కాముఁడు మన సైన్యముల నెల్ల సమయింపక మానఁడు. మనము వారినెల్లఁ జంపఁ గల్గితి మేనియు గోవిందుఁడు మనలనందఱ నంతమొందించి శాంతికై న పట్టంబుఁ గట్టుఁగాని యూరకుండఁడు. కావున నిష్కాము ప్రాణంబులతోఁ బట్టితెచ్చిన మాయావాదమాండి మఱల ద్వైతమున కనుపవచ్చు దాన మనకు సర్వవిభూతియుఁ గలుగు " ననిన నతని కౌటిల్యమునకును, కించిజ్జత్వమునకును నేవగించుచు బ్రాహ్మణుండు " సత్కాముఁ డడ్డు పడకున్న నీ కోరినట్లు కావింతు " ననియె, దానికి ముదంబంది నిష్కాముఁడు పట్టు వడెన కా దలంచుచు శిబిరంబు నల్గడలఁ జాటించిన.

నిష్కాముఁ డా వార్త చారులవలన విని భయఁపడు చున్నం జూచి సత్కాముఁడు " అన్నా ! నేను ప్రాణంబుల

నుండ నిన్ను బ్రాహ్మణుండెకాఁడు స్థాణుండై నఁబట్టనోపఁడు. సాధ్యాసాధ్యముల నెఱుంగక దురాశాగ్రస్తులై యప్పాపు లిట్లు దలంచిరి. వారి తలంపెన్నఁడును నెగడదు. మనకు పరాభవంబు రా దూఱడిల్లు ” మనియె.

## బ్రాహ్మణుని ప్రథమ దిన వాదము.

ఇట్లుత్సాహవంతులై యుభయులును నెక్కుపెట్టి వాదోత్సాహంబునఁ బెనఁగుచుండ, బ్రాహ్మణుండు ధీరమూర్తియై యంతర్యాగ పరివారంబుల పయింబడి యున్మత్తుని లీల యనుబంధ చతుష్కమును చెదరఁగొట్టి సమయించు చుండె. అప్పుడు దుర్నిరీక్ష్య తేజుండై వెలుఁగొందు నతనిం జూచి నిష్కాముఁడు సత్కామాహింసులఁ బురికొల్పిన వారును నతనిం దలఁపడి పోరుచుండిరి. దంభుఁడును వేదకాముఁడును దలఁపడిరి. తర్కదృష్టియు పాషండుఁడును నెదిరించిరి. తక్కిన గుణానీకం బప్రతిహతంబుగా పోరుచుండె. అట్టియెడ బ్రాహ్మణుఁడునిష్కాముఁబోదివి వాదించుచుండ,సత్యకామాప్తకాము లన్నకుం బాసటయై నిలిచిన నందఱుఁ దనబుజ్మంత్రజాలములఁ జీకాకు పరచి నిష్కాముఁ జుట్టి పట్టఁబోవు నెడ సుగుణప్రభువు పట్టువడియె పట్టువడియెనని సైనికులెలుంగుఁ జూపుతఱి సత్కాముఁడు తనయరదంబు రయంబునఁదోలించుకొనివచ్చి యాతనిం దాకి సరభసంబునఁ బోరాడ నోటి కండవ్రావ గర్జించు బెబ్బులి చందంబున రోజుచు నతం డతనితోఁ బోరాడుచుండె. అంత సూర్యుడస్తాద్రిం జేరిన కయ్యంబు సాలించి యందఱును విడిదలలకుం బోయిరి.

## బ్రాహ్మణుని రెండవనాఁటి వాదము

మఱునాఁడు పం(డెండవ దినంబున నిరువాగులును గట్టాయితంబై వాదభూమిం జేరిన యవసరంబున బ్రాహ్మణుండు లజ్జావిషాదంబులు మొగంబునం దోప కల్లతేని కడకుంబోయి "కుమారా ! సత్కాముం డద్దుకొనుటం జేసి చేఁజిక్కిన నిష్కాముఁడు తప్పించుకొనిపోయె. కావున సత్కాముని పోరికి దూరంబుగాఁ గొనిపోవు మానిసులు మనలో నుండిరేని నా ప్రతిజ్ఞ ననాయాసంబుగా నిర్వహింతు" నన్న క్రోధుండు "నాసైన్యంబులతో నన్ను వాని మీఁదికిం బంపుఁడు. వాద భూమినుండి వేఱుగా గొనిపోయి నాచే నతఁడైన నొండె నాతనిచే నేనైన నొండె డెగునట్లు జూతు" నన్న నాతని తమ్ములు హింసాపారుష్యులును నట్ల పల్కిరి. ఇట్లు కూడఁ బలికికొని క్రోధుఁడు, దంతదష్ను రక్తాక్ష సర్వాంగకంపన బధిరకర్ణ ముష్టిప్రియ భృకుటి విక్షేపాదులైన పదివేల సేగి మూఁకల ననుబంధ చతుష్కముతో గొని సత్కాము నెదుటికిం జని "నీవు ధీరుండవేని వాదభూమికిం దొలఁగి మాతో నెక్కటి వాదంబునకు ర" మ్మని పిలిచిన సత్కాముఁ డన్నం జూచి "బలవంతుఁడగు శత్రుఁడు పిలువఁ బోవ కుండుట పౌరుషంబు గాదు. నీ సంరక్షణంబునకు విజ్ఞానుఁడను పాంచాలవరు సత్యజిత్తును సహాయుండుగా నుంతు. నీతఁ డున్నంత కాలంబును పగవారిపలని భయంబును బొందకుండు నది. ఆతఁడు నశించెనేని కలనికిం దొలఁగి పో" మ్మని చెప్పి

యతం డోడఁబడ నమస్కరించి క్రోధునితోడి యుద్ధంబునకు ప్రత్యేకంబ చని మహావాక్య బాణాసారంబులు గురిపించుచు క్రోధుని పరివారములగు దంతదప్పాది దశసహస్ర యోధులను శాంతదృష్టి సమభావములను బాణంబులచేత నిముసంబున హతులుఁగాఁ జేసి, రోసంబునఁ బైకొన్న హింసుని కారుణ్యాస్త్రంబున సంహరించి విక్రమించు చుండె. అంతఁ గృష్ణునితో సమానుల మను మత్సరంబున నతని నెదుర్కొనం గోరి పాపసేనలఁ జేరిన నారాయణ గోపాలురను సారూప్యులు పదివేవురు వచ్చి సత్కాము రథంబుఁ బొదివిన వారి నందఱ మిథ్యావేష నిరూపణంబులను బాణంబుల నవలీల సమయించి మిగిలిన క్రోధసైన్యములఁ గిట్టి కొట్టుచుండె.

ఇట శాంతిసైన్యములును, కలుషసేనలును గలయం బెరసి పోరుచుండ రక్తసిక్తంబైన యట్లు వాదభూమి భయంకరాకారంబుగా నుండె. అట్టియెడ బ్రాహ్మణుండు కరినాథుం బొదువు కేసరివిధంబున నిష్కామునుఁ బొదివిన నతండును వెనుదీయక పోరు చుండె. అట్టియెడ విజ్ఞానుండు బ్రాహ్మణు నెదిర్చి యనేక వాక్యబాణముల నొప్పించిన నతఁడు క్రోధమూర్తియై యతనిం బడలువడం గొట్టుచుండ విజ్ఞానునకు ( సత్యజిత్తు ) సహాయముగా జ్ఞానుండును (సూర్యజిత్తు) వచ్చి పోరుచుండ బ్రాహ్మణుఁడు సహింపక కర్మప్రాధాన్యములను బాణముల నిరువురను సమయించి నిష్కాముఁ బట్టుకొన నప్పళించు చున్నయెడ, నక్రూరుఁ డన్ను నుత్తమౌజుండును,

నక్రోధుఁ డను యుధామన్యుఁడును, దమమును, నహింసయు, తర్కదృష్టియు నెక్కుమ్మడి బ్రాహ్మణుం బొదివిన నతం డం దఱ కన్నిరూపులై కొట్టుచు నిలువరించి నిష్కాము మీఁదికిం బోవ నతండు కైతవంబున వాదంబునకుఁ దొలంగం బాఱె. అట్టియెడ మిగిలిన యోధులు గుఱుం బొదివిరి.

## సత్కామునిచే మోహుఁడు నశించుట:

ఇట్లు వాదంబు నడుచుచున్న సమయంబున మోహుఁ డను భగదత్తుండు మద మను గజం బెక్కి వాదభూమిం బ్రవేశించి తన గజంబుచే నెల్లఱ నుక్కఱం గొట్టించుచు వేదకాముఁబొదివిన వారిసైనికులెల్లఱు వేదకాముండు సచ్చెం జచ్చె ననుచుండిరి. ఆలోనన నిష్కాముఁడు తన సేనలఁ గొన్నిటిం బురికొల్పుకొని యెదిరించిన నా మదగజంబు సేయు సమరంబు మహా ఘోరంబై యనేకుల ప్రాణంబులు నేలకుం గోలకుం దెచ్చుచుండె. ఆ కాలంబునఁ గ్రోధుఁ తోఁ బోరాడు సత్కాముఁడు తన సైన్యమునఁ బుట్టిన కోలాహలం బాలించి హరితో నిట్లను.

"పద్మనాభా ! మోహుని మదంబుగా నోపు మన దళముల బడలువడం గొట్టుచున్నది. వేదకామునకు నన్నకుం భారంబగు తేరగ్గిసకుఁబోవని''మ్మనిన నతండవ్వలనికి రథంబు దోలుచుండె. వెనుకనుండి క్రోధపరివారము లొక్కపెట్టఁ గవిసి కొట్టుచుండె. ఇట్లు ముందు మోహంబును వెనుక క్రోధంబును నాక్రమించియున్నను తలంకక మఱల వెనుకకు

మరలి కినుకసామిమూకలనెల్ల రూపుమాపి, పౌరుష్యుండు పొడసూపిన నతనింజంపి, క్రోధుని మూర్ఛమునుంగఁ జేసి, తెరపింగని మోహునిమీది కోంకార నాదంబు సేయుచుఁ గదిసిన నిరువురకుఁ గొంతతడవు ఘోరంబగు సంగరంబు సెల్లె. నప్పుడు వార్ధక్య మను బాణంబున మదమను గజంబును, క్షణికానందమనుబాణంబున మోహుఁడను భదదత్తునిం బడనేసె. ఇట్లద్దినంబు గడచె.

## తర్కదృష్టి సహస్రారపద్మవ్యూహమును భేదించుట

పదుమూఁడవ నాఁడు సత్కాముఁడు క్రోధసేనలతోఁ బోరాడ ప్రత్యేక రంగమునకుం జనియె.

ఇట బ్రాహ్మణుం డెవ్వరికిని భేదింపరాని తెఱఁగున పూర్వ మీమాంసాశాస్త్ర సైన్య నిక్షిప్త సహస్రార చక్రం బను పద్మవ్యూహం బమర్చి తాను శాస్త్రవాదకర్తయై ద్వారంబున నిల్వ, సత్కామునకె కాని తమకు శోధించి చొరరాని యమ్మొగ్గరంబు నీక్షించి నిష్కామాదులు చింతించుచు తర్కదృష్టియైన దీని భేదింపం గలఁడని యాలోచించుకొని యతనిం బిలిచి "కుమారా! మా కభేద్యంబగు నీవ్యూహంబుం జించి లోనఁ బ్రవేశింపుము, మేమును నీతోడన వచ్చి శత్రువులఁ జెండాడెద" మన్న "వల్లె" యని సంతసంబున నాయత్తుండై రయంబున నమ్మొగ్గరంబు సేరనరిగి సుషుమ్నానాళద్వార ముఖమున నున్న బ్రాహ్మణు డగ్గరి తర్కదృష్టి "అగ్నిమూర్ధోహవై ధూమతాంతః స్వం లోకం

న ప్రత ప్రజానాతి, గ్లావాహ్యేతే అదృఢాః యజ్ఞరూపాః అవిద్యాయా మంతరే వర్తమానాః యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః'' అగ్నిసాధ్యములైన కర్మల యం దత్యంతాసక్తి గలవాఁడు పొగచే నావరింపఁబడిన చిత్తము గలవాఁడై స్వకీయ రూపమును (ఆత్మతత్త్వమును) యెరుంగఁ జాలఁడు. యజ్ఞములనే యీ సాధనములు ఓటి యోడలు. అజ్ఞానములో బడి కర్మలనే నమ్మియుందురు. పుష్పించిన వృక్షమువలె నాపాతరమణీయమైన కర్మప్రతి పాదక వేదవాక్యమును వివేకహీనులు దాని తాత్పర్యము నెఱుఁగక చెప్పుచుందురను శృతివాక్యములను బాణములచే నాతని నొడించి ద్వారభేదనం బొనర్చి లోపలఁ బ్రవేశించిన నాస్తికుండును, నహంకారుండును, మహామోహుండును, పాపండుఁడును, యజ్ఞుండును, ప్రబోధుండును, మానసుండును, లోభుండును, ధర్మార్థకాములును, దంభుండును, ద్వంద్వులును పూర్వ మీమాంస యను సాల్వుండునుఁ గూడి యొక్క మ్మడి నతనిం దలపడి ఘోర తర్కదృష్టియు ననేక శతసహ స్రాంతంబులగు తర్కవాక్యముల వారి నందఱఁ దరిమితరిమి కొట్టుచు మహార్ణవంబునం దిరుగు సుందరనగంబు పోల్కి సహస్రార పద్మ మధ్యంబునం దిరుగుచు నెదిరించిన వారినెల్ల నామరూపరహితులం జేయుచు విహరించుచుండ గట్టివాదులు గూడ నతని కోల్తల కోర్వక పాఱం జొచ్చిన వారి వెంటన తగిలి యోంకారనాదంబుఁ జేసి కూడముట్టి తర్క వాక్యములఁ గొట్టుచుండె. అట్టియెడ వ్యూహాముఖంబున శాంతేయులును,

దమంబును, నహింసయు, నుత్తరపక్షావమానుండను కుంతి భోజుండును, నభిరతి యుపరతి తితిక్షులును, విశ్వా సాక్రూరాక్రోధులును, యోగవిద్యాంతర్యాగులును, జాగరణుండును మోక్ష సంతోష ప్రీతి స్మృతి దయలను విద్యా పుత్రులేవురును నెక్కఁపెట్ట యుఱవడించి తర్కదృష్టికి బాసటగాఁ బోవునెడ మార్గమధ్యంబున పాషండుఁ డీశ్వర దత్తవరంబు బలిమి నడ్డగించి లోనికిం బోకుండ నరికట్టె.

### తర్కదృష్టి సహస్రారపద్మమునఁ జిక్కుకొని నశించుట.

అట తర్కదృష్టి కోల్తలకుంగాక పోరుచున్న సైన్యంబుల నెల్లఁ బురికొల్పుకొని బ్రాహ్మణుం డతని నెదిర్చి పోరుచుండ నహంకారుని కొమరుండు సర్వోత్కృష్టుం డెదిరించి మూర్ఛితుం జెయ్యె. మహామోహాహంకారు లెదిరించి నిలువ నేరక పాఱిరి. మహామోహు కొమరుండు మిథ్యాదృష్టి యను లక్ష్మణుఁ డెదిరించి నశించె. ఇట్లెల్ల యోధుల నుఱుమాడి చిక్కువరచియు, చీకాకుఁ జేసియు నమ్మొగ్గరంబు భేదించి బయలువడు సామర్థ్యంబు తనకు లేమిఁ జిక్కువడుట నెఱింగి బ్రాహ్మణుండు, ప్రబోధించి యహంకారాదులఁ గూర్చుకొని పోయి యతని చుట్టునుం దిరిగి యాతని సాధన సంపద నెల్ల తమ మాయావాద జాలంబుల నఱికివేసిన వికలసాధనుండై శత్రుమధ్యమున నొంటి నిలిచి పోరాడు నక్కుమారునితో నాస్తికుని కొడుకు బ్రహ్మమిథ్యుఁ డనువాఁడు తలపడిన, నిరువురును కొంతవడి పోరి యొక్కపరి సమసిరి. తర్కదృష్టి పత

నంబునకు సంతసించుచు పాపయోధు లెల్లను సింహనాదం బులు చేసిరి.

ఆనాదము విని నిష్కాముదులు కుమార మరణంబు నిరూపించుకొని వాదంబు సాలించి శిబిరంబులకు విషాదాకారంబులతోఁ జనిరి. నిష్కాముఁడు భరింపరాని దుఃఖమునఁ గుందుచుండ నక్కడికి వేదపురుషుండరుదెంచి మృత్యుదేవతా ప్రభావం బెఱింగించి "తర్కుఁ డొక్కని కేడ్చెదవేల సర్వం బును సమసినంగాని పరిపూర్ణానంద సామ్రాజ్యముం బొంద రాదు. ఈ క్రమమెఱింగిన నీవును దుఃఖించిన నెట్లు"ని ప్రబోధించి చనియె.

## సత్కాముఁడు పాషండునిఁ జంప ప్రతిజ్ఞసేయుట

అక్కడ క్రోధసేనలఁ నుఱుమాడివచ్చుచున్న సత్కాముఁడు మార్గంబున ననేకంబులగు దుశ్శకునంబులఁ గాంచుచు, మాధవుఁ బ్రశ్నించుచు, శిబిరంబుఁజేరి యన్న విడిదలకుంజని కొమరుంగానక సవిషాదంబున నున్న యన్నవలన వృత్తాంత మెల్ల విని దుఃఖించుచు "తర్కుండు లేకున్న నాకెక్కడిగతి. అతఁడున్న నెంతటి యగమ్యమైన గమింతు. అక్కటా! పర మేశ్వరా! నాతర్కుంబు తుదముట్టె యింకనాకెక్కడి విజ యంబు. ఎట్లుజీవింతు నేమిసేతు. తండ్రీ! ముగ్ధయగు ధారణా పతి నేమిచేసి పోతివి. నీ వియోగమున దుఃఖించు నాయమం గౌగలించి యోదార్పుము. నాయనా! సమతను సంతస పెట్టుము. అని యివ్విధమున సత్కాముఁడు విలపించుచుఁ

గొడుకు చావునకుం గారణుండైన పామండుపై నలుక వ్రేడమ "నెల్లి సూర్యుఁడస్తమింపకయ మున్న పామండు బొరిపుత్తు నట్లు సేయనైతినేని యోంకారంబుతో గూడ నగ్నిఁ జొత్తు" నని ప్రతిజ్ఞావాక్యంబులు బల్కఁగ దామోదరుండు నగుచు "సత్కామా! యిట్టి దుర్ఘట ప్రతిజ్ఞల నొనర్పవచ్చునా? బ్రాహ్మణాహంకారుల సాహాయంబున నిల్చు పామండుఁ జంప సాధ్యమగునా? బ్రాహ్మణుఁడు మరవగాహ వ్యూహమువన్ని పామండునిఁ జేరకుండ నిలిచిన నీ వేమిసేతువు, తెలుపు" మన్న సత్కాముఁడు కృష్ణా! వారి నే నెఱుఁగుదు. నన్ను వా రెఱుంగుదురు. నీ సహాయము నా కుండ ప్రతినసాధిం చుట యేమిలెక్క" యనుచు నందఱుం గూడికొని దుఃఖం బులు దిగఁద్రావి సరససల్లాపంబు లాడుకొను చుండిరి.

సత్కాముఁడు సుషుప్తియందు సవికల్ప సమాధికిఁ బోవుట.

హృషీకేశుఁడు సత్కామునిఁ గూడి తదీయ గృహం బునకుం జని పరిశుద్ధజలంబుల కృతాచమనుండై యొక్క విజనప్రదేశంబున దర్భశయ్యఁ గావించి దాని గంధపుష్పాక్ష తంబుల నలంకరించి మహావాక్యముల విన్యసించుచు తానందుఁ గూర్చుండి సత్కాముఁ గూర్చుండ నియోగించి యతఁడు నిత్యంబునుఁ జేయు రుద్రపూజను షోడశోపచారంబులతో తనకుఁ జేయించుకొని యతని 'సుఖనిద్రంబొందు' మని చెప్పి తాను తన విడిదికిం జనియె. ఆ యానంద సుషుప్తి యందు సత్కాముఁడు సవికల్పసమాధిం బొంది యందు కృష్ణ సహి

తుండై కైలాసంబునకుంజని యందు నుమారమణుసందర్శించి కాద్రంబగు కవచ మనుసంధించి హరునివలన న్యాసపూర్వకంబుగా పంచాక్షరి యను పాశుపతంబును పునరుపదేశంబు నొంది ప్రకృతిస్థుండై కన్నులు విప్పి జాగ్రద్దశనుబొంది యది యంతయు స్వప్నరూపంబుగా నున్నను జాగ్రదనుభవంబు రీతి ననుసంధించు కొనియుండె.

ఇట కలుషవర్గ స్కంధావారమున పాషండుడు సత్కాముని ప్రతిజ్ఞావాక్యములు విని భయవిషాదంబులతో చైవుల కొటికదొర కొలువుకూటంబునకుం బోయి "సత్కాముఁడు నన్నుఁ జంపఁ బ్రతినఁబూనెనఁట దానిదప్పింప మీరెవ్వఁరును సమర్థులుగారు ప్రాణంబులన నందఱికినితీపియె. కాననెల్లిభానుఁ డస్తమించువర కెందేనిం బోయెద" ననిన బ్రాహ్మణుండు "నేనుగలుగ నీవాతనికి వెఱవం బనిలేదు. నాచేతులమాటున నున్న నిన్ను దేవతలునుఁ దేఱిచూడనేరరు. ఆ సత్కాముఁడు ప్రవేశింపరాని బంధుర వ్యూహముంబన్ని నిన్ను రక్షించెద. దాన మన కార్యంబులన్నియుఁ గడముట్టు నిన్నుఁ జంప లేకున్న రేపు సాయంసమయమున కతఁడు సచ్చు. వాఁడు మడిసిన తక్కువారెల్లఱు తమంతన నామావశిష్టులయ్యెదరు. రేపటితో మన సంగరంబునుఁ దుదముట్టు నిలువు" మని పలికిన నెల్లవారును సంతసించిరి.

## బ్రాహ్మణుఁడు సుషుమ్నానాళాంత సహస్రార పద్మవ్యూహమును బన్నుట.

ఆ రాత్రి గడువ మఱునాఁ డరుణోదయమ్మున సైన్యములతో గురుండు రణభూమికిం జని సహస్రార మధ్యమున కర్ణిక యను పద్మాకారవ్యూహం బమర్చి యచ్చట పాపం డుని నిలిపి వానికి బాసటగా కాముఁడు నహంకారుఁడు దంభుఁడు లోభుఁడు ప్రబోధుఁడు యజ్ఞుఁడు నుండునట్లు నియమించి యక్కడినుండి యాధారంబు వరకు నాఱు విశ్రాంతి స్థానంబులు జేసి సహస్రారంబు మొదలు నాధారంబు వరకు సూచీముఖ మను పేర నంతర్నాళ మార్గంబుఁ గావించి యాధార మను ముఖద్వారమున నొరు లెవ్వఱును దాని భేదించి లోనికిం జనకుండ తాను నిలిచియుండె.

### షట్చక్ర స్థానములు

"గుదమేఢ్రాంతరాళస్థం మూలాధారం త్రికోణకమ్
శివస్య జీవరూపస్య స్థానం తద్ధి ప్రచక్షతే
స్వాధిష్ఠానాహ్వయం చక్రం లింగమూలం షడశ్రకమ్
నాభిదేశే స్థితం చక్రం దశాస్రం మణిపూరకమ్
ద్వాదశారం మహాచక్రం హృదయేచా ప్యనాహతమ్
తదేతత్పూర్ణ గిర్యాఖ్యం పీఠం కమలసంభవ
కంఠకూపే విశుద్ధాఖ్యం యచ్చక్రం షోడశాశ్రకమ్
పీఠం జాలం ధరం నామ తిష్ఠత్యత్ర చతుర్ముఖ
ఆజ్ఞానామ భ్రువోర్మధ్యే ద్విదలం చక్రముత్తమమ్." —యోగశిఖ

నాఁడు కృష్ణపరమాత్మ సవిశేష సన్నాహంబుతో సమర్చిన యరదంబును ప్రదక్షిణ ప్రణామంబులుఁ జేసి సత్యాకముఁ డెక్కి తనవారితో రంగస్థలంబుఁదఱిసి దమంబును (సాత్యకి) బిలిచి "నెచ్చలీ! నేఁటికయ్యం బతి భారంబు. తీవ్రాతి తీవ్రతమ శాస్త్రవాదన నిపుణంబు. మనమీభారం బునఁబడియున్న కాలమున నన్ను బ్రాహ్మణునికిం జిక్కనేని మిక్కిలియు నెడఱు వాటిల్లు నట్లుగాకుండ జూచుకొనుట మన కెక్కుడు కార్యంబు, కావున నేనిమ్మహా నాళంబు భేదించుకొని పోవునెడ నాతనిసంరక్షణంబునకుం జాలకుందు. అప్పుడు భ్రాతృదేవు రక్షణంబునకు సమర్థుండవగు నీవుండుట కర్తవ్యంబు. కావున నాభారంబు నీవు వహించి నిలువు" మని చెప్పి రథంబుఁ దోలించుకొని గురునిఁ జేరంబోయి యచ్చట నెదుర్కొన్న మందాధికారుల ననేకులజంపి, నాస్తికుండు తాకిన నెడతలంగొట్టి పఱపించి, గురుం డాసిన నతండు పోనీక చిక్కవరుప - సత్యాకముఁడు "శిష్యుండ నామేలుఁదలంపు" మని ప్రార్థించినను నతండు లోనఁ బ్రవేశింపరాకుండఁ గొట్టుచుండ, నప్పుడు కృష్ణుఁడు సమయవేదియై బ్రాహ్మణుఁడున్న స్థలంబుఁ జూచి యతనికిఁ బ్రదక్షిణించు నట్లు రథంబు ద్రిప్పి మెఱుపు మెఱసినంతకాలంబున సూచీ ముఖద్వారంబునఁ ప్రవేశించి లోపలఁబడిజొచ్చుకొనిపోవుచుండె. ఎడనెడ నెదుర్కొన్న వారినెల్లసమయించుచు పోవుచుండ లోభుఁ (కృతవర్మ) డెదిరించి పోనీయక యాగినఁ గొన్ని విజ్ఞాన వాక్యముల నతని సమ్మోహితుంజేసి పోవుచుండె. లోభుఁడాలోనఁ దెలిసి సత్యా-

మునకుం బాసటయై వచ్చు చక్రరక్షకుల నక్రోధాక్రూరుల నతనిఁ జేరకుండఁ గొట్టుచు నిలిపె. ఆలోన సత్యాఖ్యుఁడు వేదఁ గని వాదుల నెల్ల నంతమొందించుచుఁ బోవుచుండ, మఱల లోభుండు గదిసి తత్త్వవిచారంబునుఁ గదలనీయక పొదివి పోరుచుండె. ఆతని వాదంబుతోన ప్రొద్దు పోవుచుండె. ఆలోన మదమను కాంభోజుండును, మత్సరమను వికర్ణుండును నెదిర్చి చూపరకు వెక్కసంబుగఁ బోరాడి ధనాభావంబను నస్త్రంబునఁ బొలిసిరి.

ఇవ్విధమున శాంతేయుఁడు గురునిఁ గడచి లోభాదుల నాఁచి మదాదులఁ జంపి పోవుచుండఁ గల్లలయొకిమీఁడు (దుర్యోధనుఁడు) చూచి బ్రాహ్మణుని డగ్గరి క్రూరవాక్యముల నిట్లనియె.

### పొల్లుఱేఁడు బ్రాహ్మణుని దూఱుట

"మహాత్మ నిన్ను నమ్మి పాషండుని వాదమున నిల్పినందుకు మిథ్యాదృష్టిని శూన్యరూపం జేయనెంచితివి. పంచకామ పక్షపాతివి గాకున్న సత్యాఖ్యము లోనికిం బోనిత్తువె? మాయెడ నీవు తేనెఁ బూసిన కత్తివైతి" వని పల్కుచు కార్యభారం బూహించి రాజసం బడంచుకొని "ఆచార్యా! పాషండునకుం బాసటయై యున్న నుత్తమాధికారి గుణలోకరె ల్ల సత్యాఖ్యము రాకకు భయంపడి వెలవెలబారం జొచ్చిరి. నీ వూఱకున్నఁ గాదతని రక్షింపఁ బూను" మన్న బ్రాహ్మణుఁడు "కుమారా! పూయజ్ఞుని పలుకులకును నీమాట్ల

లకనుఁ గోపింతునయ్యా ! మాధవు మతి ముందు బోవుచుండఁ జను సత్యాకాముని బ్రహ్మవాక్యములు వెనుకనున్న వారిఁ గూడఁ దాకుచుండు, అట్టివాని బోనీక యాపఁ గలుగుదునె యెరిగి యెరిగి యేలవల్కెద వది యట్లుండె నింక నొక్క హితంబు సెప్పెద నాకర్ణింపుము. నేనీ స్థానంబువీడి లోని కేతెంచిన నిష్కామానీకంబు లొక్కపెట్ట లోనికిం జొచ్చు, అట్లైన మనయొద్దు చెడను. అప్పుడు పాపంబు గాచుట సాధ్యము గాని పని. కావున నిష్కాముఁబట్టి యిచ్చెదనన్న ప్రతిజ్ఞ యీకడన తీర్తు. వృద్ధుఁడనగుట శీఘ్రపువాదంబునకుం జాల. నీవును సత్యాకాముఁడును తుల్యశక్తి సంపన్నులు. అదియునుం గాక సందేహంబు వ్రానాడి వారితో పగఁగొంటివి. తగు సహాయులం గూర్చికొని నీవయుద్ధపడుము సత్వరంబచను''మని హేళనారూపంబుగా నాడుటయునప్పాపకుపలపతి "ఆచార్యా నిన్నును లోభునిం గెలిచిన సత్యాకాము నేను గెలువఁగల్గుదునె. ఇదియ కార్యంబందువేని నీనియోగం బాచరింతు. యశంబు వమ్ముగాకుండఁ జూడు'' మనిన గురుండు "సత్యంబు వల్కితివి. సత్యాకాముఁ డట్టివాఁడ. నేనొక్క కవచంబిత్తు దాని ధరించి రక్షితుండవై యతనిఁ దలపడుము. తదీయ మహావాక్య శరములు నీ తనువుం దాకకుండు'' నని చెప్పి పైశాచిక కవచంబను మంత్రంబు ననుసంధించి ధారణం బొనర్పం జేసి దీవించి పొమ్మనిన రయంబున నరదంబుఁ దోలుకొని సత్యాకాముఁడున్న యెడకుం బోవుచుండె.

ఇక్కడ నాధారముఖద్వారమున నహింసుఁడు గురుం దలపడి పోరాడి యతనిచే భంగమొంద దము౦ డెడసొచ్చి తీవ్రవాదంబుఁ జేసి గురుని భంగించె. ఇట్లు ధీరు లెవ్వరును లోనికిం జననుంప గురుండు కనుపుఁ గొట్టుచుండె.

## సత్కాముఁడు ద్వంద్వముల సంహరించుట.

అక్కడ సత్కాముఁడు తన తత్వవిచారము (రథము) నడచు నంతమేర గుణగణంబును సర్వప్రళయముగఁ గూల్చుచుండ దానికిఁదగినట్లు మాధవుండును తత్వవిచారమును గడపుచుండుట వినువారి కద్భుత జనకం బయ్యె. ఇట్లతి రభసంబున పోషండుఁ డున్న దిక్కునకుం బోవంబోవ ద్వంద్వములను విందానువిందులు శీతోష్ణ మానావమాన సుఖదుఃఖ కాంచనలోష్టాదులైన సేనలంగూడికొని మార్కొన్న వ్యవసాయాత్మికా బుద్ధివృత్తులను బాణములచే వారినందఱ బోకార్చి పోవుచుండ శాంతేయుఁడు ధీరవాదమను రణవిహారంబున బడలిన మహావాక్యములను వాహంబులఁగని "కృష్ణా! తత్వవాహనములు శత్రువాక్యములను శరంబులు నాటి బడలియున్నవి. కావున వీని విడిచి నీరుపట్టుం దీర్పు" మని తాను పాదచారియై నిలిచె. అట్టియెడ పగతు జాతనిం గొట్టుట సులభంబని యెంచి తలపడి హతులగుచుండిరి. ఆమీద సత్కాముని సాధనచతుష్టయ సాధితంబైన వ్యవసాయాత్మికా బుద్ధిబలంబున నమ్మహావాక్యములఁ దెలివినొందించి, గోవిందుఁడు మఱల వానిని తత్వవిచారంబునకు బూన్చి యెప్పటియట్లుఁ బోవుచు

నవరాహ్ణాంబునకు సహస్రార సమీపగతులై యందున్న యోధులనడుమ పాషండుఁ గాంచి యోంకార శంఖనాదంబు లొనర్ప మిథ్యావాదు లెల్లఱును పాషండు దెసవిగతాశులై యుండిరి.

అంత మహామోహుఁడు గురుదత్త కవచధారణంబున భయంబువీడి సత్కాముఁగూడముట్టి క్రూరవాక్యములనునారాచములు ప్రయోగించుచుండ నతని సాహసంబు గురుఁడుపదేశించిన పిశాచ కవచధారణంబె యని యెఱింగి మున్ను తా నగ్గురువువలన నెఱిఁగిన తన్మారణ ప్రయోగంబున దాని వమ్ముజేసిన నతం డచ్చట నిలువనేరక పాఱిచనియె. ఆమీద సత్కాముఁడు పాషండు జట్టుకొనియున్న మూకల కడరి పోరుచుండె.

## నిష్కాముఁడు దముని సత్కామునకుఁదోడ్పడఁ బొమ్మనుట

ఇక్కడ సేనాముఖమున గురునితో నెదిరించి నిష్కాముఁడు పట్టువడు నంతటి పనికివచ్చి వాదంబునకుఁ దొలఁగి యయ్యెడఱుఁ దప్పించుకొనియె. జాగరుండు గురుదాకి పోరాడుచుండ కలియను నలంబుసుండతనిఁ దాకి మడిసె. అంత నిష్కాముఁడు తమ్ముఁ డొక్కరుండ మొగ్గరంబుఁ బ్రవేశించుటకు భయంపడి దమంబుంగాంచి "ప్రశాంతాంతరేంద్రియా! దముఁడా! సత్కాము డొంటరియై వ్యూహమునఁ బ్రవేశించె. బ్రాహ్మణుం డత్యంత క్రూర వాచా పటిష్ఠుండు. తమ్ముని గతి యెట్లయ్యెనో యెఱుకపడ దేమిసేయుదు. నీవైన నాతనికి బాసట

లేక తక్కిన పోరు భరంబగు. సత్కాముఁడు ద్వైతమున నున్నవాఁడు " దమము సహాయమున సంతశ్శత్రువుల నవలీల గెల్తు" నని పలికె. దానికిం దగిన ట్లెప్పు డతనికిం దోడుపడ వలయు. నారక్షణంబునకు వేదకాముండు గలఁడు. నీవు శీఘ్రమున గురుం గడచి మొగ్గరంబుఁ జొరు" మన్న వల్లె యని సూచీముఖంబున కేఁగి గురుం దలపడి పోరాడి సత్కాము నట్ల ప్రదక్షిణంబుగా లోనికిఁ జని మార్గమధ్యంబున నెదుర్కొన్న పాపప్రభువుల ననేకులఁ జంపి సత్కాముఁ జేరం జనియె. మఱల నిక్కడ నిష్కాముఁడు దము నొక్కనిం బంపితి నేమయ్యెనో యనుభయంబున వేదకాముఁ బిలిచి "సోదరా! యొంటిఁ జనిన సత్కాము బాసటకు దము నొంటిం బంపితి. ఇతం డతనిఁ గూడికొనియెనో లేదో మనంబు తల్లడిల్లు చున్నది.

"కం. తమ్మునిఁ దలంచి కృష్ణుని
తమ్ముఁ బనిచె నాతనిం బదంపడి తన చి
త్తమ్మునఁ దలఁపఁడ ధర్మజుఁ
డెమ్మెయి వాఁడొక్కొ నారె యీ యున్న జనుల్."

— భారతము.

కావున గురునకుం జిక్కకుండ నారక్షణంబు నేన సేసి కొందు. నీవు త్వరిత గమనంబున నతనిఁ జేర నరుగు" మని పంచిన నతని రక్షణంబున కహింసు నునిచి వేదకాముఁడు సేనాముఖంబునకుం జనిన, గురుండు త్రోవ యీక "నీ

తమ్ముఁడు ప్రదక్షిణించి చనియె. నీవును నట్లు పొ" మ్మన్న "శత్రుపక్షంబున నుండునంత వరకును గురుండవు కావు. నీకుఁ జేసిన ప్రదక్షిణంబు పగవానికిఁ జేసినట్లు యగు" నని చెప్పుచు ననలీల నతనిని రథంబుతోఁ గూడ నెత్తివైచి లోనికిం జొచ్చి పోవుచుండ మోహుఁడు తలపడి యోడి చనియె. అహంకారుఁడు తలపడి యోడి పాఱి మరల మరల నెదుర్కొని యోడి పాఱుచు కడకు వేదకాముని నిరాలాపుం జేసి యతనిం జంపక పౌరుషంబులాడి విడిచిపుచ్చిన నతండు సత్కాముఁడున్న దెసకుఁ జనియె.

## దముఁడు కాముని జంపుట.

అంత దముఁడు తీవ్రవాగ్జాలములు ప్రయోగించుచు సత్కాముఁడున్న దెసకుం బోవుచుండ కాముఁ డడ్డుకొని పోరాడి యన్యోన్యసాధనంబులు వమ్ములు కా కామిన్యపాంగదృష్టియను ఖడ్గంబుగొని కాముండును నంతరింద్రియ నిగ్రహమను ఖడ్గంబుఁ గొని దముండునుఁ దలపడి పోరు నాలోన కాముఁడు దముం బడవైచి నఱుకఁబోవుచుండ నారాయణుండు కనుంగొని సత్కాముఁ జూచి "సత్కామా! నీ శిష్యుని రక్షించు కొ" మ్మనిన సత్కాముఁడు కాముఁ డెత్తిన కామినీదృష్టి యను ఖడ్గమును నంతశ్శోధన మను బాణంబున నఱికిన నాలోన దముఁడు తెప్పఱిలి లేచి ప్రాయోపవేశంబున ప్రాణాయామ పరుండై యున్న కాముని నంతరింద్రియనిగ్రహమను ఖడ్గంబున ఖండించె. ఇట్లమ్మువ్వురును దుర్గుణసంహార

క్రీడ సలుపుచు సాయంతనమునకు పాషండుఁడున్నెడకుఁ బోవ నహంకారాదు లనేకవిధంబుల సిలుగులం బెట్టుచు నతనిఁ గానరాకుండఁ జేయుచుఁ బ్రొద్దుఁ గడపుచుండ కృష్ణుఁ డిట్లున్నఁ దీఱదని తన కాలచక్రంబున తేజోమయ సూర్యుం గప్పిన నజ్ఞాన తిమిరంబావరింప చీకటి పడియె. అప్పుడు సత్కాముఁడు వచ్చునని సంతసంబున నత్యాత్తిఁ జూచు పాషండుని రౌద్రంబగు పంచాక్షరమును బ్రణవంబునం జేర్చి ప్రయోగించిన దాన నతండు తలదెగి పడిసె. అహంకారాదులచే నెంతటి రక్షకత్వమును బొందియు పరమాత్ముని యాస్తిక్యముచే పాషండత్వము నశింపక తీరదయ్యె.

ఇట్లు విజయంబు సంపాదించి సంతసంబున సత్కామ వేదకామ దమాక్రూరాక్రోధులు పరమాత్మఁ గూడి నిష్కాముపాలికి రయంబునఁ జని విజయంబుఁ దెల్పుచు నమస్కరించిన వారినెల్ల గాఢాలింగనంబుఁ జేసి తమ్ముఁడు బ్రతికి వచ్చినట్లు సంతసించుచుండె.

మహామోహుఁడు గురునిపాలికిం జని " నీవలన నన్యాయంబుగ పాషండు గోలుపోతి. నీవు శాంతేయ వత్సలుండవని యెఱింగియు బేలనైతి. అహంకారుఁ డొక్కరుఁడు పెనఁగిన నేమియగు. సత్కాముఁ బొరిగొనువారు మన సైన్యమున లేరు. నాకై యెందఱు ప్రాణము లర్పించిరి. ఇంక నేమి సేయుదు నేన పూని పగతురఁ జంపియెదె వారిచేతఁ జచ్చియెదడె. నాకై ప్రాణములర్పించినవారి ఋణముఁ దీర్చుకొందు"

నన గురుండు "కృపారూపా! యిప్పుడెవ్వరి నన్ను నేఱియగు నాఁటి వితండవాద వాక్యంబులె నేఁటిసత్కార్యము మహావాక్య ములుఁగా వచ్చుచుండె. పాపఫలం బెవ్వరికేని యనుభవింప కుండరాదు. నాఁడె సద్విచారుఁ డింత బుట్టునని తెలిపె. విన నేఱక యింత దెచ్చుకొంటి వనుభవింపుము.

" ఉ. అన్నివిధంబులం బఱచియైనను నక్కటికంబులేక వా
రి న్నెఱిఘాలి కానలఁ జరింపఁగఁ బంచిన బోయివచ్చి య
య్యన్నయుఁ దమ్ములుం దమకు నయ్యనగం బిలవేఁడి కాన కి
ట్లున్నను వారి మార్గనుట కోర్చితి నేనొక బ్రాహ్మణుండనే "
— భారతము

ఇదె చెప్పుచుంటి నోంకారేయ తాపేయులఁ జంప కుండ కవచంబు వీడ నీ రాత్రి పోరు చాలింపకుండునట్లు పీటం జాటింపు " మన్న నతం డట్ల సేయించె. అట్లా రాత్రి (సమ్మూఢ దశయందు) సామాన్యజ్ఞాన మను కరదీపికా సహా యంబున నుభయ సేనలకుఁ బోరు చెల్లుచుండె. అట్టియెడ వేదకాముఁడు పాప సైన్యముల నెల్ల " విజ్ఞాతా రమరే కేన విజానీయాత్, ఆత్మావా ఆరే ద్రష్టవ్యః, సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్, అవినాశీ అరే ఆత్మా, ఏషా ఆత్మా అపహత పాప్మా, శుద్ధం అపాపవిద్ధం, సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, వాచారంభణం వికారో నామధేయమ్, స ఏవ ద్రష్టా స ఏవ శ్రోతా " మొదలగు ప్రమాణవాక్యములను గదాఘాతంబుల సమయింపు చుండె. ధర్ముఁడు నియమపాలన జీవతోషణ ఘారమార్థికాది పరివారముల్లతో ఖేదకాము మార్గాన్న తన

దివ్యశక్తి యను గదాఘాతంబున వారినందఱిని రూపుమాపె. ప్రబోధుఁ డొక్కెడఁ బోరుచుండె. యజ్ఞుఁ డద్భుత వాదక్రీడఁ గావించుచుండె. సత్యకామాప్తకాము లొక్కదెసఁ బోరుచుండిరి.. తంత్రీం జంపిన పగఁ దీర్ప నర్థుఁడు సంఖ్యాసమీకరణాస్వప్నపాలన భంగభయాసంతృప్త్యాదులైన పరిహారములతో దను నెమరొక్కని యతనిచే నిమిషభంగుర నిత్యాచాంచల్యాదులను బాణముల సమసిపోయె. ఆ మీఁద నుభయసైన్యంబులును సంకులంబుగాఁ బోరుచుండె.

అట్టియెడ నహంకారుఁడు తన కగ్గమైన యాప్తకాముని వాహనమై కల్యుంజేసి యాత్మశ్లాఘ్యంబను వింటిమొనం బొడుచుచు మావంటివారితో నెన్నఁడును కయ్యంబు సేయకుము. ఎక్కడనేని గోష్ఠంబుల నుండు మని యెత్తి యాడుచు విడిచి చనియె. అది యెల్లఱకు సుప్తికాలంబును తనకు ననుకూలంబును నగుట జాగరుం డనంతబలుండై పాపిష్ఠసైన్యంబుల పయిం గవిసి తన మాయాజాలంబులఁ గప్పి చతురంగముల నేలపాలు సేయుచున్న యతని యప్పటి విజృంభణంబుఁ గన్న సూర్యోదయంబువేళకు సర్వంబునుఁ దుదముట్టునట్లు కన్పట్టె. అప్పుడు మానసికాదు లహంకారుఁ జూచి వీనిఁ దెగటార్పకున్న మన బ్రతుకు సున్నయగు. వీనికన్న సత్కాముఁడె మేలు. అంతరాత్మ దత్తంబైన దివ్యశక్తిని సత్కాముకొఱకుఁ బూజించుచు దాఁచి యుంచితి. నిప్పుడీయడలు దప్పినమీఁద టికిం జూచుకొందము ముం దీతనిపయిం దానిఁ బ్రయోగింపు" మన నప్పు డహంకారుఁ డా దివ్యశక్తిని జాగరుని పయిం

ప్రయోగించిన నది దివ్యతేజోజాలంబులు దిశలం గప్పుచు వచ్చి జాగరుఁ బరిమార్చె. ఆతని పాటుఁ గాంచి కల్మష యోధు లందఱు సంతసంబునం బొదలుచు సింహనాదంబులు గావించిరి. కొమరుని పాటుఁ గని నేదశాముఁ డెంతయు దుఃఖించె.

## బ్రాహ్మణునిచే యోగవిద్యాంతర్యాగులు మడియుట

ఆమీఁద యోగవిద్యాంతర్యాగు లొక్కుమ్మడి తమ తమ పరివారంబులతో బ్రాహ్మణు ముట్టడించిన నతం డయ్యుద్ధఱ సైన్యంబులతోఁ గూడ సాయకాసారంబు లడరించి ముంచి పరలోకంబునకుఁ బంచె. అప్పుడు తండ్రి మరణముం గాంచి దుఃఖించి యహింసుఁడు "గురునిఁ జంపికాని కవచంబు వీడ" నని ప్రతిజ్ఞఁ జేసె. ఇంతలో నాదిత్యోదయం బగు టయు నెల్లవారును కాల్యకృత్యంబు లొనర్చి పదియేనవ నాటి యుదయంబున మఱల సమరంబునకుం దలపడి పోరుచుండ, గురుని యాటోపంబు సహింపరానిదై విజృంభించినఁ గనుంగొని వాసుదేవుండు "ఇవ్విధమున నితనితోఁ బోరాడి దేవతలకైన జయింప శక్యంబు గాదు. దీని కొక్క మందు సెప్పెద. యజ్ఞము నశించెనన్న నితండు "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః" ఈలోకమున కర్మలు చేయుచునే నూఱువత్సరములు జీవింపఁ గోరవలయునని పల్కు తన వాద వ్యాపారమును మాను. అట్లు చేయుఁ" డన్న నిష్కాముఁ డసత్యదోషంబునకు వెఱచి విషాద మొందుచుండ వేదశా

ముఁడు యజ్ఞంబు సమసె నని గురునకు వినం జెప్పిన నతఁడు హృదయంబు జల్లని చెదర బెదరియు నతని వాక్యంబులు సత్యంబులు గావని యెంచి యప్పలుకులు పెడచెవిం బెట్టి యహింసునిఁ గవిసి పోరుచుండె.

అట్టియెడ యమనియమాది మహర్షు లతని పాలికిం జనుదెంచి "బ్రాహ్మణా! బ్రహ్మజ్ఞుఁడవగు నీకు సుగుణ మారణ కర్మంబు ధర్మంబుగాదు. ఇంతకుమున్న చేసితేనిదియు కాలంబు పూర్ణంబయ్యెఁ గావున నింకనైన శాంతించి యీ హింసాకర్మము నుజ్జగింపు" మని బోధించి యంతర్ధానంబు నేసిరి. గురుఁడు వారల ధర్మప్రబోధం బూహించి వేదకాము వాక్యములఁ దలంచి యెదురనున్న తనకు ముఖ్యశత్రువగు యహింసుఁ గనుంగొని వికలహృదయుండై కుమారుఁడు సచ్చుట బ్రతుకుట నిష్కాముపలనఁ దెలియంగోరి యతని నడిగె.

## అహింసుఁడు మృతుఁడైన గురుని బ్రదుంచుట

అది యసమయంబని వాసుదేవుఁ డమ్మహారాజు నీక్షించి "బావా! యీదినమున నపరాహ్ణంబు దనుక గురుండని నేసె నేని మనవారందఱు మడియకుండ నేర్తురే? కావున నెల్లఱు నీతని వాతంజేర్పక నీ కొడుకు సచ్చెననుము. ఆత్మరక్షణమున కాదు నసత్యమును సత్యంబెయగు నట్లుసేయు" మనియెను. వేద కాముఁడు నట్ల బోధించె. అప్పుడు నిష్కాము డెట్టకేలకు సమ్మతించి 'యజ్ఞండు సమసె'నని యెలుంగెత్తి పలికి 'సామజ'

మని యల్లన ననియె. అప్పలుకులాలించి గురుండు చింతాకు లిత హృదయుండై "ఆత్మావై పుత్ర నామాసి" నేనేమైన పుత్రుఁడు పోయినమీఁద నాజీవితమ్మింక నెందుకని సంగరము చాలించి యోగనిష్ఠనొంది తేజోమయాత్ముఁడై తనువు విడిచి జ్యోతిరూపంబున పరమస్థానంబు నొందె.

అట్టియెడ తనకుం దగని క్రూరకర్మయను కృపాణ మును బట్టి యహింసుఁడు తనవారందఱుఁ దగదనుచున్నను వినక రథంబు మీఁదికిం జని యతని భౌతికోపాధిని నఱికె. అవ్వార్త మఱి యొక్కెడఁ బోరుచున్న యజ్ఞుఁడు మామ యగు ప్రబోధునిచేవిని తండ్రి మరణమున కెంతయు దుఃఖించి 'యోగనిష్ఠనున్న తండ్రి మెడఁ గోసిన పాపిం జంపకమాన'' నని ప్రతిజ్ఞఁ జేసి యతనిపయిం గవియుచు పితృవియోగదుః ఖాగ్ని పైకొన సహింపలేక మహామోహముఁ జూచి "యబ ద్ధంబులు వల్కి బ్రతికెద మనుకొన్న నిష్కాముని వారెల్ల పుడమిం బడియెదరో చూడు'' మని పల్కుచు నారాయణ కవచధారణశక్తిం బఱపిన నది నింగియు నేలయు నిండి యాభీల చటులజ్వాలాజాలంబులతో చతురంగముల ద్రుంగించుచు వచ్చుచుండ, దానికి ప్రతివిద్యం గానక నిష్కామాదులు నిర్విణ్ణులై చేయునదిలేక చూచుచుండ నప్పుడు నారాయణుం డెల్లఱ నాలోకించి యిట్లనియె. "సత్యవాదులారా! మీమీ యన్యదేవతోపాసక సాధనంబుల విడిచిపెట్టి వాహనంబులుదిగి నమస్కరించుచు నిలువుం డిదియ దీని ప్రత్యస్త్రము. ఇది నారాయణకవచ మంత్రప్రభావము. ఇది తనయం దనన్య

భక్తిం జూపువారిని రక్షించు ” ననిన నందఱు నట్లనేసిరి. దాన నమ్మహాస్త్రము వమ్మై చనియె.

ఇట్లు తండ్రి మరణంబును, మహాస్త్రము వ్యర్థమగుటయు నంతరంగమున సంతాపంబుఁ గూర్ప సైన్యంబులపైఁ గవిసి యహింసుఁ దాకి పోరునెడ సత్యాకాముఁడు తన తీవ్ర వాక్యవాదమున నతని యాటోపం బుడిపె. అప్పటికి సాయంతనం బగుటయు నాలంబు సాలించి యుభయ బలంబులు విడిదలలకుం జనియె.

“ శ్లో॥ ఏకాకీ నిస్పృహః శాంతః పాణిపాత్రో దిగమ్బరః
కదా శమ్భో భవిష్యామి కర్మనిర్మూలన క్షమః॥

— భర్తృహరి.

ఆత్మభారతమున బ్రాహ్మణపర్వము

సమాప్తము

ఓం తత్సత్



శ్రీరాధాకృష్ణాయనమః

# ఆత్మభారతము

## అహంకార పర్వము

---

శ్లో. సత్యజ్ఞాన మనంత మచ్యుత మజం చావ్యాకృతంతత్పరం
కూటస్థాది సమస్తసాక్షి మనఘం సాక్షాద్విరాట్తత్త్వదమ్
వేద్యం విశ్వమయం స్వలీనభువనం స్వారాజ్యసౌఖ్యప్రదం
పూర్ణం పూర్ణతరం పురాణపురుషం రామంభజే తారకమ్,

— శ్రీరామకర్ణామృతము.

### అహంకారుని ప్రథమ దివస వాదము.

పదునాఱగు దినసంబున రెండు వీడుల దళములు వాద భూమిం జేరిన మీఁద దుర్గుణప్రభువు గురుని పోకకు దుఃఖించి సర్వసైన్యంబు నడుమట కహంకారునికి పట్టాభిషేకం బొనర్చిన, పొంగి యతండు " బంధుమిత్ర యుతంబుగ సత్కామునిఁ బరిమార్చి ముక్తిరాజ్యము నీ పాలొనరింతు శాశ్వతముగ నీవ పాలింపు '' మని పల్కుచు నాత్మశ్లాఘ్యంబను రథం

చెక్కి పాపవిచార మను ధనువుఁబట్టి మద మను గజకక్ష్య మెఱయఁ బండితదూర పరనిందా పరాయణులు చక్రరక్షకు లుగా సర్వోత్కృష్టత యను వృషసేనుఁడు ముందు నడువ సేనాముఖంబునకు వచ్చి నిల్చిన, నిష్కాముఁడును సేనం దరియవచ్చి యహంకారుఁ జూచి సత్కామునితో నిట్లను. "తమ్ముఁడా! కల్లలఁజేసి మాకలం జూచితివే? ఎంత తక్కువయై యొప్పుచున్నదియొ, ఉన్నదానిని యొక వ్యూహంబుఁగా నిల్పి యహంకారుఁ డాహవంబంతయుఁ దనమీఁద నిడుకొని మనల మడియింపఁ బూని యున్నవాఁడు. ఇతనివలనన పదుమూఁడేండ్లును మహాశోకవారిధిం బడి ద్వైతకామ్యం బులఁ దగిలి యుండవలసివచ్చె. ఈతఁ డొక్కఁడు పోయిన సర్వమును సమకూరి నట్లయగు. వీఁడు నశించిన కల్లలయొక్కమీఁదూఱ కయ నచ్చు. ఇట్లు చేయు మనియె.

అంత నుభయసేనలను నెదురించి పోరుచుండ నాస్తికుఁ డాప్తకాము మార్కొని విరథుండై పాఱె. సత్యకాముఁ డహంకారు నెదుర్కొని తీవ్రతర వాక్యజాలముల నొకల్లొకల్ల నొప్పించుచుఁ బోరునెడ నహంకారుఁడు సత్యకాము సర్వ సాధనముల వికలంబులు జేసి నోరాడకుండఁ జేసిన నేమియుం దోఁచక పాఱుచుండ వెనుదగిలి యతనిం బట్టుకొని

క. అలవెఱిగి పెనఁగు పెనఁగం
దలఁచిన నదిగాక సిగ్గుదలకొని యనికిం
దొలఁగుట యుంకిట దగు వి
చ్చలవిడి నర్జునుని కదకుఁ జనుము కుమారా! — భారతము

అని విడిచిపుచ్చె. అహింసుఁడు ప్రబోధు నెదిరించి యతనిచే నొప్పింపఁబడినవాఁడై నిలువనేరక వేదకాముకడకుం జనియె. ఇట్లద్దినంబున భండనంబొనర్చి సాయంతనమున విడిదలలకుం జని పదునేఁడగు దివసంబున రేపకడ యిరువాగులును వాద స్థలిం జేరిరి.

## జీవుని నిర్వేదము

వాదవిధానము నెప్పటికప్పుడు వైరాగ్యునివలన నెఱుంగుచుండు జీవుఁడు శోకించుచు నిట్లనియె. వైరాగ్యా! మహామోహుని బుద్ధిహీనత నేమందు? శాంతేయు లంతబలవంతులై తన్నలయించి పాఱఁద్రోలుచుండ నేమియుఁ జేయనేరక యూఱకయ చూచుచుండు ప్రల్లదుఁ డహంకారుఁ డొక్కపోటు బంటఁట. అతనింగొని విజయంబు గాంచునఁట. తన్నును దనశక్తిని నెఱుఁగఁజాలని యవివేకి నేమనియెద. అహంకారుఁడఁట పరమాత్మతోఁ గూడ పంచకాముల గెలుచునఁట. మీరాజు బుద్ధిమాంద్యము నేమనవలయు. నా సర్వనాశనమునకుఁ గారకుండైన మానసికుఁడు నడుపు నీతియు, నహంకారుని యహంకారమును తన్నుఁ బొడగరిం జేయునని వీఁడూఱఁడిల్లు. వితండవాదము నాఁడంకురించిన యాదుర్దశయ వైరాగ్యా! నేఁటి కిట్లు దుఃఖఫల పరంపరా సంపాదిని యయ్యె. ఇంత జగడంబు జరిగియు తమ్మునిబిడ్డ లొక్కఁడును చెడరకయ సుఖంబుండిరి. అక్కటా! నాయందు దైవ మెట్టిదయ్యె. వెలుపలి కర్మలకుంగాని నాకీ సనాతన దశయందు చేయూఁత

కొక్కండేని మిగులకుండఁ జేయును గాబోలు. “ఏక పాండు రంగా ఏకమాత, కాహీం బోలణే ఆహే ఏకాంత ఆప్హా జరీ తారీల సంచిత, తరీ ఉచిత కాయ తుమ్చే” ఓ స్వామీ! ఏకాంతమున నొకటి జెప్పెద వినుము. కర్మయే నన్నుఁ దరింపఁజేయు నెడల నీవు చేయు నుపకార మేమి? యను చుండ నతనిం జూచి వైరాగ్యుఁ డిట్లను. మహాత్మా! గడచిన దానికి వగచిన ఫలంబు కలుగదు. అదియునుంగాక యిమ్మహా మారణ కార్యం బంతయు నీ యుపేక్షాభావంబునఁ గలిగిన దింతియ కాని యొండు గాదు. నాఁడ సద్విచారాదుల మాటలు విన్న నీయంగద గలుగనేర్చునే? నేనని యహంకరించి భిన్న భావము నొంది సమ్యగ్దృష్టి రహితుండవై పాపుల ప్రేరణము నెఱుంగనేరక మమత్వమున వారు ద్రిప్పిన త్రిప్పుడులంబడి గ్రుడ్డితనంబున పుణ్యాలైనవారిఁ దెలియక దూరస్థులఁ జేసిన ఘోరదురితంబె యిది. ఫలానుభవ కాలంబున కాదన్న వదల నేరదు. ఇందఱ వలనం గల్గు శుభాశుభముల కెల్ల కర్తవై యనుభవింపవలసిన వాఁడ వీవ. కావున యుష్మాలికంబుఁదక్క-కృతమును స్మరించుచు ననుభవింపు మని బోధించుచుండె.

## అహంకారుఁడు దంభుని సారథినిగాఁ జేసికొనుట

అక్కడ సమరాంగణమున నహంకారుఁడు తన స్వయం శ్లాఘ్యమును మహామోహుని కడకుఁ దోలించి యతనితో నిట్లను. “ప్రభూ! యీ దినమున సత్కాముఁడును నేనును

నెండ్రిడోరుల జయింపఁ బ్రయత్నింతుము. కాని నాశక్తి జాగ కునిఁ జంపుటకై వినియోగించి నప్పటినుండి యతఁడు నన్ను చులకనఁ జూచుచుండె. కావున నిప్పుడు వగరుపురాని విధంబున నతనిం జంపఁ జూడవలయు. సర్వసాధనములును నతనికి నాకు నొక్కపోలికయ కాని యతఁడు విజ్ఞానాగ్నిచేఁ బడసిన తత్వవిచార మహావాక్యములు మాత్రము నాకంటె యెక్కుడు. అదియునుంగాక లోకప్రవర్తకుఁడైన పరమాత్ముఁ డతనికి సారథ్యంబు నడుపుచుండుటంజేసి యసాధ్యంబు లేదు. ఆకారణమున సర్వవిధములఁ గృష్ణుని కేన సముండననిచాటు. దంభుని నాకు సారథినిఁగాఁ జేసితివేని సత్కాము ననాయా సంబున జయింతు. నాకివ్వరం బీవలయు." ననిన సంప్రీతుఁడై కల్లసామి యతనిఁ దోడ్కొని దంభుని కడకుం జని "మహాత్మా! నీకు వినతుండనై యిందఱు విషయాధిపతుల నడుమ నిన్నొక్కటి ప్రార్థింతు. సత్కాముఁ దెగటార్చుట నీకును, నాకును, నెల్లఱకును గావలసి కార్యం బగుటను, నీవు కృష్ణునికంటె సర్వవిధముల మేటివగుటను, నహంకారుఁడు నీ సారథ్య మభిలషించుచున్నవాఁడు. అక్కార్యమున కొడఁబడి సత్కాముఁ దెగటార్చించి నన్నుఁ గరింపు" మని ప్రార్థింప నతండు "పొల్లుతేఁడా! నన్ను నేమని యిట్టి నీచకర్మకుఁ బురికొల్పుచుంటివి. ఇతఁడు నాకన్న నేమిట ఘనుండని యెంచితివి. నాలో షోడశాంశంబున కేనిఁ జాలఁడు. కృష్ణ జిష్ణుల నేని లెక్కగొనను

జ. విను మేను విక్రమింపఁగ
గనుఁగొనియెడు నంతవాఁడుఁ గలఁడే కులశై
ల నికాయంబు వగలుతు
వన నిధులు గలంతు ధరణి వ్రత్తుం గలయన్.

— భారతము.

నా పరాక్రమంబునకుఁ బదునాల్గు లోకముల నాఁగు వాఁడు గలఁడె. ఈయున్న నిష్కామ యోధుల నొక్కని నాభాగంబునఁ జేర్పుము. వాని దూలనాడింపకున్న నాపేరు దంభుఁడు కాఁడు. ఇంత వాని నన్నెఱుఁగక మాట్లాడితి'' వన నృపారూపుఁడు ''నీవంతటివాఁ డవకా నెఱుంగుదు. సత్త్వము నకు సాటి యగువాఁడు మన యహంకారుఁడు. కృష్ణునకు దీటగు లేక మేటి యగువాఁడ వీవని యెఱింగియె వారికి సాటిగా మిమ్ముఁ బ్రార్థించుచుంటి. నామాటలు పాటించి మన్నింపు'' మనిన దంభుఁడు నన్ను కృష్ణునికంటె మేటిఁ జేసితివి గాన నీ కోర్కె కంగీరింతు. కాని సమరంబు నప్పుడు

క. వీనులకుం బలుకులు సేఁ
దైనను జెప్పుదు హితంబులగు కార్యంబుల్
దానికి నోర్వఁగ వలయుం
గాని యలుకవలదు నీకుఁ గర్ణున కధిపా!

అని పలికి సాచివ్యంబునకుం జాలినవాఁడై యతని రథంబెక్కె.

## అహంకారుఁడు నిష్కాముని పరిభవించుట

ఇట్లు దంభుఁ డాత్మశ్లాఘ్యంబు నధికోపించి యహం కారుఁడు సమరోత్సాహంబుగా నాడుచున్న వాక్యములనెల్ల

తిరస్కారపూర్వకంబుగాఁ దూలంబుచ్చుచు తనదంభ సారథ్యము నడుపుచుండె. అహంకారుఁడును నాఁడు ప్రళయరుద్రుండునుంబోలె సుగుణనికాయమునెల్ల నేలపాలుసేయుచు నిష్కాముతోఁ దలపడి యాతని సమయింపవలయు ననునంతటి యుత్సాహంబున నూనాడుచుండె. సత్యకామ నిష్కాములు తలపడిన నయ్యిద్దఱ సాధనశూన్యులంజేయ వారాప్తకాము నరదంబెక్కిన నమ్మువ్వుర ననాత్మవాద వాక్యాసారముల ముంచుచు సిలుగులు బెట్టుచుండ గనుంగొని దంభుఁ డహంకారున కిట్లను. "అహంకారా! కార్యసరణి నెఱుంగక నిష్కారణముగ నిష్కాముపై నాగ్రహింతువేల? అతనిం జంపితివేని సత్కాముఁ డాగ్రహావేశమ్మున నిన్నును నీ పరివారమును పీనుగుపెంటలు సేయకున్నె? కావున నితడు సచ్చినను ఫలము గలుగనేరదు. సత్కాముఁ డొక్కఁడు బోయిన నఖిల ముక్తిపథ సంపాదనంబగు. అదియునుంగాక నదిగో యటుచూడుము. కలుషప్రభువు వేదకాము చేతులంజిక్కి ప్రాణాపాయదశ నొందుచున్నవాఁడు. ఇప్పు డతనిం బొదివి యితని రక్షింపకున్న నీవు నిష్కాము సమయించుట వృథయగు" అనిన నజ్జిత్తి చూచి యతనిచేఁ బొదువంబడుట గని యవ్వాలనికిం జనియె. అంత నిష్కాముఁ డిద్దఱు తమ్ములతోఁ గూడ శిబిరంబునకుఁ జని సెజ్జ నొడలు సేర్చి హృదయంబున దరికొను పరిభవానలంబు పీడయొనర్పనుండి సత్యకామాప్తకాముల వేదకామునకు సహాయంబుగాఁ బంపె.

## సత్యాముఁ డహంకారుని తేజమునకు భీతిల్లుట

అహంకారుఁడు విజృంభించి సకల గుణ ప్రళయంబు సేయుచుఁ దనమీఁది కురువడించుటఁ గాంచి సత్యాముఁడు వాసుదేవున కిట్లను "మాధవా! యహంకారుం జూచితివే? ఏకవీరుండన నొప్పుచు తేటిచూడరాక యుద్ధతుండై మండు చున్నవాఁడు. బ్రహ్మచర్యాదుల నెంచుట యొక్కయెత్తు నీతని నెంచుటయన్న మఱియొకయెత్తునుఁగా దోఁచుచున్నది. ఆహా! యీతనియుత్పత్తి యెఱుఁగరానిది. ప్రచారం బద్భుతా వహము. ఈతని చేరదీసి మన్నించుటచేతనె కదా? జీవుని కుటుంబమంతయు నీదశకువచ్చి దుఃఖభాజనమైనది. ఈతని శక్తి యసామాన్యంబగు. ఇప్పు డితనిం దొడరిన పరాజయంబె కాని విజయంబు లభింపదు. చచ్చి సేయునది లేదు. "జీవన్ భద్రాణి పశ్యతి" (బతికియుండిన శుభములు బడయవచ్చు" కావున తత్త్వవిచారమును స్మరలింపు" మన కృష్ణుం డతని నిరుత్సాహంబు నిరూపించిచూచి కలుకెక్కింపకున్నఁ గాదని కయ్యపు వలను నిరీక్షించి వేదకాముఁడు బౌద్ధేయ సేనలనెల్ల నిలువరించి యహంకారునితోఁ బోరుచుండుటఁ గాంచి కలని కతండ చాలునని యెంచి సత్యాముఁజూచి "మీ పెద్దయన్న సమరభూమి లేఁడు. ఇక్కడ యహంకారుని చేఁ బరాభవింపఁ బడి శిబిరంబున కేఁగి యుండనోపు. అతనిఁ జూచివచ్చుట శ్రేయం"బనిచెప్పి యొడంబరిచి రయంబున శిబిరంబునకుంజని యిద్దరును నిష్కాము పాదములకు నమస్కరించిన యిరువురం గౌఁగిలించి యహంకారుని సమయించియ వచ్చిరని యెంచి

నిష్కాముఁడు తమ్మునింజూచి "యింద్రాదులైన లోకపాలురను నెవ్వనిం జంపుకొనలేక దుఃఖములపాలఁ బడుచుండిరో యట్టి బల్లిదు నశ్రమంబునఁ దునిమివచ్చితిరి. ఇది నా సుకృతంబ కాఁదలంతు. అహింసాదులు చూచుచుండ నేఁ బతనిఁ దలఁపడి సంపూర్ణముగాఁ బరిభవింపఁబడి యిక్కడికిం జేరితి. పదుమూడేఁడు లాహార నిద్రలు మాని యెట్లు జయింతునా యని యెవ్వని సావుకొఱకు తపించితినో యట్టివాఁడు నేఁటికి జీవసంసరణమున కాదిమూలంబైన యహంకారుండు మడియుటచే కూకటివేరుబోయిన వృక్షంబుపగిది మహామోహుఁడు మొదలంట నశించు" ననిన నిష్కామునకు సత్కాముఁ డిట్లను.

## సత్కాముఁ డహంకారుని జంపమికి నిష్కాముఁడు నిందించుట

అన్నా! నేను క్రోధునితోఁ భరంబున బెనఁగుచుండ యజ్ఞుండును తోడై క్రొత్తె. అట్లుండఁ దలఁపడి పోరుచు సైన్యమధ్యంబున నిన్నుంగానక నీవేమైతివోయని భయంబునఁ జూచిపో వచ్చితిమి. మాపోవునంత కక్కడ వేదకాముఁడు గలఁడు. క్షేమంబున నున్న నిన్నుం జూచితి మింకఁజని యతని నవలీలఁ జంపివత్తు మాజ్ఞయిచ్చి పంపు" మన్న నహంకారుఁ జంపిరామి యెఱింగి కనలుచు నిష్కాముఁ డాశాభంగంబు నొంది తమ్మున కిట్లను. "బ్రహ్మవాదమున మాయావాదులఁజంపుట యొండె వారిచేఁ జచ్చుటయొండె కాక నొచ్చియేని వాదభూమి విడిచి వచ్చుట యుత్తమాధికారి లక్షణంబె. నేనుక్కరుండ యహంకారుచేత జయింపఁబడితి ననవేల నీవును నట్టివాఁడ

నైతివి. కావున నింక నెవ్వరి నన నక్కఱయేమి. మనకింక బ్రహ్మవాదంబుతో నిమిత్తంబులేదు. తపంబున నుండుటయె కర్తవ్యంబు. ఔరా! యహంకారుఁ డెట్టి బెట్టిదుండు. నిన్నును నన్నును జయించుటయెకాక సృష్టిస్థితి లయకర్తయగు పరమాత్మకుంగూడ జయింపరాని వాఁడయ్యె''నని దీనాననుండై పలుకు నిష్కాముని సస్మితసుందరవదనారవిందుండై చూచుచు నారాయణుం డయ్యన్నదమ్ముల నిద్దఱఁ బ్రసాదదృక్కుల నాదరించుచు వారి హృదయముల నావరించియున్న స్వరూపావరణంబునుఁ బోగొట్టనెంచిన వాఁడై యిట్లనియె.

"భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిణ దృష్టే పరాపరే"

కార్యకారణ స్వరూపమగు బ్రహ్మము సాక్షాత్కరించిన తోడనే యాత్మానాత్మల యన్యోన్యాధ్యాసము నశించును. సర్వసందేహములు నివృత్తియగును. సర్వ శుభాశుభ కర్మలు నశించుచున్నవి.

తమేవ విద్వా నత్యేతి మృత్యుం పంధాన చేతరః
జ్ఞాత్వాదేవం పాశహానిః క్షీణైః క్లేశైర్న జన్మభాక్"

ఆయాత్మ నెఱిఁగినవాఁడు మృత్యువు నతిక్రమించుచున్నాఁడు. దీనికన్న మఱియొక మార్గము లేదు. స్వప్రకాశుఁడగు పరమేశ్వరునిఁ దెలిసికొనిన పాశహాని యగుచున్నది. పాపములు నశించిన జన్మములేదు.

సత్యాభామా! త్వంశబ్దవాచ్యమై చెప్పఁబడు జీవ చైతన్యము మూలావిద్యచేత భ్రాంతినొంది యింద్రియ సమిష్టి భావంబున నేర్పడిన దేహంబునందు తాదాత్మ్యస్థితి నొందినది. అప్పుడా యింద్రియ సమిష్టిజడదేహమే యహం శబ్దవాచ్యమై తెలుపఁబడుచు జీవచైతన్యమును మఱుఁగుపరచి యింద్రియ సమిష్టి భావదేహంబును గనుపరుచుచు దేహవిలక్షణ సాక్షి చైతన్యమును గప్పిపుచ్చి జీవచైతన్యమును సర్వమునకుఁ దానకర్తనుకొనునట్లు జేసి సుఖదుఃఖపరంపరలఁ గల్పించుచు జననమరణంబులఁ బొందించుచుండు. ఇట్టి యహంకారమును మొదలంట నున్మూలింప వలయుననిన

"ప్రమాణ వ్యవహారోఽయం సర్వఏవ పరాగ్యతః
సువిచార్యాప్యతోఽనేన యుష్మద్యేవ దిదృక్షతే"

ఎంత నిపుణముగ నాలోచించి చూచినను ప్రత్యక్షాది ప్రమాణము లనాత్మభూతములై దేహగేహములయందే ప్రవర్తించు చున్నట్లు కనఁబడు చున్నది, కావున ప్రత్యక్షాది ప్రమాణములచేత ననాత్మవస్తువులే చూడవచ్చుచున్నవి గాని యాత్మవస్తువు చూడఁ బడుట లేదు.

"అన్వయ వ్యతిరేకాభ్యాం నిరస్యా ప్రాణతో యతః,
వీక్షాపన్నస్యకోఽస్మీతి తదసీతిశ్రుతి ర్జగౌ"

'అహం బ్రహ్మాస్మి' యను నఖండవాక్యార్థ జ్ఞానము లోకసిద్ధములైన ప్రత్యక్షాది ప్రమాణముల వలన కలుగునది కాదు. కనుక దేహము మొదలు ప్రాణము వరకుఁ గనిపించు

పదార్థము లాత్మ కాదని యన్వయ వ్యతిరేకముల చేత నాలో చించి నిరాకరించుకొని పిదప 'నే నెవఁడ ' నని స్వరూప మునుఁ దెలియఁగోరి యేపురుషుఁ డుండునో వానిని గూర్చి 'తత్త్వమసీ ' త్యాది శ్రుతి 'నీవా బ్రహ్మవే ' నని యుపదే శించు చున్నది.

"తస్మా త్ప్రిమాతృ ప్రమాణ ప్రమే యేభ్యోహేయ మానోపాదేయ మానేభ్యోఽన్వయ వ్యతిరేకాభ్యాం ముం జేషికావద శేష బుద్ధివిక్రియా సాక్షిత యాత్మానం నిష్కృష్య తత్త్వమస్యాది వాక్యేభ్యోఽపూర్వాది లక్షణ మాత్మానం విజానీయాత్ "

ప్రమాతృ ప్రమాణ ప్రమేయములు మూఁడు జాగ్ర త్స్వప్నములయం దనువర్తించి యుండును. సుషుప్తిదశయందు వ్యావర్తించి యుండును. ఇట్టి ప్రమాత్రాది త్రిపుటికంటె చిదాత్మ విలక్షణమైయుండునని యన్వయవ్యతిరేకయుక్తులచేత ముంజిగడ్డియొక్క పై పొరలను తీసివేసి లోపలనుండు కాడను వేఱుజేసి చూచినటుల నిశ్చయించి చూచి పిదప తత్త్వమస్యాది వాక్యములను విని 'అపూర్వ మనపర మనంతరమ్ బాహ్యం ప్రజ్ఞాన ఘన ఏవ ' (తూర్పు పడమర లోపల వెలుపల లేని వాఁడు కేవల జ్ఞానస్వరూపుఁడు) ఇత్యాది శ్రుతులచేతను, సత్యజ్ఞానాది వాక్యములచేతను ప్రతిపాదింపఁ బడిన యఖండ జ్ఞానాకారమైన పరమాత్మ నపరోక్షముగా తెలిసుకొనవలయును.

ఇట్లన్వయ వ్యతిరేక విచారణంబులతోను వాచ్యవాచక లక్షణార్థంబులతోను నహంకారమును లయము నొందించిన నాఁడు తచ్ఛబ్దవాచ్య బ్రహ్మమునందు లయమును బొందును. ఈ రహస్యము నెఱుంగ నేరక సాధారణయుక్తులచేత నా యహంకారమును నశింపఁ జేతుమని పంతంబులాడి యందఱును తమకుఁ దెలియకుండ తామే దానియందు లయమగుచుండిరి. నాయంతవానిం బొందియు మహావాక్యములను వాహనములు గలిగియు విభ్రాంతుఁడనై యహంకారునకు భయంపడుట వింతగాదె " యనుటయుఁ దెలివొందిన మనంబుతో సత్త్వాముఁ డన్నకు నమస్కరించి " అన్నా ! యహంకార నాశనంబున కజ్ఞానకారణంబునఁ జాలనైతి. ఇప్పటికి దేవుని కరుణామయ ప్రబోధంబునఁ దెలిసితి నాజ్ఞ యిచ్చి పంపు " మనిన నతఁడు దీవించి పంపిన

## వేదకాముఁడు నాస్తికునిఁ జంపుట

కృష్ణు లిరువురును తత్త్వవిచారము నధిరోహించి ప్రవృద్ధంబులగు తేజంబులతో కదలి కలనికిం జని వేదకామునిం గని నిష్కామ క్షేమంబుఁ దెల్పి యిరువురు నతి రభసంబున నహంకారుని దునుమఁ బోవునెడ నాస్తికుండు సర్వశూన్య మను రథంబెక్కి మూలాభావ మను ధనువుంబట్టి స్వప్నతుల్య మను బాణములఁ బ్రయోగించుచు పిపంచ ఘృతపీనులు చక్రరక్షకులుగాఁ జేసికొని వేదకామునితోఁ దలపడి పోరు చుండ వేదకాముఁడు

ఉ. ఆసభలోనఁ గొన్న ఋణమంతయు నీఁగఁగఁగంటి వడ్డితో
బాసకొకింతయుం దొలఁగఁబాఱకు తీర్చెద నిప్డు నేఁడు నా
చేసిన పుణ్య మెవ్వరును జేయరు నిన్నిటు పేరదెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృపసేయుట గానఁగవచ్చెఁ దమ్ముడా!

— భారతము

అని పల్కుచు నతనిం దలపడి యాత్మసత్యమను బాణమున రథమును, నాత్మ నిత్యమను బాణమున ధనువును, 'ఆత్మైవ విభాతి' యను బాణమున చక్రరక్షకులను నశింపఁజేసి సర్వసరికరశూన్యుండై నిలిచియున్న యతనిని 'బ్రహ్మాహ' మను గదాప్రహారమునఁ బొలియించి యానంద రసామృత పానంబుఁ జేయుచు సొక్కుచుండె.

## సత్కాముఁ డహంకారునిఁ జంపుట

సత్కాముఁ డప్పు డహంకారుఁడు సూచుచుండ నతని కొమరుని సర్వోత్కృష్టుఁడను వృషసేనుని నమ్రభావమను బాణంబున సమయించిన నతండు పేరలుకఁ గన్నులెఱ్ఱజేసి విజృంభించిన నయ్యిరువురకును నతిఘోరంబగు వాదంబుచెల్లె. అట్టియెడ దహరాకాశంబున నిండిన యింద్రియాధి దైవతము లెల్లఱు సత్కాముని విజయంబు నిరీక్షించు చుండిరి. అప్పు డమ్మహావాదు లిద్దఱును బ్రచండయోగ సత్వంబులు మెఱయఁ బోరుచుండ జిష్ణుని తత్త్వవిచార చోదకుఁడుగా నున్న కృష్ణుని మాయావిలసనంబున నహంకారుని యాత్మశ్లాఘ్యమను రథం బిటునటు గదలలేక నిలిచిపోయిన వికలహృదయుండై చూచు

చుండ నతని పాపవిచారం బను ధవుని ప్రేమాస్త్రముచ
నఱికి, మద మను గజకర్ణుని దేహ మనిత్య మను శరమున
విఱిచి, పండితద్వార పరనిందాపరాయణులను చక్రరక్షకుల
సమదృష్టియను బాణంబున సంహరించి సర్వపరికర శూన్యుం
డై ప్రోడై నిలిచియున్న నతనిం దత్పదలక్షణావృత్తిరూప
విచారణ నిశ్చయార్థంబుచే నశింపఁజేసి పరమాత్మయే నేనను
తాదాత్మ్య స్థితిం బొంది మరల ప్రకృతిస్థుండై యతి దుర్ఘట
శత్రుసంహారక్రియకు పరమానందంబు నొందుచు మాధవుఁ
గూడి తనవారి నెల్లఱం గూర్చికొని నిష్కామము సన్నిధికిం జేరి
వృత్తాంతంబెల్ల నివేదించి యతనిచేఁ గౌఁగిలింపఁబడి భార
మంతయుం దీరినట్లు సంతసించుచు నారాత్రి సుఖనిద్రం
బొందిరి.

శ్లో॥ కాతే కాంతా కస్తే పుత్ర స్సంసారో యమతీవ విచిత్రః
కస్యత్వంవా కుత ఆయాత స్తత్వం చింతయ తదిహ భ్రాతః
— భజగోవిందం

ఆత్మభారతమునం దహంకారపర్వము

సంపూర్ణము

ఓం తత్సత్

---



శ్రీరాధాకృష్ణాయనమః

# ఆత్మభారతము

## దంభపర్వము

శ్లో. తృష్ణాతోయే మదనపవనో ద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహ సంఘాకులేచ
సంసారాఖ్యే మహతిజలధౌ మజ్జతామ్ నస్త్రిధామన్
పాదాంభోజే వరదభవతో భక్తినావం ప్రయచ్ఛ.

— ముకుందమాల.

అష్టాదశ వాసరంబున మిగిలిన బలంబులతో మిథ్యాకల్పనుఁడు వాదభూమిం జేరి తన సర్వస్వంబు నగు నహంకారుఁడు లేమికిదుఃఖించుచు వైరాగ్యసద్విచారాదుల ప్రబోధంబు వినమి నింతవాటిల్లె నని తలంచుకొని దురపిల్లు నతని సమీపంబునకు ప్రబోధుఁ డేతెంచి "కుమారా! కడచిన దానిం గూర్చి వగచిన ఫలంబులేదు. బ్రహ్మచర్యాది మహాగుణవర్గంబును తక్కుంగల విషయాధిపసమూహంబును శాంతేయుల

బ్రహ్మతేజంబు ముందు నిలువనేరక యారిపోయె. ఇంకనెక్కరుండవై మిగిలితివి. తనవను సమస్తంబుకంటెను తానె ఘనంబను వాక్యము నెఱుఁగవె. నా మాటలు విశ్వసించి యిప్పుడేని నిష్కామ శరణంబు నొంది సుఖంబున నిన్ను నీవు గాచికొ" మ్మనిన నతండు " మహాత్మా ! నా యందలి ప్రేమాతిశయంబున సంధి కర్తవ్య మని పల్కితిరి. ఐనను మీమాటలు రుచింప వెట్లంటిరేని బాల్యమాది వారి కెన్నియేని యెగ్గులాచరించితి. నమ్మిన నావారు నాకొఱకు ప్రాణంబులర్పించిరి. ఇంక నే నొక్కరుండ మిగిలితి. సర్వసంపత్పరివారశూన్యుండనగు నా యొక్కని తేజం బేమిసేయ నోపు.

ఉ. ఆఱని లోఁతు నీటికొల నక్కట ! పూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి రేకులు తొంబదితొమ్మి దిప్పుడా
నీరజమందుఁ దా మిగులునే యొకటే కటులుండెనో యలం
కారములౌనె యా కొలనుగాని సరోజముగాని భూమికిన్.

— తి. వేం.

కౌంతేయుల కడుగులొత్తుచు నెట్లును వారితో కలిసి మెలఁగనోప. కావున వాదంబున నెదిర్చి ముందు వోయిన యహంకారాదుల పరలోకంబునఁ గలిసికొందు. ఇదియనా నిశ్చితం" బని యెఱిఁగించి దంభుని కడకుఁబోయి మహాత్మా !

ఉ. పొచ్చెముతేని నెయ్యమునఁబూని విపద్దశ నొందకుండఁగా
నెచ్చెలిఁ గావఁజూచు మహనీయున కిట్టిద కాలమిప్పుడీ
వచ్చుపడంగ నీ భుజబలాతిశయంబున నద్భుతంపు గెల్పిచ్చి
కృతార్థుఁ జేయుమను నే నినుఁ జెందియుఁ దూలఁబోదునే.

క॥ పూనుము చమూపతిత్వము
నా నమ్మినవారు నేను నరపతి బల సం
తానంబుతోడఁ బరిజన
మై నడచెద మాక్రమింపు మరి వర్గంబుల్.

— భారతము

అని ప్రార్థించి యతని సేనాధిపతిఁగా నొనర్చి నాఁటి కయ్యంబునకుం జాలి నిల్చె. శాంతేయసేనలును వాదస్థలంబుఁ జేరె. అట్టియెడ సర్వవిషయ నాయకులును సంకులంబుగాఁ బోరుచు పరస్పర వాక్యాఘాతంబుల మడియుచుండిరి.

## నిష్కాముఁడు దంభుని జంపుట

దంభుఁడు శూన్యజపమను రథంబెక్కి, నిమీలితాక్షమను బాణాసనంబుఁ జేపట్టి, కమండలపతాకాగ్రాల, తులసీదామ రుద్రాక్షహార భస్మాంగరాగోర్ధ్వపుండ్రాది పరివారంబులును, నతి వినయుండను కౌమరుండును ముందునడువ వాదస్థలంబుఁజేరి కైవల్యపతి సేనలం బొదివి వాదించుచుండ నిష్కాముఁ డడరి యతని నెదిరించి బ్రహ్మవాక్య జాలములఁ బ్రయోగించుచుఁ గొంతవడి పోరి బ్రహ్మతేజోమయ మూర్తిం దాల్చి ముక్తినేత, సర్వాంతర వృత్తి బహిష్కారణం బనుశక్తి ఘాతంబున రథధనుః పతాక పరివారంబులతోఁగూడ నతనిఁ దెగటార్చె. ఇట్లు దంభుఁడు వోయిన పూర్వ మీమాంసయను సాల్వుఁడు కర్మప్రధానమనుగజంబునెక్కి సేనలంబొరిగొనుచు వచ్చుచుండ నతనితోఁ ధమాఖింసు లెద్దురొని యుత్తర

మీమాంసయను కుంతిభోజుఁడు తోడుపడ నైష్కర్మ్య సిద్ధాంత నిరూపణాస్త్రంబున నతనిం బొలియించిరి.

ఆప్తకాముఁడు మనస్సును చంపుట

ఆమీఁద తన బలగంబంతయు నశింప నొంటిమై నిలిచి క్రోధుఁడు సత్కామము చే నాత్మదృష్టి యను బాణంబున సమసి పోయె. అంత సర్వనాశనమునకు కారకుం డైన మానసుఁడు సంకల్ప మను రథంబెక్కి వికల్పమను ధనువుఁ బట్టి, సంచలన మను పతాకగ్రాల మాయావాద శూన్యదృష్టి మిథ్యానిరూపణాది పరివారములును సర్వపరి భ్రమణుం డను కొమరుండును నడువ వాదరంగంబునకు వచ్చి నిలిచిన నతనితో నాప్తకాముఁడెదుర్కొని వాయు రివాకారుం డనియును, కలిగియు లేఁడని చూచిన లేకపోవువాఁడనియును, సర్వంబును మాయావికారంబున వికల్పించు చుండువాఁడని యును నతని మిథ్యారూపంబు నిరూపింప మానసికుఁడు సర్వ పరివారములతో నదృశ్యుఁడయ్యె.

" సదామోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశా శాఖాస్వటతి ఝడితి స్వైర మభితః
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యంత చపలం
దృఢం భక్త్యాబధ్వాశివభవదధీనం కురువిభో "

శ్లో. భిక్షాశనం తదపి నీరసమేకవారం
శయ్యా చ భూః పరిజనో నిజదేహమాత్రమ్
వస్త్రం సుజీర్ణ శతఖండ మయీచ కన్థా
హాహా తథాపి విషయాన్నజహాతిచేతః. — భర్తృహరి.

బిచ్చమేకూడు. అదియును చప్పిడిదై యొకపూటకే దొరుకును. పడుకచాపయులేని కటికునేల, సేవకుఁడు తన దేహమే; వస్త్రమో మిక్కిలి ప్రాఁతగిలిన నూలుపేలికల బొంత. ఇట్టి దశగిలిగియు పాడుమనస్సు విషయములను విడువ ననుచున్నది. అక్కటా ! ఏమి వింత.

## మహామోహుఁడు చిత్తసరోవరమున దాగుట.

ఇట్లు సేన లెల్ల నిశ్శేషముగా నశించిన యజ్ఞ ప్రబోధ లోభులు ముప్వురు మాత్ర మవశిష్టముగా నిలిచిరి. అయ్యవసరమున వాదభూమి విడిచి యెద్దియుం దోచక మహామోహుఁడు పాఱి చిత్త సరోవరమను ద్వైపాయనప్రాదంబు కడకుం జని యందు శత్రులకుఁ గనరాకుండ దాఁగ సెంచి యున్న సమయంబున యజ్ఞాదులు ముప్వు రచ్చటికిం జని యతని దీనావస్థ నాలోకించి తపించుచు "సర్వ విషయాధీశ్వరుం డిట్టి వాఁ డయ్యె. దైవము నేమనం గల" మనుచు యజ్ఞుఁడు దబ్బరతేనిం జూచి "కాయపురాధి నాథా! మేమింకను ప్రాణంబుల నుండ నీవు నిరాశా చిత్తుండవు కావలదు. మమ్ముఁగొని పగవారి మీఁదికింజనుము. వారినందఱ నామావశిష్టుల జేతము ర" మ్మనవుడు మహామోహుఁ డిట్లను "గురుకుమారా! నా మిథ్యామయ దేహము సంధి సంధులు వికలమై బాధింపజొచ్చె. నేఁటి కెవ్విధంబునను శత్రువుల మార్కొననోప ఇప్పటికిఁ దగవైనరీతి పగవారికిఁ గన రాకుండ డాఁగియుండి తఱివేచి సంహారక్రియకుఁ బ్రారంభింతు

మీరెందేని జనుం" డనియె. ఇట్లు వారెన్నివిధములఁ బుకి క్కొల్పు చున్నను నుత్సహింపక చిత్తసరోవరంబు లోనికింజేరి శాంబరీ విద్యా ప్రభావంబున నెవ్వారికిం గనరాక యుండె.

శాంతేయులు శత్రుశేషం బెప్పటికేని యనర్థంబే యను తలంపున కల్లల యెకిమీని వెదకుచు వచ్చుచుండిరి. వారిం గాంచి ప్రాణభయమున యజ్ఞాదులు మువ్వురును మడుగు విడిచి యెందేనిఁ జనిరి.

అంత పంచకాములు విజయోత్సాహంబులతో కృష్ణ పురస్సరంబుగా వచ్చుచు వేదకాముని చారులవలన పొల్లుతేఁ డడఁగియున్న చిత్త సరోవరంబు జాడఁదెలిసికొని యమ్మడుగు దరింజేరి మిథ్యాకల్పను మాయాస్తంభితంబై యున్న దానిని లీలంగ్రహించి నిష్కాముఁడు మాధవుతో నిట్లను.

కృష్ణా! మాయావియగు నాదుష్టుఁ డీచిత్తసరోవరం బును తనమాయచే వికల్పించి యొరుల కెవ్వరికేని భేదించి మూలం బెఱుఁగరానియట్లజేసియందు విలీనుండై యుండి మన యెప్పు డప్రబోధస్థితి నొందుదు మప్పుడ మఱల కైకొని నశింపఁ జేయవలయునను పూనికం గూర్చుండియున్నవాఁడు కనుంగొను" మన నచ్యుతుఁడు "బావా! మాయావుల మాయలవలననకాని నొండింట జయింపరాదు. విష్ణుండును నింద్రుండును రాక్షసులనెల్ల నట్ల సమయించిరి. నేనును నర కాదుల నట్లనేసితి" నని ప్రబోధింప తెలివొందిన మనంబుతో మహాషోషాలు నుద్దేశించి నిష్కాముఁడు,

దుత్తారము సామీ! పానమననెంతతీపి. నీకొలఁకెందఱు నచ్చిరి. నీవొక్కఁడవు బ్రతికి యింకను నేమి యేలుకొనం దలంచితివి. కొమ్మలన్నియుం బోవ మ్రోడైన మ్రాఁకువలె నుండియు నింక నేఁటి బిక్షలంగాంచి మురియ నెంచితివి. పౌరుషంబు పాడుసేయక మగవాఁడవై నిల్చి పగవారినో పరలోకమునో గెలిచి కొనుము" యని యిట్లు మర్మములు దూలనాడిన యాతని వాక్యములకు సహింపక సరోవరంబు వెలువడి వచ్చి నిష్కాముఁజూచి నిష్కామా! ప్రాణి ప్రాణ భయము నొందుట యపూర్వమా! నాకుఁగల సర్వ పరికరపరివారములునునశించి నొచ్చియున్న కారణంబున వాదమునకుం దొలఁగి సేదదీర్చుకొని మఱల పగవారిఁ బైకొందు. అదియునుంగాక సర్వంబునుఁబోఁగొట్టుకొనియున్న నాకింకను పౌరుషంబేల? యీ సర్వశూన్య సామ్రాజ్యంబీవ యేలుకొనుము పొ"మ్మనిన నిష్కాముఁడు "దుస్సంకల్పా! యీమాత్రము పూర్వమె యీఁగన్ననింత యేలఁగల్గు. నీవేమిచెప్పినం బోదు. సన్నద్ధుండవై రమ్ము. నీకుం దోఁచినవానికి రణంబిమ్ము".

వేదకాముఁడు మహామోహునిఁ జంపుట

అనిన వల్లెయని యతండు సన్నద్ధుండై వేదకాముని దనకు జోడై పోరాడ రమ్మనిన వేదకాముఁడును గడంగి ప్రమాణవాక్యములను నుద్దండ గదాదండంబుఁబూని కడంగిన మధుమతీ విద్యయను గదాదండముం గైగొని మృషారూపుఁడునుఁ దలపడి పోరాడుచుండ, మహామోహుఁడు తన మూలా

విద్యారూప మాయా విలసనంబున మధుమతింగొలిపి వేద కాము ప్రమాణవాక్యంబు లప్రమాణరూపంబులుగా నిరూపించుచు పోరుచుండ క్రమక్రమంబున నతని మాయా జాలంబుల భేదింప సమర్థుండుగాక వేదకాముఁడు డస్సి కృశింపం జొచ్చుటయు నీక్షించి పుండరీకాక్షుండు వేదకాము నుద్దేశించి "బింబమునకు ప్రతిబింబ మేర్పడుటకు కారణము దర్పణము. కావున ప్రతిబింబమును నశింపఁజేతునని దర్పణమును భిన్నము సేయ మొదలిడిన నదిభిన్నమగుకొలఁది ప్రతిబింబ పరంపరల నభివృద్ధి సేయుచుండు. నంతియకాని మూలమునశింప దదియే 'అహమన్యో అసవన్యో' అను భావజనకంబగు ద్వంద్వమును బుట్టించు నట్టి ద్వంద్వమనునూరుద్వయమును 'నేహనానాస్తి కించన' యను ప్రమాణవాక్య గదం గొట్టుము. దాన నతండు మూలాభావమై నశించు'' నని సత్కాముసకుఁ జెప్పుచు సంజ్ఞాపూర్వకంబుగా వేదకామునకు ప్రబోధించిన, ఆ వాక్యము లనుసంధించి జాగ్రద్దర్పంబు నొంది వేదకాముఁ డట్టి వాదంబున నతనిం బ్రహరించిన మాయావాది తన మాయలన్నియు మాయమైపోవ నున్నరూపంబున లేనివాఁడై నామమాత్రాకారంబునఁ బడియుండె.

## సత్కాముని రథ వాహనము లగు తత్త్వవిచార మహావాక్యములు దగ్ధమగుట.

ఇట్లు పంచకాము లాప్తకాములై సంతసించి ప్రణవశక్ నాధంబులు సేయుచుఁ గదలి యహింసాదుల విడిది పట్టునకుం

బంపి తానును పరమాత్మయు దముఁడును పాడువాటి యున్న మహామోహాహ్వ మనికిపట్టునకుం జని యం దేవురును రథావతరణంబులు సేయుచున్నయెడ నచ్యుతుండు సత్కాముఁజూచి “ సత్కామా ! ప్రణవ ధనువును నానంద విజ్ఞానమయ కోశములను మాత్రమందుకొని ముందు నీవు తత్వవిచారమునుండి దిగుము. ఆవల నే నవతరింతు ” ననిన నతం డట్లు సేసె. అంత పరమాత్మ మనస్సను పగ్గముల ముడిచి తత్వవిచారము నందుంచి తానును నుత్తరించె. ఆ మీాద సత్సంగతి యను హనుమంతుఁడు వ్రాయె.

అప్పుడు మహావాక్యములను వాహనములతోఁగూడ తత్వవిచారమను రథంబు దగ్ధమయ్యె. దాని గాంచి యెల్లఱును నాశ్చర్యమగ్నులై “ కృష్ణా! యిదియే ” మన నతండు “ కర్మాణి తత్సాధనాని సంసారిణోపి విధీయంతే ” మిథ్యాకల్పను పతనంబువర కిన్నియు వలయు పరికరంబులై యొప్పె. అక్కార్యంబు దీరిన నిన్నియు భరంబులవై యొప్పు. శత్రువర్గము మొదలంట నశించుటం జేసి యింక మన యాత్మ సామ్రాజ్య సంరక్షణంబునకు ప్రణవ మొక్కటియ సహాయకారి ” యని చెప్పె. ఇట్లు సంభాషించుచు నాఁటి నిశి వారన్నదమ్ము లేవురును కృష్ణుండును దముఁడును మాత్రము సరస్వతీ తీరంబునకుం జని యందుండిరి.

ఆరాత్రి మాధవుండు జీవబుద్ధుల నోదార్ప కాయపురంబునకుఁ బోయి యందు బుద్ధిం గూడి కొమరుల పోకకుఁ

భాగులుచున్న జీవునిం గాంచి అంతకు మున్న యతని నోదార్ప వచ్చిన వేదపురుషునకని నమస్కరించి కృష్ణుడు జీవుని చేయిఁ బట్టుకొని తన్నుం దెలిపి తానును దుఃఖించుచు "మామా! వంశమంతయు నకారణముగా నాశమొంది యిట్లగునని యెఱిఁగియు నీతమ్ముని బిడ్డలు వాదమున కుత్సహింపరైరి. ఇందు నీవెఱుఁగని దేది కలదు. మీయందు విరోధంబుమాని వీరందఱితోఁ గలసి సుఖంబున మనఁగోరిన ముక్తికాము లెంతటి మహనీయులో విచారింపుము. నన్ను సమాధానముఁ జేసికొని రమ్మని పంచిరి. అయిదుగు రుండుట కొక్కొక్క స్థానంబుఁ జూపినఁ జాలుననిరి. దానికిని మీ రొడఁబడరైతిరి. ఇంతకును కాలంబును దైవమునుఁగూడి యిట్లనేసె. కావున మీకు నమస్కరించి వేఁడుకొందు. పాప రహితులగు నీ బిడ్డలయందు కోపముమాని వారికి శుభములు గోరుచుండుము. మీ యుత్తమలోక క్రియాకలాపంబులు వారియంద నిలిచి యున్నవి." అనిచెప్పి బుద్ధి దేవింగాంచి.

## శ్రీకృష్ణుఁడు బుద్ధి నోదార్చుట

అత్తా! నీకుం దీటగు భోటులీ గుణలోకముననెందును లేరు. నాఁడు కొమరుని కీవెంత యొత్తి చెప్పితివి. మూర్ఖుఁడై యతండు నీమాటలు విననొల్లఁడయ్యె. నాఁడె కీడుబట్టునని చెప్పితివి. నీవాక్యంబె చెల్లె. ఇందు శాంతేయుల దోష మిసు మంతయు లేదని నీవయెఱుంగుదు. నీవలిగి చూచిన మూఁడు లోకములును భస్మీభూతంబులగు. నీవట్టి తపఃప్రభావంబుఁగల

దానవు. వారలయెడఁ గోపింపకు'' మని ప్రార్థించుచున్న పద్మా క్షునకు బుద్ధిదేవి యిట్లను.

కృష్ణా! భరింపరాని పుత్రదుఃఖమున తీవ్ర వేదనం బొందిన హృదయము నీవాక్యామృత సేచనంబున శాంతి నొందె. ఇదియంతయు నీ సెప్పినట్టిద మందభాగ్యులమైన మా పూర్వకర్మంబె మమ్మింతజేసె. పుత్రమోహంబున నొక్కి చెప్పనేరకుంటిమి. అదియ మమ్ము శోకార్ణవమున ముంచె. కడచినదాని నిప్పుడు దడవిన నేమిగలదు. వాసుదేవా! నీకు నమస్కరించి వేడుకొందు. బాహ్యదృష్టి రహితుండును సనా తనుండును నాయనునదంతయుఁ బోఁగొట్టుకొనిన దీనుండును నై యున్న యీక్షేత్రజ్ఞుని సరసిరక్షించుభారము నీయందును పంచ కాములయందునుఁ గలదు. గతమునుమఱచి యీయంధరాజు నంధతం బాపి నీసందర్శనంబొసంగి తరింపఁజేయుము. అంత మా దుఃఖములుఁ దీరు నిదియ వరం బొసంగు'' మని యావరణ రూపమగు పయ్యెద మొగంబున నదిమికొని యేడ్చుచుఁ బ్రార్థించిన, వరదుఁ డవ్వరం బొసంగి వారిచే ననుమతుండై యప్పుడ శాంతేయుల కడకు వచ్చె. వేదపురుషుండును "నారాయణుని వాక్యములు పరమాదరణీయము లవియ మీకు దుఃఖనివృత్తిఁ గల్గించు'' నని బోధించి చనియె.

అట నొంటిం బ్రాణావశిష్టుండై పడియున్న మహా మోహుకడకు యజ్ఞలోభ ప్రబోధు లేతెంచి యతని దీనా వస్థకు శోకింపుచుఁ దగ్గఱఁ గూర్చుండి తాపోష్ణశ్వసన వాక్యం

బుల నూదార్చుచుండు తటి యజ్ఞుడు "నిన్నుఁ గొట్టిన పగ వారిని నామావశేషంబుఁ జేయుచున్న తాపంబు దీరదు. ప్రభూ! యిప్పుడ యి య్యుద్దఱ సైనికులుఁగాఁ జేసి నాకు సేనాపతిత్వ మొసంగి యభిషేకింపు" మని యతనిచే నట్ల చేయించుకొని "నీవు ప్రాణంబులతో నుండి శాంతేయ సైన్యములు నిరవశేషమయ్యె నని వినునట్లు సేతుఁ జూడు" మని ప్రబోధలోభులంగూడి శాంతేయ స్కంధావారంబు దిక్కునకు నడిచె.

ఆత్మభారతమున దంభపర్వము

సమాప్తము

ఓం తత్సత్





శ్రీరాధాకృష్ణాయనమః

# ఆత్మభారతము

## అప్రబోధపర్వము

శ్లో॥ జాతో నాహం నప్రవృద్ధో ననష్టో
దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః
కర్తృత్వా దిశ్చిన్మయ స్యాస్తి నాహం
కారస్యైవ హ్యాత్మనో మేశివోఽహమ్. — అద్వైత పంచరత్నం

ఇట్లు గుణత్రయము సన్నాహవంతంబై శత్రు శిబిరముఁ దరియం జొచ్చు సమయంబున, అక్కడ శాంతేయ బలములు పంచకామ మాధవ విహీనంబై నదయ్యును వాదోప సంహార నిమిత్తంబైన యానందంబున సొక్కి శత్రుభయంబుఁ దక్కి యప్రబోధమను సుప్తిం గూరియుండె.

అప్రబోధంబుననున్న యహింసాదుల యజ్ఞుఁడు జంపుట

యజ్ఞుఁ డచ్చటికి విచ్చేసి తమ్ము మఱచి పడియున్న వీరినెల్ల నవలీల హింసించి ప్రభువు ఋణముఁ దీర్చుకొందుమని

యుత్సాహపడి పోవుచుండ, ప్రబోధుఁ డతనినాఁపి కుమారా! యిట్టి యవస్థం గూరియున్నవారి నడఁచుట పాపము.

సీ॥ ప్రారంభములకెల్ల బౌరుషమ్మును దైవ
ముసు సాధనమ్ములు వినుము వాని
లోన నొక్కటి చేతఁగానేర దనఘ త
త్ఫలసిద్ధి లెట్లన్నఁ దఱుచు వాన
కాఁరు పొలంబునఁ గల్గెనేనియుఁ గొల్చి
గావింపనేర్చునే యేవిధమున
వల నేర్పడఁ దున్నఁ బొలములోనైన వ
ర్షంబు లేకున్న ధాన్యంబు లగునె,

ఆ॥ కాఁపు లావు వెరవుగల్గి కర్శనము సే
యంగ వృష్టి దగినయట్లు గలుగ
ఫలముగల్గునట్లు పౌరుషంబునకు దై
వంబు తోడుపాటు వలయు నెందు.

క॥ మతి నెప్పుడుఁ దాధర్మ
స్థితి నూహించుచును హితులు సెప్పెడి వెరవు
ద్ధతి దక్క యాచరించుచు
జితేంద్రియత గలిగి నడవఁ జెందు శుభంబుల్.

— భారతము

అని యెన్నిరూపములబోధించినను నాదరింపక యజ్ఞుఁడు పశుబుద్ధింబూని మారణకర్మమె పరమ కర్తవ్యముగా నిరూపించుచు తన నిజరూపంబు వేదికయు, క్రోధ మగ్నియు, ప్రాణముల్లు సమిధలును, ప్రాణాసవంబు స్రుక్స్రువమ్ములును,

తన్నేలిన దబ్బరతేని సంతోసమున కగు నాసమె యాజ్యంబు
గాను, ప్రబోధలోభులు ఋత్విక్కులుగాను, సప్రబోధస్థితి
నున్న వాదుల సందఱ పశువులుగాను జేసి హింసింపంబూని
మారణకర్తయగు రుద్రుని తేజంబు తనయందావహింప మాఱి
ప్రలయకర్తవోలె శిబిరంబునఁ బ్రవేశించి, తొలు తనయహింసు
నగరి కఱిగి, యప్రబోధంబునఁ దన్నుఁ దామఱచి యున్న
వానిఁబట్టి "బ్రాహ్మణంబులు కొఱగానివని నిందించి యజ్ఞ
ములు హింసాత్మకములనివాదించి, నన్నును నాతండ్రిని ప్రపం
చమున లేకుండఁ జేయ సమకట్టిన మహాపాపివి. ఇట్టినిన్ని
ప్పుడ చంపి నాతండ్రిని మఱల బడసి ప్రపంచమున నా ప్రచా
రము సాగింతు! పాపీ! నీపాపంబున నీవ హతుండవౌచుంటి"
వని వల్కుచు నతనిం జంపి, యక్రూరాక్రోధు లెదుర్కొన్న
వారి నంత మొందించి, విద్యాదేవీసుత పంచకము మోక్ష,
సంతోష, శ్రీ త్యానంద దయలు నిద్రాముఖంబులతో నెదు
ర్కొన్న నొక్కమ్మడి వారిం జదిపి, యభిరతిం బిలుకుమార్చి,
యుత్తర మీమాంసఁ బంచత్వంబు నొందించి, తక్కుంగల
సైనలనెల్ల బాఱుచున్ననుబోనీక, ప్రాణభయంబునఁ బ్రార్థించు
చున్నను విడువక, కన్నీరుగార్చు వారిం గాదనక, కాళ్లు తడఁ
బడ నిల్చువారిఁ గదలిపోనివ్వక చంపుచు వచ్చుచుండె. అతని
బారింబడక తప్పిపోయినవారిని ద్వారంబున నిల్చి లోభప్రబోధు
లొక్కనిం బోనివ్వక బారి సమరుచుండిరి. ఇట్లుమ్మువ్వురును
రాక్షసావేశ సంభృతి క్రౌర్యులగుచు మానుష హానిం దలం
పక నొక్కనినేని దక్కకుండ సర్వనాశనం బొనర్చి, తాము

ప్రవేశించు నప్పటివలె పోవునప్పుడును నిశ్శబ్దంబుగా నుండు నట్లు సేసి తెలతెల వేగువరకు నాస్థలంబు విడచి, కొఱప్రాణం బుల నున్న మహామోహము కడకుంజని చేష్టలు దక్కి పడి యున్న యతనిం గాంచి దుఃఖించి, తమ్మెఱిఁగించి తాము సేసి వచ్చిన యకృత్యం బంతయు నెఱింగించిన నతండు పొంగి యజ్ఞుం గౌఁగిలించుకొని “తీవ్రవాదులసి నమ్మిన బ్రహ్మచర్యా హంకార దంభులైన నీ చేసినంత జేసి నన్నానందింపఁ జేయనైరి మహాత్మా! యింకఁ బోయివత్తు పరలోకంబున పునర్దర్శనం బగుంగాక” యనిన యజ్ఞుండు పురపురం బొక్కుచు నతనిం గౌఁగిలించుకొని, యతఁడు తనకుం జూపిన మన్ననల దలంచు కొనుచు నిట్లనియె, మహాత్మా!

చ॥ కుడువఁగఁ గట్ట బంధులకుఁ గోటివిధంబులఁ బెట్ట జన్నము
ల్నడుప ననేక ధర్మవిదులం బొగడం దఁగఁజాలు నట్టి యె
క్కుడు సిరియిచ్చి పేర్మి నొక కొండక మన్చిన నీవు సావఁగా
నొడలిటు లోమితిం గురుకులోత్తమ యే నొక సేవకుండనే

— భారతము

అని పలుకుచుండు నంతలోనన యతండు ‘వగలుమాని ధ్యానం దేనిఁ బొం’దని పల్కి ప్రాణంబులు విడిచిన, యప్పటికి సూర్యోదయంబగుచు వచ్చె. అంత నమ్మువ్వురును వేర్వేర దేశంబుల జనిరి. ఇట్లు పాపసేనయందు యజ్ఞప్రబోధ లోభులును పుణ్యసేనయందు పంచకాము కృష్ణదములును దక్క నుభయ దళంబులును పూర్ణముగా నశియించె.

## నిష్కాముఁడు తనపుత్రులు యజ్ఞునిచేఁజచ్చుట విలపించుట

మఱునాఁ డుదయమ్మున పంచకాములు కృష్ణునితోఁ గూడి సరస్వతీ తీరమున సంధ్యాది కాల్యకృత్యములఁ దీర్చుకొని శిబిరంబుల కడకుం జని తపోబల సంపన్నుని హృదయంబునుం బోలె నిశ్శబ్దముగానున్న దానింగాంచి యిట్లగుటకుఁ గారణంబేమి యనుకొనుచుండు నాలోన నహింసు సారథి యజ్ఞుని వలనఁ జరిగిన యావద్వృత్తాంతమును జెప్పిన విని, నిష్కాముఁడు సర్వనాశనమునకు నిర్వేదించుచు విద్యాదేవిం బిలువనంపి, కొమరుల మరణంబు వినిపించి, ఆ యమయుం దామును ననేకవిధంబులతలపోయుచు దుఃఖించి, యకార్యంబంతయు యజ్ఞునివలన సంభవించెనని యెఱిఁగియమీఁద, విద్యాదేవి కోపంబు దీపింప "కైవల్యపతీ! యప్రబోధుఁడైయున్న నాబిడ్డల క్రూరుండై పాపమని యెంచక రూపుమాపె. తర్కదృష్టి పోకకు దుఃఖించు నాకీబిడ్డల పోకయును, గల్పించి మఱింత యడలఁ జేసె. మన వేదకాముచే నప్పాపాత్ముఁ బట్టించి నశింపఁ జేయకున్న మీకుం గానరాక నశింతు"ననిన నిష్కాముఁ డిట్లను. దేవీ! శాంతస్వరూపిణివగు నీ కుపశమించుట కర్తవ్యము. ఎల్లఱు నిట్లగుటయొకదా? యీశాంతి సమరమునకు రూపము. సర్వవిజ్ఞాన విద్యాస్వరూపిణి వగు నీ యనంత బ్రహ్మశక్తియే యిందఱ నిట్లుసేసి మాకుఁ దేజంబుఁ గూర్చుచుండె. నీకుం దెలియనిదే? అహింసా సంతోషాదుల

హింసించిన పాపమున నతండు ప్రపంచమున నామమాత్రా వశిష్టుండు గాక పోఁడు. అని చెప్పుచుండ విద్యాదేవి వేద కాముఁజూచి "నాథా! నీ వతిరయంబునఁజని యజ్ఞుఁ డెక్కడేని శబర పాంచాలాది దేశంబులను, మన వాదంబులోనికి రాక తక్కిన చార్వాక శాక్త్యాదుల కడను దాగియుండు. అతనిం బట్టి బంధించి వాని హింసాప్రచారంబు లోకంబునకుం జాటు" మనిన నతండప్పుడ సత్యకాము సారథిం జేసికొని యతని వెదకుచుం జనియె.

## నిష్కామాదులు యజ్ఞునిఁ బట్టఁ బోవుట.

అంత వాసుదేవుఁడు నిష్కాముఁజూచి "బావా! యజ్ఞుని జయింతునని పుత్రశోకావేశంబున వేదకాముఁడొక్కరుండ చనియె. యజ్ఞుఁడితని బలసామర్థ్యములు లెక్కించువాఁడు గాఁడు యజ్ఞునకు బ్రాహ్మణములవలన గలిగిన స్వర్గభోగానందాది కర్మజన్య సుఖములే పరమార్థమను ప్రమాణము లనేకములు గలవు. మఱియు "యావంత్యశ్చేహ విద్యంతే శ్రుతయః స్మృతిభిః సహా, విదధ త్యురుయత్నేన కర్మాత్తో భూరి సాధనమ్" ఈలోకమందు స్మృతులతో గూడ శ్రుతులెన్ని కలవో యవియన్నియు మహా ప్రయత్నముతో కర్మనే విధించుచున్నవి. కావున కర్మయే గొప్ప సాధనము. అను నిట్టి ప్రమాణములజూపు నతని నెదిరిన మన వేదకాము దక్కించుకొనుట యనుమానంబగు. అందును నతఁడు నన్నును లెక్కసేయక నాతో నెదిరింప నుత్సహించు

చుండు. (క్రూరదర్శనా సద్వ్యాపార సంరంభుఁడు యజ్ఞుఁడు. వానిచే బాధితుండు గాకుండ వేదకాము రక్షింపవలయు, పదుండని యాప్తకామ దముల శిబిరంబున నిలిపి నిష్కామ సత్కాములఁ గొని రయంబున వేదకామునిఁ గలయంజనియె.

యజ్ఞుండును తన (క్రతుమయ హింసాస్వరూపమునంత టిని వదలి, యిది స్వర్గకామము గాదు, యిందునను పరమ పద యానంబుగలుగు నని నిరూపింపఁదగు రూపంబున తపో మూర్తిఁదాల్చి వేదపురుషు నా(శ్రమంబున నుండ, నాతనిం గాంచి వేదకాముఁడు "(బహ్మఘ్నా! నిముసంబున నెంత సాత్వికుండవైతివి. (క్రూరాత్మా! యింక నీ భేషజంబుల జాలించి (బహ్మవాదంబునకురమ్మ"ను చుండు నాలోన నతఁడు కృష్ణులఁజూచి మహామంత్ర బలసంపన్నులగు వారిని దేని చేతను గెలువరాదని యెంచి యిష్టాపూర్తములకన్న నున్నత కర్మలున్ను, స్వర్గమునకంటె యానందస్థానమున్ను లేదను నతఁడు తన భావమును మఱుఁగు పరచి" యిందు నాకిచ్చిన తృణంబేని (బహ్మలోకముఁ జేర్పఁజాలు" నను మాయా మయంబగు (బహ్మశిరమును (ప్రయోగించి దీన నశాంతేయ మగు ననిన దామోదరుండు సత్కామా! సత్కామా! (భ్రాంతుండవై యావాక్యములె సత్యమని భావించితివేని మీ రేవ్వరును మడియుదురు. కావున నీవాక్యములనే మఱల నను సంధించి యతని ననుము. దాన నయ్యర్థము వమ్మై మీరు నిలువనోపుదు" రనిన నతండు జ్ఞానాధేవతు కైవల్యం',

సర్వకర్మ నిరాసకంబగు జ్ఞానమొక్కటియె ముక్తిమార్గము. ఆత్మయొక్కటియె యానందస్థానము" అని వాదించె.

ఇట్లు జగద్భయంకరంబుగా నయ్యిరువురుఁ బోరు నవసరంబున నిదిధ్యాసుఁడు వేదపురుషుం గూడుకొనివచ్చి వారి నడుమ నిల్చి యిట్లనియె. "ఇంతకుమున్ను పలువురు బ్రహ్మవాదులు పోయిరిగాని యిట్లు సర్వగుణ ప్రళయంబగునట్లు పోరినవారు లేరు, దీని నుపసంహరింపు" డనిన సత్కాముఁడు "మహాత్మా! ఆత్మరక్షణంబుఁగోరి యట్లుసేసితి నావాదంబుపసంహరింతు నతని శాంతింపం జేయుఁ"డని యట్లసేసె. యజ్ఞుఁ డట్లుసేయ సమర్థుండుగాక, దీన శాంతేయులుగాకున్న వారి యనంతర గుణసంతానంబేని నశించు ననియె. (వారిబిడ్డలైనను నన్నును సరింతు రనియె.)

## వాసుదేవుఁడు యజ్ఞుని శపించుట

అప్పు డాదుష్టుని దుష్టత్వమును తన దివ్యచిత్తంబున నెఱింగి దామోదరుండు "నీచా! గోఘాతివగుటగాక భ్రూణఘాతివిగూడ నగుచుంటివి. కాని యింతపనిసేయ నీ నీచత్వంబునకు సాధ్యపడదు. ఇప్పటికి తర్కదృష్టి భార్య ధారణావతి వస్తువిచారుని గాంచనున్నది. వాని బోకార్పనెంచి నీ పాపహృదయంబుం బ్రద్దలువాపి చూపితి వంతియకాని దాని నెరవేర్పఁ జాలవు. నాయనుగ్రహంబున వస్తువిచారుఁడు సురక్షితుండై యీయెల్లఱుఁ దీఱినమీఁద కాయపురంబున కధినాథుండై, నీ మాయయగు ప్రబోధునిచే నెల్లవిద్యల నభ్య

సించి సందడులెల్ల దీఱిన యానంద సామ్రాజ్యంబు బహు కాలం బనుభవింపఁ గలఁడు. ఇది యంతయు దీనాన నుండవై దిక్కులేక తిరుగుచు నీవ చూడఁగలవు. మఱియు నీ వింతటి క్రూరహింసకుఁ బాల్పడిన కారణంబున ప్రపంచమున నింక మీఁద నిన్నాదరించువారు లేక నాహార శూన్యుండవై యాజ్య గంధంబులేక దుర్గంధ భూయిష్ఠంబైన దేహంబుతోఁ గలిం గూడి తిరిగెదవుగాక" యనియె.

అప్పుడు వేదపురుషుఁడు "బ్రాహ్మణుండవయ్యును క్రూరంబని యెంచక కేవల హింసాస్వరూపమాత్రుండవైన కారణంబున నీకట్ల యయ్యెడు" మని పల్కి నిధిధ్యాసునితోఁ గూడి సనియె. ఇట్లు యజ్ఞుని నామమాత్రప్రకాశునిఁగా నొనర్చి కృష్ణుఁడు శాంతేయులఁ గూడి విద్యకడ కేతెంచి యచ్చటి విశేషంబంతయు నెఱింగించి యామెను సంతోష పరిచె. ఇట్లెల్లఱ గోవిందుఁడు తగిన శాంతి వాక్యములఁ బ్రబోధించుచు నానంద చిత్తులం జేయుచుండె.

శ్లో॥ మందార మూలే మణిపీఠ సంస్థం
సుధాప్లుతం దివ్య విరాట్స్వరూపమ్,
సబిందు నాదాంత కళాంత తుర్య
మూర్తిం భజేహం రఘువంశ రత్నమ్.

ఆత్మభారతమునం దప్రబోధపర్వము
సమాప్తము
ఓం తత్సత్



శ్రీరాధాకృష్ణాయనమః

# ఆత్మభారతము
## ప్రబోధపర్వము

-o:-

సీ. దార గృహక్షేత్ర ధనములపై నాస
యను గట్టిత్రాట బంధనము నొంది
లలితంపు భోగలాలస యను తృణముపై
నత్యంత మొదలని యాసఁగొలిపి
వివిధ దుఃఖానేక విభ్రాంతు లనియెడు
బహుళభారంబున బడలికఁ గని
భయదమైతోఁచు నామయ వర్గమను దుష్ట
దంశకావళిచేత దష్టమగుచు

గీ. మహితసంసార మను నీటి మడుఁగునందు
పాపమను గొప్ప యుబ్బలిఁబడి తపించు
జీవుఁడను దుక్కిటెద్దును లేవనెత్తఁ
దగినసాధన మా హరి ధ్యాన్న మొకటె.

# జీవనిర్వేదము.

స్థూలపురమున జీవుఁడు బుద్ధితోఁ గూడి కొమరు లెల్లఱు సమయుట విని దుఃఖార్తుఁడై యక్కటా! నావంటి పాపి ప్రపంచమునఁ గలఁడె. కన్నవారెల్లఁ బోవ చుట్టపక్కం బులు శూన్యంబులుఁగా నొక్కండనై యింకను బ్రతికియుంటి నేమిసేతు, నేదిదిక్కు. అనంత భోగభాగ్య సంపన్నుఁడనై యుంటినని సంతసించు నేను నేఁటి కేదియు లేక నా యనునది యంతయుఁబోవ ననదనై బ్రతుకవలసె. కట్టా! యీశ్వరా! నాయందింత కఠినుఁడ వైతివేల.

నూర్గురు బిడ్డల నొక్కనినేని విడిచి పోరాదె. నీవ యింత పక్షపాతివైన నింక లోకంబున న్యాయంబెట్లు నిలుచు. అయ్యో! కుమారులారా! యింక మీ యాలింగనసుఖం బేనాఁటికి గల్గు. మీ మృదువాక్య శ్రవణం బీజన్మమున లేదు గదా? మీయందలి లోభమున నీధర శాశ్వతముగ మీ రొక్కరే యేలవలెనను నాశచేతనే కదా నాఁడు వాసు దేవుఁడు చెప్పిన మాటలు విననైతి. సద్వివేకాదుల పలుకులు పాటింపనైతి. నిదిధ్యాసాదుల నీతులు పెడచెవులఁ బెట్టితి. దుర్బుద్ధినై సదసద్వివేకుని మఱచి యతనిపాలు హరింప నెంచితి. ఇట్టి పాపంబె చుట్టుముట్టి యిట్టులొనర్చె. అక్కటా! నాయీ దుఃఖమున కేది కడ. ఎట్లు జీవింతు నని పనవి పనవి యేడ్చు జీవుని కడకు వైరాగ్య సద్విచారు లేతెంచి యతని

నాలింగన మొనర్చి లేవనెత్తి యోదార్చి రంత వైరాగ్యం డిట్లనియె.

జీవా ! నీవెన్నఁడును పాపివిగావు పుణ్యుఁడవును గావు. నిరంజనుఁడవు. ఇట్లయ్యును త్రిగుణాత్మిక ప్రకృతియందు బుట్టిన యంతఃకరణము జడమయ్యును నీశ్వర విశిష్టంబై "ఆజడాత్మ సదాభాంతి యత్సాన్నిధ్యాజ్జడా అపి అజ్ఞానా న్మానసో పాధేః కర్తృత్వా దీని చాత్మని, కల్ప్యంతేంబు గతే చంద్రే చలనాది ర్యథాంభసమ్" జడమైనను పరమాత్మ సాన్నిధ్యమున చైతన్యరూపముగాఁ బ్రకాశించును. ఎట్లు జలములు కదలు చుండఁగా నందలి ప్రతిబింబిత చంద్రుఁడు కదలుచుండె నందురో యట్లే యజ్ఞానముచే మనోవికల్పిత కర్మముల నెల్ల నాత్మయం దారోపించి కర్తనుగాఁ జూతురు. ఇట్టి జడాంతఃకరణ మీశ్వర సన్నిధి నయస్కాంత సాన్నిధ్యమున సూదియుంబోలె సంచలనంబు నొందుచుండు. అందుఁ గల్గిన వృత్తియె మనస్సనంబడు. (నిస్తబ్ధ సరోవరమునం దేదేని వస్తువు పడిన బయలుదేరు నలవంటిది వృత్తి) అదియ యింద్రియ గోళములఁ జేరి బాహ్యవిషయములఁ బ్రసరించి యనుకూల ప్రతికూల కర్మములఁ బుట్టించి దానివలన నేర్పడిన పుణ్యపాపములచే స్వర్గమనియు నరకమనియు నూర్ధ్వాధో లోకంబులకు యాతాయాతంబులు కల్పించుచుండు. ఈ కర్మముల కనుకూలముగా దార పుత్ర పశు ధనాదుల వికల్పించి వాని రాకపోకలచే సుఖదుఃఖముల నొందించు చుండు. ఈ యంతఃకరణమే యేకమగు యీశ్వర రూపంబు

నుండి బింబ ప్రతిబింబ రూపమున వికల్పించుచు బహుళ ప్రపంచమును గల్పించి, యామీద యీ సమస్తమునకుఁ గర్తగాని యీశ్వరుండవ యగు నిన్ను విభ్రాంతి నొందించి కర్తనుగాఁ దలంచునట్లు చేసి శోకింపం జేయుచున్నది. సూక్ష్మ విచారణంబునఁ గన్న నీ సంసార మంతయు నంతఃకరణ విశిష్ట మానస కార్యంబే యయి దాని సంకల్పమునఁ దోఁచుచు దాని వికల్పమునఁ బోవుచు నుండు. ఇదియె మాయా విలసనము.

అగ్నిని పొగ గ్రమ్మినట్లు, సూర్యుని మేఘ మావరించినట్లు నిత్యనిర్వికారు స్వరూపుండవైన నిన్నా మాయ గ్రమ్మి జనన మరణ బాల్య యౌవన వార్ధక్యావస్థలం బొందుచున్నట్లు సూపుచు, సవికారుఁడ ననిత్యుఁడ ననిపింపఁ జేయు చున్నది. తత్త్వవిచారమున నీ మాయను బోఁద్రోఁచిన సచ్చిదానంద స్వరూపుండగు పరమాత్మవు నీవ యయ్యెదవు. ఇట్టి నీవు నిన్ను మఱచి, యెండమావుల జలంబునుఁబోలె కేవల మిథ్యా రూపంబై యజ్ఞానమున మాత్రము తోఁచు సంసార మింతయు సత్యమని నమ్మి, యిది నా యిల్లు, యిది నా ధన మాతఁడు మిత్రుఁ డీతఁడు శత్రుఁడు వాఁడు బిడ్డఁడు వీఁడు మనుమఁడని భావించు చుంటిని. ఇవి యన్నియు తత్త్వదృష్టిం జూచిన నైంద్రజాలికుని బుట్టనుండి తీయు బొమ్మలుంబోలె తాత్కాలిక సత్యంబులు ననంతరా సత్యంబులును నగు. సదసద్విచారంబున కేవల మిథ్యాత్వంబు నొందు. "యత్రహిద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి" అవిద్యాదశయందు భేద

మున్నట్లు దోఁచిన నప్పు డొకఁడు మఱియొకనిఁ జూచును. ఇట్టి యీ సంసారమున మమత్వంబుఁ జేర్చి నీవు కోరిన వాని రాకకుఁ గడఁగానక దుఃఖించెదవు. "అస్పర్శోపి యథాస్పర్శం అచలశ్చల నాదిచ అవివేకాత్తదా దుఃఖం మానసం చాత్మ నీక్షతే" నిరవయవ పరమాత్మకు క్రియాదులు స్థూల దేహ అభేదాధ్యాసముచేత గలుగును. అట్లే మనస్సంబంధమగు దుఃఖము సూక్ష్మదేహ అభేదాధ్యాసముచేతఁ గలుగును.

ఇందు దేహ మొక కాలాయస నిగళంబుగాఁ దగు లొక్కన దార పుత్రాదు లందలి గొలుసులై బంధింప దాని నుండి విడివడనేరక

ఆ. తనకుఁ దాన బంధ మొనరించు కొనియెడు
పొత్తి నూలు కాయ పురువు భంగి
నగుణమయ్యు సగుణతావాప్తిఁ బొందు న
క్షరము ప్రకృతి గుణము సంక్రమించి. — భారతము.

ఇట్టి యీ గొలుసునుండి తప్పించుకొన సర్వవిధములఁ బ్రయత్నించు చుంటివి గాని క్షేత్రజ్ఞా! యివిగొక మఱికొన్ని నూతన నిగళంబులు దగులుకొనుచున్నవి. నిలువు టద్దముల నిండిన మేడగదియందొక శునకముచేరి యందొక దర్పణ మునఁ దనబింబమును జూచి మఱియొక కుక్క తన్నుఁ బట్ట వచ్చుచున్నదని భ్రాంతంబై యఱచుచు మరియొక దిక్కునకుఁ బోవ, నందును నట్లకా నిట్లు బింబ ప్రతిబింబంబులతో నేర్ప డిన కోట్లకొలఁది తన రూపములనెల్ల పరరూపంబులుఁగా

నెంచుచు భయభ్రాంతంబై వచ్చిన త్రోవ మఱచి యా మేడ నుండి విడివడి పోనేరక యఱచి యఱచి వాపోయి, వాపోయి కడకెన్నాళ్లకో యేపుణ్య శేషంబునో మొదట తావచ్చిన ద్వారముంగాంచి బయలువడి తా నొక్కటి మాత్రము సత్యమై మిగిలిన దెల్ల నసత్యమై తోప, యేదుఃఖలేశంబును లేక స్వేచ్ఛావిహారియై యానంద మయుండై యొప్పు, అట్లే నీవును జన్మజన్మాంతర సత్కర్మ సంస్కారవిశేషంబున తత్త్వమస్యాది మహావాక్య విచారముం జేసితివేని నీ నిజరూపంబు నెఱింగి ముక్తుఁడ వయ్యెదవు.

"సుషుప్త్యాఖ్యం తమోఽజ్ఞానం బీజం స్వప్నప్రబోధయోః, స్వాత్మబోధ ప్రదగ్ధంస్యా ద్బీజం దగ్ధం యథాభవమ్" స్వప్నజాగరణలకు కారణమై సుషుప్తమని, తమస్సని యజ్ఞానమని వ్యవహరింపఁబడుచున్న మూలావిద్య, స్వస్వరూపజ్ఞానముచేతఁ దహింపఁ బడినదై, దహింపఁబడిన విత్తనమువలెమరల సంసారోత్పాదనము లేనిది యగును.

"అప్రబోధాద్యదా సిద్ధిః ద్వైతా దన్యస్యవస్తునః, బోధాదేవ మసిద్ధత్వం బుద్ధ్యాదేః ప్రత్యగాత్మనః" జ్ఞానము కలుగక పూర్వ మంతఃకరణాదుల కంటె భిన్నమై యున్న యాత్మస్వరూప మెట్లు ప్రకాశించదో, యట్లె జ్ఞానము కలిగిన పిదప నాత్మస్వరూపము కంటె భిన్నమైన యతఃకరణాది వస్తువు ప్రకాశింపదు.

కావున క్షేత్రజ్ఞా ! నీవు దీనుండవు, హీనుండవుఁగావు. నీవ దేవుండవు. నీవ యీశ్వరుండవు "ఉపాధ్యపాస్తే స్వయ

మేవ కేవలం" ఉపాధి నశించిన నీవ కేవలుఁడవు. జీవా! బ్రహ్మము నీవు. బ్రహ్మాండము నీవు. బ్రహ్మాండాంతర్గత జీవ జాలంబెల్ల నీవు. ఈ సర్వమునకుఁ గర్తవు, భర్తవు, హర్తవు నీవ. నీవుగాని తృణంబును లేదు. నీవు లేనిది పరమాణువును లేదు. దేని కౌఁగిలింతను గోరుచుంటివో యా మహామోహ మే నిన్నింత దుఃఖితుఁ జేసినది:

సీ॥ ఒకయింటనుండి వేఱొక యింటికరిగిన
 విధమును వస్త్రంబువిడిచి యొండు
వస్త్రంబుగట్టిన వడువునునై యుండు
 నొడలు దొఱంగి యొండొక్క యొడలు
గైకొంట నృప విను కడవకు సారెపై
 నమరమృత్తిక యిడునపుడు విరియు
టయు వెరవారఁ బట్టఁగరాక చెడుటయు
 వాని యెత్తెడునెడ వ్రయ్యుటయును
గీ॥ నెత్తియొకచోట డించిన నెడలుటయును
నెండియవియుటయును నావమిడినఁ బగిలి
పోవుటయు వాడు జనులఁచే బొలియుటయును
గలుగుగతి మేనికెల్లను గలుఁగు జేటు;

— భారతము

కావున క్షేత్రపాలా! నీ భ్రాంతిని నీవెఱిఁగికొనుము. చూడు తండ్రికి బిడ్డఁడవైన నీవ బిడ్డకు తండ్రివైతివి. ఒక్కఁడ వగు నీవే తండ్రి, బిడ్డ, యన్న, తమ్ముఁడు, మామ, బావ, మొదలగు నామంబులఁ బరిణమించితివి. ఇవియన్నియు స్థూలదేహ

మున కేర్పడిన నామంబులే కాని యాత్మవగు నీకెన్నండును లేవు. "జాతస్యహి మనుష్యస్య ధృవం మరణమితి విజానీ యాత్, తస్మాజ్జాతే నప్రహృష్యే న్మృతేచ నవిషీదేత్" మనుష్యునకు పుట్టుకతోడనే మరణము నిశ్చయమైయున్నది. ఆ కారణమున పుట్టుకకు సంతోషమును మరణమునకు దుఃఖ మును పొందరాదు.

జీవా! కించిత్సింహావలోకనంబు సేయుము. ఇప్పటి కెందరికి బిడ్డడవైతివి. యెందరికితండ్రివైతివి. వారందఱేమైరి. నిజముగా నేడువ వలెనన్న నెందఱి కేడ్తువు., యెందఱికి మాను కొందువు. వెఱ్ఱివాఁడా! నీవు తాతవుగావు, తండ్రివిగావు, బిడ్డడవునుగావు. లక్షణావృత్తిచే విచారింప శాశ్వతానంద స్వరూపుఁడవు. ఏకాత్మవు. నీవే భగవంతుండవై యుండి భగవంతుఁడొకఁ డెక్కడనోయుండి నన్ను బాధించుచున్నాఁ డనుకొనుట, దర్పణ వికారము నెఱుంగక తన మొగము సొట్ట పోయెనని యేడ్చునట్టిదగు. ఏ సుఖదుఃఖములు వేనిని గాని యిచ్చుటకు పరమాత్ముఁడు కర్తగాఁడు. అవి నీకులేవు. అవి యెల్ల మనోవికల్పములు. అవిద్యాహేతువులు. మనంబునకు బుచ్చిన సుఖమును లేదు, దుఃఖమును లేదు. "సంసారో అహ మస్మీతి విపరీతం ప్రతిపద్యసే, అకర్తారం సతంకర్తే తిఅభోక్తారం సతం భోక్తేతి. విద్యమానాంచ అవిద్యమానమితి" (ఇయమ విద్య)సుషుప్తి సమాధి మూర్ఛలు మన మెఱుఁగుచున్నవియు కాదా? ఆ దశలయందు ప్రపంచమేది, ప్రవృత్తులేవి. కావున సృష్టిమొదలు లయముపరకును జరుగు నీ జీవజగద్వ్యాపార

మంతయు మానసిక మాత్రంబెయని తెలిసికొనుటయె. జీవ న్ముక్తి.

జీవా! నీవును నెఱుఁగఁ దగుదాని నెఱింగితివి. శమ దమ నిదిధ్యాసాదులవలన వినవలసినదాని వింటివి. నేనును సద్విచారుఁడును కంటిని ఱెప్పవలె నిన్ననుసరించి యుంటిమి. ఇంకను విజ్ఞానములేక దుఃఖించు చుంటివన నాశ్చర్యంబుగాదె? తమ తమ దోషంబులచే ననుచితులగు వారెల్ల నశించిరి. ఉచితస్వరూపులగు శాంతేయులు మాత్రము మిగిలి యుండిరి. ఇంకను వారిఁగీడాడక యుచితజ్ఞుండవై వారిఁగూడి యానంద సామ్రాజ్య మనుభవింపుము. ఇంక నీస్థూల పురంబు మీఁది మమత్వమును వీడి వస్తువిచారుని (పరీక్షితుని) బుట్టించి విదేహకైవల్యమున నిష్కామయోగ పట్టాభిషేకం బొనర్చితి వేని నీభారమంతయుఁ దీరి విజ్ఞాన చక్షుండవై కేవల సచ్చిదా నంద స్వరూపుండ నేననియు, సుఖదుఃఖము లెన్నఁడును నాకు లేవనియు నెఱిఁగి యానందింపఁ గలుగుదునని ప్రబోధింప నంకిలిదేరని హృదయముతో నున్న యవ్విభునిఁ జూచి సద్వి చారుఁడు,

సద్విచారుఁడు జీవునికి
సంసార గహనము తెఱఁగెఱిఁగించుట

అన్నా! సంసార మతిగహనము. అనాది స్వరూప యగు దానియం దేనాఁడో తగుల్కొని జీవుఁడు క్రూరమృగ ములగు జరారోగంబుల కులికిపడి పరువులు వాఱుచు,

నెంచును గడఁగానక యందు భార్య యను తృణ సంవృతా నూపంబునఁబడి జీవితాశ యను తీవెంజుట్టుకొని యా బావి నడుమం దలక్రిందైై వ్రేలుచు, క్రిందకాలమను కాలసర్పమును జూచి పడుటకు భయఁపడుచు, మీఁద నాఱు తలల సామజము లను నాఱు ఋతువుల వత్సరంబులు వచ్చుచుఁ బోవుచుండఁ గాంచి బెగడొందుచుఁ, సితాసిత మూషికములను దివారాత్ర ములు కాలికిఁ దగిలిన తీవను త్రెంచు చుండ భీతిల్లుచు, కామము లను మధుకరంబులుమీఁదఁ బెట్టిన తెట్టియ లోని కామ మను మధురసము బిందుబిందువుఁగా నోటియందొలు కుచుండ నాకుచు, నదియ పెనుతృప్తిగా జీవితాశం బడి బ్రతుకవలె నని కోరుచు, తీవ్రదెవ్వన కూపంబునంబడి కాల సర్పంబునకుఁ జిక్కి యమయాతనలం బడి మరియొక్క కూపం బునం బడుచు, ప్రవాహమధ్యమునఁ బడిపోవు తృణమొక్కొక్క సుడింబడి తిరిగి తిరిగి మరియొక్క సుడికిఁ బోవుచు స్వయం శక్తి లేమింజేసి ప్రవాహవేగం బెట్టీడ్చిన నట్లుఁగాఁ బోవుచు నెన్నటికిని దరిజేరనట్లు "శుభాశుభ వ్యామిశ్ర కర్మవాయు సమీరితః చండోత్పింజలక శ్వసనవేగాభి హతాంభోధి మధ్య వర్తి శుష్కలాజవత్" శుభాశుభ మిశ్రకర్మలను గాలిచేత కొట్టఁబడి సముద్రమధ్యమున నస్వతంత్రమై తిరుగు వెండిన పేలగింజవలె, జీవుఁ డీషణత్రయముల జిక్కి వానినుండి విడి వడ నేరక చోరకృషి వణిక్కర్మాదులఁ బ్రవేశించి, నిద్రా సుఖముల మఱచి, తన ప్రాణముల మీఁది యాసనుగూడ విడిచి, యెంతచేసి మహాపాపంబులనేని యొనర్చుచుండు.

ఇట్లు జీవుఁడు ధనధాన్య పుత్రమిత్రపరివారంబుల నెంత యభివృద్ధి నొందించియు తనివి నదక, వీని వృద్ధియగు కొలందియు నాశయు వృద్ధినొంద "అంగం గళితం పలితం ముండం దశనవిహీనం జాతంతుండం, వృద్ధోయాతి గృహీత్వా దండం తదపినముంచ త్యాశాపిండం" తల నెరసి దంతములూడి తల యేరుబారి కఫముగప్పి కాయము వంగినను తృష్ణలొంగక వెంటనంటి వేధించుచుండ దాని నరికట్టనేరక యేడ్చుచుండు. ఇంతలో కాలంబు చేరువయైన నదియయ్యో నిదికాకపోయె నేబోయిన నదియెట్లగు నేమిసేతునని యేడ్చుచు నేడ్చుచు నుండ కాలుఁడు కనరాక డాసి పాశంబులంజుట్టికొని పోవు నప్పుడు, వీరు లేకున్న నెట్లుజీవింతునన్న బిడ్డలను, నాప్రాణము లన్న ధనములను దిగవిడిచి యొక్కఁడ కదలిపోవు.

మఱియు శరీరంబు రథము, దాని కింద్రియములు గుఱ్ఱములు, మనస్సు పగ్గములు, బుద్ధి సారథి, జీవుఁడు రథికుడై యొప్పు. బుద్ధి యను సారథి విజ్ఞుండు గాక పగ్గములు సడల విడిచిన గుఱ్ఱము లుగ్రుడ్డివోట విషయములను విషమ ప్రదేశముల నధోముఖంబుఁగా లాగుచుండుటంజేసి నయ్యో విషమ స్థలముల సంచారమున జీవుఁడు కుతిలపడుచు, సవ్యమార్గమున నడిపింపనేరని దుష్టసారథిచేత గుఱ్ఱముల కాళ్లు విఱిగి రథమున చక్రములూడి కూబరము బగిలి సంచారయోగ్యంబు గాకున్న నయ్యయ్యో! యదివోయె నిదివోయె నేమిసేతునని యేడ్చుచుండు. అట్లుగాక వెరవరియై సారథిని సాత్త్విక గుణం

బుచే వ్యవసాయాత్మిక వృత్తిసంపన్నుం జేసి మనస్సను పగ్గముల శీలమను నేర్పున గట్టిగా లాగిపట్టి మెలఁకువతో నశ్వములు నడుపుచు రథవేగం బాఁగఁ గలిగినవాఁడు జనన మరణ భయంబు వీడి పరమసుఖము నొంది గమ్యముం జేరఁ గలుగు. ఇంతవట్టు నెఱిఁగి మనుత్వమున గలుగు దుఃఖంబు వీడు మని బోధించె. అప్పటికిని దుఃఖంబు కడఁగానక జీవుండు తపించు చుండ, వేదపురుషుండరుదెంచిన వైరాగ్యవిచారులు సంభ్రమంబున నెదురు వచ్చి నమస్కరించి తోడి తెచ్చి యుచితాసనంబున నునిచి యాతని రాక జీవుని కెఱింగించిన నతండత నికి సమస్కరించి.

"తండ్రీ! మానవజన్మము దుఃఖముల పుట్టగదా? ఈ జన్మంబేల ధర్గంబు సేయనా? తేజోధనంబులు బోయి తనయులు బోయి చుట్టము లెల్లఱును బోవ నెవ్వనినేని దుఃఖాగ్ని దహింప కుండునే? మహాత్మా! ఇంత నిర్భాగ్య దశ నొందినను చావు రానేర దేమిసేతు" నని యూఱకుండ నతనితో వేదపురుషుండిట్లను.

## వేదపురుషుఁడు జీవునకు దుఃఖోప శమనంబు సేయుట

వత్సా! ధర్మంబును నీతియు నెఱిగిన నీవిట్లుపలఁ జెల్లునా? లోకమున దేనికేనియు శాశ్వతమను నది లేదు "జాతస్య మరణం ధృవ" మనిన మాటవినలేదే. లోకమున నేవస్తువున కేని నిలకడ లేదు. లోక మెప్పుడును చెదరకుండ దీని వింత యేమన వ్యక్తి పూర్వకముగా నొక్కటియు లేదు.

సమిష్టి పూర్వకముగా నెక్కటియు లేకపోదు. ప్రకృతి యెప్పుడును కలదిగాదు, కలుగకపోదు. ఇదియ యీశ్వర విలసనము. కుమారా! శాంతేయ బౌద్ధేయులకు నీ యెఱుకలేని వైరం బేర్పడెనే? ఈ మహా సంక్షోభంబున కెల్ల కారణము నీకొమరుండె. ఇదియెల్ల నిట్లగుట తత్వదృష్టితో విచారించిన మేల కాని కీడుగాదు. వీఱందఱునీకు తీరనివనటం బుట్టింపఁ బుట్టిన రోగంబులుగాని పుత్రులుగారు. వీరిఁ బోకార్చుటయే దుఃఖ నివృత్తియగు ఎంతటి విజ్ఞులకేని వీరు గల్గునంతకు శ్రేయము ప్రాప్తింపదు. కావున దీని నెఱిఁగి యజాతశత్రుండవై మనుము. నిష్కాముఁడు నీ యెడ నత్యంత భక్తి యుక్తుండు దాని నీ వెఱిఁగి యతని యందు బద్ధానురాగుండవై మెలంగుము. ఇట్టి దుఃఖాగ్నిని విజ్ఞాన బలంబున నార్చి సుఖింపు" మని బోధించి చనియె.

ఇట్లుమ్మృవ్వర చేఁ జెప్పంబడియుఁ దేఱని మనంబుతో నున్న జీవుని కడకు యజ్ఞ దంభ ప్రబోధు లరుదెంచి యా రాత్రి యప్రబోధంబునఁ జేసిన కార్యంబంతయు నివేదించి శాంతేయుల వలని భీతిం జేసి యొందేనిఁ జనిరి.

అవ్వల కామపంచకంబును కృష్ణుండును జీవబుద్ధుఁ కడకేతెంచి నమస్కరించి సముచిత రూపంబున జీవునిచె సన్మానింపబడి బుద్ధియాజ్ఞంబొంది శాంతిదేవికడకుం జని నవ స్కరించిన నాయమ కొమరుల మేనులు నిమురుచు నతిదా రుణ వాక్యాస్త్రములవలనఁ గిలిగిన వ్రణములఁగాంచి దుఃఖిఁ

చుచుండు నంతలో పుత్రదుఃఖాతురయగు విద్యాదేవియు నేతెంచి యత్తకు నమస్కరించిన నయ్యమం దగ్గరదీసి శాంతి యోదార్చె, ఇట్లుండఁగను గూడి వాదహతులైన తమ తమ వారిం గూర్చి శోకించు చుండిరి. ఆ మీఁద పురోహితుఁ డగు శమమును సద్విచారవైరాగ్యులను గూడి నిష్కాముఁడు వాదనిహతుల కెల్ల నౌర్ధ్వదైహిక క్రియల నెల్ల నాచరించి యెల్లఱను గూడి స్థూల పురంబునకు విచ్చేసి యందు వారి వారి మందిరముల సుఖం బుండిరి.

శ్లో. యస్మా దన్య న్నా స్త్యపి నైవం పరమార్థః
దృశ్యా దన్యో నిర్విషయజ్ఞాన మయత్వాత్
జ్ఞాతృ జ్ఞానజ్ఞేయ విహీనోసి సదాజ్ఞ
స్తం సంసారధ్వాంత వినాశం హరిమీడే.

— హరిమీడేస్తవము.

ఆత్మభారతమునఁ బ్రబోధ పర్వము

సం పూ ర్ణ ము



శ్రీరాధాకృష్ణాయనమః

# ఆత్మభారతము

## ఆనందపర్వము

—— -o: ——

శ్లో॥ నాస్థా ధర్మే నవసునిచయే నైవకామోప భోగే
యద్యద్భవ్యం భవతు భగవన్పూర్వకర్మాను రూపమ్
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతాం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాం భోరుహ యుగగతా నిశ్చలాభక్తిరస్తు.

— ముకుందమాల

ఒకానొకనాఁడు వేదపురుషుండును, నిదిధ్యాసుండును యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులును తమతమ శిష్యప్రశిష్యులతో నిష్కామ సందర్శనంబునకు వచ్చిరి. నిష్కాముఁడు, శముఁడును, దముఁడును, కృష్ణుండును, వైరాగ్యుఁడును, సద్విచారుఁడును, జీవుండును, బుద్ధియు, శాంతియు, విద్యాదేవియు, వస్తుపిచార గర్భయగు

ధారణావతిఁగూడి సమతయు, వేదకామాది యనుజన్ములును, గూడియుండ నిత్యవైభవంబుగా నున్న సమయంబున, నిది ధ్యానుఁడు నిష్కాముఁజూచి యజాతశత్రూ! విగతకంట కంబై నిరామయంబుగా నున్న యీయాత్మానంద సామ్రా జ్యంబునకు ప్రభుండవై పట్టాభిషేకం బానర్చుకొమ్మన నుమ్మ లించుచు నిష్కాముఁ డిట్లను.

## నిష్కాముని మనస్తాపము

మహాత్మా! యహంకారంబులేనియాత్మ సామ్రాజ్య మనుభవించు టెట్లు. అదిలేని యనుభవం బెవరిది. అక్కటా! యతనివలన కష్టపరంపరలకు లోనైతి, నతం డెట్లు బోవునని చచ్చునంతకు వెదకుచుంటిని గాని యతఁడు లేనివాఁడు. నే నెట్లు బ్రతుకుదునని చింౘనైతి. నాకన్నను పెద్దవాఁడౌట పూజ్యుఁడని మన్నింపనైతి. నిష్కాముఁడనగు నాకానంద సామ్రాజ్య సంపాదనం బనునది మాత్రమేల. దీనినెల్ల వేద కామ సత్కాము లనుభవింతురుగాక. నేనొక్కరుండ నేకాం తంబున సుఖినై యుండెద" ననిన సత్కాముఁ డిట్లను.

అన్నా! యివి యేటి మాటలు "ప్రత్యగాత్మానవ బోధస్య అనాత్మస్వాభావ్యాత్ తదభి నిర్వర్త్య శ్చాయం బుద్ధ్యాది దేహాంతః తస్మి న్నాత్మత్వ మవిద్యా కృతమేవ" ప్రత్యగాత్మ నెఱుఁగ కుండుటయే యనాత్మరూపమై యున్నం దున బుద్ధిమొదలుకొని దేహమువరకు గల యీ సంఘాత మా యజ్ఞానముచేత సంపాదింపఁ బడినది. కాని యం దాత్మ

భావనమున్ను యజ్ఞానముచేతనే చేయఁబడినది. కావున సర్వా వస్థల యందును నాత్మ యొక్కటియే యనుసరించి యుం డును, దేహేంద్రియాదు లనుసరించి యుండవను జ్ఞానముగల వానికే యఖండార్థము బోధ యగును. కావున నాత్మ ధర్మ మార్గమున సత్పథకంటకులగు నరివర్గముం దునిమి సంపాదిం చిన యానందసుఖము ననుభవింప ననుట యేటి పాడి. ఇది తామసత్యాగము కాదా ? ఏ యానందప్రాప్తి కాటంక రూపులై యొప్పు నహంకారాదుల జంపితిమో తద్వధమున నగు నా యానందము కోరకయే లభించుచుండ దానిం గాదని యేకాంతమున సంకల్ప శూన్యంబుగా నుండ నెట్లు వలను పడు. అహంకారాదులు పోవఁ గల్గిన శూన్యత్వమును బాపి కొన నంతర్యాగం బొనర్పుము. అనిన నిష్కాముఁడు.

సోదరా ! " బుద్ధాద్వైత స తత్త్వస్య యథేష్టాచ రణం యది. శునాం తత్త్వదృశాం చైవ కోభేదోఽశుచి భక్షణే " తెలియఁ బడిన యద్వితీయ తత్వము గల వానికి యథేచ్ఛా చరణము గలిగియున్నచో కుక్కలకును తత్వవేత్త లకును నమేధ్య భక్షణ యం దేమి భేదము గలదు ? కావున నివియెల్ల సకామంబులగుఁగాని నిష్కామరూపం బే నాఁడును గా నోపవు. ఇట్లగుట సంసారారణ్యమునఁ జేర్చు మార్గము లుగా నున్న వీనినెల్ల విసర్జించి యేకాకినై సమాధినిష్ఠం దగిలి నిందాస్తుతుల సమానంబుగాఁ జేసి తగిన వేళల ప్రపంచోన్ము ఖుండ నగుచు నందలి విషయంబులు లీలామాత్రంబుఁగా ననుభవించు చుండెద " ననిన సత్కాముఁ డిట్లను,

అన్నా ! యిట్లనఁ దగునా ? నీ వట్టివాఁడ వైన మాకు నిలువ నాధారంబేది ? నిన్నుఁ దగు మార్గంబున నడిపింపమైతి మని యింద్రియాధిదేవతలు నిందింపరే ? నా యను మమత్వమునఁ బోషించినవారు బోవ నేమియుం దోఁచక విభ్రాంతుఁడై యడలు తండ్రి నేమి సేతువు ? అని చెప్పు మాటలకు నిరుత్తరుఁడై యున్న నిష్కాముఁ జూచి పురుషోత్తముం డిట్లను.

## శ్రీకృష్ణుఁడు నిష్కామున కానందస్థానము నెఱిఁగించుట

బావా ! యజాతశత్రూ ! నీకుఁ గలిగిన యీ విషాదంబె వాదారంభమున సత్కామునకును గలిగె. మిమ్మనేక విధముల యాఱడుల వాక్రేసి యడలించిన మహామోహాదుల నొక్కపెట్ట విడుచుటచేతం గలిగిన పూర్వసంస్కారము చలింపఁజేయు చుండుటంజేసి, మోహము బోయిన వాసనాత్మక మోహమును, నహంకారంబు బోయిన వాసనాత్మకాహంకారంబును నిన్నుత్తల పెట్టుచున్నవి. "నివృత్త సర్పః సర్పోత్థం యథా కంపనం ముంచతి, విధ్వస్తాఖిల మోహో ఽపి మోహకార్యం తదాత్మవిత్" రజ్జువును జూచి సర్పమని భ్రమించి భయపడిన పురుషుఁడు వణకుచుండగా నాప్తుఁడైన యొకఁడు 'ఇది సర్పము కాదు త్రాడు' అని బోధించుటచేత సర్పమను బుద్ధి నివర్తించినను వణకు వెంటనే వదల నట్లు ఆత్మజ్ఞానికిన్ని తత్వజ్ఞానముచే నిశ్శేషముగా యజ్ఞానము నశించినను నజ్ఞానకృతములైన దేహేంద్రియరాగద్వేషాదులు

వెంటనే వదలక యనుసంధించి యుండుము. బాహ్యాంతస్తత్త్వంబుఁ దెలిసిన నీవు చేయవలసిన దొక్కటియు లేదు. అంతరాత్ముండవై యెప్పుడు నన్ను గుర్తించి, సర్వంబునకు నేను కర్తనని భక్తి మార్గమున నాయందు భారముంచి, సత్కాముఁడు గలవాఁడవై, శమదమాదుల పోషించుచు, విద్యయందుఁ బ్రణయంబును బొందుచు, నుత్తరమీమాంసా పోషిణియగు శాంతిదేవి ప్రేమంబును బొందుచు, తర్కదృష్టికిఁ బుట్టిన వస్తువిచారుఁడు వృద్ధి నొందువరకు, జీవబుద్ధులు తనివినొంది యాత్మ తాదాత్మ్యంబుఁ జెందువరకు. నిష్కాముఁడవై వారు పోయిరను దుఃఖమును, వీరు కలరను సంతోషమును లేక, విధ్యుక్త కర్మముల నెల్ల నాచరించుచు మమకారాహంకార రహితుండవైనప్పుడు నీవనునది యేది. ఫలాపాదియగు కర్మమొక్కఁడ, ఇప్పుడేది లేకున్న జీవయాత్ర గడువదని యేడ్చుచుంటివో యా యహంకారమునకు నిలువ నీడయేది. అహంకార నాశమే ముక్తిగాని దాని కూడిక యెప్పుడును ముక్తిప్రోవ గాదు. సర్వజీవశ్రేయమున కాటంక మదియె. అట్టి యహంకారము బోవునరకు నిద్రాహారంబు లెఱుఁగక యెంతయుం దపించితివి. ఎట్టులో పురాకృత పుణ్యవిశేషంబున నింత శ్రమంపడి యిందఱుఁ జంపినమీద నతనిం బోకార్చఁ గంటివి. అట్టివానిఁ గూర్చి మూఢుండవై యతఁడు లేకున్న బ్రతుకు టెట్లనియు, నాకంటెఁ బెద్దవాఁడనియు మఱల మమత్వంబునఁ దలంచి సత్కామాదుల విడిచి యొక్కఁడవ నిలువఁ బ్రయత్నించుట నీ నిజధర్మంబు గాదు.

కావున జీవుని వృత్తి పర్యంతము నాతని నిర్వాణసుఖం బును గోరి నీ ప్రభుత్వ మీ దేహమునందు నడిచిన సర్వ మును సుకరంబగు. జీవనిర్వాణంబులోపల నెక్కుపరి వేద పురుషు ననుగ్రహంబున నయ్యహంకారాదుల నెల్ల ఛాయా మాత్రముగా దర్శించిన మీఁద సంపూర్ణముగా మమకారంబు విడువఁ గలవు. లెమ్ము పట్టాభిషిక్తుండవై బ్రహ్మచర్యవలన నింకను నుత్తమధర్మముల నెల్ల నెఱింగి యా ధర్మములె లోక మున కుపకరించునట్లు జేసి పూజ్యంబగు నానందసామ్రాజ్య మనుభవింపుము. ''

## నిష్కాముని యానందరాజ్య పట్టాభిషేకము.

ఇట్లు పురుషోత్తము నుపదేశంబున నంకిలిఁదేరి నిష్కా ముఁడియ్యకొనిన నెల్లవారును సంతసించి జీవబుద్ధుల సాన్నిధ్య మున తదాజ్ఞంబొంది, పరమాత్మ శమము పురోహితుఁడుగా, దమము సర్వకార్య నిర్వాహకుఁడుగా, యమ నియమాదులు సదస్యులుగా, తాను ద్రష్టగా, నిదిధ్యాసాదులు ఋత్విక్కు లుగా, వైరాగ్య సద్విచారులు పార్శ్వవర్తులై యొప్పుచుండ, శాంతిదేవి యానందపారవశ్యంబునఁ జూచుచుండ, వేదపురు షుఁడు సర్వంబునకు మూలకారణుఁడై కూడియుండ, బ్రహ్మ చర్యుఁడు క్షేమంబుఁ గోరుచుండ, లోభయజ్ఞుల వీడివచ్చి ప్రబోధుఁ డాచార్యకత్వంబు వహింప, వేగకామాదులు నలు వురు సహాయసంబంధిత్వము నడుప, శాంతిక పౌష్టికాద్యంత హోమ క్రియల నిర్వర్తింపం జేయించి యామీఁద జీవనిర్వాణ

మును గోరి కాయపురమున హృదయకమలకర్ణికా పీఠమున నిష్కాముఁ గూర్చుండఁ జేసి గంగా, యమునా, సరస్వతీ జలముల (యిడా పింగళా సుషుమ్నలను త్రికూటస్థానమున) నభిషిక్తుం జేసి శాశ్వతానంద సామ్రాజ్యపట్టభద్రుడ వగు మని దీవించి పట్టంబుఁ గట్టె,

## జీవుని ముక్తదశ

ఇట్లు జాతశత్రుండగు నిష్కాముని పరిపాలనంబున సర్వ బాహ్యాంతశ్శత్రు రహితంబై పరిపూర్ణానంద మయంబై యొప్పు నా కర్మక్షేత్రమున నిలిచిన జీవుఁడను ధృతరాష్ట్రుఁడు "సకల కర్మంబులు విసర్జించి విఘ్నంబులం జెందక నిరాహారుండై శాంతి నంగీకరించి పుత్రార్థ దారైషణంబులు వర్జించి విన్యస్థాసనుండై ప్రాణంబుల నియమించి మనస్సహిత ములైన యింద్రియముల నాఱింటిని విషయంబులఁ బ్రవర్తింప నీక నివర్తించి హరిభావనచే ధారణా యోగంబు వహించి రజస్సత్వ తమోరూపంబులగు మలముల మూఁటిని హరించి మనంబు నహంకారాస్పదంబైన స్థూలదేహంబు వలనం బాపి బుద్ధియందు నేకీకరణంబుసేసి యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబు వలన క్షేత్రజ్ఞుని యందుఁ బొందించి దృష్టంబైన యీశ్వరుని వలన క్షేత్రజ్ఞునింబాపి మహాకాశంబుతోడ ఘటాకాశంబుఁ గలుపు కైవడి నాధారభూతంబైన బ్రహ్మమందుఁ గలిపి లోపలిగుణక్షోభంబును వెలుపలి యింద్రియ విక్షేపం

బును లేక నిర్మూలిత మాయా గుణ వాసనుండగుచు "(భాగవతము) కేవలానందమయ బ్రహ్మమున విలీనుండయ్యె.

శ్లో॥ హేమర్త్యాః పరమం హితం శ్రుణతవో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మి బహుళం సమ్య క్ప్రవిశ్య స్థితాః
నానాఽజ్ఞాన మపాస్య చేతసి నమోనారాయణా యేత్యముం
మంత్రం సప్రణవం ప్రణామ సహితం ప్రావర్త యధ్వం ముహుః॥
— ముకుందమాల

ఇది శ్రీ మార్కండేయ గోత్ర, పద్మశాలీయ వంశ్య
బిట్రాన్వయ సంజాత, సంతత నారాయణ ధ్యాన
పరాయణ పిచ్చయ కనకమాంబా సుత,
హనుమత్ప్రసాద లబ్ధాత్మ విజ్ఞాన, సుజన
విధేయాంజనేయయాభిధేయ ప్రణీ
తంబైన శ్రీ మహాభారతాంత
ర్గతాధ్యాత్మికతత్వప్రబోధ
కాత్మభారతంబున
సర్వమును.
ఆత్మభారతమున ఆనందపర్వము సర్వమును
సంపూర్ణము.
ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



శ్రీ రా మ

# వివేకసముద్రమథనము

———:o:———

ఆ. జలధిఁ గడవసేయ శైలంబుఁ గవ్వంబు
సేయ భోగిఁ ద్రాడుసేయఁ దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడు దక్క
నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె,

ఆ. గొల్లవారి బ్రతుకు కొఱతన వచ్చునె
గొల్లరీతిఁ బాల కుప్పఁ ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు
సేటు లేని మందు సిరియు గనిరి.

సామాన్యముగా ప్రజలకు భాగవతము నందలి సముద్రమథన కథనుగూర్చి యెన్నియో సందేహములు పొడ కట్టుచుండును. ఈ కథ రూపకాలంకారముగా వేదమునం దున్నట్లు కొందరు ప్రాజ్ఞులు వ్రాయఁ జూచితిని. ఈ కథ పట్ల నే సందేహములు పాఠకులకుఁ గలుగునో వానినే శ్రీ పోతనకవి గ్రహించు సముద్రమును కడవగా సేయుటకును,

కొండను కవ్వముగా సేయుటకును, పామును తరిత్రాడుగా సేయుటకును, నంపు లక్ష్మిని యమృతమునుఁ బడయుటకును, పరమాత్మకుఁ దప్ప మఱియొకనికి సాధ్య మగునా ? యని ముందుగనే చెప్పి యంతతో నాఁగక నారాయణుఁడును దేవతలును పాలకుప్పను తరిచి గొల్లలై చావనిమందు సంపాదించుకొనిరనియుఁ జెప్పినాఁడు. ఆ మహాశయుఁడు సాభిప్రాయముగాఁ జెప్పినట్లు దోఁచి మన మిందుఁ జెప్పిన సముద్రమేది, కొండయేది, మథన మేమి యని విచారించిన నిందొక గొప్ప రహస్య మిమిడి యున్నట్లు గోచరించును, ఆ రహస్యమేమియని విచారింతము.

శుద్ధ సత్వగుణ ప్రధానుఁడగు నంతరాత్మ యను నింద్రుఁడు (దీనినే వేదము లిదంద్రుఁడని చెప్పినవి) ఒక్కనాఁడు సాత్వికాహంకార మను తెల్లయేనుఁగు నెక్కి వచ్చుచుండ శ్రద్ధయను దుర్వాసుఁ డెదురువచ్చి భక్తియను పుష్పమాల నిచ్చె, అహంకారాధిష్ఠుఁడై యున్న యంతరాత్మ దానిని తిరస్కరించి పరమాత్మకుఁ జేర్చవలసిన భక్తిమాల నహంకార గజమస్తకమున నుంచినఁ జూచి శ్రద్ధయను దుర్వాసుఁడు కోపించి "శ్రద్ధారహితుండవై భక్తిని తిరస్కరించిన కారణమున నీ యాత్మశక్తియను నైశ్వర్యమంతయు వివేక సముద్రమునఁ గలిసిపోవు" నని శపించె. అంత నంతరాత్మ యను నింద్రుఁడు తనకుఁగల సర్వ దివ్యశక్తులనుఁ గోల్పోయి నిస్తేజుఁడు దుఃఖియు నయి స్వస్వరూపమును మఱచి జనన మరణముల పాలొచుంటినని తపించుచు దుర్గుణము లను.

రాక్షసగణము చెలరేఁగి చుట్టుముట్టి బాధింప సుగుణము లను దేవతలు కానరాక పలాయనమొంద నేయునదిలేక యంత రాత్ముఁడు భక్తియుక్తుండై పరమాత్మునిఁ గాననేఁగి యనేక విధంబుల బ్రార్థించె. అప్పుడు భగవంతుఁడు ప్రసన్నుఁడై యాతని నీక్షించి "ఇంద్రా!

కం. ఎప్పుడు దనకును సత్వము
నొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ
గప్పికొని యుండవలయును
నొప్పుగ నహిమూషికమున కొదిఁగినభంగిన్.

సాత్విక గుణప్రవృత్తి తనకు లభియించు వరకు నంతశ్శత్రు వులఁ జూచియు శాంతుఁడై యుండవలయును. ప్రతియొక్కఁ డును చావులేని తనము దనకు లభియించువరకును సర్వ శాస్త్రార్థములను మథించవలయు" నని చెప్పి యంతర్థానంబు నొందిన నంతరాత్ముఁడు బుద్ధియను బ్రహ్మమొదలుకొని సకల సుగుణము లను దేవతలం గూడికొని పరమాత్మ నాదేశము ననుసరించి వివేకమను సముద్రమును మథింపఁ బ్రయత్నించి, జ్ఞాతులై లోపలి శత్రువులుగా నున్న దుర్గుణ ములను రాక్షసులతో స్నేహమొనర్చి, వారిని సామముననే కాని నిగ్రహించి స్వాధీనమొనర్ప నసాధ్యమని యెఱింగిన వాఁడై రాక్షసరాజగు మహామోహమను బలినిఁ జేరి నమ స్కరించి "మీకు లోఁబడి సేవించుచు నుండెద" నని యొప్పించి నమ్మకముగలుగునట్టులు గొన్నిదినంబులు స్నేహం బున సంచరించి యొక్కనాఁడు 'వివేకసముద్రమును మథించి

చావులేని మందును సంపాదింత' మనెను. ఆమీద దేవతలు, రాక్షసులు అను సుగుణ దుర్గుణములు కూడి వివేకమను పాల సంద్రమున బుద్ధియను మందరపర్వతమునుఁ జేర్చి సుషుమ్నా నాళగత కుండలిని యను వాసుకిని తరిత్రాడుగాఁ దగిలించి రేచక పూరకంబులతో మధింపంబూనిన నాధారరహితమై బుద్ధి (మందరము) దానియందు నిలువలేక మునింగిన సుగుణ గణము పరమాత్మని గూర్చి "దేవా! పతనమగు బుద్ధిని పట్టినిల్ప మే మెంతటివారము. అది నిలువకున్న నీకార్యము తుదముట్టునా? దానికి నీకరుణయే యాధారము. ఈబుద్ధి నుద్ధరించి మమ్ముఁ గాపాడు" మని ప్రార్థించిన పరమాత్మ కూర్మ రూపంబున దర్శనం బిచ్చి 'నావలె సర్వేంద్రియముల నంత ర్ముఖములుగాఁ జేసి సాత్వికసముద్రమును మధించిన బుద్ధి కుదురుకొనును. కాకున్న యీ బింకుచలన మాగదు' అట్లుఁ గండని సూచించుచు తానా బుద్ధియను కవ్వమునకుఁగుదురుగా నిలిచె నివ్విధమున,

క. తరి గాంద్రలోన నొకఁ డఁట
తరి గడవకుఁ గుదురు నొకఁ త్రాడఁట చేరుల్
దరి గవ్వంబును దానఁట
హరి హరి హరి చిత్రలీల హరియే యెఱుఁగున్.

స్వప్నద్రష్ట సర్వము తానై కలఁ గాంచినట్లు మధన సమయమున పరమాత్మ కవ్వమునకు కుదురు, కవ్వము, లాగుత్రాడు, కవ్వమున కాధారమైన చేరులు, కవ్వము లాగువారు సర్వమును తానై సుగుణ దుర్గుణ సంఘముచే

నది యెల్ల నడుపఁబడిన దని చూపుచు తన లీల నిట్లు తెలియఁ జేసెను. దీనివలన పరమాత్మకు భిన్నముగా నేదియు లేదని తెలియుచున్నది. ఇట్లింద్రియముల నంతర్ముఖములు సేసి మథించిన ననాది కాలానుగతమై జనన మరణ ప్రవాహ కారణమై సర్వానర్థదాయకమైన యహంకారమను హాలాహలవిషాగ్ని యుద్భవించిన దానికి సహింపనేరక నందఱును తల్లడిల్లిరి. అది సత్త్వబుద్ధి మథనమున జన్మించినదౌట బుద్ధ్యధిదైవతమగు రుద్రుఁడు తోడన దాని నొక్క ముద్దగాఁజేసి తనయం దణఁచుకొనెను. ఇది ప్రాణాయామ సాధనకాలమున తొలుదొల్త జనియించి యింద్రియముల సంక్షోభింపఁజేయు నత్యుష్ణశక్తి, దాని స్తంభింపఁ జేసి మఱలఁ దరుచుచుండ సాత్త్వికమనం బను నుచ్చైశ్శ్రవము పుట్టెను. దానిని మహామోహుఁడు వశపరచుకొనియె. ఇంకను దరువ మదమను నైరావతము సాత్త్వికశ్వేతమై జన్మించి యెందేనిఁ జనియె. మఱియుఁ దరువ సాత్త్విక కామములను కల్పవృక్షములు బుట్టెను. మఱియు మోహవిభ్రాంతులను సాత్త్వికాప్సరసలు జన్మించిరి. ఆమీఁద జ్ఞానచంద్రోదయ మయ్యెను. వెంటనే శుద్ధసత్త్వ ప్రధాన మూలమాయయను నాదిలక్ష్మి యుద్భవించెను. ఆ యమను పరమాత్మ స్వాధీనపరచుకొనెను. ఇట్లు విసువక తరుచుచుండ సర్వగుణంబులును సాత్త్వికరూపమునఁ బొడకట్టి యంతరించినమీఁద సర్వానర్థ నివారకంబును మహా

మోహ నిరాసకంబును, సర్వముక్తస్థానమునైన ప్రజ్ఞాన మను నమృతము, (చావులేని మందు) వివేకసముద్రమున లభించిన దానినిఁ బొంది యంతరాత్మ యను నింద్రుఁడు బ్రహ్మానందమను స్వర్గరాజ్యము నొంది సుఖించుచుండెను.

---

# గజేంద్రమోక్షము

సీ. రాజేంద్ర విను సుధారాశిలో నొక పర్వ
తము త్రికూటంబనఁ దనరుచుండు
యోజనాయుత మగు నున్నతత్వంబును
నంతియ వెడలువు నతిశయిల్లఁ
గాంచ నా యస్వార కలధౌత మయములై
మూఁడు శృంగంబులు మొనసియుండు
దటశృంగ బహురత్న ధాతు చిత్రితములై
దిశలు భూ నభములఁ దేజరిల్లు

గీ. భూరిభూజ లతాకుంజ పుంజములును
మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
మరిగి తిరిగెడు దివ్యవిమానములును
జలులఁ గ్రీడించు కిన్నర చయముఁ గలిగి.

అమృతమయ మహాసముద్రమున సూర్యకిరణముల నుండి మేఘము లుత్పన్నములైనట్లు త్రికూట మను పేరున

త్రిగుణాత్మకమాయ యుత్పన్నమయ్యెను. అది కాల దేశాత్మకమై యనేక యోజనాయత విస్తారమై యొప్పె. అది కాంచనాయస్సార కలధౌతమయ శృంగము లను సత్వరజస్తమో గుణాత్మక మయ్యెను. అది తట శృంగ బహురత్న ధాతు చిత్రితమై తేజరిల్లు నన, ఆ శృంగత్రయ మను గుణత్రయమె సప్తధాతు సమన్విత చరాచర జంతు దేహములుగా పరిణమించి యందుఁగల భూజలతాకుంజములును స్రోతలిడు సెలయేళ్లును గానై వాని మరిగి తిరుగుచున్న యధిదైవతా రూప యింద్ర వరుణాది దివ్యలునుఁ గలిగి ప్రకాశించునది త్రికూటమను త్రిగుణాత్మక మాయ. దానియందు నామరూప భేద పరిణమిత నానాజంతు సమన్వితారణ్యమే సంసారారణ్యము. అందుఁ దగుల్కొనిన జీవులే యెక్కడ జూచిన లెక్కకెక్కువయై నడచు నిభయూధములు. ఈజీవు లెల్లరు తృషార్దితములై యన, తీరని తృష్ణాజలములఁబడి యడలు చుందురు. అందొక్క జీవుం డను గజరాజు పరమేశ్వరుని యందు మనస్సును లగ్నంబు సేయనేరక జాయారూప కరేణు సముదయంబునుగూడి సంసారారణ్యమున సంచరించుచు తద్గహన సంచార మాయామహిమంబున నుత్తమమార్గంబు దప్పి కేవలేషణత్రయముల యందు పిపాసం జొందినవాఁడై త్రిగుణాత్మక మాయ యను త్రికూట పర్వతమునఁ బొడమిన యంతఃకరణవిశిష్ట చిత్తసరోవర మనుసరోవరమునఁ బ్రవేశించి పురాకృత కర్మభోగంబు ననుభవించుచు నహంకారమను మకరంబుచేతం బట్టువడి,

ఉ. ఊహ గలంగి జీవనపు టోలమునం బడి పోరుచుఁ మహా
మోహలతానిబద్ధ పదముఁ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహిక్రియ దీనదశ గజముండె భీషణ
గ్రాహదురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై.

ఇట్లహంకార నక్రంబుచే విడినడ సమర్థుండు గాక పెక్కేండ్లు దీనుండై సంసారమునందుఁ దీరని మమత్వంబున భార్యయని బిడ్డలని గృహమని వ్యామోహంబు నొంది యేడ్చి యేడ్చి తుదకు నింతకుంగాక యొక్కఁడై వెలుఁగు దేవుఁ డొక్కఁడు గలఁడని నమ్మి తదేకధ్యాననిష్ఠాగరిష్ఠుండై ప్రార్థించినఁ బరమాత్మ కాలచక్రమను చక్రంబున నా యహంకార నక్రంబును బరిమార్చ జీవుఁడను గజేంద్రుండు చీకటిం బాసిన సూర్యునివలె చిత్తసరోవరమునుండి విముక్తుండై విరక్తుఁడై సంసారమును విడిచి పరమాత్మునిం జేరు కొనియె.

---

# వామనావతారము

వామనావతార ఘట్టమున పలువురు పలువిధములైన ప్రశ్నలువేయుచు తగవులాడుచుందురు. వామనుడు తన పాద మున భూమిని కొలుచునప్పుడు బలిచక్రవర్తి యొక్కడ నుండె ననియు, సభాగృహమును కప్పును పడగొట్టుకొని మీదికిఁ బోయెనా! యనియు, వానిపాదము బ్రహ్మాండమువెడల్పైన

వాఁడెక్కడ నుండెననియు నిట్లు పలుకుచుందురు. ఇట్టి సందేహము లెవ్వరికేనియుఁ దోఁచవచ్చు. కాని భాగవతమునందు ప్రతికథయు నాధ్యాత్మికవిద్యను రూపకాలంకారమున వ్రాసినదియే కాని యది నిజమైన కథగాదని తోఁచుచున్నది. తత్త్వదర్శనులకు సులభగ్రాహ్య మగుటకొఱకు వేదములయందును నిట్టులే కథలుగాఁ దత్త్వము నుపదేశించుట కలదు.

బలిచక్రవర్తి భక్తుఁడు, విజ్ఞాని, వదాన్యుఁడు. అతఁడు స్వర్గభోగముల నాక్రమించి యదియె పరమావధిగాఁ జూచుచు సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తియు, మంగళాధ్వర విధాన విహర్తయునై వర్తించుచుండెను. ఇట్లుండుట మోక్షహేతువు గాదని యాతని నుద్ధరింప నెంచినవాడై పరమాత్మ మాయా వటుమూర్తియై వచ్చి,

ఆ. ఒంటివాఁడ నాకు నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేర యొల్లఁ
గోర్కిదీర బ్రహ్మ కూకఁటి ముట్టెద
దాన కుతుకసాంద్ర దానవేంద్ర !

అని యాచించె. యందలి మాయ మర్మము లెఱుఁగని యా యమాయికపు నీగికాఁడు "పొట్టివడుగా ? యిట్టులడిగితివేమి. ఇంత చుల్కని దాన మెట్లీనేర్తు" ననియె. అనిన వడుగు "మదాకాంక్షితంబైన మూఁడడుగుల్ మేరయ త్రోవకిచ్చుటిది బ్రహ్మాండంబు నాపాలి" కనెను. అప్పు డతని గురుఁడు శుక్రుఁడు, బలి వైభవ సంపదల నన్నిఁటిని

నిరసించి పరమపదమునుఁ గూర్పవచ్చిన పరమాత్ముఁడని గ్రహించి బలింజూచి "దైత్యేంద్రా! యీతఁడు విష్ణుఁడు నీ యైహికముల నన్నింటినిహరించి నన్ను బికారిఁ జేయవచ్చిన వాఁడీతని నమ్మకుము. ఈదానమీాకు" మని బోధించిన బలి చక్రవర్తి "భౌతికములైన నశ్వరసంపదలఁగొని శాశ్వత పదము నొసంగవచ్చినవాని నెట్లు గాదందు" నని పల్కుచు నప్పుడ వడుగునకు మూఁడడుగులు ధారవ్రోసె. దాన మంది దాతయందు కరుణించి యామాణవకోత్తముఁడు తన విశ్వ మూర్తిత్వమును బలిచక్రవర్తికిఁ జూపించుచు

శా॥ ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీధిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాసిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

ఇట్లు సభామధ్యమందున్న బలికిఁ దన విరాడ్విగ్రహ స్వరూప దర్శనమిచ్చి "పాదోస్య విశ్వభూతాని త్రిపాద స్యామృతం దివి" నాచతుష్పా ద్విభూతియం దొక్కపాద మున భూమియంతయునిమిడియున్నది. మిగిలినమూఁడుపాదము లంతరిక్షలోకమునఁ గలవనియు, మరియు రెండు పాదము లతో భూలోక భువర్లోకములునిండినవి. మూఁడవదగుపాదము స్వర్లోకమును అదియె బ్రహ్మపదమని చెప్పఁబడు సహస్రా రము దానినెఱుఁగటయె బలిశిరమున పరమాత్మపాదముంచుట.

మ॥ ఒకపాదంబున భూమిఁగప్పి దివి వేతొంటం నిరోధించి యొం
డొకటన్ మీఁది జగంబులెల్లఁ దొడి నొండొంటం విలంఘించి ప
ట్టక బ్రహ్మాండ కటాహముం బెటిలి వేంద్రంబై పగుల్ గానరా
నొకఁడై వాగ్గృగలభ్యుఁడై హరి విభుండొప్పారె విశ్వాకృతిన్.

ఇంతియకాని పొట్టివాఁ డట్టెయుండ కాలోకఁ ాఁటి సభాగృహాప్ర పైకప్పుఁ జించుకొని మీఁదికిఁబోలేదు. మఱియు దీనినే యిడా పింగళా సుషుమ్నా పాదములుగాఁ జెప్పి రెంటిని వశమొనర్చి మూఁడవదానియందు విలీనమగుటను తెలియఁ జేయును. నాదబిందు కళలలో నాదబిందువుల వశమొనర్చి కళయందుఁ గలియుటను తెలియఁ జేయును. ఇట్టులె విజ్ఞుల యభిరుచి ననుసరించి యెన్ని విధములనైనఁ జెప్ప వచ్చును. ఇట్లు బలిచక్రవర్తి నారాయణుని భక్తిపాశంబులఁ గట్టువడి యిహాసంపదల నెల్ల కంపమెఱుఁగక విడిచి యెఱుకఁ గలిగి చుట్టాలు, దొంగలు సుతులు బుణస్థులు కాంతలు సంసార కారణు లని యెంచి యుద్బుద్ధుండై యజయాఖ్య మాయను గెల్చి, సర్వకాల సర్వావస్థల యందును భగవంతుఁడు తనకుం దర్శన మిచ్చుచుఁ దనవాకిట నుండునట్లు వరంబును బొంది సుతల మను శాశ్వతానంద లోకమున నుండెను.

---

## మత్స్యావతారము

గీ. మున్ను పోయిన కల్పాంతమున నరేంద్ర
బ్రహ్మమనఁగ నైమిత్తిక ప్రళయమైన

నింగిపై నిట్టతొలఁకు మున్నీటిలోనఁ
గూలె భూతాళి జగముల కొలఁదు లెడలి.

మహాప్రళయకాలమున భూతకోటులన్నియు మహామృత్యువను జలముల యందు విలీనమయ్యెను. అప్పుడు —

మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి వీ
పిఱియన్ నీల్గుచు నావులించుచు నజుండే సృష్టియున్ మాని మే
నొఱగన్ ఱెప్పలు మూసి కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్
గుఱువెట్టం దొడగెం గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా!

నూఱేండ్లు జగత్సృష్టిని సాగించిన బ్రహ్మ యను బుద్ధి తన కర్మల తలగడఁ జేసికొని గుఱక వెట్టి నిద్రించెను. అనగా తన పనిమాని జీవుని చాటున కేఁగెను. ఆ యెడ నెఱేఁగి యజ్ఞానాంధకార మను హయగ్రీవుఁడు బ్రహ్మ యను బుద్ధిదైన సృష్టిజ్ఞాన మను వేదమును దొంగిలించి మృత్యుగర్భ మను జలగర్భమునఁ దూఱెను. అప్పుడంతరాత్మ యను నారాయణుండు, బుద్ధి వేదరహితమై నిద్రించుటయు వాసనలు లేకున్న పునస్సృష్టికి భంగమగుటయు గ్రహించి విషయవాసనలను విత్తనము లామృత్యుజల మధ్యమునఁ బడి స్మృతి భంగమును నానిచెడుట గలుగకుండ నన్నింటిని నొక్కచోఁ జేర్చి ముందు కానున్న సృష్టికంతకును దానకర్త గావున, జీవుని సంసారదశయం దాతని జాగ్రత్స్వప్న సుషుప్తులయందు నేత్ర కంఠ హృదయస్థానములకు మహాజల మధ్యమునఁ దిరుగు మత్స్యంబురీతి నాడులమధ్యమున దాననాయాసంబునఁ దిరుగు

వాఁడొట పరమాత్మ మత్స్యంబునువలె మృత్యుజలగర్భంబున ననాయాసంబుగా సంచరించుచు 'ఏకమేవా ద్వితీయ' మను తన యొంటితనంబునుఁ దెల్పునొంటికొమ్మున విషయవాసనలను విత్తనములుంచి హిరణ్యగర్భ దశయనునావను కుండలిని యను పాఁప త్రాట నంటఁగట్టి సంతసించుచుండె. బ్రహ్మము నెఱిఁగి మృత్యువును జయించిన తజ్జ్ఞుల కీ ప్రళయము లేదని తెలియఁ జేయుటయే యిందు తపస్వులైన సప్తర్షులు దేహధారులుగానే యుండిరనుట. వారు భగవంతు నిట్లు గానముఁ జేసిరి.

మ॥ తమలోఁ బుట్టినవిద్య గప్పికొనుడున్ దన్మూల సంసార వి
భ్రములై కొందఱు దేలుచున్ గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో
గము నందే పరమేశుఁ గొల్చి ఘనులై కైవల్య సంప్రాప్తులై
ప్రమదం బందుదు రట్టినీవు కరుణంబాలింపు మమ్మీశ్వరా!

ఇది యంతయు నవిద్యామోహము. తన్మూలమున మృత్యు వను జలమధ్యమునఁ జిక్కి సంసారులై మునుఁగుచు తేలుచు నుందురు. అంత నారాయణుండు, జీవసంసారియొక్క పురాకృత కర్మములు వేచియుండుట నెఱిఁగి వేదరహితుండై (స్మృతి రహితుఁడై) బ్రహ్మ యను బుద్ధి సంసారక్రమము నడిపింప లేఁడని యెంచి యప్పు డజ్ఞానాంధకార మను హయగ్రీవుని మృత్యు జలమధ్యమున వెదకి వానిఁ జంపి వేదమును దెచ్చి నిమురమానిన బుద్ధికర్పించి జీవసంసారమును మఱల నడిపింపం జేసెను.

శ్రీరస్తు

# కాళియ మర్దనము

కాళిందీనదిలో నొక మడుఁగు కలదనియు, నందొక కాళియ మను సర్పము గలదనియు, నది తన విషాగ్నిజ్వాలలచే తనదరికిఁ జేరిన వారిని నశింపఁజేయు ననియు శ్రీ భాగవతమునఁ జెప్పఁబడి యున్నది. ఇందీ నది యెట్టిది? పామెట్టిదో విచారింతము. దేహము యొక్క భారమునంతటిని మోయుచు ప్రధానావయవముగా నున్నది వెన్నెముక. శరీరమునందలి యన్నిభాగములకు చెందిన నాడు లన్నియు నీ వెన్నెముక యందున్న యిడాపింగళా సుషుమ్న లను మూఁడు ప్రధాననాడుల ననుసరించి యుండును. ఆ మూఁడింటిలో ప్రధాన మైనది సుషుమ్నా నాళము. దానినే కుండలిని యనియు, వెన్ను పామనియుఁ జెప్పు చుందురు, వెన్నును వీణాదండ మనియు దాని నంటి యున్న నాడుల నుక్కుతంత్రు లనియు నందురు. యోగులు దీని నుండియే నాదబ్రహ్మమును దశవిధముల నాలాపింతురు. ఈ భూమి నంతటి నాదిశేషుఁడు మోయుచున్నాఁడని చెప్పుట దేహ భారము నంతటిని సహించు నీ వెన్నెముకలోని కుండలిని యను పామును గూర్చియే. ఇందు మన కథాభాగ మెట్లిమిడి నదో చూతము. ఇడా పింగళా సుషుమ్నలను గంగా యమునా సరస్వతు లందురు. గంగాయమునులసంమున శ్రీకృష్ణ పరమాత్మని సంచారము. వెన్నెముకయొక్క మీదిభాగము. సహస్రారమును (మెదటిభాగమును) దిగువభాగ మాధారమును

నంటియుండును. దీనినాశ్రయించియుండునది కుండలిని (వెన్ను పాము) వెన్నెముక కొన్ని పూసలకూర్పు. ఈ పూసలన్నిం టిలో క్రిందినుండి మీదివరకు నడుమనొక రంధ్రముగలదు. దానిని సుషుమ్నానాళమనియు నందుఁగల రేడియం వంటి యొక దివ్యశక్తిని కుండలిని యనియుఁ జెప్పుచుందురు. దానినే పామందురు. ఇది సహస్రారమనకు లోఁకయును నాధారము దగ్గఱ తలయునుఁ గలిగి యుండును. ముడ్డిపూస(త్రికము)యని చెప్పుచోట పుడిసిలి (ప్రసృతి)వలె నొకగుంటకలదు. అదియే కాళిందిలోని మడుఁగు. అందున్న కుండలినీశక్తియే కాళి యాహి. ఈకుండలిని యధోముఖముగా నున్నంత కాలమును విషాగ్నులను దురూహలను బుట్టించుచు జీవులనందఱ మర ణము పాలు సేయు చుండును. మధుర యను నుత్తమ దేహ మునఁ జేరిన కృష్ణపరమాత్మ వానిలోనివగు లింగశరీర మను వ్రేపల్లె యందు నివసించి యింద్రియము లను గోవుల నలరించుచు నీ కుండలిని యను కాళియుని నూర్ధ్వగామిని (సహస్రార వాసిని) చేసినఁగాని, యింద్రియాధ్యాత్మికశక్తు లను గోపికలు తనతోఁ గూడి యానందింప ననువు పడదని యాలోచించి యొక్కనాఁడు భ్రూమధ్యాంతరమున నింద్రియ ముల నెల్లఁ జేర్చి తాను సహస్రార గతుండై, సహస్రార మన మెదటిభాగము దానిపై నున్న పొరమీద నున్న రక్తపు చారికలు చెట్టువలె నుండును. అదియే కడిమిచెట్టు, కృష్ణ పరమాత్మ దాని నధిరోహించి సుషుమ్నానాళ మధ్యము నుండి క్రిందికి దిగి ( మడుఁగునందు దుమికి ) మడుగు నడుగు

భాగ మను నాధారమునందు జుట్టఁజుట్టుకొని విష యను దుర్వి షయములఁ గ్రక్కుచుఁ బడుకొనియున్న కుండలినీశక్తి యను కాళియాహి మీఁది కెక్కి తాండవించెను. ఇది పూర్ణకుంభ కముచే నగుపని. అంతట కుండలిని పరమాత్ముని మహాతే జము ముందు నిలువలేక, సంపూర్ణకుంభకముచేతనైన నపాన వాయువు యొక్క యొత్తిడి కాఁగలేక, తనలోని దుర్విషయ విషవహ్నుల వెడలఁగ్రక్కి యామీఁదపరమాత్మను గ్రహింపఁ గలిగి, యిడాపింగళలను భార్యలఁగూడి యనేక విధంబుల గోవిందుని బ్రార్థించి తదాజ్ఞచే నూర్ధ్వగామినియై సహస్రారమను సముద్రము నకుఁ జేరుకొనెను. ఇట్లు కుండలినిని భద్రపరిచి కృష్ణదేవుఁడు గోపికలను నింద్రియములఁ గూడి భ్రూమధ్య త్రికూటస్థాన మను యమునదరిని శరచ్చంద్రికయను నాత్మ తేజముననందఱునుఁ దానై రాసక్రీడ యను బ్రహ్మానందమునఁ దేలెను. ఇది కాళియ మర్దనము.

---

## గోపికా వస్త్రాపహారణము

ఒకనాఁ డింద్రియములను గోపికలు భ్రూమధ్యము నందలి పింగళనాడియను యమునానదికిం జని యందు పర మాత్ముఁడు సాకారవిగ్రహముతో దరిశన మిచ్చి తమకు భర్త యగునట్లు సేయుమని మూలప్రకృతియనునంబికను బ్రార్థించిరి.

కం॥ ఓ తల్లి మాకుఁ గృష్ణుడు
చేతోవిభుఁడై ననాఁడు చెలువలమెల్లన్

నేతి వసంతములాడుచు
జాతర సేసెదము భక్తిచాతురితోడన్

తల్లి! పరమాత్మ మాకు మనఃప్రభవుఁడై మమ్ము భరించువాఁడైన నేతివసంతములు (న, ఇతినేతి) యింతకన్న తరింపఁ జేయునది లేదను నిశ్చయాత్మికలమయ్యెదమని ప్రార్థించి సాత్వికావరణంబులను వస్త్రముల భ్రూమధ్యమున నిడపింగళ యను యమునాజలముల దిగి చల్లులాడుచుండ, కృష్ణ పరమాత్మ దూరస్థుఁడయ్యును సమీపంబునఁ దోఁచి తనతో నున్న యింద్రియాధి దైవతములను గొల్లల కనుసన్నలఁ గదలకుఁడని చెప్పుచు నిశ్శబ్దం బ్రహ్మోచితమ్మను రీతిం దెల్పుచు మౌనియై దేహమును కుంచించి యణుమూర్తియై వారు సాత్వికావరణ రహితానంద జలముల మునిఁగియున్న తఱివేచి వారి సాత్వికాంశములను నంబరములఁ దన స్వాధీన మొనర్చుకొని నీప (కడిమిచెట్టు) మను సద్యోముక్త దురంతే పాదపజనుస్సంతాపమగు సహస్రారము నెక్కెను. అప్పుడు తెలివొంది యింద్రియము లావరణ రహితలై యున్న ప్రపంచమును దర్శింప ననువుగామిఁ బరమాత్మనుగూర్చి "కృష్ణా! నిరావరణలమై నీ సగుణ విగ్రహ దర్శనానందము ననుభవింప నేరము. కావున మమ్ము సావరణలం జేసి రక్షింపు" మనిన పరమాత్మ.

కం॥ నాయింటికి దాసులరై
నాయాజ్ఞవహించి మీరు నడచెదరేనిన్
మీయంబరంబు లిచ్చెదఁ
దోయంబులు వెడలిరండు తొయ్యలులారా!

నాయిల్లైన హృదయకమలము నంటిపట్టియుండి నన్నే ధ్యానించువారై తిరేని మీమాయావరణముల నిత్తు'' ననిన జ్ఞానేంద్రియ పంచక కర్మేంద్రియపంచక ద్వయము నేకముఁ జేసి భ్రూమధ్యస్థానముననిలువుటయను రెండుచేతులుజోడించి నొసటికెత్తి 'నీదాస్యమొనర్చుచు నీకువశ్యలమైయుండెద'మని నమస్కరించిరి. అప్పుడు పరమాత్మ ''శృంగారవతులారా! మీరు పుట్టిననాఁటనుండి మీతో బెరిఁగి మీలోనున్నవాఁడ. మీమర్మము తెలియంగనా? మీరు నియతిఁదప్పి బహిర్ముఖులు కాకుండఁ గోరుచుంటి. మీరును నన్నే పొందం గోరుచుంటిరి. గాన సర్వేంద్రియముల నేకమొనర్చి నాకర్పించుటయే విముక్తి. దానికి సాత్వికరూపావరణమున్ననే ధ్యాననిష్ఠ యలవడును. కావున వీనిఁ గొనుండని మఱల నా సాత్వికాంబరముల నిచ్చె.

---

# భాగవత కృష్ణుఁడు

మ॥ తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాకత
ద్విరహాగ్నిం బరితాపమొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి జారుఁడనుచున్ భావించుయున్ జొక్కిపొం
దిరిముక్తిన్ గుణదేహమున్ విడిచి ప్రీతింబంధ నిర్ముక్తలై

నా వంటి సామాన్యుఁడు భాగవత రచన యందలి మహిమము నెంతని చెప్పగలఁడు. కాని మనసుండక

వానందమును బట్టలేక కొంతయేని కృష్ణ చరితమునందు పర మార్థభావ మెంతకలదో దానిని స్థాలీపులాకముగా నీపద్యము నొక్కదాని యందుఁ జూపింతును.

భాగవత కృష్ణునిఁగూర్చి సామాన్యదృష్టితోఁ జదువు వారందఱు కృష్ణుఁడు వెన్నదొంగ యనియు, గోపికాజారుఁ డనియుఁ జదువుకొని సంతసింతురు. కాని రేపటికి చావనున్న పరీక్షితుఁడు వినువాఁడును, యెల్లుండి ప్రపంచము వీడనున్న శుకయోగి చెప్పువాఁడును. అట్టి వా రిద్దరి నడుమ జారుని చోరుని గూర్చి యడుగుట, చెప్పుట జరుగునా ? యని తోఁచును. ఈ సందేహామే శ్రోతయైన పరీక్షిత్తునకుఁ గలిగి "మహాత్మా ! బ్రహ్మమను బుద్ధి యేమాత్రమును లేక జారుఁడనియే భావించిరి గదా ? గోపికలు వారికెట్లు ముక్తి గలిగినది చెప్పు" యని యడిగిన,

ఆ. బాంధవమున నైనఁ బగనైన నెవగనైనఁ
ప్రీతినైనఁ బ్రాణ భీతినయిన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు
జనులు మోక్షమునకుఁ జనుదు రధిప !

అని సమాధాన మిచ్చినాఁడు శుకయోగి.

ఇంక మన కథకు వత్తము. కృష్ణపరమాత్మను గోపి కలు జారునిఁగా భావించి ముక్తినొందిరనుట యెట్లు ? ముక్తి యన బాహ్యాంతరేంద్రియ ప్రవృత్తిరహితైకాగ్రస్థితి. ఇది భక్తి చేతను, రక్తి చేతను, కర్మచేతను, జ్ఞానముచేతను దేనిచే

నైననుఁగలుగును. అయినను బాహ్యమూర్తి దర్శనముచేఁ గలిగిన కామవికారము లేక జారుఁడనుకొనుట సంభవించునా? యని తోఁచును. ఇఁక నీ గోపికల జారత్వ మెట్టిది? శుక యోగి చెప్పినదేది? గోపికలు శ్రీకృష్ణుని నిత్యమును చూచుచుండుటచే తద్విగ్రహ చుంబనాలింగనాది సౌఖ్యములను గోరి ప్రథమమునఁ బుట్టిన కామము క్రమ క్రమముగా మారి ప్రేమ రూపము నొందెను. ఈ బాహ్య ప్రేమను భక్తిగా మార్చుట కొఱకు మాయికుఁడై శ్రీ కృష్ణుఁ డప్పు డప్పుడు వారికి దొరికియు దొరకక విరహ మను భావవైకల్య మును గలిగించెను. ఆ విరహముచే వారి ప్రేమ సంతత ధారావాహికమై దేహగేహ ప్రపంచము లను మఱపించి యంతరాంతర దృష్టియందా విగ్రహమును చెదరకనిలిపి బాహ్యేంద్రియ ప్రవృత్తిని మఱచి సౌఖ్యనట్లు చేసినది. ఆ స్థితియందు వెలుపలి యింద్రియ సంబంధమైన గుణములు కర్మములు సర్వథా విముక్తము లైనవి. ఇఁక మిగిలినది తాము తమ దేవుఁడు ఈ యునికియందు కామమేది బాహ్యేంద్రియ సుఖమేది ఇదియే బంధ నిర్ముక్తి ముక్తి పథము ఇదియే గోపికల నిష్కామ భక్తిరహస్యము. ప్రేమ మాంతరికమైన భక్తిగాను బాహ్యమైన కామముగాను పరిణ మించును. గోపికల యనురాగము సకలేంద్రియ భోగలాల సత్వము లేని కళంక రహితముగా కృష్ణుని యందైక్య మొన ర్చిన పరాకాష్ఠనొందిన పరమభక్తి. ఇది మననసాధనము గోపికమైనదప్ప గోపికా కృష్ణానురాగమును గ్రహించుటకల్లం

ఇంక దీనిని యాధ్యాత్మికదృష్టియందు వీక్షించిన మతి యొక యానందమును గూర్చ్చను. కొన్ని యింద్రియములు తమ గోళములను విడిచిరాలేక భగవత్సందర్శనాతురుణము నాకాంక్షించువారట వాని వియోగమును సహింపనేరక మిక్కిలి వేడినొంది, మానసికవీధియందు వానినీగాంచి చెదర కుండఁ బట్టుకొని లక్ష్మీనాయకుని (మనః ప్రభువును) సర్వత్ర యాక్రమించి నిలువెల్లఁ దమలోఁ జేర్చుకొని, తమకంటె నన్యముగాఁ జూచుచు వానివలన నానందించుచుంటి మను కొనుచు వెలుపలికార్యమైనఁగని లోపలికరణములయందెల్ల వాని మూర్తినే (తమ యిష్టదైవ మూర్తినే) నింపుకొని బాహ్యమంతయు మరచి సాక్షాత్కైక్యానుభవమున సర్వ బంధ నిర్ముక్తులై తద్రూపము నొందుటయను మోక్షపదము నొందిరి.

ఇట్లు భాగవత పురాణమునందు ప్రతి పద్యమునందును పరిపూర్ణ భక్తిరసము తొణికిసలాడుచుండునట్లు నా యల్ప బుద్ధికి దోఁచినదానిని కొంచ మిందుఁ జూపితిని. ఇందలి గుణ మును మాత్రము గ్రహించి పాఠకులు నన్నాశీర్వదింప వేడు కొందు. ఇంక భారతకృష్ణునిఁగూర్చి నాకుఁ గోచరించినరీతి నాలుగు వాక్యములఁ జెప్పి యింతతో విరమింతును.

# భారతకృష్ణుఁడు

భారతార్ణవమున గృహస్థ ధర్మోద్ధరణ కొఱ కీఁ యీఁది దాని నుద్ధరించిన గొప్ప సంసారి శ్రీకృష్ణుఁడు. నాచే రచియింపఁబడిన యాధ్యాత్మిక భారతదృష్టిని విడిచి చక్కని చారిత్రకముగా భారతమును చదువ మొదలిడిన నందలి సర్వదమనశక్తిశాలి యగు ధర్మరాజును చేఁజిక్కించుకొని యతనిచే నెంతలేసి కష్టదశల యందును నడుగుఁ దప్పని ధర్మపథమును నడిపించుచు తన పారమార్థిక దివ్యతత్వామృతము నంతటిని ధర్మజుని తీవ్రకష్టతర సంసారారణ్యమునం దంతటను కాలువలు వరపించి, యం దానందకల్పతరువుల మోసులెత్తించి ఫలింపఁ జేసిన పరమార్థవిజ్ఞాని శ్రీకృష్ణుఁడు. రాయభారమున కేఁగిన చోట రాజఠీవిని జూపించి రాజరాజును నుబ్బాఁత లూఁగించి నిండుధైర్యంపు మాటలఁ బగవారి బెండువడునట్లు సేసి తన్నుఁ గట్టవచ్చినవారి యెడ పెక్కుమాయలు వన్ని యుక్తి సెడక చూపులనె వారియుసురులుగొని తనపోయిన కార్యంబు నక్కబెట్టుకొని, వచ్చిన ధీరోదాత్తుఁడు. కదన భూమియందు చేయిఁ గదపక యే చూపుల మాత్రంబునన శూరుల ప్రాణములు గొని పదునెనిమిదక్షౌహిణుల భారతయోధుల మరణమునకుఁ గారణుఁ డయ్యును చక్రధారి గాని విక్రమశాలి. కంసాది భూపతుల నెందఱినో చంపి హస్తగతాఖిల రాజ్యుం డయ్యును కిరీటధారిగాని రాజరాజు. పదునాఱువేల భార్యలతోఁ గూడి బహుసంతానవంతుఁ డయ్యును చలన మెఱుఁ

గని యస్ఖలిత బ్రహ్మచారి. నూటయిరువదైదు వత్సరముల జీవనమును సాగించియు నేయవస్థయందును కంటి నీరెఱుఁగని సత్యవేదాంతి. ప్రపంచాతీత భోగభాగ్యయుక్త మహాసంసారి యయ్యును నాకాంక్షయెఱుఁగని యగ్రసన్యాసి, భారత కృష్ణుఁడు.

ఇట్లు భారత భాగవతములయందు సామాన్యుఁడ నగు నాకుఁ దోఁచిన భావములను పట్టరాని యానందము ననుభవించుచు మహాత్ముల మానసంబులకుఁ దోఁచు మహనీయార్థము లిందింకను నెన్ని యిమిడియుండునో యనుకొనుచుందును. భగవద్రూపులగు పాఠకు లిందలి సత్యమును మాత్రము గ్రహింపఁ బ్రార్థింతు.

మంగళం మహత్

నా రచనలు

సరోజముఖి (నాటకము) 0-12-0

స్తోత్రమంజరి (భక్తిరసయుక్తపద్యములు) 0- 6-0

రామశతకము (అక్షరమాలకందములు) 0- 2-0

బిట్రా ఆంజనేయులు

(తాడికొండపోస్టు - గుంటూరు జిల్లా)